శ్లో॥ యం న పశ్యతి పశ్యంతం చక్షుర్యస్య న రిష్యతి॥
తం భూతనిలయం దేవం సువర్ణ ముపధావత ॥11॥

టీ:- నను యది సఃసర్వంవ్యాప్నోతి తర్హి చక్షురాదిభిః కిం నప్రతీయ తే? త్రాహయమితియం పశ్యంతం మనః చక్షుర్వానపశ్యతి చక్షురాద్యవిషయత్వాత్ న హి ప్రమాతారం ప్రమాణం విషయీ కరోతీతి భావ: తథాచశృతిః "చక్షుషశ్చక్షు శ్శ్రోత్రస్య శ్రోత్రమి"త్యాది. నను తర్హి ఘటనాశేదేవదత్తస్య తద్విషయంచాక్షుషం జ్ఞానమివేశ్వరస్యాపి స్వరూప విషయ జ్ఞానం నశ్యేత్తత్రా హయస్యతు పశ్యతః చక్షుర్జ్ఞా నరిష్యతి నశ్యతి తత్తదాకారేణోన్నాయా వృత్తేరేవనా శోన స్వతస్సిద్ధ జ్ఞానస్య న హి సవితృప్రకాశః ప్రకాశ్యనాశేనశ్యతీతి భావః భూతాని నిలయోయస్యతం. సర్వాంతర్యామిణం. తథాపి. సువర్ణం శోభన తపనం అసంగం. ఉపధావత భజధ్వం. ॥11॥

భగవంతుడు అంతట ఉన్నట్లైతే కన్ను మొదలైన ఇంద్రియాలకు ఎందుకు గోచరమగుట లేదు? సర్వమును దర్శించగలిగిన మనస్సు కానీ, కన్నులు కానీ ఈశ్వరుని చూడలేవు. ఈశ్వరుడు ఇంద్రియాలకు విషయము కాదు. అంటే గోచరము కాదు. ప్రమాతను అంటే ఎరిగెడు వానిని ప్రత్యక్షాది జ్ఞానకారణమైన ప్రమాణము తెలుపలేదు . ' చక్షుషశ్చక్షు శ్రోత్రస్య శ్రోత్రం ' అని శృతి. ఘటము భగ్నమైన విషయము దేవదత్తుడు కంటిద్వారా గ్రహించినట్లు ఈశ్వర సంబంధమైన స్వరూపజ్ఞానము నశించును కదా! అనే విషయమును చెప్పుచున్నాడు. చూచేవానికి దర్శన జ్ఞానము నశించును. అంటే చూపు ఆయా వస్తువుల ఆకారములను కలిగించు మనోవృత్తిగా పరిణమించును. అదే నశించును. అంతేగాని స్వతః సిద్ధమైన జ్ఞానమునకు నాశనము లేదు. సూర్యప్రకాశము ప్రకాశించు వస్తు నాశనముచేత నశించదని భావము. సర్వ భూతములకు నిలయము, సర్వాంతర్యామి, అనంగుడు, తేజోరూపుడు, మంగళకరుడైన సూర్యదేవుని సేవించుము. (11)

శ్లో॥ న యస్యాద్యంత మధ్యంచ స్వః పరో నాంతరంబహిః
విశ్వస్యామూని యద్యస్మాద్విశ్వంచ తదృతం మహత్ ॥12॥

భగవంతుని స్వరూపము యొక్క శాశ్వతత్వమును చక్కగా ప్రతిపాదించుచూ వివరించుచున్నాడు. ఈశ్వరునికి ఆది, మధ్యము, అంతములు లేవు. తన పర భేదము, బహిరంతరములు లేవు. జగత్తు యొక్క పుట్టుక, స్థితి, నాశము అనేవి పరమాత్మవలననే కలుగుచున్నవి. విష్ణుని రూపమే జగత్తు. అందుకే అది సత్యమై, గొప్పదై, పరిపూర్ణమైన బ్రహ్మమే అయినది. 12

టీ :-తత్స్వరూపస్య నిత్యత్వ మేవోపపాదయన్నాహ నయస్యేతి. అమూని ఆద్యం తాదీని విశ్వస్య యస్మాద్భవంతి. విశ్వం చ యద్రూపం. అతఏవ. అవ్యభిచారిత్వాత్. తత్ ఋతంసత్యం. మహత్పరిపూర్ణం బ్రహ్మ. ॥12॥

శ్లో॥ సవిశ్వకాయః పురుహూతఈశఃసత్యః
స్వయంజ్యోతిరజఃపురాణః।
ధత్తేఽస్యజన్మాద్యజయాత్మశక్త్యా తాం
విద్యయోదస్యనిరీహఆస్తే ॥13॥

టీ :-నను విశ్వం చేత్తద్రూపం. తర్హి తస్య కుతో జనాద్యభావః. స్వప్రకాశత్వం వా, జగజ్జన్మాదికర్తృత్వే నవికారేణ సత్యత్వం పూర్ణత్వం వా? తత్రాహ సఇతి. స ఈశః సత్యశ్చ స్వప్రకాశశ్చ. పురాణశ్చ. నిర్వికారః. విశ్వం కాయోయస్య. పురూణిహూతా నినామానియస్య. తథావిధోపి, యతః. అస్య విశ్వస్య జన్మాది. స్వశక్త్యా. మాయయా. ధత్తే. తాంచ నిత్యసిద్ధయా విద్యయా. ఉదస్య హిత్వా నిష్క్రియఏవాస్తే. ॥13॥

ఒకవేళ జగత్తు అతని రూపము ఐనట్లైతే అతనికి జన్మాది వికారములు కలుగక పోవుట ఎట్లు సంభవించును? జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు కారణము కావడమనే వికారము వలన పరమాత్మునికి స్వయంప్రకాశకత్వము, నిత్యత్వము, పరిపూర్ణత్వము అనే గుణములు ఏ విధముగా సిద్ధించగలవు? అనే ప్రశ్నలకు (పూర్వపక్షమునకు) సమాధానము చెప్పుచున్నాడు. ఈశ్వరుడు త్రికాలాబాధితముగా సత్యమైనవాడు. స్వయం ప్రకాశకత్వము కలవాడు. విశ్వమే శరీరము గాగల ఈశ్వరుడు పురూహూతుడను ప్రచురమైన నామము కలవాడు. అనాదియై పుట్టుకలేని భగవంతుడు ఇన్ని లక్షణములు కలవాడైనను ఈ జగత్తునకు జన్మాది వికారములు కలిగించు వాడైనాడు. తన శక్తిచేత, మాయచేత జగత్తును భరించును. ఈ సృష్టికార్యమును ఈశ్వరుడు నిత్యసిద్ధమైన విద్యచేత కొనసాగించుచున్నాడు. ఇంత గొప్ప పనిని నిర్వహించు వాడైనప్పటికీ దీనినంతయు విడిచి అంటే వికార రహితుడై నిష్క్రియుడుగానే ఉన్నాడు. (13)

శ్లో॥ అథాగ్రే ఋషయః కర్మణోహంతేఽకర్మహేతవే ।
ఈహమానోఽహి పురుషః ప్రాయోఽనీహం ప్రపద్యతే (14)

టీ :-అత ఇతి. యస్మాదేవమీశ్వరః కర్మ కర్తృత్వాది సంత్యజ్య. నైష్కర్మ్యేణాస్తే అతః అస్మాద్ధేతోః ఋషయోప్యగ్రే ఆదౌ. కర్మాణి కుర్వంతి కిమర్థం? అకర్మ హేతవే మోక్షార్థం. పాఠాంతరేఽపి కర్మనాశాయ. హియస్మాత్ ॥14॥

అందు వలననే పూర్వఋషులు కర్మలను కోరుట మోక్షము కొఱకే. అంటే వారు కర్మాచరణములో తప్ప కర్మఫల కాంక్షలేని వారని భావము. ఈశ్వరుడు కూడా సృష్టి కార్యమును కోరిన వాడైనప్పటికీ కర్తృత్వము, కర్మ ఫలములను పరిత్యజించి నిష్కర్ముడైనాడు. (14)

శ్లో॥ ఈహతే భగవానీశో న హి తత్ర విషజ్జతే ।
ఆత్మలాభేన పూర్ణార్థా నాఽవసీదంతి యేనుతమ్ ॥15॥

టీ :-నన్వీహమానః కర్మభిరవకుంఠితః కోశకార ఇవ బధ్యేత తత్రాహ - ఈహతఇతి. అతస్తమనువర్తమానాః యే. తేనా వసీదంతి. న విసజ్జంతే ॥15॥

ఈశ్వరుడు సృష్టియందిచ్ఛ గలవాడై, కర్మలచేత ఆవరింపబడి కత్తియొఱను చేయువానివలె కర్మబద్ధుడైనాడు. అంటే కర్మఫలసంబంధము లేని వాడైనాడు. అట్లే భగవంతునికి, ఆ భగవంతుని ఆశ్రయించి, అనుసరించిన సాధకులకును కర్మఫల సంబంధముండదు. (15)

శ్లో॥ తమీహమానం, నిరహంకృతం, బుధం
నిరాశిషం, పూర్ణమనన్య, చోదితమ్।
నృూన్, శిక్షయంతం, నిజవర్త్మ, సంస్థితం
ప్రభుం, ప్రపద్యేఽఖిల, ధర్మ,భావనమ్ ।16।

భగవంతుడీవిధముగా లోకమును అనుగ్రహించు నిమిత్తము సృష్టి మొదలైన కార్యములు నిర్వహించు చున్నాడు. రామకృష్ణాది అవతారములతో వేదోక్తమర్యాదను, ధర్మమును ప్రవర్తింప జేసెను. ఆ భగవంతుని శరణు పొందుచున్నాను. భగవంతుని మార్గమనగా నరావతార మార్గమని అర్థము.

టీ॥ తదేవం లోకానుగ్రహాయ విశ్వసృష్ట్యాది యః కరోతి శ్రీరామ కృష్ణా ద్యవతారైశ్చ వేదోక్త మర్యాదయా యో వర్తతే తం శరణం ప్రజామిత్యాహ తమితి. నిజవర్త్మనరావతా రాను రూపో మార్గః.తత్ర సమ్యక్ స్థితం.అతః ఈహమానంకర్మాచ రంతం. తథాపి జీవవైలక్షణ్యమాహ నిరాశిషం నిరహం కృతం అనన్యచోదితమితి చ నిరహంకారత్వే హేతుః. బుధంనిరా శిషత్వే హేతుః. పూర్ణంఅనన్యనియుక్తత్వేహేతుః. ప్రభుం తథాపి కర్మానుష్ఠానే, హేతుః నృస్వాచారేణ శిక్షయంతం. తత్కిమర్థం? తత్రాహ అఖిలాన్ ధర్మాన్ భావయతి ప్రవర్తయతీతి తథా తం. (16)

మానవులను ధర్మమార్గ ప్రవర్తనులుగా శిక్షణ ఇచ్చు నెపముతో కర్మమార్గము నందు చక్కగా ఉంచే కోరిక ఈశ్వరునికి కలిగింది. ఐనప్పటికిని జీవుని విలక్షణతను చెప్పుచున్నాడు. ఆహార నియమముండుటకు హేతువు పరిపూర్ణత్వము. నిరహంకారత్వమునకు కారణము సర్వజ్ఞానరూపమైన బుద్ధి. ఇతరులచేత నియమింపబడకుండ తానే నియంత్రించుటకు (అనన్యచోదితమ్) ప్రభుత్వము కారణము. ఐనప్పటికీ ఈశ్వరుడు సృష్ట్యాదులను నిర్వహించుట మానవులకు వారి వారి ఆచారములను సక్రమముగా ఆచరించుటకై శిక్షణ ఇచ్చుట కొఱకే. సర్వధర్మములు ఆచరించి, ఆచరింప జేయుటయే పరమాత్ముని సంకల్పము. (16)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతి మంత్రోపనిషదం వ్యాహరంతం సమాహితమ్ ।
దృష్ట్వాసురా యాతుధానా జగ్ధుమభ్యద్రవన్ క్షుధా ॥17॥

టీ :- ఇతీతి.సమాహితమపి సంతం. మంత్రోపనిషదం వ్యాహ రంతం దృష్ట్వా. సుప్తోత్థితవ ద్వివశమివ మన్వానాఅసురాః యాతుధానాశ్చ. క్షుధానిమిత్తేన జగ్ధుం అత్తుం.అభ్యద్రవన్ అభిదుద్రువుః. ॥17॥

**శ్రీ శుక మహర్షి ఈ విధముగా చెప్పినాడు :-**

ఈ విధముగా మంత్రోపనిషత్తును ధర్మమును గుఱించిన ఆలోచనను చెప్పుచూ చక్కగానున్న స్వాయంభువ మనువును చూచి, నిద్రనుండి మేల్కొనిన దానివలె విశ్వమును భావించి అసురులు, యాతుధానులూ ఆకలి కారణము చేత విశ్వమును భక్షించుటకై పరిగెత్తి వెళ్ళినారు.(17)

శ్లో॥ తాంస్తథావసితాన్వీక్ష్య యజ్ఞః సర్వగతో హరిః ।
యామైః పరివృతో దేవైర్హత్వాశాసత్త్రివిష్టపమ్ ॥18॥

టీ :-తానితి. యామైః స్వపుత్రైః. త్రివిష్టపం స్వర్గమపాలయత్ స్వయమేవేంద్రో బభూవేత్యర్థః. తత్ర ప్రతి మన్వంతరం. మన్వాదయః షడన్యే భవంతి. తథాహి. సూతోద్వాదశే వక్షతి. శ్లో"మన్వంతరం మనుర్దేవా మనుపుత్రాసురేశ్వరః, ఋషయోంశావతారశ్చహరేష్షడ్విధ ముచ్యత" ఇతి. తత్రాద్యోహి. స్వాయభువోమనుః. ప్రియవ్రతో త్తానపాదౌ మనుపుత్రౌ. యామాదయోదేవాః మరీచిప్రముఖాః సప్త ఋషయః యజ్ఞోహరేరవతారః. ఇంద్రశ్చ సవివేతి. తన్మన్వంతరం పంచవిధమేతత్. తచ్చ. చతుర్థస్కంధోపక్రమేనిరూపితం. (18)

ఈ విధముగా జగన్నాశమునకు పాల్పడిన రక్కసులనుచూచి అంతటా నిండిన హరి వారిని సంహరించి, తన పుత్రులు, దేవతలతో కలిసి తానే ఇంద్రుడై స్వర్గమును పరిపాలించెను. ప్రతి మన్వంతరమున మనువు మొదలైనవారు వేరు వేరుగా ఆరుగురు. ఈ విషయమును సూతుడు ద్వాదశ స్కంధమున "మన్వంతరం మనుర్దేవా మనుపుత్రాస్సురేశ్వరః । ఋషయోంశావతారశ్చ హరేష్షడ్విధముచ్యతే"॥అని చెప్పబోవుచున్నాడు. అందులో మొదటివాడు స్వాయంభువ మనువు. ప్రియవ్రత ఉత్తానపాదులు మను పుత్రులు. యమాదులు దేవతలు. మరీచి మొదలైనవారు సప్తఋషులు. యజ్ఞుడు హరి అవతారము. అతడే ఇంద్రుడు. అతని మన్వంతరము ఈ విధముగా ఐదు విధములు. ఈ విషయము నాల్గవ స్కంధప్రారంభమున నిరూపితమైనది. (18)

శ్లో॥ స్వారోచిషో ద్వితీయస్తు మనురగ్నేః సుతోఽభవత్ ।
ద్యుమత్సుషేణరోచిష్మత్ ప్రముఖాస్తస్యచాత్మజాః ॥19॥

టీ :- ద్వితీయాసు, త్రిషుమన్వంతరేషు మన్వాదిషట్కమహ స్వారోచిష ఇతి యావద్గజేంద్రమోక్షప్రశ్నం. (19)

అగ్నిదేవుని పుత్రుడైన స్వారోచిషుడు రెండవ మనువు. ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మతుడు మొదలైనవారు ఈయన కుమారులు. స్వారోచిష మన్వంతరము నుండి అంటే రెండవ, మూడవ, నాల్గవ మన్వంతరములందు మన్వాదుల షట్కము గజేంద్రమోక్షణ ప్రశ్న వరకు చెప్పుచున్నాడు. (19)

శ్లో॥ తత్రేంద్రో రోచనస్త్వా సద్దేవాశ్చ తుషితాదయః ।
ఊర్జస్తంభాదయః సప్త ఋషయో బ్రహ్మవాదినః ॥20॥

ద్వితీయుడైన స్వారోచిష మన్వంతరమున రోచనుడు ఇంద్రుడైనాడు. తుషితాదులు దేవతలు. బ్రహ్మవాదులైన ఊర్జస్తంభాదులు సప్తఋషులు.(20)

శ్లో॥ ఋషేస్తు వేదశిరసస్తుషితానామ పత్న్యభూత్ ।
తస్యాం జజ్ఞే తతోదేవో విభురిత్యభివిశ్రుతః ॥21॥

వేదశిరసుడను ఋషికి తుషిత అను పేరుగల స్త్రీ భార్య అయినది. ఆమెయందు విభుడను ప్రఖ్యాతితో శ్రీమహా విష్ణువు కుమారుడై అవతరించెను. (21)

శ్లో॥ అష్టాశీతి సహస్రాణి మునయో యేధృతవ్రతాః ।
అన్వశిక్షన్వ్రతం తస్య కౌమార బ్రహ్మచారిణః ॥22॥

టీ :- విభోరసాధారణం చరితమాహ అష్టాశీతి సహస్రాణీతి. ॥20-22॥

విభుని అసాధారణ చరితమును చెప్పుచున్నాడు. ఘనులు, అధికులు, దృఢవ్రతులు ఐన ఎనుబది ఎనిమిది వేలమంది మునుల అనుగ్రహ శిక్షణలో ఆ విభుడు కౌమార బ్రహ్మచారి యగుచు వ్రతమును సలిపినాడు. (22)

శ్లో॥ తృతీయ ఉత్తమోనామ ప్రియవ్రత సుతో మనుః ।
పావనః సృంజయో యజ్ఞో హెూత్రాద్యాస్తత్సుతా నృప॥23॥

ఓ రాజా! ప్రియవ్రతుని కుమారుడైన ఉత్తముడనే పేరు గల వాడు మూడవ మనువు. పవనుడు, సృంజయుడు, యజ్ఞుడు, హెూత్సుడు మొదలైన వారతని పుత్రులు. (23)

శ్లో॥ వసిష్ఠ తనయాః సప్త ఋషయః ప్రమదాదయః ।
సత్యవేద శ్రుతా భద్రా దేవా ఇంద్రస్తు సత్యజిత్॥24॥

వసిష్ఠ మహాముని కుమారులైన ప్రమదాదులు, సప్త ఋషులు, సత్యులు, వేదశృతులు, భద్రులు మొదలైన వారు దేవతలు. సత్యజిత్తనువాడు ఇంద్రుడు. 24

శ్లో॥ ధర్మస్య సూనృతాయాంతు భగవాన్ పురుషోత్తమః ।
సత్యసేన ఇతి ఖ్యాతో జాతః సత్య వ్రతైః సహ ॥25॥

ధర్ముడను వానికి అతని భార్య సూనృతయందు భగవంతుడైన పురుషోత్తముడు సత్యవంతుడై సత్యసేనుడను పేరుతో జన్మించినాడు. (25)

శ్లో॥ సోఽనృతవ్రత దుశ్శీలానసతో యక్షరాక్షసాన్ ।
భూతద్రుహో భూతగణాంస్త్వవధీత్సత్యజిత్సఖః ॥26॥

సత్యజిత్తునకు సఖుడై సత్యసేనుడను ఇంద్రుడు, అసత్యపరాయణులు, దుష్టశీలయుతులైన యక్షరాక్షసులను, భూతగణములను సంహరించెను.(26)

టీ॥ సఇతి.సత్యజిత ఇంద్రస్యసఖాసన్. ॥23-26॥

శ్లో॥ చతుర్థ ఉత్తమభ్రాతా మనుర్నామ్నాచ తామసః ।
పృథుః ఖ్యాతిర్నరః కేతురిత్యాద్యాదశతాత్సుతాః ॥27॥

ఉత్తముడు తృతీయ మనువు, అతని తమ్ముడు తామసుడనువాడు నాల్గవ మనువు. పృథువు, ఖ్యాతి, నరుడు, కేతువు మొదలైన పదిమంది తామస మనువు పుత్రులు. (27)

శ్లో॥ సత్యకా హరయో వీరా దేవాస్త్రిశిఖ ఈశ్వరః ।
జ్యోతిర్ధామాదయః సప్తఋషయస్తామసేఽంతరే ॥28।

తామస మన్వంతరమున సత్యకులు, హరులు, వీరులు, దేవతలు. త్రిశిఖుడనువాడు దేవపతి ఇంద్రుడు. జ్యోతిర్ధామాది మునులు సప్తర్షులు. 28

టీ :- చతుర్థఇతి. ఉత్తమస్తృతీయో మనుః. తస్యభ్రాతా. సత్యేతి. త్రిశిఖః ఈశ్వరః ఇంద్రః ॥27,28॥

శ్లో॥ దేవా వైధృతమోనామ విధృతేస్తనయా నృప! ।
నష్టాః కాలేన యైర్వేదా విధృతాః స్వేద తేజసా॥29॥

ఇంకా ఇతరులైన పరాక్రమవంతులైన దేవతలను గుఱించి చెప్పుచున్నాడు. ఓ రాజా! వైధృతులను పేరుగల విధృతి తనయులైన దేవతలు

టీ :–అన్యానపివిశిష్టపరాక్రమాన్, సురానాహదేహవైధృతయ. ఇతి ॥29॥

అపారమైన పరాక్రమము కలవారు. అంతకుముందు నష్టమైన వేదములను వీరు తమ విక్రమముతో సాధించినారు. (29)

శ్లో॥ తత్రాపి జజ్ఞే భగవాన్ హరిణ్యాం హరిమేధసః ।
హరిరిత్యా హృతో యేన గజేంద్రో మోక్షతో గ్రహాత్॥30॥

టీ :–తత్రేతి. హరిరిత్యాహృతో వ్యాహృతఃగ్రహత్ గ్రాహత్॥30॥

హరి మేధునకు అతని పత్నియైన హరిణి యందు భగవంతుడైన హరి ఉద్భవించినాడు. మొసలినోట చిక్కి సంకటపడుచున్న గజేంద్రుని దుఃఖమును చూచి హరి కాపాడినాడు. (30)

**రాజా (పరీక్షిత్) ఉవాచ :–**

శ్లో॥ బాదరాయణ ఏతత్తే శ్రోతుమిచ్ఛామహే వయమ్ ।
హరిర్యథా గజపతిం గ్రాహగ్రస్త మమూముచత్ ॥31॥

టీ :–బాదరాయణ ఇతి. అమూముచత్ మోచయామాస.॥31

**శుకమహర్షిని పరీక్షిత్తు ఈ విధముగా అడిగినాడు :–**

ఓ బాదరాయణియైన శుకమహర్షీ! శ్రీమహావిష్ణువు మొసలినోట చిక్కిన గజరాజును ఆ బాధనుండి విముక్తుని గావించిన విధమును మీనుండి వినగోరుచున్నాము. (31)

శ్లో॥ తత్కథాసు మహత్పుణ్యం ధన్యం స్వస్త్యయనం శుభమ్ ।
యత్ర యత్రోత్తమ శ్లోకో భగవాన్ గీయతే హరిః ॥32

విష్ణుకథను వినుటకు హేతువును చెప్పినాడు. ఏయే కథలందు ఉత్తమ శ్లోకుడు, భగవంతుడైన శ్రీహరి కీర్తింపబడునో అట్టి కథలు మహాపుణ్య ప్రదమైనవి. ధన్యమైనవి. మంగళకరమైనవి. మంచిని కలిగించునవి. అట్టి కథలను వినిపించుమని శుకమహర్షిని అర్థించినాడు. ఇక్కడ 'తత్' అనుటలో వినుటకు ఇంపైన కథ అని అర్థము. ఆయా కథఅందు (తత్కథాసు–తాసు

**శ్రీ సూత ఉవాచ :-**

శ్లో॥ పరీక్షత్తైవం స తు బాదరాయణిః
ప్రాయోపవిష్టేన కథాసు చోదితః ।
ఉవాచ విప్రాః ప్రతినంద్య పార్థివం
ముదా మునీనాం సదసి స్మ శృణ్వతామ్ ॥33॥

టీ :- తదితి.శ్రవణేచ్ఛాయాం హేతుః తత్కథాసుతాసుకథాసు. సాకథైవ వాసుమహత్పుణ్యం. పుణ్యవిశేషణంధన్యమిత్యాది ॥32,33॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
మన్వంతరాను చరితే ప్రథమోఽధ్యాయః

కథాసు ) అనికాని, అట్టి కథ మిక్కిలి పుణ్యకారణము (తత్కథాసు మహత్పుణ్యం) అనికాని చెప్పుకొనవచ్చును. (32)

**శ్రీ సూత మహాముని ఇట్లు చెప్పినాడు :-**

ఆ విధముగా ప్రాయోపవిష్టుడైన పరీక్షిన్మహారాజు చేత శ్రీహరి కథను వినిపించుటకు ప్రేరేపితుడైన శుకమహర్షి రాజును గుఱించి మునుల సదస్సులో చెప్పిన విషయమును సూతమహాముని పరీక్షిత్తును అభినందించి శౌనకాది మునుల నుద్దేశించి ఓ విప్రోత్తములారా! ఆ కథలను వినుడు అని చెప్పదొడగెను. (33)

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే మన్వంతరాను చరితమను
ప్రథమాధ్యాయము ఆంధ్రానువాదము.

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ తుర్యే మన్వంతరే ప్రోక్తం గజేంద్రస్య విమోక్షణమ్ ।
ద్వితీయాది త్రిభిస్తత్తు విస్తరేణోప వర్ణ్యతే॥
ద్వితీయేతు గజేంద్రస్య గజేభిః క్రీడతే జలే ।
దైవాద్గ్రాహ గృహీతస్య హరిస్మృతి రుదీర్యతే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఆసీద్గిరివరో రాజం స్త్రికూట ఇతి విశ్రుతః ।
క్షీరోదేనావృతః శ్రీమాన్యోజనాయుత ముచ్ఛ్రితః ॥1॥

టీ :- తుర్యేమన్వంతరేప్రోక్తం గజేంద్రస్య విమోక్షణమ్. ద్వితీయాదిత్రిభిస్తత్తు విస్తరేణోపవర్ణ్యతే. ద్వితీయే తు గజేంద్రస్యగజీభిః క్రీడతో జలే. దైవాద్గ్రాహగృహీతస్య హరిస్మృతిరుదీర్యతే. ఆసీదితి. ఆసీత్ ఆస్తే. ॥1॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

నాల్గవ మన్వంతరమున గజేంద్రుని విమోచనము చెప్పబడినది. రెండవ అధ్యాయమునుండి మూడధ్యాయములు అంటే రెండు, మూడు, నాలుగు అధ్యాయములందు విస్తరముగా వర్ణితము. రెండవ అధ్యాయమున గజేంద్రుడు ఆడ ఏనుగులతో జలక్రీడలాడుట, పిమ్మట మొసలినోట పడి దైవికముగా హరినామస్మరణ కలుగుట చెప్పబడును.

**శ్రీ శుకమహర్షి ఇట్లు చెప్పెను :-**

ఓ పరీక్షిన్మహారాజా! శ్రీమంతమైన త్రికూటమను పేరుగల ఒక పర్వత శ్రేష్ఠముండినది. అది పదివేల యోజనముల పొడవుతో పాల సముద్రముచేత ఆవరింపబడినది. (1)

శ్లో॥ తావతావిస్తృతః పృథక్ త్రిభిఃశృంగైః పయోనిధిమ్।
దిశఃఖం రోచయన్నాస్తే రౌప్యాయస హిరణ్మయైః ॥2॥

టీ :- తావతేతి. తావతాయోజనాయుతేన పర్యక్పరితః త్రికూటసమాఖ్యాభీజమాహ - త్రిభిశ్శృంగైర్ముఖ్యైస్సువర్ణ రౌప్యలోహమ యైః. (2)

ఆ త్రికూట పర్వతము పొడవుతో సమానముగా పదివేల యోజనముల వెడల్పుతో ఇనుము, వెండి, బంగారు శృంగములతో సముద్రమును, దిక్కులను, ఆకాశమును అంతటా ప్రకాశింపజేయుచున్నది. (2)

శ్లో॥ అన్యైశ్చ కకుభః సర్వా రత్నధాతు విచిత్రితైః ।
నానాద్రుమలతా గుల్మైర్నిర్ఘోషై ర్నిర్ఝరాంభసామ్ ॥3॥

టీ :-అన్యైరితి. అన్యైశ్చ శృంగైః.నిర్ఝరాంభసాంనిర్ఘోషైశ్చ. కకుభః సర్వారోచయన్నాస్త ఇతి. పూర్వేణైవాన్వయః. కథం భూతైః శృంగైః రత్నైర్ధాతుభిశ్చ విచిత్రితైః నానావిధానాం ద్రుమ లతానాం గుల్మా ఏషు తైః. (3)

ఇంకా అనేకమైన శృంగములతో త్రికూటనగము సెలయేటి జలముల మ్రోతలతో, అనేకవిధములైన వృక్షములు, తీగలు, పొదలతో, రత్నములు, గిరి ధాతువుల రంగురంగుల కాంతులతో అన్నిదిశలును ప్రకాశింపజేయు చున్నది. (అని పూర్వ శ్లోకముతో అన్వయము.) బంగారము, వెండి, ఇనుముతో కూడిన శిఖరము వలన ఆ గిరికి త్రికూటమని పేరు వచ్చినది.(3)

శ్లో॥ స చావ నిజ్యమానాంఘ్రిః సమందాద్పయ ఊర్మిభిః।
కరోతి శ్యామలాం భూమిం హరిన్మరకతాశ్మభిః ॥4॥

ఆ త్రికూట పర్వత పాద ప్రదేశము అన్ని వైపులనుండి జలతరంగముల చేత ప్రక్షళితమై ఆకుపచ్చని రాలతో భూమిని హరితవర్ణముగా చేయుచున్నవి. (4)

శ్లో॥ సిద్ధచారణ గంధర్వ విద్యాధర మహోరగైః ।
కిన్నరైరప్సరోభిశ్చ క్రీడద్భిర్జుష్టకందరః ॥5॥

టీ :-సదేతి పయసఊర్మిభిః సమంతాదవనీజ్యమానా ఆంఘ్రయో మూలప్రాంతా యస్య హరిద్భి:పాలాశవర్ణైః ॥4,5॥

విలాసముగా క్రీడించునట్టి సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, కిన్నరులు, అప్సరసల అనుభవములతో కూడిన గుహలతో ఇంపైనది ఆ త్రికూటనగము. (5)

శ్లో॥ యత్ర సంగీత సన్నాదైర్నదద్గుహ మమర్షయా ।
అభిగర్జంతి హరయః శ్లాఘినః పరశంకయా ॥6॥

టీ :-యత్రేతి కిన్నరాదీనాం సంగీత సంనాదైర్నదంత్యోగుహా యస్మిన్ ప్రదేశేతం అభిగర్జంతిహరయః సింహాః అమర్షయా అసహనేన. (6)

ఆ త్రికూటపర్వతమున కిన్నరాదుల మనోహర జంత్ర గాత్ర సంగీతవాదములతో గుహలు ప్రతిధ్వనించగా అసహనముతో శత్రుసింహముల గర్జన అను భ్రమతో అందలి పరాక్రమముచే కొనియాడదగిన సింహములు గర్జనలు చేయుచున్నవి. (6)

శ్లో॥ నానారణ్యపశువ్రాత సంకులద్రోణ్యలంకృతః ।
చిత్రద్రుమ సరోద్యాన కలకంఠవిహంగమః ॥7॥

టీ :- నానేతి నానాయే ఆరణ్యాః పశవః తేషాంవ్రాతైః సంకూలాభిః ద్రోణీభిరలంకృత ఆస్తేకించ. చిత్రాః ద్రుమాః యేషుసురోద్యానేషు కలకంఠామధుర స్వనా విహంగమా యస్మిన్ ॥7॥

ఆ త్రికూటగిరి అనేకవిధములైన అడవి మృగముల సముదాయముతో, కిటకిటలాడు జలాశయములతో, దేవతల ఉద్యానవనమువలె చిత్రవిచిత్రములైన వృక్షములతో మధురమైన కంఠధ్వని కలిగిన పక్షి సముదాయములతో మనోజ్ఞమైనది. (7)

శ్లో॥ సరిత్సరోభిరచ్ఛోదైః పులినైర్మణివాలుకైః ।
దేవస్త్రీ మజ్జనామోద సౌరభారుజ్వలైర్యుతః ॥8॥

టీ :-కించసరిదితి స్వచ్ఛోదకైస్సరిత్సరోభిర్యుతః మణయ ఏవ వాలుకా ఏషుతైః పులినైశ్చయుక్తః దేవస్త్రీణాంమజ్జనేన.య ఆమోదః తేన సౌరభయుకాంతన్యం బూని అనిలాశ్చ తైశ్చయుత ఆస్తే. (8)

మణులే ఇసుక గాగల తిన్నెలతో దేవతాస్త్రీల స్నానములవలన సిద్ధించిన సువాసనాభరితమైన చల్లని నీరు పిల్లగాలులతో స్వచ్ఛమైన జలములతో ఒప్పిన నదీ సరస్సులతో కూడినది త్రికూటనగము. (8)

శ్లో॥ తస్యద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః ।
ఉద్యాన మృతుమన్నామ ఆక్రీడం సురయోషితామ్ ।9।

టీ :-తస్యేతి తస్యద్రోణ్యాంవరుణస్యోద్యానమాస్తే ॥9॥

ఆ త్రికూట పర్వతమందలి కాసార తీరమున భగవంతుడు మహాత్ముడు ఐన వరుణ దేవుని ఉద్యాన వనమున్నది. దానిపేరు ఋతుమతి. దేవతా స్త్రీలు అందు విశేషముగా క్రీడింతురు. (9)

శ్లో॥ సర్వతో-లంకృతం దివ్యైర్నిత్యం పుష్ప ఫలద్రుమైః ।
మందారైః పారిజాతైశ్చ పాటలా శోకచంపకైః ॥10॥

ఆ ఉద్యానవనము నిత్యము ఫలపుష్పములతో శోభిల్లునట్టి దివ్యమైన మందారము, పారిజాతము, కలిగట్టు, అశోకము, చంపకము మొదలైన వృక్షములతో అంతటా అలంకరింపబడినది. (10)

శ్లో॥ చూతైః ప్రియాలైః పనసైరామ్రై రామ్రాతకైరపి ।
క్రముకైర్నారికేళైశ్చ ఖర్జూరైర్బీజపూరకైః ॥11॥

ఇంకా ఉద్యానవనము మామిడి, మోరటి, పనస, తియ్యమామిడి, అంబాళము, పోకలు, కొబ్బరి, ఖర్జూరము, మాదీఫలము (మున్నగు వృక్షములతో అలంకృతమని ముందటి శ్లోకముతో అన్వయము). (11)

శ్లో॥ మధూకైః సాలతాలైశ్చ తమాలై రసనార్జునైః ।
అరిష్టోదుంబర ప్లక్షైర్వటైః కింశుక చందనైః ॥12॥

ఆ వనము ఇప్ప, తాటి, మద్దిమ్రాను, తెల్లగన్నేరు, కుంకుడు, మేడి, జువ్వి, మఱ్ఱి, మోదుగు, మంచిగంధము మొదలైన మహావృక్షములతో (అలంకృతమని ముందటి శ్లోకముతో అన్వయము) (12)

శ్లో॥ పిచుమందైః కోవిదారైః సరళైః సురదారుభిః ।
ద్రాక్షేక్షురంభా జంబూభిర్బదర్యక్షాభయామలైః ॥13॥

వేప, రక్త కాంచనము, తెగడ మొదలైన వృక్షములు, దేవతా వృక్షములు మొదలైన తరువులతో, ద్రాక్ష, చెఱుకు, అరటి, నేరేడు, రేగు, రుద్రాక్ష, కరక, ఉసిరి మొదలైన ఫల వృక్షములతో ( అలంకృతమని ముందటి శ్లోకముతో అన్వయము) (13)

టీ :- గిరివనాదిసర్వంధ్యేయమితి వక్షతి. అతోగిరిముపవర్ణ్య. వనం వర్ణయతి సర్వతోలంకృతమితి
॥10-13॥

శ్లో॥ బిల్వైః కపిత్థైర్జంబీరైర్వృతో భల్లాతకాదిభిః ।
తస్మిన్ సరః సువిపులం లసత్కాంచన పంకజమ్ ॥14॥

మారేడు, వెలగ, నిమ్మ, జీడి, మొదలైన వృక్షములతో ఆ ఉద్యానవనము నిండినది. ఆ గిరి యందలి సరస్సు మిక్కిలి విశాలమైనదై ప్రకాశించు బంగారు పద్మములతో ( శోభించినదని తర్వాత శ్లోకముతో అన్వయము) (14)

టీ:- పునర్గిరిం వర్ణయతి మందారైరిత్యాదిచతుర్భిః మందారాదిభిర్వృ త ఇత్యన్వయః ॥14॥

శ్లో॥ కుముదోత్పల కల్హార శతపత్ర శ్రియోర్జితమ్ ।
మత్త షట్పద నిర్ఘష్టం శకు తైశ్చ కలస్వనైః ॥15॥

ఎఱ్ఱతామర. కలువ, ఎఱ్ఱకలువ, తామర మొదలైన పుష్పాల సమృద్ధితో శోభించినది ఆ కాసారము. మదించిన తుమ్మెద ఝుంకారములతో, మనోహరమైన శకుంతముల మధురధ్వనులతో (నిండినదని ముందటి శ్లోకముతో అన్వయము.) (15)

టీ :-తస్మిన్నితి. తస్మిన్ గిరౌసరఆస్తే.తద్వర్ణయతి సువిపుల మిత్యాది సార్థైః పంచభిః లసంతి కాంచన పంకజానియస్మిన్ కుము దాదీనాం(శ్రియా ఊర్జితం. ॥15॥

శ్లో॥ హంసకారండవాకీర్ణం చక్రాహ్వైః సారసైరపి ।
జలకుక్కుట కోయష్టి దాత్యూహ కలకూజితమ్ ॥16॥

హంసలు, కారండవములు, చక్రవాకములను పేరుగలిగిన బెగ్గురు పక్షులు, నీటికోళ్ళు, గ్రుడ్డికొంగలు, వానకోయిలల మధురమైన ధ్వనులతో ఆహ్లాదకరమైనది ఆ సరస్సు . (16)

టీ:- మత్తేతి. కలకిస్వనో యేషాం తైశ్శకుంతైశ్చ నిర్ఘుష్టం చక్రాహ్వైసారసై ః ఆకీర్ణం. ॥16॥

శ్లో॥ మత్స్య కచ్ఛప సంచార చలత్పద్మరజః పయః ।
కదంబ వేతస నీలనీప వంజులకైర్వృతమ్ ॥17॥

చేపలు, తాబేళ్ళ సంచారములచేత పద్మాల పుష్పొదులు కలిసినది ఆ కాసార జలము. కడిమి, ప్రబ్బలి, కిక్కిసగడ్డి, మంకెన, తినాస మొదలైన వృక్షములతో కూడినది సరస్సు. (17)

శ్లో॥ కుందైః కురబకా శోకైః శిరీషైః కుటజేంగుదైః ।
కుంజకైః స్వర్ణయూదీభిః నాగ పున్నాగ జాతిభిః ॥18॥

మొల్ల, ఎఱ్ఱ గోరింట, కంకేళి, దిరిసెన, కొండమల్లెలు, గార ( ఒక విధమైన గంధము ), గొజ్జగి, బంగారు, అడివి మొల్లలు, నాగకేసరము, సురపొన్న, జాజి (మొదలైన పుష్ప వృక్షములతో అలంకరింపబడినది ఆ కాసారమని ముందటి అర్థము). (18)

శ్లో॥ మల్లికా శతపత్త్రైశ్చ మాధవీ జాలకాదిభిః ।
శోభితం తీరజైశ్చాన్యైర్నిత్యర్తుభిరలంద్రుమైః ॥19॥

మల్లెలు, తామరలు, పూలపరివిందుల లేత మొగ్గలు మొదలైన మిక్కిలి విరాజిల్లునట్టి వృక్షములతో మనోరంజకముగా ఉన్నది ఆ కాసారము.(19)

టీ :-జలేతి. జలకుక్కుటాదీనాం కులైః కూజితం. మత్స్యానాం కచ్ఛపానాం చ సంచారేణ చలతాం పద్మానాం రజసాయుక్తం పయోయస్మిన్ తత్. శోభితమితి. నిత్యమృతవః ఫలపుష్పాదిసంపత్తి హేతవో యేషాం తైః అలం శోభితం. ॥17,18,19॥

శ్లో॥ తత్రైకదా తద్గిరి కాననాశ్రయః
కరేణుభిర్వారణ యూథపశ్చరన్ ।
సకంటకాన్కీచక వేణు వేత్రవ
ద్విశాల గుల్మం ప్రరుజన్వనస్పతీన్॥20॥

ఇట్లుండగా ఒకానొకప్పుడు త్రికూటగిరి కాననము నందున్న అనేకములైన ఆడ ఏనుగులకు భర్తయైన గజరాజు దప్పికతో నున్న సైన్యముతో అందు సంచరించుచు ముండ్లతో కూడిన లావైన వెదురు, పేము మొదలైనవి కలిసి పోయిన వెడల్పైన పొదలున్న వృక్షములను అణగద్రొక్కుచు ( సరోవర సమీపమునకు వచ్చినదని ఐదవ శ్లోకముతో అన్వయము ) (20)

టీ :-తత్రేతి.తత్రైవం సతి. ఏకదా. తద్గిరికాననాశ్రయోవారణ యూథపః, కరేణుభిశ్చరక్ తృష్ణార్దితేన యూథేన వృతః సరోవవర స్యాభ్యాశం సమిపముసాగమదితి పంచమేనాన్వయః. కింకుర్వన్? కీచక వేణువేత్రవతం. విశాలం గుల్మం. లతాదిసందర్భం వనస్పతీంశ్చ ప్రరుజన్ ప్రభంజన్. (20)

శ్లో॥ యద్గంధమాత్రాద్ధరయో గజేంద్రా
వ్యాఘ్రాదయో వ్యాలమృగాః సఖడ్గాః ।
మహోరగాశ్చాపి భయాద్ద్రవంతి
సగౌర కృష్ణాః శరభాశ్చమర్యః ॥21॥

టీ :-యదితి. కథంభూతః యస్య గంధమాత్రాత్ హరయః సింహాగజేంద్రాదయశ్చ భయాద్ద్రవంతి పలాయంతే. ॥21॥

ఆ గజరాజు మదవలపు వాసన తగినంతమాత్రమున సింహములు, ఇతర గజములు, పెద్దపులులు, పాములు, జింకలు, ఖడ్గమృగములు, శరభములు, చమరీమృగములు, గౌరములు ( బక్కాంకజాతి మృగము ), కృష్ణమృగములు మొదలైన అడవి జంతువులన్నియు భయముతో పారిపోవుచున్నవి. (21)

శ్లో॥ వృకా వరాహ మహిషరక్ష శల్యా
గోపృచ్ఛశాలా వృక మర్కటాశ్చ ।
అన్యత్ర క్షుద్రా హరిణాః శశాదయః
చరంత్యభీతా యదనుగ్రహేణ॥22॥

టీ :-వృకేతి. వృకాదయస్తు క్షుద్రాఅల్పప్రాణినః అన్యత్ర తద్దృష్టి పథం త్యక్త్వాచరంతి. ॥22॥

మరొకచోట అంటే ఆ గజరాజు దృష్టి పథంలో పడకుండా దాని అనుగ్రహము చేత తోడేళ్ళు, అడవి పందులు, అడవి దున్నలు, ఎలుగుబంట్లు, ఏదుపందులు, కొండముచ్చులు, నక్కలు, జింకలు, కుందేళ్ళు మొదలైన అల్పప్రాణులైన జంతువులు నిర్భయములై తిరుగుచున్నవి. (22)

శ్లో॥ స ఘర్మతప్తః కరిభిః కరేణుభి
ర్వృతో మదచ్యుత్కలభై రనుద్రుతః ।
గిరిం గరిమా పరితః ప్రకంపయన్
నిషేవ్యమాణోఽలికులైర్మదాశనైః ॥23॥

ఆ గజరాజు తీవ్రమైన ఎండవేడిమిచేత తపించినదై ఆడ మగ ఏనుగులతో ఆవరింపబడినదై, మదజలపానమునకై తుమ్మెదలతో సేవలు పొందునదై, మదమును స్రవించు ఏనుగు గున్నలు వెంటరాగా అపారమైన బలముతో త్రికూటగిరిని సంపూర్ణముగా కంపింపజేయుచు కాసారమును (కాసారమును చేరినది. తర్వాత శ్లోకముతో అన్వయము) (23)

శ్లో॥ సరోఽనిలం పంకజరేణురూషితం
జిఘ్రన్విదూరాన్మదవిహ్వలేక్షణః ।
వృతః స్వయూథేన తృషార్దితేన త
త్సరోవరాభ్యాశ మథాగమద్ద్రుతమ్ ॥24॥

పద్మరాగముతో కప్పుబడిన సరోవరముపై వీచు చల్లగాలి సువాసనను దూరమునుండియే పసిగట్టి (అక్కడ జలమున్నదని గ్రహించి) మదముచే చలించునట్టి కన్నులు గలది. దప్పిక తపించు తన అనుచర బృందముతో కూడినదైన గజరాజు ఆ సరోవర సమీపమునకు వేగముగా సమీపించెను. (24)

శ్లో॥ విగాహ్య తస్మిన్నమృతాంబు నిర్మలం
హేమారవిందోత్పల రేణువాసితమ్ ।
పపౌ నికామం నిజ పుష్కరోద్ధృత
మాత్మాన మద్భిః స్నపయన్ గతక్లమః ॥25॥

గజేంద్రము ఆ కాసారమునందు ప్రవేశించి క్రుంకులిడుచు అమృతజలము వలె నిర్మలమైనవి. బంగారు పద్మాలు, కలువల పుష్పాదుల సువాసన గలది, తన తొండముతో గమటబడినవి అయిన సరోవర జలములతో తడుపుకొనుచు ( స్నానము చేయుచు ) ఎండ తాపము నుండి ఉపశమనము పొందినదై ఆ జలమును తృప్తిగా కడుపారగా సేవించినది. (25)

టీ :-సఇతి. పునః కీదృశః? ధర్మతప్తః మదచ్యుత్ మదస్రావీ. మదమశ్నంతీతి తథా తైః. (23,24,25)

శ్లో॥ స్వపుష్కరేణోద్ధృత సీకరాంబుభిః
నిపాయన్సం స్నపయన్ యథాగృహీ ।
ఘృణీ కరేణూః కలభాంశ్చ దుర్మదో
నాచష్ట కృచ్ఛ్రం కృపణోఽజమాయయా ॥26॥

ఎండవేడిమికి తపించిన గజము తన తొండముతో ఎగ జిమ్మబడిన నీటి తుంపరలతో మిగుల గర్వితయై తన భార్యలైన ఆడ ఏనుగులను, బిడ్డలైన గున్నలను చక్కగా స్నానము చేయించుచూ, నీటిని త్రాపుచూ దైవ సంకల్పము చేత తనకు కలుగబోవు భయంకరమైన సంకటమును గ్రహించలేక పోయెను. (26)

శ్లో॥ తం తత్ర కశ్చిన్నృప! దైవ చోదితో
గ్రాహో బలీయాంశ్చరణౌ రుషాఽగ్రహీత్ ।
యదృచ్ఛయైవం వ్యసనం గతో గజో
యథాబలం సోఽతి బలో విచక్రమే ॥27॥

ఓ రాజా! గజపతి ఈ విధముగా జలక్రీడలాడుచుండగా దైవికముగా ఒకానొక బలమైన మొసలి కోపముతో ఏనుగు కాలును పట్టినది. ఆకస్మికముగా సంభవించిన ఈ ఆపదకు భయపడక అపారమైన బలము కలిగిన గజరాజము తన బలమంతటినీ ప్రయోగించి గ్రాహముపై విజృంభించినది. (27)

శ్లో॥ తథాతురం యూథపతిం కరేణవో
వికృష్యమాణం తరసా బలీయసా ।
విచక్రు శుర్దీన ధియోఽపరే గజాః
పార్ష్ణిగ్రహాస్తారయితుం న చాశకన్ ॥28॥

ఆ విధముగా మొసలి నోటచిక్కి, వేగముగా బలముగా నీటిలోనికి లాగబడి సంకటపడునట్టి తమ భర్తయైన గజరాజును ఆడేనుగులు ఏమి చేయుటకును తోచనివై ఆకుల పడినవి. వెనుక అనుసరించుచున్న మిగిలిన ఏనుగులును తమ అధిపతియైన గజరాజును రక్షించుటకు అశక్తమైనవి. (28)

టీ :- విగాహ్యేతి. నిజేన పుష్కరేణ కరాగ్రేణ,ఉద్ధృతం గతక్లమస్సన్ నికామం పపౌ. ॥26,27,28॥

శ్లో॥ నియుధ్యతోరేవ మిభేంద్ర నక్రయో
ర్వికర్షితోరంతరతో బహిర్మిథః ।
సమాః సహస్రం వ్యగమన్మహీపతే
స ప్రాణయోశ్చిత్ర మమం సతామరాః ॥29॥

ఓ రాజా! ఈ విధముగా బలమైన గజ గ్రాహములు పరస్పరము వెలుపలికి, లోపలికి లాగుచు తీవ్రముగా పోరాడుచుండగా ఒక వేయి సం॥లు గడిచినవి. ఈ కరి మకరుల పోరాటమును మిక్కిలి చిత్రముగా దేవతలు వీక్షించిరి. (29)

శ్లో॥ తతో గజేంద్రస్య మనోబలౌజసాం
కాలేన దీర్ఘేణ మహానభూద్వ్యయః ।
వికృష్యమాణస్య జలేఽవసీదతో
విపర్యయోఽభూత్సకలం జలౌకసః ॥30॥

అప్పుడు బలముగా నీటిలోనికి లాగబడుచూ చాలాకాలము గ్రాహముతో పోరాడి అలసిన గజనాథుని ఉత్సాహ శక్తికి మూలమైన మనో ధైర్యము, శరీరబలము, ఇంద్రియ శక్తులు క్రమముగా క్షీణించినవి. జలము నివాసమైన మొసలికి మాత్రము వ్యత్యస్తముగా సర్వశక్తులు వృద్ధిపొందినవి. (30)

టీ :–తథేతి. దీనధియః కరేణవః తం కేవలం విచుక్రుశః.॥29,30

శ్లో॥ ఇత్థం గజేంద్రః స యదాప సంకటం
ప్రాణస్య దేహీ వివశోయదృచ్ఛయా ।
అపారయన్నాత్మ విమోక్షణే చిరం
దధ్యావిమాంబుద్ధిమథాప్య పద్యత ॥31॥

ఈ విధముగా దేహధారియైన గజపతి ప్రాణసంకటమును పొంది ఆకస్మికముగా శరీర శక్తి నశించి వశము తప్పినది. దరిచేరలేని గ్రాహ బాధనుండి తనను విడిపించుకొనుటకై చాలాసేపు చింతించినది. అప్పుడా గజేంద్రునకు ఈ విధమైన ఆలోచన కలిగినది. (31)

టీ :–తతఇతి. మన ఉత్సాహశక్తిః బలంశారీరకం. ఓజః ఐంద్రియ తేషాం సకలం బలాది. విపర్యయో విపరీతం. అధికం జలౌక సో గ్రాహస్య. ॥31॥

శ్లో॥ నమామిమే జ్ఞాతయ ఆతురం గజాః
కుతః కరిణ్యః ప్రభవంతి మోక్షితుమ్ ।
గ్రాహేణ పాశేన విధాతు రావృతోఽ
ప్యహం చ తం యామి పరం పరాయణమ్॥32॥

ఆపదలో నున్న నన్ను నా సహచరులైన బలమైన ఏనుగులే రక్షించలేవు. ఆడ ఏనుగులకు సాధ్యమే కాదు. దైవ వశము చేత మొసలి రూపబంధనమున పడితిని. దీని నుండి తప్పించుకొనుటకు నాకు శక్తిలేదు. ఐనప్పటికీ ఇతరులైన బ్రహ్మాదులకును ఆశ్రయుడై పరాత్పరుడైన పరమేశ్వరుని శరణు పొందుచున్నాను. (32)

టీ :-ఇత్థమితీతి. స ఇత్థం యదా ప్రాణసంకటమవాప. యతో దేహి. ॥32॥

శ్లో॥ యః కశ్చనేశో బలినాంతకోరగాత్
ప్రచండ వేగాదభిధావతో భృశమ్ ।.
భీతం ప్రపన్నం పరిపాతి యద్భవాన్
మృత్యుః ప్రధవత్యరణం తమీమహి ॥33॥

టీ :-బుద్ధిమేవాహ నమామితి. అహం చ న ప్రభవామి. యతః గ్రాహరూపేణ విధాతుః పాశేనవృతః తథాపి. తం పరం పరమేశ్వరం, పరేషాం బ్రహ్మాదీనాం అయనకాశ్రయభూతం శరణం యామి. కోఽసౌ శరణం యాసి తత్రాహ యః కశ్చనేతి అంతక ఏవోరగః తస్మాత్తం శరణం మామహి వ్రజేమహి యద్భయాదిత్యత్ర శ్రుతిః "భీషాస్మా ద్వాతఃపవతే। భీషోదేతి సూర్యః। భీషాస్యాదగ్నిశ్చేంద్రశ్చ। మృత్యుర్ధావతి పంచమః ।" ఇతి. ॥33॥

ఇతి శ్రీమద్భాతవతే, మహాపురాణే, అష్టమస్కంధే
గజేంద్రోపాఖాఖ్యానే ద్వితీయోఽధ్యాయః

బలవంతమై తీవ్రమైన వేగముతో వెన్నంటి మిక్కిలిగా పరిగెత్తివచ్చు యముడనే సర్పము వలన భయపడి శరణుపొందిన నన్ను ఏ సర్వశక్తిమంతుడైన ఈశ్వరుడు రక్షించునో, ఏ పరమాత్మ శక్తివలన మృత్యువుకూడా బయపడి పారిపోవునో, అట్టి విశ్వమయుడైన పరమేశ్వరుని రక్షణార్థమై శరణు పొందుచున్నాను. అని గజరాజము మొరలిడినది. " భీషాస్మా ద్వాతఃపవతే। భీషోదేతి సూర్యః । భీషాస్యాదగ్నిశ్చేంద్రశ్చ। మృత్యుర్ధావతి పంచమః ।" పరమాత్మ భీతివలన గాలి వీచును. సూర్యుడుదయించును. అగ్ని, ఇంద్రుడు వారి వారి కార్యములందు ప్రవృత్తులగుదురు. ఐదవదిఐన మృత్యువు పరిగెత్తిపోవును. అని శృతి వాక్యము. (33)

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే గజేంద్రోపాఖ్యానము నందు
ద్వితీయాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ తృతీయేతు గజేంద్రేణ స్తుతీ హరి రుపేత్యతమ్ ।
సముద్ధ ధార తం గ్రహాత్ గ్రాహం దేవల శాపతః॥

టీ :- తృతీయేసగజేంద్రేణస్తుతో హరిరుపేత్య తమ్. సముద్దదార గ్రాహాచ్చ గ్రాహం దేవలశాపతః.

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం వ్యవసితో బుద్ధ్యా సమాధాయ మనోహృది ।
జజాప పరమం జాప్యం ప్రాగ్జన్మన్యనుశిక్షితమ్ ॥1॥

టీ :- ఏవమితి. జప్యం స్తోత్రం ప్రాగ్జన్మని ఇంద్రద్యుమ్నసంజ్ఞేః1

**గజేంద్ర ఉవాచ :-**

శ్లో॥ ఓం నమో భగవతే తస్మై యత ఏతచ్చిదాత్మకమ్ ।
పురుషాయాది బీజాయ పరేశాయాభి ధీమహి ॥2॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

మూడవ అధ్యాయమున గజరాజు స్తుతించగా శ్రీహరి అతనిని సమీపించి, మొసలినుండి కరినాథుని, దేవలశాపము నుండి మకరిని రక్షించినాడు. అనేది విషయము.

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా నిశ్చయబుద్ధితో మనస్సును హృదయమందు చక్కగా చేర్చి (ఏకవృత్తితో) పూర్వజన్మలో పొందిన శిక్షను అనుసరించి (అగస్త్యముని శాపముతో ఇంద్రద్యుమ్న భూపతి గజ జన్మమును పొందిన విషయమును భావించి) భగవంతుని గుఱించి గొప్పగా స్తుతించినాడు. (1)

**గజరాజు ఈ విధముగా స్తోత్రము చేసినాడు :-**

కేవలుడైన పరమాత్మునికి నమస్కారము. ఆయనను ఏకాగ్రతతో ధ్యానించుచున్నాను. మొసలి నోటచిక్కి గజరాజు సంకటపడుచున్నందున శారీరక నమస్కారాలు సాధ్యము కానందున అతనిని శారీరకముగా సేవ

టీ :-నమ ఇతి. తస్మైనమో నమనం. అభిధీమహి అభిధ్యాయేమ. కేవలం గ్రాహ గృహితత్వేన కాయప్రణతేర శక్యత్వాత్ స్వస్యతద్ జ్ఞానం సంభావయితుం విశినష్టి యతశ్చి ద్రూపాత్.ఏతదే హాదీ. చిదాత్మకం చేతనం భవతి. తదుక్తం. శ్లో:ःయేన చేతయతే విశ్వః మితి తత్రహేతుః పురుషాయ కారణత్వేన ప్రవిష్టాయ నను. ప్రకృతి పురుషౌకారణమితి ప్రసిద్ధం. తత్రాహ. ఆది ః ప్రకృతిః బీజంపురుషః తద్రూపాయ. ప్రవిష్టత్వే2పి జీవ వత్పారతంత్ర్యం వారయతి పరేశా యేతి (2)

శ్లో॥యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయమ్।
యో౽స్మాత్పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయంభువమ్।3

టీ:- పరమైశ్వర్యంవివృణ్వన్నాహ - యావదధ్యాయపరిసమాప్తి యస్మిన్నితి. యస్యిన్నధిష్ఠానే. యత ఉపాదానాత్ . యేన కర్త్రా . యశ్చ స్వయమేవేదం విశ్వం భవతి. అస్మాత్కార్యాత్. పరస్మాత్కారణాచ్చ. యః పరస్తం. స్వయంభువం స్వతసిద్ధం. ప్రపద్యే శరణం వ్రజామి. (3)

చేయు జ్ఞానము నశించినది. పరమాత్ముని చిద్రూపము వలన ' యేన చేతయతే విశ్వమ్ ' జగత్తును ఆయనే చైతన్యవంతము చేయుచున్నాడు. అనే హేతువు వలన ఈ శరీరాదులునూ జ్ఞానమయములై చైతన్యవంతములగుచున్నవి. కారణత్వము చేత పురుషునియందు (దేహియందు) ప్రవేశించినవాడు పరమాత్ముడు. సృష్టికి ప్రకృతి పురుషులిరువురు కారణమని ప్రసిద్ధము. ఈ జగత్తుయొక్క రూపమునకు (దృష్యమానమగుటకు) మొదటి కారణము ప్రకృతి (ఇది కార్య కారణ రూపము). ప్రకృతికిని కారణుడైన పురుషుడు (పరమాత్మ) బీజము (ఇతడు కేవల కారణ రూపుడు) పరమాత్మ జీవునియందు ప్రవేశించినను, జీవునివలె పరతంత్రుడు కాకుండా సాక్షి రూపమున స్వతంత్రుడై వున్నాడు. సర్వోత్కృష్టమైన ఈశత్వముతో ఉన్నవాడు. అట్టి పరమాత్ముని ధ్యానించినాడు. (2)

పరమైశ్వర్యమును వివరించి చెప్పినాడు. ఈ సర్వజగత్తు ఏ ముఖ్యమైన మూలస్థానమునందు, ఏ ప్రధానకారణమునందు, ఎవరి చేత నిర్మితమై ఏదైతే వున్నదో అది అంతయూ పరమాత్మనే. (విశ్వముగా పరిణమించినాడు). ఈ జగత్తనే కార్యముకంటే, ఇతరమై సర్వోత్కృష్టమైన కారణము కంటే శ్రేష్ఠమై, స్వయంభువుడై, స్వయముగా సిద్ధమైన పరమాత్మను శరణు పొందుచున్నాను. అని గజేంద్రుడు స్తుతించినాడు. ఈ జగత్తు ఈశ్వరుని యందు ఇంటియందలి ఘట పటాది (కుండలు, ఇతర పరికరములు) వలె ఉన్నది. కుండ

తయారగుటకు కుమ్మరివానివలె (నిమిత్త కారణము), మట్టి ముద్దవలె (ఉపాదాన కారణము), కుండను నిర్మించవలెనను కోరికవలె (సంకల్ప కారణము), పరమాత్మ స్వయముగనే చతుర్విధ కారణైక్యమును పొంది ఈ జగత్తును సృష్టించి నాడని అర్థము. జగత్తునకు ఆత్మనే స్వయముగా మూలము. (3)

శ్లో॥ యః స్వాత్మనీదం నిజమాయయార్పితం
క్వచిద్విభాతం క్వ చ తత్తిరోహితమ్ ।
అవిద్ధ దృక్సాక్ష్యుభయం తదీక్షతే
స ఆత్మమూలోఽ వతు మాం పరాత్పరః ॥4॥

టీ:- విశ్వహేతుత్వం స్వతసిద్ధత్వం చోక్తం. ఇదానీం విశ్వ ప్రకాశకత్వం స్వప్రకాశకత్వంచ వర్ణయన్ప్రార్థయతే. యఇతి. విభాతిం అభివ్యక్తం సత్. క్వచిత్ప్రళయే తిరోహితం లీనం సత్. తదుభయం కార్యం కారణం చ. సాక్షీ సన్. సమీక్షతే. సాక్షిత్వే హేతుః అవిద్ధదృక్ అలుప్తదృష్టిః. ఆత్మమూలః స్వప్రకాశః. కుతః. పరాత్ప్రకాశాచ్చక్షురాదేరపి.పరః. తస్యాపి ప్రకాశక ఇత్యర్థః చక్షుషశ్చక్షురిత్యాదిశ్రుతేః. (4)

పరమాత్మకు విశ్వహేతుత్వము, స్వయం సిద్ధముగ చెప్పబడినది. ఇప్పుడు విశ్వప్రకాశకత్వము, స్వయంప్రకాశకత్వమును వర్ణించుచూ గజేంద్రుడు ప్రార్థించుచున్నాడు. పరమాత్మ తనయందు తన మాయా శక్తిచేత స్థాపించిన ఈ సర్వ జగత్తును సృష్టికాలమున అభివ్యక్తమై ప్రకాశించునట్లును, ప్రళయకాలమున నశించి ( అదృశ్యమై ) తనయందే లీనమైనట్లునూ, ఈ సృష్టిప్రళయములైన కార్యకారణములు, రెండింటికిని సాక్షియై పరమాత్మ దర్శించును. పరమాత్మ సాక్షిత్వమునకు చెక్కుచెదరని ( అవికలమైన ) దృష్టి హేతువు. ఆత్మ మూలుడు, స్వయం ప్రకాశుడు ఐనవాడు పరమాత్మ. భౌతికములైన కన్నులు చూడలేని సర్వోత్కృష్ట ప్రకాశము కంటే మిక్కిలి అధికమైన కాంతి స్వరూపము. పరమాత్మ " చక్షుషః చక్షుః " అని శ్రుతి. అట్టి ఈశ్వరుడు తనను కాపాడవలెనని గజేంద్రుడు ప్రార్థించినాడు. (4)

శ్లో॥ కాలేన పంచత్వమితేషు కృత్స్నశో
లోకేషు పాలేషు చ సర్వహేతుషు ।
తమస్త దాసీద్గహనం గభీరం
యస్తస్యపారేఽభి విరాజతే విభుః ॥5॥

టీ :-తిరోహితమీక్షత ఇత్యేతత్ప్రపంచపూర్వకం దుర్జ్ఞేయత్వం వదన్ప్రార్థయతే ద్వాభ్యాం. కాలేనేతి. పంచత్వమితేషు నాశం ప్రాప్తేషు గహనం దురవగాహం గంభీరమనంతం. తస్య తమసః. శ్రు. "ఆదిత్యవర్ణం తమసః పరస్తా" దిత్యాది శ్రుతేః. ॥5॥

తిరోహితమును అనగా ప్రళయమును భగవంతుడు చూచును అనే విషయమును వివరించుచూ, ఈశ్వరుని తెలియుట అసాధ్యము (దుర్జ్ఞేయత్వము) అను విషయమును చెప్పుచు గజరాజు ప్రార్థించుచున్నాడు. సృష్టి ప్రళయకాలములు రెండింటిచేత అంతటా సర్వ కారణములతో పరిపాలించునట్టి ఎల్లలోకములు నాశనము పొందిన పిమ్మట తెలియవీలులేని (దురవగాహమైన) కారు చీకటి నిండును. ఈ అలోకమైన పెంజీకటికి ఆవల ఏకాకృతితో వెలుగునట్టి సర్వేశ్వరుని ప్రార్థించినది. (5)

శ్లో॥ న యస్యదేవా ఋషయః పదం విదుః
జంతుః పునః కోఽర్హతి గంతుమీరితుమ్ ।
యథానటస్యాకృతిభిః విచేష్టతో
దురత్యయామ క్రమణః సమా-వతు ॥6॥

టీ :-నేతి. అతఏవ. దేవాదయో యస్య స్వరూపం న విదుః. జంతు రర్వాచీనః. గంతుం జ్ఞాతుం. ఈరితుం వక్తుం వా. దురత్యయం దుర్గమమనుక్రమణం చరితం కథనం వా యస్య సః. మా మాం. (6)

అందువలన దేవతలు, ఋషులు మొదలైన వారెవరు పరమాత్ముని స్వరూపమును తెలియలేరు. ఇక అర్వాచీనములైన (ఆధునికములైన) సాధారణ జంతువులు, మానవులకెవరికైనను ఈశ్వరుని గురించి తెలియుటకుగానీ, చెప్పుటకుగానీ ఎట్లు సాధ్యమగును. నటుని వలె పెక్కు రూపములతో ప్రయత్నపూర్వకముగాచేయు విలాసములతో కూడి అనుసరించుటకు గానీ, అనుకరించుటకుగానీ అశక్యమైన చరితముగల భగవంతుడు నన్ను కాపాడుగాక. అని ఏనుగులరేడు ప్రార్థించినాడు. (6)

శ్లో॥ దిదృక్షవో యస్య పదం సుమంగళం
విముక్త సంగా మునయః సుసాధవః ।
చరంత్యలోక వ్రతమవ్రణం వనే
భూతాత్మ భూతాః సుహృదః స మే గతిః॥7॥

టీ :- కథం తర్హి. శ్రు. "తమేవం విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేయనాయే"తి. శ్రుతిరిత్యాశంక్య. తద్జ్ఞానోపాయం కథయన్నాహదిదృక్షవఇతి. అలోకవ్రతం బ్రహ్మచర్యాది. అవ్రణం అచ్ఛిద్రం భూతానామాత్మభూతాః భూతేష్వాత్మదృష్టయస్సంతః. స మే గతిరస్తు. (7)

శ్లో॥ న విద్యతే యస్యచ జన్మ కర్మవా
న నామరూపే గుణదోష ఏవవా ।
తథాపి లోకాప్యయ సంభవాయ యః
స్వమాయయా తాన్యను కాల మృచ్ఛతి ॥8॥

టీ :- దురత్యయానుక్రమణత్వం ప్రపంచయన్ప్రణమతి. నవిద్యత ఇతి. లోకానామప్యయః ప్రళయః. సంభవో జన్మ. తయోర్ద్వంద్వైక్యం. తదర్థం యస్తాని జన్మాదీని స్వీకరోతి తస్మైనమ ఇత్యుత్తరే ణాన్వయః. (8)

ఐతే ఎట్లు " తమేవ విదితత్వాతా మృత్యుమేతి " భగవంతుని తెలిసినవాడు మృత్యువును తరించును. అనే శృతి ఉన్నదనే ప్రశ్నకు పరమాత్మ జ్ఞానోపాయమును విరించుచూ చెప్పినాడు. పరమాత్మయొక్క మిక్కిలి మంగళకరమైన స్థానమును పొందదలిచి సర్వ బంధములను త్యజించినవారు, సర్వజగత్తున పరమాత్మను దర్శించగలవారు, మంచిమనసుగలవారు, మిగులసాధుచరితులైన మహామునులు అరణ్యమందు ( మానసిక ఏకాగ్రతతో, ఏకవృత్తితో ) సర్వ సంకటరహితమైన బ్రహ్మచర్యాది నియమములను అనుసరించి భావన చేయుచున్న స్వరూపుడైన పరమాత్మ నాకు దిక్కు అని గజరాజు ప్రార్థించినాడు. (7)

పరమాత్మ విలాసమును అనుకరించుటకుగాని వీలుగాదని చెప్పుచూ గజేంద్రుడు ప్రణమిల్లినాడు. పరమాత్మకు జన్మకాని, కర్మకాని, నామరూపములుకానీ, సత్వరజస్తమోగుణములతో కూడిన దోషములుగానీ లేవు. ఐనప్పటికి ఈశ్వరుడు కాలానుగుణముగా ( సృష్టి సమయమున సృష్టి, ప్రళయ సమయమున ప్రళయములను) తన విలాసమైన మాయాశక్తితో జగత్తుయొక్క ప్రళయమును, సృష్టిని కలిగించుచున్నాడు. అంటూ లోకము యొక్క జన్మాది కార్యనిర్వహణలను స్వీకరించిన పరమాత్మను గజేంద్రుడు స్తుతించినాడు. (అని తర్వాతి శ్లోకముతో అన్వయము ) ఈ సృష్టి, ప్రళయములనే ద్వంద్వమునకు

శ్లో॥ తస్మై నమః పరేశాయ బ్రహ్మణేఽనంతశక్తయే ।
అరూపాయోరురూపాయ నమ ఆశ్చర్యకర్మణే ॥9॥

టీ :-తస్మైఇతి. బ్రహ్మణే బ్రహ్మరూపాయ. అనంతశక్తయే ఉరురూపాయ. అతః ఆశ్చర్యాణి కర్మాణి యస్య తస్మై. పరేశాయ నమః. ॥9॥

శ్లో॥ నమ ఆత్మ ప్రదీపాయ సాక్షిణే పరమాత్మనే ।
నమో గిరాం విదూరాయ మనసశ్చేతసామపి ॥10॥

టీ :-నమఇతి. ఆత్మప్రదీపాయ ప్రకాశాంతరస్యావిశయాయ. కుతః సాక్షిణే ప్రకాశకాయ. పరమాత్మనే జీవనియంత్రే. అతఏవ. గిరాం విదూరాయ అప్రాప్యాయ. చేతసాం చిత్తవృత్తీనాం. తథా చ శ్రుతిః "యతో వాచోనివర్తంతే అప్రాప్య మనసా సహ" ఇతి. 10

ఐక్యమే. సృష్టి జరిగిననేకాని ప్రళయము జరుగదు. ప్రళయమైతేగానీ సృష్టికి అవకాశమురాదు. ఈ రెండును అవినాభావమైనవి. అట్లే సర్వద్వంద్వములకు పక్షాంతరము ఐక్యమే పర్యవసానము. ఇక్కడ సమాహార ద్వంద్వమున పుంలింగత్వము అర్థము. (8)

సర్వోత్కృష్టుడైన ఈశ్వరుడు, రూపరహితుడైన పరమాత్మ, అనంతశక్తి గల విశ్వరూపుడు, ఆశ్చర్యమైన కర్మలు కలవాడు (అనితర సాధ్యలీలా విలాసుడు) అయిన పరమేశ్వరునికి నమస్కారము. (అని గజరాజు స్తుతించినాడు) (9)

ఈశ్వరుని ప్రకాశింపజేయు అన్య ప్రకాశము లేదు. (నతద్భాయతే, న శశాంకో, న పావకః). ఆయనే స్వయముగా ప్రకాశించువాడు. సర్వ జీవులను నియంత్రించువాడు. అందువలన వాక్కులకు, సర్వచిత్తవృత్తులకు అందనివాడు. (అవాఙ్మానస గోచరుడు). 'యతో వాచో నివర్త్యంతే, అప్రాప్యమనసా సహ' వాక్కులు మనస్సు అతనిని పొందలేక పరావర్తనము చెందినవి. అనేది శ్రుతి ప్రమాణము. అట్టి పరమాత్మకు నమస్కారము. (10)

శ్లో॥ సత్త్వేన ప్రతిలభ్యాయ నైష్కర్మ్యేణ విపశ్చితా ।
నమః కైవల్య నాథాయ నిర్వాణ సుఖసంవిదే ॥11॥

టీ :-సత్యేనేతి. ఏవమపి విపశ్చితా నిపుణేన. నైష్కర్మ్యేణ సన్న్యాసేన. సత్త్వేన శుద్ధేన. శ్రు.సన్న్యాసయోగాద్యతయశ్శుద్ధ సత్త్వా ఇతి శ్రుతేః ప్రతిలభ్యాయ ప్రత్యక్తే ్వనప్రాప్యాయ. నిర్వాణసుఖసంవిదే మోక్షానందానుభూతయే. (11)

భగవంతుడు దుర్లభుడైనప్పటికి నిపుణులైన పండితులు (సాధకులు) సన్యాసయోగముతో, శుద్ధమైన బుద్ధితో తమ కంటికి ఎదురుగా నిలిచినట్లుగా (ప్రత్యక్త్వేన) పొందునట్టివాడు (సన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః - అని శ్రుతి ప్రమాణము), మోక్ష ప్రదాత అయిన భగవంతుని మోక్షానందానుభూతి కొఱకు నమస్కరించుచున్నాను. (11)

శ్లో॥ నమః శాంతాయ ఘోరాయ గూఢాయ గుణధర్మిణే।
నిర్విశేషాయ సామ్యాయ నమో జ్ఞాన ఘనాయచ । 12

టీ:- నమఇతి. గుణధర్మిణే సత్త్వాదిధర్మానుసారిణే. జ్ఞాన ఘనాయ చేతి నిర్విశేషత్వే2పి ప్రధానవైలక్షణ్యయుక్తం. (12)

శాంతుడు, భయంకరుడైనవాడు, తెలియరానివాడు, సత్వరజస్తమాది గుణములను అనుసరించినవాడు, సర్వభేద రహితుడై ప్రజ్ఞాన ఘనుడైనవాడు, సర్వసముడైన పరమాత్మకు నమస్కారము. (12)

శ్లో॥ క్షేత్రజ్ఞాయ నమస్తుభ్యం సర్వాధ్యక్షాయ సాక్షిణే ।
పురుషాయాత్మమూలాయ మూలప్రకృతయే నమః। 13

టీ :-క్షేత్రజ్ఞాయేతి. సాక్షిణే ఇతి. సర్వాధ్యక్షత్వేఽపి నిర్వికారత్వ ముక్తం. ఆత్మానాం క్షేత్రజ్ఞానం. మూలాయ మూలస్య

సర్వక్షేత్రములకు, ఆత్మలకు, ఆశ్రయమైనవాడు, సర్వమునకు అధినాయకుడైనను సర్వభేద రహితుడై కేవలము సాక్షిమాత్రముగా వున్నవాడు, ఆత్మకు మూలమైన ఈశ్వరుడు, సర్వమునకు మూలమై, ప్రధానమైన ప్రకృతి పుట్టుకకు కారణమైనవాడైన పరమాత్మకు నమస్కారము. (13)

ప్రధానస్యాపి. ప్రకృతయే ఉద్భవహేతవే. తత్రహేతుః పురుషాయ పూర్వమేవ సతే, తథా చ శ్రుతిః "పూర్వమేవాహమిహాస" మితి. తత్పురుషస్య పూరుషత్వమితి పూర్ణాయేతి వా. (13)

శ్లో॥ సర్వేంద్రియ గుణద్రష్ట్రే సర్వ ప్రత్యయ హేతవే ।
అసతాచ్ఛాయ యోక్తాయ సదా భాసాయతే నమః॥ 14

టీ :-సర్వేతి. సర్వేంద్రియాణాం. యే గుణాః విషయాస్తేషాం ద్రష్ట్రే సర్వే ప్రత్యయా ఇంద్రియవృత్తయో హేతవో జ్ఞాపకాయస్య తస్మై. తదేవాహ. అసతా అహంకారేణప్రపంచేన. ఛాయయా అసద్రూప యా. ఉక్తాయ ప్రతిబింబేన బింబమివ సూచితాయ. తత్ర హేతుః సద్రూపో విషయేష్వాభాసో యస్యతస్మై. తదుక్తం తృతీయే. శ్లో. "యథా జలస్థ ఆభాస" ఇత్యాదినా. పాఠాంతరే. అసత్యస్య ఛాయ యా అధ్యాసేన అక్తాయ యుక్తాయ. తదధిష్ఠానాయేత్యర్థః. ॥14॥

అన్ని ఇంద్రియముల గుణరూపమైన విషయమును తెలిసిన వాడు (ద్రష్ట), సర్వేంద్రియ వృత్తులకు కారణమై జ్ఞాపకమైనవాడు, అహంకారము మొదలైన సమూహమునకు కనపడని ( అసద్రూపమైన ) వాడు, అహంకారాది రహితుడు, ప్రతిబింబము చేత బింబమువలె సూచించబడువాడు, దృష్యమాన జగత్తుచేతనే తెలియదగిన నిరాకార నిర్గుణుడైన పరమాత్ముడు, సద్రూపుడైన విషయములందు, సర్వజగత్తునందు ప్రకాశించువాడైన పరుమాత్మకు నమస్కారము. (14)

శ్లో॥ నమో నమస్తేఽఖిల కారణాయ
నిష్కారణాయాద్భుత కారణాయ ।
సర్వాగమామ్నాయ మహార్ణవాయ
నమోఽపవర్గాయ పరాయణాయ ॥15॥

సర్వకారణరూపుడు, అందువలననే స్వయముగా నిష్కారణుడు, తాను కారణరూపుడై ఉండియు, అనగా మట్టి కుండగామారి వికారము పొందినట్లుగా, ఏ వికారము పొందని వాడైనందున అద్భుతకారణుడైనవాడు, సమస్తమైన పాంచరాత్ర్యాది ఆగమములకు, సర్వవిద్యలకు, మూలమైన

టీ :-నమోనమఇతి. అఖిలకారణాయ సర్వకారకరూపాయ. అత ఏవ స్వయం నిష్కారణాయ కారణత్వేఽపి మృదాది వద్వికారం వారయతి. అద్భుత కారణాయేతి. ఏవంభూతత్వే ప్రమాణమాహ సర్వే ఆగమాః పాంచరాత్రాదయః. ఆమ్నాయాశ్చ వేదాః తేషాం మహార్ణ వాయస్రోతసామివ పర్యవసానస్థానాయ. అపవర్గాయ మోక్షరూపా య. అతః పరాయణాయ ఉత్తమానామా శ్రయాయ. (15)

వేదములకు, మహాప్రవాహములకు సముద్రము వలె చిట్టచివర నిలయమైనవాడు, (శ్రుతి శిఖరగిరాం నైవ తాత్పర్యభూమిః), మోక్షరూపుడైన వాడు, సర్వోత్తమమైన వాటన్నిటికి ఆశ్రయమైన వాడు అయిన పరమాత్మునికి నమస్కారము. (15)

శ్లో॥ గుణారణిచ్ఛన్న చిదూష్మపాయ
తత్క్షోభవిస్ఫూర్జిత మానసాయ ।
నైష్కర్మ్య భావేన వివర్జితాయ
స్వయం ప్రకాశాయ నమస్కరోమి ॥16॥

టీ :-గుణేతి. గుణఏవారణిస్తయా ఛన్నశ్చిదూష్మపో జ్ఞానాగ్నిః తస్మై తేషాం గుణానాం. క్షోభేకార్యే విష్ఫూర్జితం బహిర్వృత్తికం మానసం యస్య. శ్రు."సో2కామయత బహుస్యాం ప్రజాయేయే" తి శ్రుతేః నైష్కర్మ్యమాత్మతత్త్వం. తస్య భావేన భావేనయా. నివర్తితా ఆగమావిది, నిషేధలక్షణా యైస్తేషు. స్వయమేవ ప్రకాశో యస్య తస్మై. ॥16॥

త్రిగుణములనే అరణి యందు అదృశ్యముగా నున్న జ్ఞానాగ్నిరూపమైన వాడు, త్రిగుణములు లయమును పొందగా ప్రకాశముతో వెలుపల వర్తించు మనస్సుకలవాడు. ("సోకామయత బహుస్యామ్" అని శ్రుతి ప్రమాణము- తాను పెక్కువిధములుగా అగుటను కోరినాడు), ఏ కార్యమునందును కోరికలేకపోవుటచేత (నైష్కర్మ్యముతో) కేవలము ఆత్మతత్వభావనతో విధినిషేధములను (చేయవలసిన కర్మలును, చేయకూడని కర్మలు రెండిటిని) పరిత్యజించినవాడు (వివర్జిత ఆగమా), స్వయముగా ప్రకాశరూపుడైనవాడైన పరాత్పరునికి నమస్కారము. (16)

శ్లో॥ మాదృక్ప్రసన్న పశుపాశ విమోచనాయ
ముక్తాయ భూరి కరుణాయ నమోఽలయాయ।
స్వాంశేన సర్వతను భృన్మనసి ప్రతీత
ప్రత్యగ్దృశే భగవతే బృహతే నమస్తే ॥17॥

టీ :–మాదృగితి.మాదృక్ మద్విధశ్చాసౌ ప్రసన్నపశుః తస్య పాశః‌ః అవిద్యా తస్య విశేషేణ మోక్షణం యేన. తత్ర యోగ్యతామాహ. ముక్తాయ మోచనే హేతుః భూరిః కరుణా యస్య అతస్తత్ర. ఆలయాయ అనలసాయ. స్వాంశేన అంతర్యామిరూపేన సర్వేషాం తనుభృతాం మనసి ప్రతీతా ప్రఖ్యాతా. యా ప్రత్యక్ దృక్ తస్మై. తథా చ శ్రతిః.cయ ఆత్మని తిష్ఠన్నాత్మానమంతరోయ మయతీc తి. భగవతే సర్వేషాం తనుభృతాం నియమనసమర్థాయ. తేషాం మనసి స్థితత్వేపి బృహతే అపరిచ్ఛిన్నాయ . (17)

నా వలె శరణాగతిని పొందిన పశువులకు అజ్ఞానమనే పాశమును తొలగించి రక్షించువాడు, ఎట్టి బంధములు, (రాజీపడు విషయములు కాని, ఒత్తిడులకు లొంగు విషయములు కాని) లేనివాడు, ఆశ్రితులను రక్షించుటలో అపారమైన కరుణ, సంరంభములు కలవాడు, సర్వజీవుల మనస్సులలో అంతర్యామి రూపముతో ప్రఖ్యాతమైన ప్రత్యగాత్మగా నిత్యము సన్నిహితమైనవాడు (య ఆత్మని తిష్ఠన్నాత్మానమంతరే యమయతి– ఆత్మలోనే ఉండి ఆత్మను (వ్యక్తిని) లోపలనుండే పరమాత్మ నియమించుచున్నాడు– అని శ్రుతి ప్రమాణము), సర్వజీవులను నియంత్రించుటలో మిక్కిలి సామర్థ్యము కలిగినవాడు, జీవులమనస్సులందణిగి ఉన్నప్పటికీ గొప్పగా అపరిమిత మైనవాడైన (అపరిచ్ఛిన్నుడు), భగవంతునికి నమస్కారము. (17)

శ్లో॥ ఆత్మాత్మ జాప్త గృహవిత్త జనేషుసక్తైః
దుష్ప్రాపణాయ గుణ సంగ వివర్జితాయ ।
ముక్తాత్మభిః స్వహృదయే పరిభావితాయ
జ్ఞానాత్మనే భగవతే నమ ఈశ్వరాయ ॥18॥

తమలో అపారమైన అంతస్సత్వమున్నను తనపట్ల, తనపుత్రులు, భోగవస్తువులు, గృహము, ధనము, బంధుజనులు మొదలైన వానియందు మిక్కిలి ఆసక్తి కలిగినవారిచేత పొందుటకు సాధ్యముకానివాడు, దీనికి హేతువేమనగా సత్త్వాది గుణముల సంబంధమును పూర్తిగా విడిచినవాడు, అందువలననే దేహము సంపదలు మొదలైన వానియందు ఏమాత్రము

టీ :-ఆత్మేతి. అంతస్థత్వే౽పి దేహదిష్వాసక్తైర్దుష్ప్రాప్య పణాయ. ప్రాప్తుమశక్యాయ. తత్ర హేతుః గుణసః గేన వివర్జితాయ. అత ఏవ ముక్తాత్మభిః దేహాదిష్వనాసక్తైః. చింతితాయ. తైః పరిభావితం రూపమాహ జ్ఞానాత్మన ఇత్యాదినా. (18)

కోరికలేనివాడై తననే చక్కగా భావించువాడు, కేవలము జ్ఞానస్వరూపుడు, భగవంతుడైన ఈశ్వరునికి నమస్కారము. (18)

శ్లో॥ యం ధర్మకామార్థ విముక్తి కామా
భజంత ఇష్టాం గతిమాప్నువంతి ।
కించాశిషోరాత్యపి దేహమవ్యయం
కరోతుమే౽దభ్రదయో విమోక్షణమ్ ॥19॥

టీ :-యమితి. ఇష్టాం గతిం కామితం ధర్మాదిఫలం ప్రాప్నువం త్యేవ. న తు తావదేవకింతు. యాస్తైరకామితా అన్యా అప్యా శిషః రాతి. దేహ మప్యవ్యయం జరా మరణరహితం రాతి ఏవం యః అదభ్రదయః స మే విమోక్షణ మేన కేవలం కరోతు.నాధికం ప్రార్థయే. (19)

ధర్మము, కామము, అర్థములను పరిత్యజించవలెనను కోరిక కలిగినవారు ఏ భగవంతుని సేవింతురో వారు ఇష్ట కామ్యమైన ధర్మాదుల ఫలమును పొందుచున్నారు. చేరి కొలుచు వారికి ఆశీస్సులను, నాశరహితమైన శరీరమును (ముక్తిని) ఇచ్చువాడు, వంచనలేని దయగలవాడైన సర్వేశ్వరుడు మాత్రమే నాకు విముక్తిని ప్రసాదించుగాక, అని గజేంద్రుడు పరాత్పరుని ప్రార్థించినాడు. (19)

శ్లో॥ ఏకాంతినో యస్య న కించనార్థం
వాంఛంతి యేవై భగవత్ప్రపన్నాః ।
అత్యద్భుతం సుచరితం సుమంగలం
గాయంత ఆనంద సముద్రమగ్నాః ॥20॥

ఇదంతయు నేను భక్తి సుఖము తెలియకుండనే కోరుచున్నాను. భగవంతుని శరణుపొంది సర్వబంధములను వీడిన ముక్తాత్ములై అనన్య భక్తితో ఎట్టి కోరికలను కోరక ఆనందవార్ధిని మునుగుచున్న అంతరంగములు కలవారగుచు ( "స్వానందే సహజే సదా విహరతాం కైవల్య లీలాజుషామ్") ఏ భగవంతుని మిక్కిలి ఆశ్చర్యకరమై, మంగళకరమైన చరితమును గానము

టీ :-ఏతావదప్యహం భక్తిసుఖానభిజ్ఞత్వేన వాంఛామీత్యాహ. ఏకాంతినఇతి .యస్య త్వేకాంతభక్తా న కించిదర్థం వాంఛంతి. తం పరమేశ్వరమీడే స్తౌమీత్యుత్తరేణాన్వయః. తేషాం నిష్కామత్వే హేతుః. యే వై భగవతః సర్వజ్ఞాన్ ముక్తాన్ ప్రపన్నాః సేవితవంతః. (20)

శ్లో॥ త్వమక్షరం బ్రహ్మ పరం పరేశ
మవ్యక్త మాధ్యాత్మిక యోగ గమ్యమ్ ।
అతీంద్రియం సూక్ష్మమివాతి దూరం
అనంతమాద్యం పరిపూర్ణమీడే ॥21॥

టీ :-తమితి. అత్యద్భుతత్వమంగళత్వప్రదర్శనార్థమక్షరత్వాది విశేషణాని. (21)

శ్లో॥ యస్య బ్రహ్మాదయో దేవా వేదాలోకాశ్చరాచరాః ।
నామరూప విభేదేన ఫల్గ్వ్యాచ కళయాకృతాః ॥22॥

టీ :-పరిపూర్ణత్వం ప్రదర్శయన్నాహ. త్రిభిః యస్యేతి. ఫల్గ్వ్యాస్వల్ప యైవ కళయా అంశేన కృతాః. సజయతాదితి తృతీయేనాన్వయః. 22

చేయుదురో, వైష్ణవ్య సామగీతాదుల నాలపింతురో, అట్టి పరమేశ్వరుని స్తుతింతును. అని ముందటి శ్లోకముతో అన్వయము. భగవంతుని సర్వము తెలిసినవారు, అన్ని బంధములను వీడినవారు, అనన్యాశ్రితులైనవారే సేవించగలరని భావము.(20)

నాశన రహితుడు, జ్ఞాన స్వరూపుడు, సర్వోత్కృష్టుడు, సర్వేశ్వరుడు, నిరాకారుడు, నిర్గుణుడు, అవ్యక్తుడు, మనోబుద్ధి సంయోగుడు, ఇంద్రియములకు లభ్యము కానివాడు, మిక్కిలి సూక్ష్మమై మనలోనే ఉండికూడా తెలియరానివిధముగా దూరమైనవాడు, ఆద్యుడు, అంతములేనివాడు, పరిపూర్ణుడైన ఈశ్వరుని స్తుతించుచున్నాను. మిక్కిలి అద్భుతము, మంగళకరమని తెలుపుటకే అక్షరుడు మొదలైన విశేషములు చెప్పబడినవి.(21)

పరమాత్మ పరిపూర్ణత్వమును మూడు కార్యములతో ప్రకటించు చున్నాడు. పరమాత్మయొక్క మిక్కిలి స్వల్పమైన కళతో (అంశతో) బ్రహ్మాదులైన ఎల్లదేవతలు, వేదములు, నామరూప విభేదముతో వర్తిల్లు సర్వచరాచరమైన లోకములు సృష్టి చేయబడినవి. (22)

శ్లో॥ యధార్చిషోఽగ్నేః సవితుర్గభస్తమో
నిర్యాంతి సంయాత్య సకృత్స్వరోచిషః ।
తథా యతోఽయం గుణసంప్రవాహో
బుద్ధిర్మనః ఖాని శరీర సర్గాః ॥23॥

టీ :-కథం కృతాఇత్యపేక్షాయాం దృష్టాంతానాహ. యథేతి. యథార్చిషోఽగ్నేరితి ప్రవాహే దృష్టాంతః సవితుర్గభస్తయ ఇత్యానంత్యే. నిర్యాంతి ఉద్గచ్ఛంతి సంయాంతి లీయంతే. గుణసం ప్రవాహమే వాహ బుద్ధిర్మ నః ఖానీతి. కరణాని. శరీరసర్గాః కార్యదేహ ప్రవాహో శ్చయతో భవంతి సః. ॥23॥

ఈ సర్వము పరమాత్మ స్వల్పాంశము చేతనే నిర్మితమైనదన్న విషయమునకు మరొక దృష్టాంతమును చూపి చెప్పుచున్నాడు. అగ్ని జ్వాలలను, సూర్యుడు కిరణములను, ఏ విధముగా ఉత్పాదించి మరల తమలో లీనము చేసికొందురో ఆ విధముగనే పరమాత్మ- మనస్సును, బుద్ధి, ఇంద్రియములు, తానే అయి గుణ సంప్రవాహమును కూర్చును. ఇంద్రియములు కారణములు, శరీర సృష్టులు కార్యమైన ఈ దేహ ప్రవాహము పరమేశ్వరుని వలననే కలుగును. (23)

శ్లో॥ స వై న దేవాసుర మర్త్యతిర్యక్
న స్త్రీ న షండో న పుమాన్న జంతుః ।
నాయం గుణః కర్మ న సన్ని చాసన్
నిషేధశేషో జయతాదశేషః ॥24॥

టీ :-అతఏవ దేవాదీనాం మధ్యే ఏకోపిన భవతీత్యాహ. సఇతి. నజంతుః లింగత్రయ శూన్యం ప్రాణి మాత్రమపిన. కింతు సర్వస్య అవధిత్వేన శిష్య ఇతి. నిషేధశేషః. మాయయా అశేషాత్మకశ్చ.జయతాత్ మద్విమోక్షణాయ ఆవిర్భవతు.(24)

పరమాత్మ ఇంద్రాది దేవతల సముదాయ మధ్యమున ఏ దేవుడు కాదు. స్త్రీ పురుష నపుంసక లింగభేదములతో నొప్పు ప్రాణమున్న ఏ జంతువు కూడా పరమాత్మకాదు. పరమాత్మకు గుణములేదు. చేయవలసిన పని (కర్మము) లేదు. లోకమునందున్న ఏ వాస్తవమైన సత్పదార్థము కాదు. ఇదికాదు అని అన్నింటిని నిషేధించగా, ఇవన్ని కానిదేదో 'అది' అను హద్దు చేత మిగులునట్టి నిషేధ శేషము (వీటన్నింటిలో ఏదీ కాకుండా వున్నట్టిది) గా ఉండి తన మాయా విలాసముతో అన్నింటి యందు తానే అయి నిండినట్టి పరమాత్మ నన్ను కాపాడుటకు ఆవిర్భవించుగాక. అని గజేంద్రుడు ప్రార్థించినాడు. (పరమాత్మ ఈ సృష్టి యందలి ఏ పదార్థము కాక పోయినను, వీటన్నింటికావల అవశేషముగా ఉండి, అన్నియును తానే అయి ప్రకాశించునని భావము ) (24)

శ్లో॥ జిజీవిషే నాహ మిహాముయా
కిమంతర్బహిశ్చావృత యేభయోన్యా ।
ఇచ్ఛామి కాలేన న యస్య విప్లవః
తస్యాత్మలోకావరణస్య మోక్షమ్॥25॥

టీ :-న చ గ్రాహాచ్ఛరీరస్య మోక్షణేనాహం జీవితుమిచ్ఛామి. తత్ర హేతుః అముయా అంతర్బహిశ్చావివేకవ్యాప్తయా. గజయోన్య. కిం ప్రయోజనం?ఆత్మలోకస్య ఆత్మప్రకాశస్య యదావరణమజ్ఞానం తస్యైవతు మోక్షమిచ్ఛామి. యస్య మోక్షస్య కాలేననాశో నాస్తి. యద్వా.దేహస్య బంధో దేహనాశేనస్యేదేవ. కిం తన్మోక్షప్రార్థనేన. ఆత్మలోకావరణస్య తు. కాలేనవిప్లవో నాస్తి. జ్ఞానైకనివర్త్యత్వాత్. అతస్తస్యైవ మోక్షణమిచ్ఛామీత్యర్థః.॥25॥

మొసలి బాధనుండి శరీర విముక్తితో మాత్రమే నేను బ్రతుకుటకు ఇష్టపడుటలేదు. (దీనికి కారణము) లోపల, బైట ( ప్రాపంచిక రూపమైన) అవివేకముతో ఆవరింపబడిన ఈ గజ జన్మతో ప్రయోజనము లేదు. ఆత్మ ప్రకాశముచేత (పుట్టుకతో) ఆవరించిన అజ్ఞానము నుండి ముక్తిని కోరుచున్నాను. ఏ కాలమునందునూ అజ్ఞాన నివృత్తికి (జ్ఞానమునకు) నాశము లేదు. లేక దేహబంధము దేహనాశముతోనే నశించును. దానికై ప్రత్యేకముగా ప్రార్థించుట ఎందుకు? అది ( అజ్ఞానావరణము ) కేవలము జ్ఞానము చేతనే నివర్తించును. అందువలన నేను దేహబాధ నివారణకంటే అజ్ఞానావరణమునుండే ముక్తిని కోరుచున్నాను. అని గజేంద్రుడు స్తుతించినాడు. (25)

శ్లో॥ సోఽహం విశ్వసృజం విశ్వమవిశ్వం విశ్వవేదసమ్ ।
విశ్వాత్మానమజం బ్రహ్మ ప్రణతోఽస్మి పరం పదమ్ 26

టీ :-సఇతి. సోఽహం ముముక్షుః. విశ్వం విశ్వరూపం అవిశ్వం విశ్వవ్యతిరిక్తం చ విశ్వం వేదోధనం ఉపకరణం యస్యతం. విశ్వ స్యాత్మానం చ కేవలం. ప్రణతోఽస్మి. న తు తం జానామి. ॥26॥

మోక్షకాంక్షినైన నేను (గజేంద్రుడు) విశ్వమును సృజించినవాడు, విశ్వరూపుడు, విశ్వముకంటే భిన్నమైనవాడు, వేదమనే గొప్ప సాధనము గలవాడు (విశ్వం వేదో ఘనముపకరణం యస్య తమ్), విశ్వమునకు ఆత్మయైనవాడు, పుట్టుకయే లేనివాడు, జ్ఞాన స్వరూపుడు, కేవలుడైన పరమాత్మయొక్క శ్రేష్ఠమైన స్థానమును పొందుటకై స్తుతించుచున్నాను. (26)

శ్లో॥ యోగరంధిత కర్మాణో హృదియోగ విభావతే ।
యోగినో యం ప్రపశ్యంతి యోగీశం తం నతోస్మ్యహమ్॥27॥

టీ :-యోగం వినా దుర్జ్ఞానత్వాదిత్యాహ. యోగేతి. యోగేన భగవద్ధర్మేణ రంధితాని దగ్ధాని కర్మాణి యేషాంతే. యే ప్రపశ్యంతి. ॥27॥

యోగముతో తప్ప ఈశ్వరుడు తెలియబడడు. భగవద్ధర్మ రూపమైన యోగముతో దగ్ధమైన కర్మలు కలవారైన యోగులు, యోగం చేత భావన చేసిన మనస్సున యోగీశ్వరుడైన ఏ పరమాత్మను చక్కగా దర్శింతురో అట్టి ఈశ్వరునికి నమస్కారము. (27)

శ్లో॥ నమోనమస్తుభ్యమసహ్యవేగ
శక్తి త్రయాఖిల ధీ గుణాయ ।
ప్రపన్నపాలాయ దురంత శక్తయే
కదింద్రియాణామనవాప్య వర్త్మనే ॥28॥

టీ :-తర్హి సర్వేఽపి యోగ మేవ కిం నాస్థితాః తత్రాహ ద్వాభ్యాం. నమ ఇతి. అసహ్యో వేగో రాగాదిలక్షణో యస్య. తథాభూతం శక్తి త్రయం యస్య. తస్మై. బహిశ్చ అఖిలధియాం సర్వేంద్రియాణాం గుణాయ శబ్దాదిరూపేణ ప్రతీయమానాయ. అతః కదింద్రియాణాం కుత్సితాని ఇంద్రియాణి యేషాం తేషాం. అనవాప్యం వర్త్మ యస్య. (28)

అన్నింటికీ యోగమేనా? దానికంటే వేరే ఏమీ లేదా? అనే విషయమును చెపుతున్నాడు. సహించుటకు వీలుకాని తీవ్రమైన వేగముతో అనురాగము, ద్వేషము మొదలైన లక్షణములతో కూడిన మూడు విధములైన (ఉత్సాహ, ప్రభు, మంత్ర) శక్తులుకలవాడు, బైట ఉన్న ఇంద్రియము లన్నింటియందు శబ్దాది (శబ్ద స్పర్శ రూప రస గంధములనే తన్మాత్రల) రూపముతో స్ఫురించువాడు, అనంత శక్తిమంతుడు, కుత్సితమైన దుర్మార్గమైన, ఇంద్రియములు కోరికలు కలవారికి పొందరాని దుష్కరమైన మార్గము కలవాడైన పరాత్పరునికి నమస్కారము. (28)

శ్లో॥ నాయంవేద స్వమాత్మానం
యచ్ఛక్త్యాహంధియాహతమ్ ।
తం దురత్యయ మాహాత్మ్యం
భగవంతమితోఽస్మ్యహమ్ ॥29॥

టీ :-నేతి. యచ్ఛక్త్యా యస్య మాయయాఅహం ధీః. తయా హతః. అయంజనో న వేద. దురత్యయం మాహాత్మ్య యస్యతం. అతః ఆశ్రితోస్మి. (29)

పరమాత్మ శక్తియైన మాయచేత నేను అనే బుద్ధిచేత అహంకారము చేత కప్పబడిన ఈ జీవుడు తనయొక్క ఆత్మను అనగా తనను తాను తెలియలేడు. అట్టి అపారమైన దాటుటకు వీలులేని దురత్యయమైన మాహాత్మ్యము కలిగిన పరమాత్ముని ఆశ్రయించినాను. (29)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం గజేంద్రముపవర్ణిత నిర్విశేషం
బ్రహ్మాదయో వివిధలింగ భిదాభిమానాః ।
నైతే యదోప స సృపుర్నిఖిలాత్మకత్వాత్
తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్ ॥30॥

టీ :-ఏవమితి. ఉపవర్ణితం నిర్విశేషం మూర్తిభేదం వినా పరం తత్త్వం యేనతం. వివిధాచాసౌ లింగభిదా మూర్తిభేదః. తస్యామ భిమానో యేషాం. అత ఏవ తేయదానోపజగ్ముః. తత్ర తదా. అఖిలామరమయః. సర్వదేవమయమూర్తిః. (30)

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా మూర్తిభేద రహితము ( నిరాకారముగా ) సంపూర్ణముగా పరతత్త్వమును కీర్తించిన గజేంద్రుని తమ తమ రూపనామముల పైననే అభిమానమున్న బ్రహ్మాది దేవతలు ( విశ్వమయత లేమి ) రక్షించుటకు సమీపించలేదు. అప్పుడు సర్వాత్మకుడు, సర్వదేవమయుడైన శ్రీహరి సాక్షాత్కరించినాడు. (30)

శ్లో॥ తం తద్వదార్తముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య దివిజైః సహసంస్తువద్భిః ।
ఛందోమయేన గరుడేన సముహ్యమానః
చక్రాయుధో-భ్యగమదాశు యతో గజేంద్రః ॥31॥

టీ :-తమితి. దివిజైర్దేవైస్సహ ఛందోమయేనేత్యతిశైఘ్ర్యా యోక్తం. (31)

ఏ కారణము చేత గజరాజు స్మృతితప్పి అశక్తుడౌచున్నాడో అట్లు తీవ్రముగా సంకటపడుచున్న గజరాజు చేయు స్తోత్రమును విని కీర్తించు దేవతా సముదాయముతో కూడినవాడై, తీవ్రవేగుడైన (ఛందోమయుడు-శీఘ్రుతకై ) గరుత్మంతునిపై మిక్కిలి వేగముగా జగన్నివాసుడు, చక్రాయుధుడైన శ్రీహరి ఆ గజమును సమీపించెను. (31)

శ్లో॥ సోంతః సరస్యురుబలేన గృహీత ఆర్తో
దృష్ట్వాగరుత్మతి హరిం ఖ ఉపాత్త చక్రమ్ ।
ఉత్క్షిప్య సాంబుజకరం గిరిమాహ కృచ్ఛాత్
నారాయణాఖిలగురో భగవన్నమస్తే ॥32॥

టీ :-సఇతి.ఖే దృష్ట్వా ఉపాత్తం ఉద్యతం చక్రం యేన. (32)

మొసలి అపారమైన బలముతో బిగపట్టి సరస్సులోనికి లాగుచుండగా బాధపడుచున్నట్టి ఆ గజేంద్రుడు ఆకాశమున గరుత్మంతునిపై అధిష్టించి, చక్రాయుధమును తన పద్మమువంటి హస్తమున మొసలిని తెగనరుకుటకై, ఎత్తిపట్టుకున్న శ్రీహరిని చూచి అపారమైన భక్తి పారవశ్యముతో ' అఖిల గురుడవు, భగవంతుడవైన నారాయణా! ' అనుచు స్తుతించినాడు. (32)

శ్లో॥ తం వీక్ష్య పీడితమజః సహసావతీర్య
సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార ।
గ్రాహాత్ విపాటిత ముఖాదరిణా గజేంద్రం
సంపశ్యతాంహరిరమూముచదుస్రియాణామ్ ॥33॥

టీ :–తమితి. గరుడోఽపి మందగతిరితి. తతః సహసా అవతీర్య. అరి ణా చక్రేణ. విపాటితం ముఖం యస్య. ఉస్రియాణాం దేవానాం. (33)

పరమాత్ముడు తీవ్రమైన సంకటముతోనున్న గజమును చూచి, గరుత్మంతుని వేగముకూడా సరిపోదని వెంటనే అతని పైనుండి దుమికి, చక్రము చేత చీల్చబడిన ముఖము కలిగిన మొసలినుండి గజేంద్రుని గ్రాహముతో పాటుగా సర్వదేవతా సముదాయము మిగుల ఆశ్చర్యముతో చూచుచుండగా వేగముగా దయతో సరస్సునుండి బయటకు ఉద్ధరించినాడు. (33)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
గజేంద్రమోక్షణే తృతీయోధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే గజేంద్రమోక్షణము అను
తృతీయాధ్యాయ ఆంధ్రానువాదము.

## శ్రీ గణేశాయ నమః
## శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ చతుర్థే తు తయోర్గ్రాహః ప్రాప గంధర్వతాం పునః ।
గజం సకవపార్షదం కృత్వా హరిర్నిన్యే నిజం పదం॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ తదా దేవర్షి గంధర్వా బ్రహ్మేశాన పురోగమాః ।
ముముచుః కుసుమాసారం శంసంతః కర్మ తద్ధరేః॥ 1॥

శ్లో॥ నేదుర్దుందుభయో దివ్యా గంధర్వా ననృతుర్జగుః ।
ఋషయశ్చారణా సిద్ధా స్తుష్టువుః పురుషోత్తమమ్॥ 2॥

టీ :- చతుర్థే తు తయోర్గ్రాహః ప్రాప గంధర్వతాం పునః.
గజం స్వపార్షదం కృత్వా హరిర్నిన్యే నిజం పదం (1,2)

## శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ
## భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

నాల్గవ అధ్యాయమున గజమకరములందు మకరి దేవల శాపము నుండి విమోచనము పొంది తన గంధర్వత్వమును మరల పొందినది. శ్రీహరి గజమును నిత్యమైన తన స్థానమున తన సమీపమున చేర్చుకొనెను. అను విషయము చెప్పబడినది.

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

అప్పుడు బ్రహ్మ , ఈశ్వరుడు ముందు నడువగా దేవతలు, ఋషులు, గంధర్వులు శ్రీహరి గావించిన గజమకరముల విమోక్షణ క్రీడను గొప్పగాకీర్తించుచూ పుష్పవర్షమును కురిపించినారు. (1)

దేవదుందుభులు మ్రోగినవి. గంధర్వులు నాట్యములు సలిపిరి. ఋషులు, చారణులు, సిద్ధులు పురుషోత్తముని స్తుతించిరి. (2)

శ్లో॥ యోఽసౌగ్రాహః స వై సద్యః పరమాశ్చర్య రూపధృక్ ।
ముక్తోదేవల శాపేన హూహూర్గంధర్వ సత్తమః ॥3॥

టీ:- య ఇతి. హూహూ సంజ్ఞో గంధర్వసత్తమః. అసౌ దేవలస్యశాపేన. గ్రాహోజాతః. సవై తతః. సద్యో ముక్తస్సన్ ఉత్తమ శ్లోకమగాయతేత్యన్వయః. ఏవం హి ఇతిహాసోత్తమే కథా. సరసి స్త్రీభిః క్రీ డన్నసౌ స్నాతుంసరః ప్రవిష్టం దేవలం పాదే ప్రగృహ్య చకర్ష. స చ కుపితో గ్రాహో భవేతి. శశాప తేన చ ప్రసాదితస్సన్ తం పత్యేవమభ్యభాషత్వ మనయైవ రీత్యా గజేంద్రం గృహ్ణీష్వ. తతశ్చ గజేంద్రముద్ధర హరిస్త్వామపి మోచయిష్యతి. (3)

హూహూ అను పేరుగల గంధర్వ శ్రేష్ఠుడు దేవలుని శాపముతో మొసలి రూపమును పొందినాడు. అతడప్పుడు శ్రీమన్నారాయణుని చక్రముతో తల ఖండింపబడిన వెంటనే శాపవిమోచనమును పొంది, తన పూర్వపు ఉత్తమమైన గంధర్వత్వమును సంతరించుకున్నాడు. ఈ ఇతిహాసమునందలి కథ ఇట్లున్నది. హూహూ అను గంధర్వుడు సరస్సునందు తన భార్యలతో జలక్రీడలాడుచు, అందులో స్నానము చేయుటకు ప్రవేశించిన దేవలుని పాదమును గట్టిగా పట్టుకుని లాగినాడు. దేవలుడు అతనిపై తీవ్రమైన కోపముతో మొసలివగుమని శపించినాడు. గంధర్వుడు శాపవిమోచనమునకై ప్రార్థించగా తనవలెనే (హూహూ) ఒక ఏనుగును పట్టుకొనగా శ్రీహరి శాపవిమోచనమును కలిగించగలడని అనుగ్రహించినాడు. (3)

శ్లో॥ ప్రణమ్య శిరసాధీశముత్తమశ్లోకమవ్యయమ్ ।
అగాయత యశోధామ కీర్తవ్య గుణ సత్కథమ్ ॥4॥

టీ :-ప్రణమ్యేతి. కథంభూతం. యశసో ధామ ఆశ్రయం. అతః కీర్తవ్యాః కీర్తనీయాః గుణాః అతీ కథా చ యస్య తం. (4)

హూహూ అనే గంధర్వుడు అధీశుడు, ఉత్తమ శ్లోకుడు, అవ్యయుడైన భగవంతుని కీర్తికి ఆశ్రయమై స్తుతించదగిన గుణములుగల కథను గానము చేసినాడు. (4)

శ్లో॥ సోఽనుకంపత ఈశేన పరిక్రమ్య ప్రణమ్య తమ్ ।
లోకస్య పశ్యతో లోకం స్వమాగాన్ముక్తకిల్బిషః ॥5॥

ఈ విధముగా శ్రీహరి అనుగ్రహముతో పాపములన్ని నశించిన గంధర్వుడు జగదీశ్వరునికి నమస్కరించి అందరునూ చూచుచుండగా తన గంధర్వలోకమునకు వెళ్ళెను. (5)

శ్లో॥ గజేంద్రో భగవత్ స్పర్శాద్విముక్తోऽజ్ఞానబంధనాత్ ।
ప్రాప్తో భగవతో రూపం పీతవాసాశ్చతుర్భుజః॥6॥

భగవంతుని స్పర్శవలన అజ్ఞానమనెడు బంధనము నుండి విముక్తుడైన గజరాజు భగవంతుని (పీతాంబరముతో, చతుర్భుజములతో పరమాత్మతో సమానమైన) రూపమును పొందినాడు. (6)

శ్లో॥ స వై పూర్వమభూద్రాజా పాండ్యో ద్రవిడ సత్తమః ।
ఇంద్రద్యుమ్న ఇతి ఖ్యాతో విష్ణువ్రతపరాయణః ॥7॥

టీ :-స ఇతి. స్వం లోకం గంధర్వలోకం. ॥5,6,7॥

ఆ గజేంద్రుడు పూర్వజన్మలో ద్రవిడ దేశమును పరిపాలించిన ఇంద్రద్యుమ్నుడను పేరుగల ఒకానొక పాండ్యరాజు. ఇతడు గొప్ప విష్ణుభక్తి పరాయణుడు.(7)

శ్లో॥ స ఏకదారాధనకాల ఆత్మవాన్
గృహీత మౌనవ్రత ఈశ్వరం హరిం।
జటాధరస్తాపస ఆప్లుతోऽచ్యుతం
సమర్చయామాస కులాచలాశ్రమః ॥8॥

టీ :-స ఇతి. కులాచలే లయాద్రౌ. ఆశ్రమో యస్య తం॥8॥

ఒకప్పుడు ఆయన మలయ పర్వతమునందలి ఆశ్రమమున నారచీరులు ధరించిన తాపసుడై, స్నానాదికములైన నిత్యకృత్యములను తీర్చుకొని శుచియై మౌనవ్రతముతో, ఆత్మానచింతనపరుడై, ఈశ్వరుడు, అచ్యుతుడైన శ్రీహరిని పరమభక్తితో ఆరాధించినాడు. (8)

శ్లో॥ యదృచ్ఛయా తత్ర మహాశయామునిః
సమాగమచ్ఛిష్యగణైః పరిశ్రితః ।
తం వీక్ష్య తూష్ణీమ కృతార్హణాధికం
రహస్యుపాసీన మృషిశ్చుకోప సః ॥9॥

ఆకస్మికముగా మహానుభావుడైన అగస్త్యమహాముని అలసినవాడై శిష్యగణసమేతముగా ఇంద్రద్యుమ్నుడు హరిపూజను నిర్వహించు ఆశ్రమమునకు వచ్చినాడు. రాజు ఆయన రాకను గమనించికూడా అర్హమైన అతిథి సత్కారములను నిర్వహించకుండా మిన్నకుండినాడు. అప్పుడు ఆ

టీ :-యదృచ్ఛయేతి. తూష్ణీం. రహసి. ఉపాసీనం వీక్ష్య.॥9॥

ఋషిపుంగవుడు మౌనముగా ఉపాసనతో నిమగ్నుడైన రాజును చూచి మిగుల కోపించెను. (9)

శ్లో॥ తస్మా ఇమం శాపమదాదసాధురయం
దురాత్మాఽకృతబుద్ధిరద్య ।
విప్రావమంతా విశతాంతమోఽంధం
యథా గజ స్తబ్దమతిః స ఏవ ॥10॥

టీ :-శాపమేవాహ. తస్మా ఇతి.అసాధురిత్యాది. అకృతాన్ అశిక్షితా బుద్ధిర్యస్య గజో యథాస్తబ్ధమతిస్తథైవాయం. అతః. సఏవగజఏవ. భవత్వితి శేషః. (10)

సజ్జనుడు కానివాడు, దురాత్మకుడు, తెలివిలేనివాడు, బ్రాహ్మణులను అవమానించువాడైన ఈ ఇంద్రద్యుమ్నుడు మూర్ఖమైన ఏనుగువలె అజ్ఞానమును పొందుగాక !. అనగా గజజన్మను పొందుగాక. అని అగస్త్యమహాముని శపించినాడు. (10)

**శ్రీశుక ఉవాచ :-**

శ్లో॥ ఏవంశప్త్వా గతోఽగస్త్యో భతవాన్నృప సానుగః ।
ఇంద్రద్యుమ్నోఽపి రాజర్షిః దిష్టం తదుపధారయన్ 11

టీ :- ఏవమితి.దిష్టం దైవప్రాపితం తదుపధారయన్నాలోకయ ॥11॥

**శ్రీ శుకమహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా! ఈ విధముగా ఇంద్రద్యుమ్నుని శపించి భగవంతుడైన అగస్త్యుడు తన అనుచరులతో వెళ్ళిపోయినాడు. రాజ ఋషి అయిన ఇంద్రద్యుమ్నుడు దైవికముగా తనకు కలిగిన గజజన్మ రూపమైన శాపమునకు తీవ్రముగా సంకటపడుచు (తర్వాతి శ్లోకముతో అన్వయము) (11)

శ్లో॥ ఆపన్నః కౌంజరీం యోనిమాత్మ స్మృతి వినాశినీమ్ ।
హర్యర్చనానుభావేన యద్గజత్వేప్యనుస్మృతిః ॥12॥

టీ :-ఆపన్నఇతి.కౌంజరీం యోమాపన్నః. తర్హి పశ్చాత్ కథం స్మృతిర్జాతా. తత్రాహ హరేరర్చనానుభావేతి. (12)

శ్లో॥ ఏవం విమోక్ష్య గజయూథప మజ్జనాభః
తేనాపి పార్షదగతిం గమితేనయుక్తః ।
గంధర్వ సిద్ధ విబుధైరుప గీయమాన
కర్మాద్భుతం స్వభవనం గరుడాసనోఽగాత్॥13॥

టీ :-ఏవమితి. అద్భుతం స్వభువనం. అగాత్. (13)

శ్లో॥ ఏతన్మహారాజ తవేరితోమయా
కృష్ణానుభావో గజరాజ మోక్షణమ్ ।
స్వర్గం యశస్యం కలికల్మషాపహం
దుఃస్వప్ననాశం కురువర్య శృణ్వతామ్ ॥14॥

టీ:-ఏవమితి. ఏతద్గజరాజమోక్షణంనామ. కృష్ణానుభావస్తవేరితః. కథంభూతం తత్రాహ. స్వర్గ్యమిత్యాది. దుస్స్వప్నం నాశయతీతి తథా. ॥14॥

తన ఈ ఇంద్రద్యుమ్న జన్మలోని స్మృతి జ్ఞానమును నాశనము చేయునదైనను, శ్రీహరిని అర్చించిన పుణ్యవిశేషముతో తాను గజజన్మను పొందినప్పటికి శ్రీహరి భక్తిని వీడనిదైన ఏనుగుజన్మను పొందినాడు.(12)

అజ్ఞానముతో నున్న గజపతిని ఈ విధముగా విడిపించి, శ్రీమహావిష్ణువు తన ప్రక్కన నిత్యసన్నిధానమున ఉండదగిన అతనితో (ఇంద్ర్యుమునునితో) కూడినవాడై గంధర్వులు, సిద్ధులు, పండితులతో కీర్తించదగిన పనిని (గజేంద్ర మోక్షణమును) నిర్వహించి గరుడాసనుడై తన అద్భుతమైన వైకుంఠమునకు వెళ్ళినాడు. (13)

ఓ మహారాజా ! కురువంశశ్రేష్ఠా ! ఈ విధముగా నేను నీకు వినిపించిన శ్రీకృష్ణుని అద్భుత కార్య రూపమైన గజేంద్రమోక్షణ వృత్తాంతము స్వర్గమును, కీర్తిని కలిగించి, కలికాల సంబంధమైన సర్వపాపములను, దుఃస్వప్నములను నాశనము చేయునదిగా తెలిసికొనుము. (అంటూ శుకమహర్షి గజేంద్రమోక్షణ గాథ శ్రవణ ఫలముగా ఫలశృతిని చెప్పినాడు). (14)

శ్లో॥ యథాను కీర్తయంత్యేతచ్ఛ్రేయస్కామా ద్విజాతయః ।
శుచయః ప్రాతరుత్థాయ దుఃస్వప్నాదుపశాంతయే॥15॥

టీ :-యథేతి. అతః. శ్రేయస్కామాః ఏతద్యథావదనుకీర్తయంతి. (15)

శ్రేయస్సును కోరిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతులవారు ఉదయమున నిద్రమేల్కొనిన పిదప శుచులై (తన నిత్య నైమిత్తిక కర్మలను ఆచరించిన పిమ్మట) చెడ్డ కలల వలన కలుగు చెడు ఫలములు శాంతించుటకై (అమంగళములు తొలుగుటకై) ఈ గజేంద్రమోక్షణ గాథను పారాయణము చేయుదురు. (15)

శ్లో॥ ఇదమాహ హరిః ప్రీతో గజేంద్రం కురుసత్తమ ।
శృణ్వతాం సర్వభూతానాం సర్వభూతమయోవిభుః16

టీ :-అనేన శ్రేయోభవతీతి కుతో జ్ఞాతం? సాక్షాద్భగవద్వచనాదేవేత్యాహ. ఇదమాహేత్యాది యావదధ్యాయ పరిసమాప్తి. (16)

ఓ కురువంశ శ్రేష్ఠా ! సర్వభూతమయుడైన శ్రీహరి ప్రీతి చెందినవాడై, గజేంద్రుని ఉద్దేశించి, సర్వజీవరాశి వినుచుండగా ఈ గజేంద్రమోక్షణగాథ దఃస్వప్నశాంతిని కలిగించునని, దీనివలన సమస్తమునకు శుభము కలుగునని స్వయముగా చెప్పినాడు. (16)

**శ్రీ భగవానువాచ :-**

**భగవంతుడీవిధముగా చెప్పినాడు :-**

శ్లో॥ యే మాం త్వాం సరశ్చేదం గిరికందర కాననమ్ ।
వేత్రకీచక వేణూనాం గుల్మాని సురపాదపాన్ ॥17॥

నన్ను, నిన్ను (ఏనుగును), ఈ సరస్సును, ఈ త్రికూట పర్వతమునందలి గుహలతో కూడిన అరణ్యమును, పేము, లావు వెదురుబొంగులు, సన్న ముల్లు కట్టెలు, (సన్నవెదురు ) మొదలైనవాని పొదలను, దేవతా వృక్షములను వేకువ జామున స్మరించు వారికి దుస్వప్నాది నిమిత్తమైన సర్వపాపములు తొలగును. అని తర్వాతి శ్లోకముతో అన్వయము. (17)

శ్లో॥ శృంగాణీ మాని ధిష్ణ్యాని బ్రహ్మణోమే శివస్యచ ।
క్షీరోదం మే ప్రియంధామ శ్వేతద్వీపంచ భాస్వరమ్॥18॥

బ్రహ్మ, విష్ణు, శివాత్మకములైన ఈ త్రికూటగిరి శిఖరములను, నా ప్రియ స్థానమైన పాలసముద్రమును, ప్రకాశించు శ్వేతద్వీపమును (స్మరించిన వారికి సర్వపాపవిముక్తి కలుగునని తర్వాతి శ్లోకముతో అన్వయము) (18)

శ్లో॥ శ్రీవత్సం కౌస్తుభం మాలాం గదాం కౌమోదకీం మమ ।
సుదర్శనం పాంచజన్యం సుపర్ణం పతగేశ్వరమ్ ॥19॥

నాయొక్క శ్రీవత్స చిహ్నమును, కౌస్తుభమణిని, వైజయంతీమాలను, కౌమోదకి అనే గదను, సుదర్శన చక్రమును, పాంచజన్య శంఖమును, పక్షిరాజైన గరుత్మంతుని (స్మరించినవారు పాపముక్తులగుదురని తర్వాతి శ్లోకముతో అన్వయము) (19)

శ్లో॥ శేషంచ మత్కలాం సూక్ష్మాం
శ్రియం దేవీం మదాశ్రయామ్ ।
బ్రహ్మాణం నారదమృషిం
భవం ప్రహ్లాదమేవచ ॥20॥

ఆది శేషుని, మిక్కిలి సూక్ష్మమైన విష్ణు కళను, నన్నాశ్రయించిన లక్ష్మీదేవిని, నారదమహర్షిని, పరమేశ్వరుని, ప్రహ్లాదుని (స్మరించినవారు పాప ముక్తులగుదురని తర్వాతి శ్లోకముతో అన్వయము) (20)

శ్లో॥ మత్స్య కూర్మ వరాహాద్యై రవతారైః కృతానిమే ।
కర్మాణ్యనంత పుణ్యాని సూర్యంసోమం హుతాశనమ్॥21॥

టీ :-యో మామితి. ప్రసంగాదన్యస్యాపి స్మరణే ఫలముచ్యతే. సర్వేషాం ద్వితీయాంతానాంస్మరంతీత్యష్టమేనాన్వయః.।17-21।

నా యొక్క మత్స్య కూర్మ వరాహాది నానా అవతారములను, నేను చేసిన అపారమైన పవిత్రమైన పనులను, సూర్యుని, చంద్రుని, అగ్నిదేవుని (స్మరించినవారుపాపముక్తులగుదురని తర్వాతి శ్లోకముతో అన్వయము) (21)

శ్లో॥ ప్రణవం సత్యమవ్యక్తం గో విప్రాన్ ధర్మమవ్యయమ్ ।
దాక్షాయణీ ధర్మపత్నీః సోమ కశ్యపయోరపి ॥22॥

టీ:- ప్రణవమితి. అవ్యక్తం మాయాం. అవ్యయం ధర్మం భక్తిలక్షణం సోమకశ్యపయోరపి. పత్నీర్దాక్షాయణీః. ॥22॥

సత్యము, అవ్యక్తము అయిన ఓంకారమును, గోవులను, విప్రులను, నాశరహితమైన ధర్మమును, దక్ష పుత్రికైన పరమశివుని అర్ధాంగి పార్వతిని, చంద్రుడు, కశ్యప ప్రజాపతుల ధర్మపత్నులను,(స్మరించినవారు పాపముక్తులగుదురని తర్వాతి శ్లోకముతో అన్వయము) (22)

శ్లో॥ గంగాం సరస్వతీం నందాం కాళిందీం సితవారణమ్ ।
ధ్రువం బ్రహ్మఋషీన్ సప్త పుణ్యశ్లోకాంశ్చ మానవాన్॥23॥

టీ:- గంగామితి. సితవారణరావతం. ॥23॥

గంగ, సరస్వతి, నంద, యమున అనే నదులను, ఐరావతమును, ధ్రువుని, ఏడుగురు బ్రహ్మఋషులును, పుణ్యాత్ములుగా కీర్తిని పొందిన ఉత్తమ చరిత్రలు గల మానవులును (స్మరించిన వారికి సర్వపాపములు తొలుగునని తర్వాతి శ్లోకముతో అన్వయము). (23)

శ్లో॥ ఉత్థాయాపర రాత్రాంతే ప్రయాతాః సు సమాహితాః ।
స్మరంతి మమ రూపాణి ముచ్యంతే హ్యేనసోఽఖిలాత్॥24॥

గ్రామాంతరములకు ప్రయాణమై పోవువారు తెల్లవారు జామున మేల్కొని ఏకాగ్రతతో పైన పేర్కొన్న తన (శ్రీహరి) రూపములను, పరమేశ్వరుని విభూతులను స్మరించువారు సర్వ ప్రాపంచిక సంకటముల నుండి విముక్తులౌదురు. (24)

శ్లో॥ యే మాం స్తువంత్యనేనాంగం ప్రతిబుధ్య నిశాత్యయే ।
తేషాం ప్రాణాత్యయే చాహం దదామి విమలాం మతిమ్ ॥25॥

వేకువ జామున నిద్రలేచి ఈ స్తోత్రమును పఠించిన వారికి ప్రాణావసాన సమయమున నిర్మలమైన బుద్ధిని ప్రసాదింతును. (అని శ్రీహరి చెప్పినాడు) (25)

టీ :-ఉత్థాయేతి. సుసమాహితా: ఏకాగ్రచిత్తా: మమరూపాణి మద్విభూతీః ॥24,25॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యాదిశ్య హృషీకేశః ప్రాధ్మాయ జలజోత్తమమ్ ।
హర్షయన్ విబుధానీక మారురోహ ఖగాధిపమ్॥26॥

టీ :-ఇతీతి. జలజోత్తమం శంఖవరం ప్రాధ్మాయ వాదయిత్వా (26)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
గజేంద్రమోక్షణం నామ చతుర్థోఽధ్యాయః

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా శ్రీహరి ఆదేశించి, పాంచజన్యమును పూరించి, దేవతా సముదాయమునకు ఆనందమును కలుగజేయుచు గరుత్మంతుని అధిరోహించినాడు. (26)

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య గారిచే
గజేంద్ర మోక్షణమను చతుర్థాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ అమృతాఖ్యానమష్టాభిరధ్యాయై రనువర్ణ్యతే ।
స్వ భక్త పక్షపాతేన యత్రమోహాయితం ప్రభోః॥

శ్లో॥ పంచమే పంచమం చాథ షష్ఠంచా కథయన్మనుమ్ ।
విప్రశాపాశ్చ నిః శ్రీకైః కృతాం దేవైర్హరేః స్తుతమ్॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ రాజన్నుదితమేతత్తే హరేః కర్మాఘనాశనమ్ ।
గజేంద్రమోక్షణం పుణ్యం రైవతం త్వంతరం శ్రుణు॥ 1॥

శ్లో॥ పంచమో రైవతో నామ మనుస్తామస సోదరః ।
బలీ వింధ్యాదయస్తస్య సుతా అర్జున పూర్వకాః ॥2॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

తన భక్తుల పట్లగల అభిమానముతో శ్రీమహావిష్ణువు జగన్మోహిని అవతారమును ధరించుటతో కూడిన అమృతమథన వృత్తాంతము ఎనిమిది అధ్యాయములలో వర్ణితము.

ఐదవ అధ్యాయమున ఐదవ, ఆరవ మన్వంతరములను, బ్రాహ్మణ శాపముచేత సర్వ సంపదలకు దూరమై దారిద్ర్యమును పొందిన దేవతలు శ్రీహరిని స్తుతించిన విషయము చెప్పబడును.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! నీకొరకై సర్వపాపములను నాశనము చేసి మిక్కిలి పుణ్యమును కలిగించునట్టి గజేంద్రమోక్షణమనే అద్భుతమైన కథను వివరించితిని. తర్వాత ఐదవ మనువైన రైవతమన్వంతర విశేషములను తెలుపుదును. సావధాన చిత్తుడవై వినుమని చెప్పినాడు. (1)

నాల్గవ వాడైన తామస మనువు సోదరుడైన రైవతుడనే పేరుగలవాడు ఐదవ మనువు. ఇతనికి అర్జునుడు అనేవాడు జ్యేష్ఠుడుగాగల బలి, వింధ్యుడు మొదలైనవారు పుత్రులు. (2)

శ్లో॥ విభురింద్రః సురగణా రాజన్ భూతరయాదయః ।
హిరణ్యరోమా వేదశిరా ఊర్ధ్వబాహ్వాదయో ద్విజాః॥3॥

ఓ రాజా ! విభుడనేవాడు ఇంద్రుడు. భూతరయాదులు దేవతలు. హిరణ్యరోముడు, వేదశిరుడు, ఊర్ధ్వబాహుడు మొదలైనవారు ఋషులు. (3)

శ్లో॥ పత్నీ వికుంఠా శుభ్రస్య వైకుంఠైః సురసత్తమైః ।
తయోః స్వకల్పయా జజ్ఞే వైకుంఠో భగవాన్ స్వయమ్॥4॥

దేవతా శ్రేష్ఠులు, వైకుంఠవాసులైన శుభ్రుడనే వానికి, అతని పత్ని వికుంఠ అనే ఆమెకు భగవంతుడు వైకుంఠుడైన శ్రీహరి తన అంశతో స్వయముగా జన్మించినాడు. (4)

శ్లో॥ వైకుంఠో కల్పితో యేన లోకో లోక నమస్కృతః ।
రమయా ప్రార్థ్యమానేన దేవ్యా తత్ప్రియ కామ్యయా॥5॥

తన ప్రియ పత్నియైన లక్ష్మీదేవితో, తనకు సంతోషము కలిగించు కోరికతో ప్రార్థించబడిన విష్ణువు సర్వలోకారాధ్యమైన వైకుంఠమనే గొప్పలోకమును సంకల్ప మాత్రముననే నిర్మించినాడు. (5)

టీ :-పంచమఇతి. తామసః చతుర్థో మనుః తస్య సోదరః భ్రాతా. (1- 5)

శ్లో॥ తస్యానుభావః కథితో గుణాశ్చ పరమోదయాః ।
భౌమాన్ రేణూన్ స విమమే యోవిష్ణోర్వర్ణమేద్గుణాన్॥6॥

విష్ణుమందిర ద్వారపాలకులై ఉండియు (సత్వగుణమును వీడి) రాజసముతో వ్యవహరించి సనకాది మహామునుల శాపముతో రాక్షసత్వమును పొందిన జయవిజయులను వరాహాది రూపములతో యుద్ధమున సంహరించుట అనే లక్షణములను, అపారమైన జ్ఞానమువంటి గుణములను, సాధించిన ఘనకీర్తులను మూడవ స్కంధమున వివరించితిని. ఐనను శ్రీహరి గుణములు అనంతమైనవి. ఈ సమస్త భూమండలమునందలి మట్టి రేణులనైనను

లెక్కించవచ్చును కాని విష్ణుమూర్తి గుణగణములను గణించుట మాత్రము అసాధ్యమైన విషయము. (6)

శ్లో॥ షష్ఠశ్చ చక్షుషః పుత్రశ్చాక్షుషోనామ వైమనుః ।
పూరు పురుష ప్రద్యుమ్న ప్రముఖశ్చాక్షుషాత్మజాః ॥7॥

చక్షుషుని కుమారుడైన చాక్షుషుడనువాడు ఆరవ మనువు. పూరుడు, పురుషుడు, ప్రద్యుమ్నుడు మొదలైనవారు చాక్షుషని పుత్రులు. (7)

శ్లో॥ ఇంద్రోమంత్రద్రుమస్తత్ర దేవా ఆప్యాదయో గణాః ।
మునయస్తత్రవై రాజన్ హవిష్మద్వీరకాదయః ॥8॥

ఓ రాజా ! మంత్రద్రుముడనేవాడు చాక్షుష మన్వంతరమున ఇంద్రుడు. ఆప్యాది గణములు దేవతలు. హవిష్మంతుడు, వీరకుడు మొదలైనవారు మునులు. (8)

శ్లో॥ తత్రాపి దేవః సంభూత్యాం వైరాజస్యాభవత్సుతః ।
అజితోనామ భగవానంశేన జగతాం పతిః ॥9॥

వైరాజుడు అను వానికి సంభూతి అనెడి అతని పత్నికి అజితుడు అనే పేరుతో జగత్పతి భగవంతుడైన శ్రీహరి పుత్రుడుగా అవతరించినాడు.(9)

శ్లో॥ పయోధిం యేన నిర్మథ్య సురాణాం సాధితా సుధా ।
భ్రమమాణో౽ంభసి ధృతః కూర్మరూపేణ మందరః॥10॥

ఈ అజితుడే సముద్రమథనమున కవ్వమైన మందర పర్వతమును కూర్మరూపముతో కుదురుగా ధరించి సముద్రమును మథించి దేవతలకు అమృతమును ప్రసాదించినాడు. (10)

టీ :- తస్యేతి. తస్య కుంఠసంజ్ఞస్య హరేః. అనుభావః సనకాది శాపేన దైత్యతాంప్రాప్తాభ్యాం. స్వపార్షదాభ్యాం. వరాహాది రూపేణ యుద్ధాదిలక్షణః. గుణాశ్చ బ్రహ్మణ్యతాదయః, పరమోదయాశ్చ మహర్ద్ధయః. థితాః తృతీయస్కంధాదిషు. (6 -10)

**రాజోవాచ :-**

శ్లో॥ యథా భగవతా బ్రహ్మన్ మథితః క్షీరసాగరః ।
యదర్థం వాయతశ్చాద్రిం దధరాంబు చరాత్మనా॥11॥

**రాజు ఈవిధముగా అడిగినాడు :-**

ఓ జ్ఞానవంతుడా ! భగవంతుడైన హరి పాలసముద్రమును చిలికిన విధము, కూర్మావతారముతో మందరపర్వతమును ధరించిన విధమును (వినిపింపుమని తర్వాతి శ్లోకముతో అన్వయము) (11)

శ్లో॥ యథామృతం సురైఃప్రాప్తం కించాన్యదభవత్తతః ।
ఏతద్భగవతః కర్మ వదస్వ పరమాద్భుతమ్ ॥12॥

దేవతలు అమృతమును పొందినవిధము, ఆ తర్వాత జరిగిన ఆశ్చర్యకరమైన విషయములతో గూడిన శ్రీమహావిష్ణువు గావించిన అద్భుత వృత్తాంతమును వివరించుము. (12)

శ్లో॥ త్వయా సంకథ్యమానేన మహిమ్నా సాత్వతాం పతేః ।
నాతి తృప్యతి మే చిత్తం సుచిరం తాపతాపితమ్॥13॥

చాలాకాలము సంకటపడుచున్నందున, నీవు వినిపించిన- సర్వజీవులకు అధిపతియైన శ్రీమహా విష్ణువు మహిమలను పేర్కొను కథల వలన ఇంకను నా మనస్సు తృప్తిని పొందుట లేదు. అనగా విష్ణుకథలను వినుటలో నాకింకను తనివి తీరలేదు. కనుక మరిన్నింటిని వినిపించుమని భావము. (13)

**సూత ఉవాచ :-**

శ్లో॥ సంతుష్టో భగవానేవం ద్వైపాయన సుతో ద్విజాః ।
అభినంద్య హరిర్వీర్య మభ్యాచష్టుం ప్రచక్రమే ॥14॥

టీ :-యథేతి. యతో హేతోః అంబుచరాత్మనా కూర్మరూపేణ. సురాణాం సాధితా సుధేత్యుక్త్వా యుద్ధాద్యపి. సూచితం అతః పృచ్ఛతి. కిం వాన్యదితి. (11-14)

**సూతుడు ఈ విధముగా చెప్పినాడు :-**

ఓ విప్రోత్తములారా ! రాజు ప్రార్థనకు తృప్తిని బొందిన వ్యాసపుత్రుడైన శుక మహర్షి పరాత్పరునికి నమస్కరించి శ్రీహరి పరాక్రమము చెప్పుటకు మొదలు పెట్టినాడని సూతమహాముని శౌనకాది మహర్షులకు ఈ విధముగా వినిపించినాడు. (14)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ యదా యుద్ధేఽసురైర్దేవా బాధ్యమానాశితాయుధైః ।
గతాసవో నిపతితా నోత్తిష్ఠే రన్స్మ భూయసః ॥15॥

టీ :-యథేతి. నోత్తిష్ఠేరన్ న పునర్జీవంతీత్యర్థః. ॥15॥

**శుకమహర్షి ఇట్లు చెప్పినాడు :-**

దేవతలు రాక్షసులతో జరిగిన యుద్ధమున వాడియైన బాణములతో బాధింపబడి ప్రాణములు విడిచి భూమిపై బడినారు. వారికి జీవించు అవకాశము లేకపోయినది. (15)

శ్లో॥ యదా దుర్వాససః శాపాత్ సేంద్రా లోకాస్త్రయో నృపః।
నిః శ్రీకాశ్చభవంస్తత్ర నే శురి జ్యాదయః క్రియాః॥16॥

ఓ రాజా ! దుర్వాసమహాముని శాపము వలన ఇంద్రునితో సహ ముల్లోకములు దారిద్ర్యమును పొందినవి. యజ్ఞయాగాదికముల నిర్వహణకు అవసరమైన ధనమును వృద్ధిపొందించు సామర్థ్యము లేకపోయెను. దుర్వాస మహాముని ఒకసారి తన మార్గమున తారసిల్లిన ఇంద్రునిచూచి మర్యాదతో తన మెడలో ధరించిన ఒకానొక మాలను ఇంద్రునికి ఇచ్చినాడు. ధనమదముతో విఱ్ఱవీగుతున్న ఇంద్రుడు ఆ దండను (హారమును) అనాదరముతో ఐరావతము కుంభస్థలముపై పడవేసినాడు. మదించిన ఆ ఏనుగు ఆ మాలను పాదములతో త్రొక్కి పొడి పొడి చేసినది. అపుడు తీవ్రమైన కోపముతో మండిపడిన దుర్వాసోముని ముల్లోకములలో ఇంద్రుడు సర్వసంపదలు కోల్పోయి దరిద్రుడగునని శపించినాడు. (16)

శ్లో॥ నిశమ్యై తత్సురగణా మహేంద్ర వరుణాదయః ।
నాధ్య గచ్ఛున్ స్వయంమంత్రై ర్మంత్రయంతో వినిశ్చయమ్॥17॥

దుర్వాసోముని శాపమును విని ఇంద్రుడు, వరుణుడు మొదలైన వారితో కూడిన దేవతా సముదాయము ఈ కలిగిన ఉపద్రవమునుండి ఎలా బయటపడవలెనో తమలో తాము ఎన్ని విధములుగా చర్చించుకున్ననూ వారికి సరియైన ఏకాభిప్రాయము కుదురలేదు. (17)

శ్లో॥ తతో బ్రహ్మ సభాం జగ్ముః మేరోర్మూర్ధని సర్వశః ।
సర్వం విజ్ఞాపయాం చక్రుః ప్రణతాః పరమేష్ఠినే॥18॥

టీ :- దుర్వాససా హి కదాచిన్మార్గేగచ్ఛంతమింద్రం దృష్ట్వాస్వకంఠస్థామాలా తస్మై దత్తా. తేనచ శ్రీమదేన అనాదృత్యైరావతస్య కుంభయోస్సా నిక్షిప్తా. స చ గజోమత్తః పద్భ్యాం తాం మాలాం చూర్ణీచకార. తతః కుపితో దుర్వాసాస్తం శకాప త్రిహిర్లోకైస్సహనిశ్శ్రీకో భవేతి. తదేతదాహ. యదా దుర్వాససశ్శాపాదితి. ఇత్యాదయః యాగాద్యాః (16- 18)

మేరుపర్వతము యొక్క పై భాగముననున్న బ్రహ్మదేవుని సభకు ఇంద్రాది దేవతలు వెళ్ళి ఆ చతుర్ముఖునికి నమస్కరించి తమకు దుర్వాసోమునివలన కలిగిన శాపవృత్తాంతమును వినిపించి తమకు ఆ గండము నుండి బయటపడు మార్గమును తెలుపుడని ప్రార్థించిరి. (18)

శ్లో॥ సవిలోక్యేంద్ర వాయ్వాదీన్ నిః సత్వాన్విగత ప్రభాన్ ।
లోకానమంగళప్రాయానసురా నయథావిభుః ॥19॥

టీ :- సఇతి.అసురాన్. అయథా దేవవైలక్షణ్యేన బలనైపుణ్యాది యుక్తాన్. విలోక్యేత్యర్థః. (19)

బలహీనులూ, కాంతిరహితులూ అయిన ఇంద్రుడు, వాయువు మొదలైన దేవతలును, సమస్తమైన అశుభములతో నిండిన ఎల్లలోకములును, ఇందుకు భిన్నముగా బలపరాక్రమాలతో వృద్ధిపొందిన రాక్షసులను చూచి భగవంతుడైన బ్రహ్మదేవుడు (ఇట్లు పలికినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము) (19)

శ్లో॥ సమాహితేన మనసా సంస్మరన్ పురుషం పరమ్ ।
ఉవాచోత్ఫుల్ల వదనో దేవాన్ స భగవాన్పరః॥20॥

టీ :- సమాహితేనేతి.హరిం శరణం గతాస్సంతోయథాపూర్వం, సర్వం ప్రాప్స్యామ ఇతి హర్షేణోత్ఫుల్లం వికసితం వదనం యస్య. (20)

బ్రహ్మదేవుడు ఏకాగ్రచిత్తముతో పరాత్పరుడైన శ్రీహరిని ధ్యానమగ్నుడై భావనచేసి ఆయన అనుగ్రహముతో, తామందరు శరణు కోరినచో ఆయన దయతో పూర్వము వలెనే సమస్తమును తిరిగి పొందగలమని, గ్రహించినవాడై ముఖమున ఆనంద దరహాసము చిగురించగా దేవతలతో ఈ విధముగా బదులు చెప్పినాడు.(20)

శ్లో॥ అహంభవో యూయమథో సురాదయో
మనుష్య తిర్యక్ ద్రుమ ఘర్మ జాతయః ।
తస్యావతారాంశ కలా విసర్జితా
వ్రజామ సర్వే శరణం తమవ్యయమ్॥21॥

టీ :–అహమితి. మనుష్యాదయః జరాయుజాండజోద్భిజ్జ స్వేదజాః. యస్యావతారః పురుషః. తస్యాంశో బ్రహ్మాతస్యకళామరీచ్యాదయః తాభిర్విసర్జితాః పుత్రపౌత్రాదిద్వారా జనితాః (21)

నేను, ఈశ్వరుడూ, మీరూ, రాక్షసాదులు, మనుష్యులు, పశు పక్ష్యాదులు, వృక్షరాశి, స్వేదజములు మొదలైన ఈ సర్వము ఆ పరాత్పరుడైన శ్రీహరి అవతారాంశల కళావిలాసముతో సృష్టి అయిన వారము. పరమాత్ముని అంశ బ్రహ్మ. అతని కళలు మరీచి మొదలైన ప్రజాపతులు. వారి పుత్రపౌత్రాదులనుండి జన్మించినవారు మనుష్యులు మొదలైనవారు. జరాయుజములనగా తమ రూపమును పోలిన కరచరణాదులతోనున్న సంతానమునకు ఏకముగా తమే జన్మనిచ్చి, పాలించి పెంచునట్టి మానవులు. మిగిలిన క్షీరదములు, అండజములు– పక్షులు, పాములు, చేపలు మొదలైనవి. ఉద్భిజములు, విత్తనమును ఛేదించి మొలుచునట్టి ఓషధులు. ఔషధ సంబంధమైన మొక్కలు, వనస్పతులు, ఆహార సంబంధమైన వృక్షములు. స్వేదజములు కంటికి కనిపించని ఏక కణజీవులు మొదలైన నాలుగు విధముల సృష్టించిన జీవరాశి. (21)

శ్లో॥ న యస్య వధ్యో న చ రక్షణీయో
నోపేక్షణీయాదరణీయ పక్షః ।
అథాపి సర్గస్థితి సంయవార్థం
ధత్తే రజః సత్వ తమాంసి కాలే॥22॥

టీ :–నను తర్హి సర్వేష్వసౌ సమస్స్యాత్. కిం తచ్చరణాశ్రయేణ

భగవంతుడు సర్వ సముడైన పక్షమున ఆయనను ప్రత్యేకముగా ఆశ్రయించవలసిన పనియేమి? అనే శంకకు సమాధానము చెప్పుచున్నాడు. పరమాత్మకు దండించవలసినవాడు కానీ, రక్షించవలసినవాడుకాని లేడు. ఆయన ప్రత్యేకముగా నిర్లక్ష్యము చేసిన వాడు కాని, ఆదరించిన వాడు కాని లేడు. అనుమాట సత్యమైనను ఆశ్రయించు వారిని నిరాకరించుట తగదు గనుక ఆశ్రయమును కోరివచ్చిన మనలను తప్పక అనుగ్రహించగలడని

సత్యం. యద్యప్యేపం తథాప్యస్మత్పక్షపాతీ భవిష్యతీత్యాశయే నాహ నయస్వేత్యాది ద్వాభ్యాం. (22)

భావించి చెప్పుచున్నాడు. గుణ రహితుడై దండన రక్షణాదులు లేనివాడైనను భగవంతుడు కాలము ననుసరించి సృష్టి కాలమున రజోగుణమును, స్థితికాలమున సత్వగుణమును, సంహార కాలమున తమోగుణమును అనివార్యముగా స్వీకరించును. (22)

శ్లో॥ అయం చ తస్యస్థితి పలన క్షణః
సత్వం జుషాణస్య భవాయ దేహినామ్ ।
తస్మాత్ వ్రజామః శరణం జగద్గురుం
స్వానాం స నో ధాస్యతి శం సురప్రియః॥23॥

టీ :-అయమితి. స్థితిపాలనస్య క్షణఃకాలః. అతః సురప్రియస్సన్ స్వీయానాం నః. శం సుఖం కరిశ్యతి. ॥23॥

ఇది శ్రీమహావిష్ణువు సత్వగుణమును స్వీకరించి జీవులందలి స్థితిని నిర్వహించి రక్షించునట్టి సమయము. అందువలన జగద్గురుడైన ఆ మహాపురుషుని శరణు పొందుదము. దేవతలపట్ల ప్రీతి కలిగిన ఆయన తనవారమైన మనకందరకు సుఖమును కలిగిచగలడని బ్రహ్మ ఇంద్రాదులకు చెప్పినాడు. (23)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యాభాష్య సురాన్ వేధాః సహదేవై రరిందమ ।
అజితస్య పదం సాక్షాజ్జగామ తపసః పరమ్ ॥24॥

టీ :-ఇతీతి. యత్ర క్షీరాబ్ధౌ. హరేర్వాసస్తదేవ తమసః పరం స్థానం యద్వా లోకాలోకాద్రేః పరతో యత్తమస్తతః పరం స్థానం జగామ. (24)

**శుకమహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ శత్రునాశకుడైన పరీక్షిన్మహారాజా ! బ్రహ్మదేవుడు ఈవిధముగా దేవతలతో చెప్పి వారందరితో కలిసి జిష్ణుని స్థానమైన పాలసముద్రమున శ్రీహరి నివాసమైనది (అనికాని లోకాలోక పర్వతముకంటే అవతలి భాగమున నున్నది), అలోకమున పెంజీకటి ఆవల నున్నది, అయిన శ్రీహరి నిరంతరము కొలువైయున్న సర్వశ్రేష్ఠమైన వైరుంఠమునకు వెళ్లినాడు. (24)

శ్లో॥ తత్రాదృష్ట స్వరూపాయ శ్రుత పూర్వాయ వై విభో ।
స్తుతి మబ్రూత దైవీభిర్గీర్భిః త్వవహితేంద్రియః ॥25॥

టీ :- తత్రేతి. దైవీభిః లోకే అప్రసిద్ధాభిః వైదికీభిర్గీర్భిః స్తుతి మకరోత్. (25)

ఓ రాజా ! అక్కడ ఏకాగ్రచిత్తుడైన బ్రహ్మ అదృష్టస్వరూపుడు ఇంతకుముందు ఎన్నడు వినని అద్భుతమైన విభావము కలవాడైన పరమాత్ముని ఉద్దేశించి లోకాతీతమై, దేవతాసంబంధమైన వైదిక స్తోత్రములతో ఈ విధముగా కీర్తించినాడు.(25)

బ్రహ్మోవాచ :-

శ్లో॥ అవిక్రయం సత్యమనంతమాద్యం
గుహాశయం నిష్కలమప్రతర్క్యమ్ ।
మనో-గ్రయానం వచసాఽనిరుక్తం
నమామహే దేవవరం వరేణ్యమ్ ॥26॥

టీ :-అవిక్రియమితి. దేవవరంత్వాం నమామహే. హేదేవ వరం త్వాం నమామహఇతివా. వరత్వేహేతుః. సత్యంకుతః? అవిక్రియం తత్కుతః? అనంతం ఆద్యం చ. నాదిం. ఆద్యంతవంతో హివృద్ధ్యాది విక్రియా యుక్తాభవంతి. కించ. గుహాశయం సర్వాంతరం. తత్కుతః? నిష్కళం నిరుపాధికం తత్కుతః?అప్రతర్క్యం తత్కుతః? మనోగ్రయా నంమనసోపి జవిష్ఠం. మనః ప్రాప్యస్థానే తతః ప్రాగేవ విద్య మానత్వాత్.

బ్రహ్మ ఈవిధముగా స్తుతించినాడు :-

సత్వము, రజస్సు, తమములనే గుణములకు సంబంధించిన ఎట్టిమార్పు (వికారము) లేనివాడు, దేశము, కాలము అనే పరిమితులకు అతీతమై, సత్యమై, అనంతమై, అనాదియైనవాడు, జగత్తుకు ఆద్యంతములు తానే అయి వృద్ధి, క్రమముగా క్షీణించుట, నశించుటలనే వికారములకు కారణమైనవాడు, సమస్తమునకు లోపల తెలియరాకుండా వున్నవాడు, బుద్ధి, మనస్సు మొదలైన సూక్ష్మ విషయములందు సూక్ష్మాతి సూక్ష్మముగా వర్తించువాడు, ఉపాధి రహితముగా నిష్కలుడైనవాడు, ఎట్టి ప్రమాణములకు అందనివాడు, మనస్సును మించిన వేగము కలవాడు, దీనికి " అనేజదేకం మనసోజవీ యోనైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్శత్। తద్ధావతోన్యా నత్యేతి తిష్ఠత్॥" అని శ్రుతి ప్రమాణము. వాక్కులకు అందనివాడు (వాచామవిషయః), "యద్వాచా నభ్యుదితం యేనవాగభ్యుద్యతే" అని శ్రుతి. మనస్సు, వాక్కులకు అందని వాడైనందున, ఎట్టి హేతువులకు పొందనివాడు (అపుతర్క్యః), తన ఇచ్ఛానుసారముగా

తథాచ శ్రుతిః. ‹అనేజదేకం మనసో జవీయోనైనద్దేవాఆప్నువన్ పూర్వమర్షత్. తద్ధావతోస్యానత్యే › తీత్యాది. వచసాచఅనిరుక్తం అవిషయత్వాత్. శ్రు. ‹యద్వాచానభ్యుదితం యేనవాగి › త్యాదిశ్రుతేః మనోవచసోరగోచరత్వాద ప్రత్యర్క్యం. యథేష్టం వా. సర్వేషాంహేతుహేతుముద్భావః. (26)

అన్నిటికి కార్యకారణరూపమైనవాడు, (సర్వేషాం హేతు హేతు మద్భావః), శ్రేష్ఠుడు, ముఖ్యుడైన దేవదేవుడవు నీకు నమస్కారము. (26)

శ్లో॥ విపశ్చితం ప్రాణమనోధియాత్మనాం
అర్థేంద్రియాభాస మనిద్రమవ్రణమ్ ।
ఛాయాతపౌయత్ర న గృధ్రపక్షౌ
తమక్షరం ఖం త్రియుగం వ్రజామహే ॥27॥

టీ :- విపశ్చితమితి. కించ. ప్రాణాదీనాం. విపశ్చితం జ్ఞాతారం. ఆత్మా అహంకారః దేహో వా. న తు తద్వ్యతిరిక్తం జ్ఞేయమస్తీత్యాహ అర్థో విషయః ఇంద్రియాణి. తద్గ్రాహకాణి తదుభయరూపేణాభాసత ఇతి తథా తం. తథాప్యనిద్రం స్వప్నద్రష్ట్రుపదజ్ఞానరహితం. కుతః? అప్రణం అదేహం. అతఏవ అక్షరం ఖమివ వ్యాపినం. చ సర్వత్రహేతుః యత్ర యస్మిన్. గృధ్రపక్షౌ జీవపక్షపాతినౌ. ఛాయాతపౌ అవిద్యా చ తన్ని వర్తకావిద్యా చనాస్తితం. త్రిషు యుగేష్వావిర్భవంతం. శరణ వ్రజామః. (27)

ప్రాణము, మనస్సు, బుద్ధి, అహంకారము, శరీరము మొదలైన వాటిని ఎరిగినవాడు, ఇంకా ప్రాణాదులకంటే వేరై గ్రహించగలిగిన విషయములు (శబ్ద, స్పర్శాది తన్మాత్రలు), వాటిని గ్రహించు ఇంద్రియములనే రెండింటి రూపములతో ప్రకాశించువాడు, ఐనప్పటికి నిద్రలేనివాడు అనగా స్వప్నద్రష్టవలె అజ్ఞానములేనివాడు, దేహరహితుడైనవాడు (అవ్రణుడు), అందువలననే నాశరహితుడై (అక్షరుడు) ఆకాశమువలె అంతటా వ్యాపించినవాడు, వీటన్నిటికీ హేతువేమన-గద్దరెక్కలవలె భుక్తి, ముక్తి రెండిటిని కాంక్షించు దేవుడు, ఆవరణ స్వభావము వలన ఛాయ అంటే అజ్ఞానము, అవిద్య, ప్రకాశస్వభావము వలన ఎండ, అంటే జ్ఞానము రెండునూ లేనివాడు, నాశరహితుడు, ఆకాశమువలె ఆద్యంతములు లేనివాడు, మూడు యుగములందు అంటే భూత, భవిష్యత్, వర్తమానములయందుండువాడవైన ఓ భగవంతుడా ! నిన్ను శరణు కోరుచున్నాము. (27)

శ్లో॥ అజస్య చక్రం త్వజయేర్యమాణం
మనోమయం పంచదశా రమాశు ।
త్రిణాభివిద్యుచ్చలమష్టనేమి
యదక్షమాహుస్తమృతం ప్రపద్యే ॥28

టీ :– తదేవమవిక్రియత్వాదిభిః సర్వజ్ఞత్వాదిభిః సత్యత్వం వరేణ్య త్వంచోక్తం. సంసారచక్రాధారత్వేనాపి తదేవ దర్శయన్నాహ అజస్యేతి. అజస్య జీవస్య చక్రం చక్రవదావర్తమానం దేహాది. అజయౌ మయాయా ప్రేర్యమాణం. యత్. యః అక్షో యస్య. యదధిష్ఠానమాహుః తమృతం సత్యం. ప్రపద్యే కథంభూతం చక్రం. మనోమ యం మనః ప్రధానం జ్ఞానేంద్రియాణి పంచ కర్మేంద్రియాణి పంచ. పంచప్రాణాః. ఇత్యేవం పంచదశ అరా యస్య ఆశు శీఘ్రగం త్రయో గుణాః.నాభిరివ మధ్యే యస్య విద్యుదివ చలం. అష్టౌ ప్రకృతయో నేమయఇవావరణానియస్య. (28)

ఈ విధముగా భగవంతుని యొక్క అవిక్రమత్వాదులతో, సర్వజ్ఞత్వాదులతో సత్యత్వము, శ్రేష్ఠత్వములు చెప్పబడినవి. సంసారచక్రధారణ ఉన్నను – సృష్టి, స్థితి, లయాది కార్యక్రమములున్నను ఆయన నిష్క్రియుడనే విషయములనే వివరించి చెప్పుచున్నాడు. చక్రమువలె తిరుగునట్టి దేహాదులతో కూడిన జన్మ మరణాది జీవచక్రమును అనాదియైన మాయతో ప్రేరేపించువాడు (నిర్వహించువాడు) – ఆ చక్రమెట్టిదనగా మనస్సే ప్రధానమైనది, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ వాయువులు మొత్తము పదునైదు ఆకులుగలది, సత్త్వము, రజస్సు, తమములనే మూడు గుణాలు నాభి వలె బండి కంటి మధ్య తూముగలది, మెరుపు తీగవలె వేగముగా చలించునది, ఎనిమిది నేములు ( బండి కమ్మలు) గలది. ( పంచ భూతములు, సూర్య చంద్రులు – యజమాని (జీవుడు), అయిన బండి చక్రము (జగత్ చక్రము) నకు అధిష్ఠానమైన పరబ్రహ్మ సత్యమైనవాడు అయిన భగవంతుని శరణుపొందుచున్నాను. (28)

శ్లో॥ య ఏకవర్ణం తమసః పరం తత్
అలోకమవ్యక్త మనంతపారమ్ ।
ఆసాం చకారోప సుపర్ణమేన
ముపాసతేయోగ రథేన ధీరాః ॥29॥

సర్వజీవులను నియంత్రించుటవలన భగవంతుని శ్రేష్ఠత్వము చెప్పబడినది. సుపర్ణుడనగా జీవబ్రహ్మలు. జీవుని సమీపమదేవుండి, అతనిని నియంత్రించుటచేత, సృష్టి మొదలైన వాటిని నిర్వహించుచున్నవాడు. "ద్వాసుపర్ణా సయుజా జఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" దేహమనే

టీ :- సర్వజీవనియంతృత్వాదినా చ వరిష్ఠత్వమాహ యదితి. య ఉపసర్పణం జీవసమీపే తన్నియంతృత్వేన.ఆసాం చకార ఆస్తేస్మ. ౘశ్రుఃౘ. ౘద్వాసుపర్ణాసయుజౌ సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతఃౘ ఇతి శ్రుతేః, యద్వా. భక్తరక్షార్థం గరుడస్యోపరి ఉపవిష్ట ఇత్యర్థః. తర్హి, దేహస్థత్వాత్ భక్తరక్షణాదిక్రియాదేశాద్వా జీవసామ్యం స్యాత్. తత్రాహ ఏకవర్ణం జ్ఞానైకస్వరూపం. తమసః ప్రకృతేః పరం. ఆలోకం అదృశ్యం నిర్వికల్పం.అనంతపారం కాలతో దేశతశ్చాపరిచ్ఛిన్నం.తత్. బ్రహ్మైవం అప్రచ్యుతస్వరూపత్వాత్ న జీవసామ్యం. శ్రు. తయోరన్య ః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతీఃౘ తి విశేషశ్రవణాదిత్యర్థః. అతఏవ యం ధీరా యోగేన రథేన ప్రాప్తిసాధనేనోపాసతే. భజన్తే. తం నమామేత్యుత్తరేణాన్వయః (29)

శ్లో॥ నయస్య కశ్చాతి తితర్తి మాయాం
యయాజనో ముహ్యతి వేదనార్థమ్ ।
తం నిర్జితాత్మ గుణం పరేశం
నమామ భూతేశు సమం చరంతమ్ ॥30॥

వృక్షమును ఆశ్రయించి జీవునికి సఖుడై అతనితో సమానముగా ఈశ్వరుడున్నాడని శ్రుతి ప్రమాణము. లేక భక్తులను రక్షించుటకై నిత్యసిద్ధుడై గరుత్మంతుని అధిరోహించినవాడు, దేహమునందుండుట వలన, భక్తరక్షణాది క్రియలందు పట్టుదలను కలిగియుండుటవలన జీవసామ్యము సిద్ధించినవాడు అనే విషయమును చెప్పుచున్నాడు. ఏకవర్ణుడు అంటే కేవల జ్ఞాన స్వరూపుడు, తమస్సు అంటే ప్రకృతి దానికంటే భిన్నుడై, శ్రేష్ఠుడైనవాడు అదృశ్యుడైనవాడు ( భౌతిక విషయములకు అతీతుడు), హేతువులకందనివాడు, మార్పులేనివాడు (నిర్వికల్పుడు), అనంతపారుడు అనగా దేశకాలాది పరిచ్ఛేదములు లేనివాడు అయినవాడు బ్రహ్మము. అందువలన జీవసామ్యము లేనివాడు. “తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యస్యన్నన్యో అభిచాకశీతి ” జీవుడు మాత్రమే కర్మఫలమును అనుభవించుచున్నాడు. అని శ్రుతి. ఆ విధముగా నున్న ఈశ్వరుని యోగీశ్వరులు యోగమనే ప్రాప్తిసాధనమైన రథముతో (ఉపాసించు చున్నారు అని తర్వాత శ్లోకముతో అన్వయము) (29) .

మాయను నియమించినప్పటికీ జీవసామ్యమును పరిహరించి శేష్ఠత్వమును చెప్పుచున్నాడు. ఈశ్వరుని మాయను ఎప్పుడూ, ఎవ్వరునూ అతిక్రమించలేరు. సర్వులు మాయచేత భ్రాంతులౌతారు. ఎవ్వరును ఆత్మస్వరూపమునుగానీ, తమను, తమశక్తిని మించిన మాయనుగానీ, దాని వైశిష్ట్యమునుగానీ తెలియలేరు. ఆ విధముగా మాయాతీతుడై సర్వజీవుల

టీ :- మాయానియంతృత్వేనాపిజీవసామ్యం పరిహన్వరిష్ఠత్వ మాహ న యస్యేతి. యస్య మాయాం.కశ్చ కశ్చిదపి.నాతితర్తి నాతిక్రామతి. కథం భూతాం. జనో యయా ముహ్యతి అర్థమాత్మ స్వరూపం. న తు వేదనిర్జితః ఆత్మా ఆత్మశక్తిర్మాయా చ. తద్గుణాశ్చ యేన తం.॥30॥

అంతరంగమున సమానముగా చరించుచున్న పరమేశ్వరునికి నమస్కారము. (30)

శ్లో॥ ఇమే వయం యత్ప్రియయైవ తన్వా
సత్త్వేన సృష్టా బహిరంతరావిః ।
గతిం న సూక్ష్మా మృషయశ్చ విద్మహే
కుతో సురాద్యా ఇతరః ప్రధానాః ॥31॥

టీ :- అర్థం న వేదేతి యదుక్తం తత్ప్రపంచయన్నాహ ఇమేవయమిది. ఇమే వయం దేవా ఋషయశ్చ. యస్య ప్రియయా తన్వా.సత్త్వేనైవ సృష్టా అపి. బహిశ్చాంతశ్చ సత్త్వాప్రకాశాభ్యామావి: ప్రకటమపి. సూక్ష్మాం గతిం నిరుపాధిస్వరూపం.న విద్మః. ఇతర ప్రధానా రజస్తమోమయాః కుతో విదుః? తం నమామేతి పూర్వేణాన్వయః. (31)

ఎవ్వరునూ ఆత్మస్వరూపమును తెలియలేరను విషయమును వివరించుచూ చెప్పుచున్నాడు. మేము (బ్రహ్మదేవుడు), ఈ దేవతలు, మహర్షులు పరమాత్ముని సత్వగుణము చేత సృష్టి అయిననూ బహిః కాలమనే రూపముచేతనూ, లోపల అంతర్యామి రూపముచేతనూ సత్వ ప్రకాశముతో ప్రకటితమైన భగవంతుని ఉపాధిరహితమై సూక్ష్మమైన స్వరూప స్వభావాదులను తెలియలేము. ఇతర ప్రధాన గుణములైన రజస్సు, తమము అనే వాని వల్ల సృష్టైన రాక్షసాదులు ఇంకా నీచయోనులందు జన్మించినవారికి పరమాత్మ తత్త్వము ఎట్లు అవగతము కాగలదు. (31)

శ్లో॥ పాదౌ మహీయం స్వకృతైవ యస్య
చతుర్విధో యత్ర హి భూతసర్గః ।
సవై మహాపూరుష ఆత్మ తంత్రః
ప్రసీదతాం బ్రహ్మ మహావిభూతిః ॥32॥

టీ :- ఇదానీం వైరా జరూపేణ స్తువన్ప్రార్థయతే ద్వాదశభిః. పాదావితి. యత్ర మహ్యాం. జరాయుజాదిభూతసర్గః. సా మహీ. యస్య పాదౌ. సః నః ప్రసీదతు. ఆత్మతంత్రః పాపాదిమత్త్వే2పి న తత్పరతంత్రః. కుతః? బ్రహ్మ అప్రచ్యుతరూపః. తత్కుతః? మహతీ విభూతిరైశ్వర్యం యస్య సః. (32)

ఇప్పుడు ప్రకాశించు (వైరాజ) రూపముతో స్తుతించుచు ప్రార్థించుచున్నాడు. పాదములు ఈ భూమి అని పన్నెండు శ్లోకములలో వర్ణించుచున్నాడు. జరాయుజములు (క్షీరదములు), అండజములు, ఉద్భిజములు, స్వేదజములు అనే నాలుగు విధములైన జీవసృష్టి కలిగిన ఈ భూమి ఆ పరాత్పరుని పాదములు. ఆత్మపుత్రుడు అంటే పాదాది అవయవములున్నను వానిపై ఆధారపడక సర్వస్వతంత్రుడైనవాడు, క్షతిలేని బ్రహ్మరూపుడు, అపారమైన ఐశ్వర్యము కలవాడైన ఆ మహాపురుషుడు మమ్ములను దయజూచుగాక. (32)

శ్లో॥ అంభస్తు యత్రేత ఉదార వీర్యం
సిధ్యంతి జీవంత్యుత వర్ధమానః ।
లోకాస్త్రయోథాఖిల లోకపాలాః
ప్రసీదతాం బ్రహ్మ మహావిభూతిః ॥33॥

టీ :- అంభ ఇతి. ఉదారవీర్యం శక్తిర్యస్య తదంభో యస్యరేతః. సనః ప్రసీదతు. ఉదారవీర్యతామాహ యతోంభసోలోకాదయః సిధ్యంతి జాయంతే. (33)

పరమాత్ముని అపారశక్తిమంతమైన రేతస్సే జలము. అట్టి జలమునందే ముల్లోకములు, లోకపాలురు పుట్టి, అభివృద్ధిని పొందుచున్నారు. అట్టి గొప్ప ఐశ్వర్యము కలిగిన ఈశ్వరుడు మమ్ము దయజూచుగాక. (33)

శ్లో॥ సోమోమనోయస్య సమామనంతి
దివౌకసాం వై బలమంధ ఆయుః ।
ఈశో నగానాం ప్రజనః ప్రజానాం
ప్రసీదతాం నః స మహావిభూతిః ॥34॥

టీ :- సోమ ఇతి. యః సోమః దేవానాం అంధః అన్నం. అత ఏవ. బలమా యుశ్చ నగానాం వృక్షాణాం. ప్రకర్షేణ జనయతి వర్ధయతీతి ప్రజనః తం. యస్య మనః సమామనంతి. స ప్రసీదతు. (34)

దేవతలకు బలము, ఆయుస్సులను ప్రసాదించే ఆహార రూపమైన చంద్రుడు పరమాత్మకు మనస్సు ( అమృతమయమైన చంద్రుని కళలు దేవతలకు ఆహారము. "ప్రథమాం పిబతే వహ్నిం, ద్వితీయం ఛండభాస్కరః"- అంటూ ప్రసిద్ధము) . వృక్షములను, జీవరాశిని సృష్టించి వృద్ధిపొందించు అపార ఐశ్వర్యవంతుడైన ఈశ్వరుడు మమ్ము అనుగ్రహించుగాక. (34)

శ్లో॥ అగ్నిర్ముఖం యస్యతు జాతవేదాః
జాతః క్రియాకాండ నిమిత్తజన్మా ।
అంతః సముద్రేనుపచన్ స్వధాతూన్
ప్రసీదతాం నః స మహావిభూతిః ॥35॥

టీ :- అగ్నిరితి. అగ్నిర్యస్య తు ముఖం జాతః. కథంభూతః. జాతం వేదో ధనం యస్మాత్. క్రియాకాండం తత్ప్రతిపాద్యం కర్మ తన్నిమిత్తం జన్మ యస్య. అంతః సముద్రే ఉదరమధ్యే స్వధాతతా. పాకార్హానే వాన్నాదీ. ప్రసిద్ధసముద్రేసి బడబానలరూపేణ ఉదరాన్యేవాను పచన్నగ్నిః. (35)

పరమాత్మకు అగ్ని ముఖము. వేదమనే అపారమైన సంపద పుట్టుకకు కారణమైనవాడు. యజ్ఞ యాగాదులు, అవి ప్రతిపాదించే కర్మలకై ఉద్భవించినవాడు, సముద్రమధ్యమందు అంటే జీవుల ఉదరమందు అన్నము మొదలైన పాకార్హమైన ఆహారపదార్థములను పచనము చేయువాడు. (అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః । ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥) ప్రసిద్ధమై సముద్రమునందు బడబాగ్ని రూపముతో జలాదులను పచనము చేయువాడునైన పరమేశ్వరుడు మమ్మనుగ్రహించుగాక. (35)

శ్లో॥ యచ్చక్షురాసీత్తరణిర్దేవయానం
త్రయీమయో బ్రాహ్మణ ఏవ ధిష్ణ్యమ్ ।
ద్వారంచ ముక్తే రమృతంచ మృత్యుః
ప్రసీదతాం నః స మహావిభూతిః ॥36॥

టీ :– యదితి. ఏష తరణిర్యస్య చక్షురాసీత్,కథంభూతః. దేవయానం అర్చిరాదిమార్గదేవ తా. త్రయీమయః.శ్రు. సైషా త్రయ్యేవవిద్యాతపతీ తిశ్రుతేః. బ్రహ్మణోధిష్ణ్యదఉసాసనా స్థానం. శ్రు. య ఏషోంతరా దిత్యేహిరణ్మయః పురుష ఇతి శ్రుతేః.ముక్తేర్ద్వారం దేవయానత్. అమృతం చ పుణ్యలోకత్వాత్. మృత్యుశ్చ కాలాత్మకత్వాత్. ఏవంభూతః తరణిర్యస్య. (36)

దేవతలకు అర్చిరాది మార్గమైన దేవయానరూపుడు, వేదస్వరూపుడు– 'సైషాత్రయ్యేవ విద్యాతపతి ' – మూడు విద్యలను ప్రకాశింపజేయువాడు– అని శ్రుతి. బ్రాహ్మణులకు (జ్ఞానకాంక్షులకు), ఉపాసనస్థానమైనవాడు, "య ఏష అంతరాదిత్యే హిరణ్మయః పురుషః " సూర్యమండలాంతర్గతుడైనవాడు పరమాత్మ– అని శ్రుతి. (ధ్యేయస్సవితృమండల మధ్యవర్తీ నారాయణః) దేవయానత్వమువలన ముక్తికి ద్వారమైనవాడు, పుణ్యలోకత్వము వలన అమృతుడు, కాలాత్మకత్వముచేత మృత్యువైనవాడు అయిన సూర్యుడు పరమాత్మకు కన్ను. అట్టి భగవంతుడు మమ్ము దయజూచుగాక. (36)

శ్లో॥ ప్రాణాదభూద్యస్య చరాచరాణాం
ప్రాణః సహో బలమోజశ్చ వాయుః ।
అన్వాస్మ సమ్రాజమివానుగా వయం
ప్రసీదతాం నః స మహావిభూతిః ॥37॥

టీ :–ప్రాణాదితి. కథంభూతో వాయుః. చరాచరాణాం సహ ఆదిధర్మ వాన్ప్రాణః. యః ణం. వయం బుద్ధ్యాద్యధిష్ఠాతారో

చరాచరములయొక్క ప్రాణము, బలము, జీవశక్తి మొదలైన ధర్మములు కలవాడు, మేము ( బ్రహ్మ ) బుద్ధి, మనస్సు మొదలగు వానికి అధిపతులమైన దేవతలము ఈ వాయుదేవుని సమ్రాట్టుగా చేసికొని అనుసరించుచున్నాము. అట్టి వాయువు పరమాత్మ ప్రాణమునుండి పుట్టినాడు. అటువంటి పరమేశ్వరుని శరణు పొందుచున్నాము. (37)

దేవాః. సమ్రాజం భృత్యా ఇవ. అన్వాస్మ అనుసృత్య స్థితాః. ంభూతో వాయుర్యస్య ప్రాణాదభూత్సః. (37)

శ్లో॥ శ్రోత్రాద్దిశో యస్య హృదశ్చ ఖాని
ప్రజజ్ఞిరే ఖం పురుషస్య నాభ్యాః ।
ప్రాణేంద్రియాత్మా సుశరీర కేతనం
ప్రసీదతాం నః స మహావిభూతిః ॥38

టీ :- శ్రోత్రాదితి. ఖాని దేహగతాని ఛిద్రాణి. ప్రాణః దవృత్తిః ఇంద్రియాణి చ ఆత్మా మనశ్చ. అసవో నాగకూర్మాదయః. శరీరం చ తేషాం కేతనం యభూతం. ఖం యస్య పురుషస్య నాభ్యాః ప్రజజ్ఞేసః. (38)

పరమపురుషుని చెవినుండి దిక్కులు, హృదయమునుండి శరీరమున నున్న రంధ్రములు ( ఇంద్రియములు), ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనే పంచ వృత్తులతో కూడిన ప్రాణము, చర్మము, నేత్రము, ముక్కు, చెవి, నాలుక అనే ఐదు జ్ఞానేద్రింయములు, మనస్సు (ఆత్మ), నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనుంజయము అనే ఐదు అంశములు, ఉపవాయువులు, శరీరము మొదలైన వాటన్నిటికి ఆశ్రయభూతమైన ఆకాశము ఆ పరమ పురుషుని నాభినుండి పుట్టినవి. అట్టి ఈశ్వరుడు మాకు దిక్కు . (38)

శ్లో॥ బలాన్మహేంద్రస్త్రిదశాః ప్రసాదాత్
మన్యోర్గిరీశో ధిషణాద్విరించిః ।
ఖేభ్యశ్చ ఛందాం స్యృషయో మేఢ్రతః కః
ప్రసీదతాం నః స మహావిభూతిః ॥39॥

టీ :- బలాదితి. యస్య బలాత్ హీంద్రో జజ్ఞే ఛందాసి ఋషయశ్చ ఖేభ్యః కః ప్రజాపతిః (39)

పరమపురుషుని బలము వలన ఇంద్రుడు, ప్రసాదమున దేవతలు, కోపమున రుద్రుడు, ప్రజ్ఞచేత బ్రహ్మ, ఇంద్రియము వలన వేదములు, మునులు, మేఢ్రమున ప్రజాపతి ( జన్మించినాడని ముందరి శ్లోకముతో అన్వయము) అట్టి ఈశ్వరుడు మాకు ప్రసన్నుడగుగాక. (39)

శ్లో॥ శ్రీర్వక్షసః పితరశ్ఛాయయాఽఽసన్ధర్మః
స్తనాదితరః ఖేహ్యాశ్చ పృష్ఠతోఽభూత్ ।
ద్యౌర్యస్య శీర్ష్ణోఽప్సరసో విహారాత్
ప్రసీదతాం నః సమహావిభూతిః ॥40॥

పరాత్పరుని వక్షస్థలమునుండి లక్ష్మీదేవి, నీడనుండి పితృదేవతలు, స్తనములనుండి ధర్మము, ఇతరమైన అధర్మము వీపునుండి, శిరస్సునుండి నాకము, విహారమునుండి అప్సరసలు పుట్టినారు. అట్టి విభుడు మమ్మనుగ్రహించుగాక. (40)

టీ :-శ్రీరితి ఇతరః అధమః ॥40॥

శ్లో॥ విప్రోముఖం బ్రహ్మచ యస్య గుహ్యం
రాజన్య ఆసీద్భుజయోర్బలంచ ।
ఊర్వోర్విడౌజోఽంఘ్రి రవేద శూద్రా
ప్రసీదతాం నః సమహావిభూతిః ॥41॥

పరాత్పరుని ముఖము నుండి బ్రాహ్మణులు, గోప్యాంగమునుండి బ్రహ్మ, భుజములనుండి క్షత్రియులు (బలము), తొడలనుండి వైశ్యులు (నైపుణ్యము), పాదములనుండి శూద్రులు (ఆవేశము)-(వేదవ్యతిరిక్తమైన శుశ్రూష అనే వృత్తిగలవారు) జన్మించిరి. అట్టి ఈశ్వరుడు మమ్ము కృప జూచుగాక. (41)

టీ :-శ్రీ ఇతి. విట్ వైశ్యః. ఓజః నైపుణ్యం తస్య వృత్తిశ్చ. అంఘ్రిః. అంఘ్రిజావిత్యర్థః అవేదశూద్రౌ వేదః వేదవ్యతిరిక్తా శుశ్రూషావృత్తిః తద్వృత్తిమాన్ శూద్రశ్చ. విడంఘ్రేరభవంశ్చ శూద్రా ఇతి పాఠాంతరం సుగమం. (41)

శ్లో॥ లోభోఽధరాత్ప్రీతిరుపర్యభూత్
ద్యుతిర్నస్తః పశవ్యః స్పర్శేన కామః ।
భృవోర్యమః పక్ష్మ భవస్తు కాలః
ప్రసీదతాం నః సమహావిభూతిః ॥42॥

ఈశ్వరుని క్రింది పెదవి వలన లోభము, పై పెదవి వలన ప్రీతి, ముక్కుపుటము వలన ద్యుతి, పశువులకు (జీవము) స్పర్శ వలన ఇష్టమైన కామము, కనుబొమల వలన యముడు, రెప్పల వలన కాలము ఉద్భవించినవి. అట్టి విభుడు మమ్మనుగ్రహించుగాక. (42)

టీ :-లోభ ఇతి. ఉపరి ఉత్తరోష్ఠాత్. నస్తః నాసికాతః ద్యుతి. కాంతిః పశ పశూనాం హితః. కామః స్పర్శేనాభూత్.॥42॥

శ్లో॥ ద్రవ్యం వయః కర్మగుణాన్విశేషం
యద్యోగమాయా విహితాన్వదంతి ।
యద్దుర్విభావ్యం ప్రబుధాపబాధం
ప్రసీదతాం నః సమహావిభూతిః ॥43॥

టీ :-ద్రవ్యమితి. ద్రవ్యం భూతాని. వయః కాలః షం భౌతిక ప్రపంచః యద్యస్మాత్. దుర్విభావ్యం కుతః ప్రబుదావబాధం విద్వద్భిరపోహ్య మానంతాంతరే ప్రబుధానాం మాయేత్యవబోధో యస్మిన్నిత్యర్థః. (43)

పంచభూతములు, ద్రవ్యము, కాలము, వయస్సు, కర్మగుణములు, విశేషము ( భౌతిక ప్రపంచము ) అనేవన్నియు పరమాత్మని యోగమాయచేత నిర్మితమైనవి. ఈ మాయ మహాపండితులు కూడా తెలియలేనిది. ఊహించలేనిది. గొప్ప పండితులుకూడా ఇది సృష్టిమాయ అని తెలియక సత్యమైనదని అపోహపడతారు. మాయ ఇట్టిదని విద్వాంసులు కూడా గ్రహింలేరు. అట్టి విభుడు మమ్మనుగ్రహిచుగాక.(43)

శ్లో॥ నమో తస్మా ఉపశాంత శక్తయే
స్వారాజ్యలాభ ప్రతి పూరితాత్మనే ।
గుణేశు మాయా రచితేషు వృత్తిభిః
న సంజమానాయ నభస్వ దూతయే ॥44॥

టీ :-తదేవం ప్రపంచముపవర్ణ్య త్ప్రపంచముపవర్ణయన్ ప్రణమితి.

ఈ విధముగా దృశ్యము వివరించి, పరోక్షమైన పరమాత్మ తత్త్వమును వర్ణించుచు నమస్కరించుచున్నాడు. నిర్వికల్పుడు, నిర్వికారుడు (ఉపశాంత శక్తి), సర్వాధిష్ఠాన బ్రహ్మత్వముతో నిడినవాడు (అద్వితీయ సర్వసుఖ ఘనానంత చిన్మాత్రరూప బ్రహ్మత్వము), మాయచేత కల్పింపబడిన గుణముల యొక్క వృత్తులకు అందనివాడు (అవాఙ్మానసగోచరుడు), వాయువులీలవంటి (స్పర్శ వుంటుంది కాని కంటికి కనిపించదు) లీలా విలాసుడు (పరమాత్మ

నమ ఇతి. వృత్తిభిర్దర్శనాదిభిః. నభస్వాన్వాయుః తస్యేవ లీలా యస్య తస్మై. (44)

పరోక్షుడుగాని అతని కార్యములు ప్రత్యక్షములే) ఐన ఆ పరమాత్మకు నమస్కారములు. (44)

శ్లో॥ సత్వం నో దర్శయాత్మాన మస్మత్కరణ గోచరమ్ ।
ప్రపన్నానాం దిదృక్షూణాం సస్మితం తే ముఖాంబుజమ్॥45॥

టీ :-స ఇతి. తేన స్మితం ముఖాంబుజం. దిదృక్షూణాం నః. అస్మచ్చక్షు రాదికరణగోచరం యథా భవత్యేవం చాత్మానం దర్శయ. (45)

ఓ పరమాత్మా ! ఆపదపొంది దర్శించవచ్చిన వారమైన మా ఈ నేత్రములకు కనిపించునట్లు చిఱునవ్వుతో కూడిన నీ ముఖారవిందముతో నీ స్వరూపమును దర్శింపజేయుము. మాకు ప్రత్యక్షమగుమని బ్రహ్మదేవుడు ప్రార్థించినాడు. (45)

శ్లో॥ తైస్తైః స్వేచ్ఛా ధృతైః రూపైః కాలే కాలే స్వయంవిభో!।
కర్మ దుర్విషహం యన్నో భగవాం స్తత్కరోతిహి ॥46॥

టీ :-భక్తేచ్ఛానువర్తిత్వం చ. తవ బహుశోదృష్టమేవేత్యాహ తైస్తైరితి. యన్నో దుర్విషహమశక్యం కర్మ తద్భవాన్ స్వయమేవ కరోతి హి. (46)

ఓ పరమేశా ! భగవంతుడా ! ఆయాకాలములందు ఆయా అవసరములకు తగిన ఆయా స్వేచ్ఛారూపములతో మేము భరించలేని కర్మఫలమైన కష్టములను నివారించుచూ భక్తులమైన మా యిష్టములను నెరవేర్చుచునే వున్నావు. (46)

శ్లో॥ క్లేశ భూర్యల్ప సారాణి కర్మాణి విఫలానివా ।
దేహినాం విషయార్థానాం న తథైవార్పితం త్వయి॥47॥

క్లేశమును కలిగించునవి, సారము లేనివి, ఫలరహితము లేనివి అయిన కామ్యకర్మములను చేయువారు బహిర్ముఖులు. అట్టివారి నిష్ఫలములైన కర్మలవలెగాక నీ భక్తులమైన మేము మా పూర్వపుణ్యములను నీకే అర్పించితిమి.

టీ :-న చ బహిర్ముఖానామివ త్వద్భక్తానాం, అస్మాకం. త్వయ్యర్పితాని పూర్వపుణ్యాని విపరీతఫలాని భవితుమర్హం తీత్యాహ క్లేశేతి. క్లేశో భూరిర్యేషు అల్పం సారం ఫలం యేషు. యద్వా విఫలాన్యేవ సకామానాం కర్మాణి. త్వయ్యర్పితంతునైవ తథా. (47)

నీకు నివేదించిన మా సంచితపుణ్యములు వ్యతిరేక ఫలములను (కష్టములను) ఎట్లు కలిగించును. (47)

శ్లో॥ నావమః కర్మకల్పోపి విఫలాయేశ్వరార్పితః ।
కల్పతే పురుషస్యైష సహ్యాత్మా దయితో హితః ॥48॥

టీ :-తత్రావైఫల్యముపపాదయతి నేతి. అవమః అల్పోపి. కర్మకల్పః కర్మాభాసః ఈశ్వరార్పిత శ్చేద్విఫలాయ శ్రమాయ న కల్పతే.హి యస్మాత్స ఏష ఈశ్వరః. పురుషస్యాత్మా, అతఏవ దయితోహితశ్చ. న హ్యాత్మని దయితే హితే చార్పితం నిష్ఫలం స్యాత్. (48)

ఈశ్వరార్పితమైన కర్మ నిష్ఫలము కాదను విషయమును యుక్తితో సమర్థించుచున్నాడు. అల్పమైన కర్మలాంటిదైనను ( కర్మాభాసము ) ఈశ్వరునికి సమర్పించి చేయబడినచో ఫలరహితమైన శ్రమగా మిగలదు. అంటే భగవంతునికి నివేదించిన ప్రతి చిన్నపని సత్ఫలితమును ప్రసాదించునని భావము. ఎందుకంటే పురుషుని ( జీవుని ) ఆత్మ ఈశ్వరుడే. అందువల్లనే ఇష్టుడు, హితుడు. ఆత్మకు ఇష్టమై హితముగా అర్పితమైనది విఫలము కాదని సమర్థించినాడు. (48)

శ్లో॥ యథాహి స్కంధ శాఖానాం తరోర్మూలావసేచనమ్ ।
ఏవమారాధనం విష్ణోః సర్వేషా మాత్మనశ్చహి ॥49॥

అనంత ఫలత్వమును చెప్పుచున్నాడు– వృక్షముల పాదులందు నీరుపోసి మూలమును తడిపినచో బోదె, కొమ్మలు మొదలైన భాగములన్నింటికి అంటే ఆమూలాగ్రముగా చల్లదనము కలుగునో అట్లే విష్ణువును ఒక్కడిని ఆరాధించినచో సర్వాత్మలకు, దేవతా సముదాయమునకు తృప్తి కలుగును. (49)

టీ :–అనంతఫలత్వమాహ యథేతి. యథాహి మూలావ సేచనం స్కంధానాం శాఖానాం భవతి. (49)

శ్లో॥ నమస్తుభ్యమనంతాయ దుర్వి తర్క్యాత్మ కర్మణే ।
నిర్గుణాయ గుణేశాయ సత్వస్థాయచ సాంప్రతమ్॥50॥

టీ :–ఏవం సత్యపి త్వదర్పితకర్మణాం త్వద్భక్తానామస్మాకం యన్ని మిత్తమిదం దు:ఖమితి తత్త్వమేవ వేత్సీత్యాశయేనాహ నమ ఇతి.దు ద్వితర్క్యాణ్యాకర్మాణి స్వభావచేష్టితాని యస్య తస్మై. (50)

ఓ పరమాత్మా ! ఇదంతయు సత్యమైనను భగవంతుడవైన నీకే నివేదించి సర్వ కర్మలను ఆచరించిన నీ భక్తులమైన మా వంటివారికి ఈ విధముగా దుఃఖము ఎందుకు కలుగుచున్నదో మీకే తెలియునని చెప్పుచున్నాడు. దేశకాల పరిచ్ఛేద రహితుడు, త్రిగుణాతీతుడు, సత్వము, రజస్సు, తమములనే గుణములు మూడై వుండగా రజస్తమో దూరమైన సత్వమును మాత్రమే స్వీకరించి (శుద్ధ సత్వుడు ) స్థిరముగా ఉన్నవాడవైన ఓ పరమేశా ! నీకు నమస్కారములు అర్పించుచున్నాము. (50)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
అమృతమథనే, పంచమోధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే అమృతమథనము అను
పంచమాధ్యాయము ఆంధ్రానువాదము.

## శ్రీ గణేశాయ నమః
## శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ షష్ఠే స్తుతిర్విష్ణోవావిర్భూతే సురైః కృతా ।
తన్మంత్రాచ్చాసురైః సాకమమృతార్థే మహోద్యమః॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం స్తుతః సురగణైర్భగవాన్ హరీశ్వరః ।
తేషామావిరభూద్రాజన్! సహస్రార్కోదయద్యుతిః ॥1॥

టీ :-షష్ఠే పునః స్తుతిర్విష్ణోవావిర్భూతే సురైః కృతా, తన్మంత్రాచ్చా సురైస్సాకమమృతార్థం మహోద్యమః. ఏవమితి. సహస్రార్కాణా ముదయే ద్యుతిరివ ద్యుతిర్యస్య. (1)

శ్లో॥ తేనైవ మహసా సర్వదేవాః ప్రతి హతేక్షణాః ।
నా పశ్యన్ ఖందిశః క్షోణీమాత్మానం చ కుతో విభుమ్॥2॥

టీ :-తేనేతి. మహసా తేజసా. ప్రతిహతానీక్షణాని చక్షూంషి యేషాం. (2)

## శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ
## భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

ఆరవ అధ్యాయమున మరల దేవతలు విష్ణువును స్తుతించుట, వారి ఆలోచనచేత రాక్షసులతో కలిసి అమృతము కొఱకు గొప్ప ప్రయత్నమును చేయుట- విషయము.

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

ఓ రాజా ! ఈ విధముగా దేవతాసముదాయము స్తుతించుచుండగా భగవంతుడు, ఈశ్వరుడైన శ్రీహరి వేయి ఉదయ సూర్యబింబముల తేజముతో వారిముందు సాక్షత్కరించినాడు. (1)

కన్నులకు మిరుమిట్లుగొలుపు ఆ అద్భుతమైన వైష్ణవ తేజమును దర్శించలేక కన్నులు మూసికొనిపోయినవి. వారు భూమినికాని, దిక్కులనుకానీ, ఆకాశమునుకానీ, ఆఖరుకు తమను తాముకానీ చూడలేకపోయిరి. ఇక వారికి పరాత్పరుడెట్లు కనిపించును?. (2)

శ్లో॥ విరించో భగవాన్ దృష్ట్వా సహ శర్వేణ తాం తనుమ్ ।
స్వచ్ఛాం మరకత శ్యామాం కంజగర్భారురేక్షణామ్॥3॥

టీ :–విరించ ఇతి. తామావిర్భూతాంతనుం విరించో దృష్ట్వా తుష్టా వేతి పంచమేనాన్వయః. కంజగర్భవదరుణే ఈక్షణే యస్యాః (3)

అప్పుడు ఈశ్వరుడు, బ్రహ్మ నిర్మలమై, గరుడ పచ్చలవలె శ్యామలమై, కుంజ గర్భమువలె ఎఱ్ఱనైన కన్నులు గలది అయిన ఆ భగవానుని శరీరమును చూచి సంతోషించిరని (ఐదవ శ్లోకముతో అన్వయము). (3)

శ్లో॥ తప్తహేమావదాతేన లసత్కౌశేయ వాససా ।
ప్రసన్న చారు సర్వాంగీం సుముఖీం సుందర భ్రువమ్॥4

టీ :–తప్తేతి. తప్తహేమవ దవదా తేన పీతేన. లసత్కౌశేయ వాససా యుక్తాం. ప్రసన్నాని చారూణి సర్వాణ్యంగాని యస్యాః ముఖం యస్యాః సుందరే భ్రువౌ యస్యాః. (4)

అగ్ని పరితప్తమైన బంగారమువలె స్వచ్ఛమై, పచ్చని రంగుతో ప్రకాశించు పీతాంబరముతో, ప్రసన్నమైన మనోహరమైన సర్వావయవములతో, మంగళకరమైన ముఖముతో, అందమైన కనుబొమలతో (ఒప్పు భగవంతుని శరీరమును చూచి సంతసించిరని తర్వాతి శ్లోకముతో అన్వయము) . (4)

శ్లో॥ మహామణి కిరేటేన కేయూరాభ్యాం చ భూషితామ్ ।
కర్ణాభరణ నిర్భాత కపోల శ్రీముఖాంబుజామ్ ॥5॥

టీ :–మహామణీతి. మహాంతో మణయో (5)

గొప్ప మణులు పొదిగిన కిరీటము, భుజకీర్తులతో అలంకృతమై, చెవులకున్న మణికుండలములచేత విశేషముగా ప్రకాశించు చెక్కిళ్ళ శోభతో ఉన్న ముఖపద్మముతో ఉన్న ( పరమేశ్వరుని శరీరమును చూచి ఆనందించిరని తర్వాతి శ్లోకముతో అన్వయము). (5)

శ్లో॥ కాంచీ కలాప వలయ హార నూపుర శోభితామ్ ।
కౌస్తుభా భరణాం లక్ష్మీం బిభ్రతీం వనమాలినీమ్॥6॥

టీ :-తేన కిరీటేన. కర్ణాభరణే కుండలే. తాభ్యాం నిర్భాతౌ యౌ కపోలౌ తాభ్యాం. శ్రీర్ముఖాం యస్యాః. (6)

బంగారు ఆభరణములైన కంకణములు, హారములు అందెలతో మనోహరమై, కంఠమున తులసీమాలను, కౌస్తుభమణిగల, వనమాలగల వక్షస్థలమున శ్రీ మహాలక్ష్మిని ధరించిన (మూర్తిని చూచి తృప్తిపడిరి) (6)

శ్లో॥ సుదర్శనాదిభిః స్వాస్త్రైర్మూర్తిమద్భిరుపాసితమ్ ।
తుష్టావదేవ ప్రవరః సశర్వః పురుషః పరమ్
సర్వామరగణైః సాకం సర్వాంగైరవనిం గతైః ॥7॥

టీ :-కాంచీతి. కౌస్తుభాభరణం కంఠే యస్యాః.లక్ష్మీం వక్షసి బిభ్రతీం. (7)

రూపమును ధరించిన, సుదర్శనము మొదలైన ఐదు ఆయుధములు సేవించునట్టి పరమాత్ముని శరీరమును చూచి బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైన వారు సమస్త దేవగణములతో తమ తమ అవయవములన్నియు భూమిని తగులునట్లుగా ప్రణమిల్లి నమస్కరించిరి. (7)

బ్రహ్మోవాచ :-

శ్లో॥ అజాత జన్మస్థితి సంయమాయా
గుణాయ నిర్వాణ సుఖార్ణవాయ ।
అణోరణిమ్నే పరిగణ్యధామ్నే
మహానుభావాయ నమో నమస్తే ॥8॥

**బ్రహ్మ ఈ విధముగా స్తుతించినాడు :-**

పరమాత్ముని సాకారమైన శరీరము యొక్క నిత్యత్వమును, అన్నింటినీ అతిశయించునట్టి ప్రాభవమును చెప్పుచు సృష్టి, స్థితి, లయము మొదలైనవి లేనివాడు. సత్వము, రజస్సు, తమములనే గుణములు లేని నిర్గుణ సుఖ సముద్రరూపుడైన, (నిత్యానంద రసాలయుడు), అపారమైన మోక్ష సుఖ స్వరూపుడు ఐనప్పటికి గణించవీలులేని తత్త్వము గల అణువుకన్ననూ మిక్కిలి సూక్ష్మతగల

టీ :–సుదర్శనేతి. శ్రీవరో బ్రహ్మే. సర్వాంగైరవనీం గతైః సాష్టాంగ ప్రణతైః శ్లో. 'అనావిరాసేయం తాభూదితి స్తువన్, బ్రహ్మేభిప్రైతి సత్య త్వవిభుత్వే భగవత్తనోః శ్రీధరీయోఽయం శ్లోకః. శ్రీమూరేరయ మావిర్భావ ఏవ న త్వస్మదాదివజ్జన్మాది తవాస్తీత్యాహ అజాతేతి. న జాతాదయో యస్య. కుతః. అగుణాయ అతః. నిర్వాణ సుఖస్యార్ణవాయ. అపారమోక్షసుఖ పాయోత్యర్థః. తథాపి. అణోరప్యణిమ్నే అతిసూక్ష్మాయ. దుర్జ్ఞానత్వాత్. వస్తుతస్తు. అపరిగణ్యంత్రాతీతం. ధామ మూర్త్తిర్యస్య తస్మై. నచై తదసంభావితం. యతః. మహాన చింత్యోఽనుభావోర్య. (8)

( అణీయుడు), వస్తువుగా లెక్కించుటకు వీలులేని అంటే ఇంత అని తెలుపుటకు సాధ్యముకాని (ఇయత్త ) మూర్తి కలవాడు, ఇది ఇట్టిదని విచారింప వీలులేని గొప్ప అనుభవము కలవాడైన పరమేశ్వరునికి నమస్కారము. (8)

శ్లో॥ రూపం తవై తత్పురుషర్ష భేజ్యం
శ్రేయోర్థిభిర్వైదిక తాంత్రికేణ ।
యోగేన ధాతః సహ న స్త్రిలోకాన్
పశ్యామ్యముష్మిన్ను హ విశ్వమూర్తౌ ॥9॥

టీ :–తన్మూర్తేః సనాతనత్వమపరి మేయత్వం చోపపాదయతి. రూపమితి హే పురుషర్షభ పురుషోత్తను. హే దాతః. ఏతత్తవ రూపం. వైదికేన తాంత్రికేణ. చ. యోగేన ఉపాయేన యోర్థిభిః. సదా ఇజ్యం పూజ్యం. అతో నేదమిదానీమపూర్వం జాతమితి

భగవంతుని రూపముయొక్క సనాతనత్వమును, తెలియరాని తనమును (అపరిమేయత్వము) ప్రతిపాదించుచున్నాడు. ఓ పరమపురుషా ! ఓ సృష్టికర్తా! ఈ నీరూపము వైదికములు, తాంత్రికములైన అపూర్వవస్తుప్రాప్తి కలిగించే (యోగము) ఉపాయముచేత శ్రేయస్సును కోరువారు ఎల్లప్పుడు పూజింపదగినది. అందు వలననే ఇది ఇప్పటిది కాదు, ఇంతకు ముందునూ లేదని భావము. దేవతలందరు ప్రసిద్ధులైనప్పటికీ అందరునూ ఈ పరమాత్మని రూపమునందే లయమును పొందుదురు. అను విషయమును చెప్పుచున్నాడు. మీ మూర్తియందు సర్వదేవతలమైన మమ్ములను, ముల్లోకములను చూచుచున్నాను గదా! అనే విషయము స్పష్టము. అని ఆశ్చర్యముతో స్పష్ట

భావః. నను. యూయంవాః సదా పూజ్యత్వేన ప్రసిద్ధాః సత్యం. సర్వేఽప్యత్రైవాంతర్భూ తా ఇత్యాహ నుహఅహో టం. అముష్మి త్వయి. నోఽస్మా. త్రిలోకాంశ్చ సహ పశ్యామి. తత్ర హేతుః. త్వం మూర్తౌ యస్య. అతస్తవైతద్రూపం పరిచ్ఛినమపి న భవతీతి భావః. (9)

శ్లో॥ త్వయ్యగ్ర ఆసీత్వయి మధ్య ఆసీత్
త్వయ్యంత ఆసీదిదమాత్మ తంత్రే ।
త్వమాదిరంతో జగతోఽస్యమధ్యం
ఘటస్య మృత్స్నేవ పరః పరస్మాత్ ॥10॥

టీ:- విశ్వమూర్తి మేవాహ త్వయీతి. ఘటస్య మృత్తికా. యథా. ఆదిరం తశ్చ మధ్యం చ. తథా. త్వమస్య తతః. తత్ర హేతుః. పరస్మాత్ప్రధానాదపి పరః. (10)

శ్లో॥ త్వం మాయయాత్మాశ్రయయా స్వయేదం
నిర్మాయ విశ్వం తదను ప్రవిష్టః ।
పశ్యంతి యుక్తా మనసా మనీషిణో
గుణవ్యవాయేప్యగుణం విపశ్చితః ॥11॥

పరిచినాడు. విశ్వరూపుడవైన నీ రూపము పరిచ్ఛిన్నము వలె ఉన్నను అఖండమైనదని భావము. (9)

విశ్వ రూపత్వమునే చెప్పుచున్నాడు. సృష్టికి ముందును, సృష్టియందును, లయము తర్వాతను ఆత్మ వ్యవహారమున (పరమాత్మ చేయు సృష్ట్యాది కార్యరూప విషయమున) విశ్వరూపుడున్నాడు. ఈ జగత్తుయొక్క మొదట, మధ్యభాగము, అంతయు ఘటనిర్మాణమున మన్నువలె (ఉపాదాన కారణమై) జగన్నిర్మాణమున ప్రధానమైన ప్రధానము కంటే (ప్రకృతి కంటే) మీద సర్వశ్రేష్ఠముగా ఉన్నది విశ్వరూపుడే. (10)

మన్ను కుండగా పరిణమించినట్లు భగవంతుడు విశ్వముగా పరిణమించినాడను పరిణామ వాదమును ఖండించుచూ చెప్పుచున్నాడు. భగవంతుడు ఆత్మాశ్రయమైన మాయతో తనే విశ్వమును నిర్మించి (అభిన్ననిమిత్తోపాదాన కారణముగా ) దానియందు అతడే ప్రవేశించినాడు.

టీ :-మృత్తికాదృష్టాంతేన పరిణామప్రాప్తిం రయతి త్వదితి. స్వయా స్వాధీనయా అత ఏవ.గుణానాం వ్యవపాయే పరిణామేஉప్యగుణ వ త్వం.యుక్తాః పశ్యంతి.మనీషిణో వివేకినః శాస్త్రజ్ఞాః. (11)

అందువలన వివేకవంతులు, శాస్త్రవేత్తలు, యోగులైనవారు భగవంతుని సత్వరజస్తమములనే గుణాలకు పరిణామము ( మార్పు ) కలిగినను భగవంతుడు మాత్రము గుణరహితుడుగనే తమ మనస్సుతో దర్శింతురు.(11)

శ్లో॥ యథాగ్ని మేధస్యమృతం చ గోషు
భువ్యన్నమంబూద్యమనే చ వృత్తిమ్ ।
యోగైర్మనుష్యా అధియంతి హి త్వాం
గుణేషు బుద్ధ్యా కవయో వదంతి ॥12॥

టీ :-ఏతదేవ సదృష్టాం తమాహ యథేతి.యథా అగ్నిం.ఏధసి కాష్ఠే.మంథనేన.అమృతమాజ్య గోషు దోహనాదినా. భువి అన్నం వ్రీహ్యాదికర్షణాదినా. అంబుఖననేన ఉద్యమనేన పురుషకారేణ వాణి జ్యాదినా వృత్తిం జీవికాం.యద్వా.అంబు ఉద్యమనేన ఘటీయంత్రా దినోద్ధరణేన.యోగైర్మనుష్యాః అధియంతి ప్రాప్నువంతి.తథా కవయ స్త్వాం బుద్ధ్యా గుణేష్వధియంతి విందంతి చ. ॥12॥

ఈ జగత్తు ఈశ్వరుణి పరిణామము కాదనే విషయమును దృష్టాంతముతో చెప్పుచున్నాడు. కట్టెల రాపిడి వలన అగ్ని, గోవులను పితుకుట వలన (పాలు వేడిచేయుట, తోడు పెట్టుట, చిలుకుట, కాచుట వలన) నెయ్యి, భూమిని దున్ని విత్తనములు వేయుటవలన ధాన్యము, భూమిని త్రవ్వుటవలన జలము, కృషి, గోపాలన, వాణిజ్యము మొదలైన ప్రయత్నములచేత (పురుషకారము చేత) మానవులు బ్రతుకు తెరువును (వృత్తిని) పొందినట్లుగా, లేక జలమును యాంత్రిక సహాయమున (బోరు బావులవలె) పొందినట్లుగా యోగాది ఉపాయముల చేత మానవులు పరమాత్మను పొందుచున్నారు. అట్లే కవులు బుద్ధిచేత సత్వాది గుణములను పొంది పలువిధములుగా వర్ణించుచున్నారు. (12)

శ్లో॥ తం త్వా వయం నాథ సముజ్జిహానం
సరోజనాభాతి చిరేప్సితార్థమ్ ।
దృష్ట్వాగతా నిర్వృతి మద్య సర్వే
గజాదవార్తా ఇవ గాంగ మంభః ॥13॥

ఓ దేవా ! పద్మనాభా ! చిరకాలమునుండి కోరుకున్న కోరికకు అనుగుణముగా యోగము చేతనే పొందగలిగిన నీవు మా కన్నుల యెదుట పొందదగిన, ఇప్పుడు నీదివ్యరూపమును దర్శించిన మేము అరణ్యమున దావాగ్ని పీడితమైన గజము గంగా జలమును పొందినట్లుగా పరిపూర్ణత్వమును పొందితిమి.(13)

టీ :-తమితి. హేనాథసరోజనాభ అతిచిరాదీప్సితమర్థం తం యోగైక ప్రాప్యం. త్వాం సమ్యగుజ్జిహానం. ఆవిర్భవంతం ప్రత్యక్షతో దృష్ట్వా. అద్యవయం నిర్వృతిం గతాః. దవార్తాః దావాగ్నిపీడీతాః ॥13॥

శ్లో॥ స త్వం విధత్స్వాఖిల లోకపాలా
వయం యదర్థాస్తవ పాదమూలమ్ ।
సమాగతాస్తే బహిరంతరాత్మన్
కిం వాస్య విజ్ఞాప్యమశేష సాక్షిణః ॥14॥

నేనేమి చేయవలెనో చెప్పుచున్నట్లైతే ఓ అంతరాత్మా ! నీవు సర్వమును రక్షించి పోషించు చున్నావు. ఈ లోకపాలురు, మేము ఏ కోరికతో నీ పాదములను ఆశ్రయించితివో ఆ విషయమును ప్రత్యేకముగా మీకు ఏమని విన్నవించుకోగలము. సర్వసాక్షివైన నీకు తెలియని బైటి విషయము లేదుకదా ! అంటే మా అభ్యర్థన మీకు ముందే తెలియినని భావము. (14)

టీ :-యద్విధేయం తత్కథ యతేతి చేత్.తత్రాహ. స ఇతి. హే అంతరాత్మన్. అశేషసాక్షిణస్తే. బహిః.కింవాన్యైర్విజ్ఞాప్యమస్తి (14)

శ్లో॥ అహం గిరత్రశ్చ సురాదయో యే
దక్షాదయోఽగ్నేరివ కేతవస్తే ।
కిం వా విదామేశ పృథగ్విభాతా
విధత్స్వ శం నో ద్విజదేవ మంత్రమ్ ॥15॥

టీ:- యూయమేవ కించిత్కురుతేతి చేత్తత్రాహ అహమితి. అగ్నేః కేతవో విస్ఫులింగా ఇవ. తేత్వత్తః. వయం పృథగ్విభావితా స్సంతః. ఆత్మనః శం శ్రేయః కిం వా విద్మః. అతస్త్వమేవ ద్విజానాం దేవానాం చ. మంత్రం విధత్స్వ. ఇదం కురుతే త్యుపాయముపదిశేత్యర్థః. ॥15॥

(మాకు మేలగు కార్యము) ఏది చేయవలెనో మీరే నిర్ణయించి చేయుడు అని చెప్పుచున్నాడు. నేను, ఈశ్వరుడు, లోకపాలురు, ఈ దేవతలు అగ్నియొక్క విస్ఫులింగమువలె నీకంటే వేరుగా ప్రకాశించుచున్నను మాకు కావలసిన శుభము మాకు తెలియదు. అందువలన దేవతలకు బ్రాహ్మణులకు వలయు శుభము నీవే కలిగించుము. మేము చేయవలసిన పనిని ఉపదేశించుము.(15)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం విరించ్యాది భిరీడితస్త
ద్విజ్ఞాయ తేషాం హృదయం తథైవ ।
జగాద జీమూత గభీరయా గిరా
బద్ధాంజలీన్సంవృత సర్వకారకాన్॥16॥

టీ :-ఏవమితి.హృదయం. మంత్ర ఉపదేష్టవ్య ఇత్యభిప్రేతం. యథా తథైవ విజ్ఞాయ. జగాద. సంవృతాని నియమితాని సర్వాణి కారకాణి కరణానీంద్రియాణి యైస్తా . (16)

**శుక మహర్షి ఈ విధముగా చెప్పినాడు :-**

మా కర్తవ్యమును నిర్దేశించవలసినదన్న వారి కోరికను తెలిసి చెప్పుచున్నాడు. తమకు ఆలోచనను కలిగించునట్టి జ్ఞానకారణములైన సర్వేంద్రియములు నిర్వీర్యములైనందున తనను శరణుపొంది నమస్కరించి దరిజేరిన బ్రహ్మాదుల హృదయమును గ్రహించి మేఘ గంభీర వచనములతో ఈ విధముగా పలికినాడు. (16)

శ్లో॥ ఏక ఏవేశ్వరస్తస్మిన్ సురకార్యే సురేశ్వరః ।
విహర్తుకామ స్తానాహ సముద్రోన్మథనాదిభిః ॥17॥

టీ :–ఈశ్వరస్యాపి తథైవాభి ప్రేతమిత్యాహ. ఏక ఇతి. ఏకవేశ్వరః సమర్థోఽపి. ॥17॥

ఆ సురేశ్వరుడు ఆ దేవతల కోరిక తీర్చుటకు తానొక్కడే సర్వసమర్థుడై వుండియు విలాసముగా సముద్రమథనము మొదలైన కార్యములలో ఆ దేవతలతో కలిసి విహరించుటకు కోరిక కలవాడై ఇట్లు చెప్పినాడు. (17)

**శ్రీ భగవానువాచ :–**

శ్లో॥ హంత బ్రహ్మన్ అహో శంభో
హే దేవా మమ భాషితమ్ ।
శృణుతా వహితాః సర్వే
శ్రేయో వః స్యాన్యథా సురాః ॥18॥

టీ :–హంతేతి. హే సురాః దేవాః. అన్యే చ గంధర్వాదయః॥18॥

**భగవానుడు ఈ విధముగా చెప్పినాడు :–**

ఓ బ్రహ్మా ! ఓ ఈశ్వరా ! ఓ దేవతలారా ! ఇతరులైన ఓ గంధర్వులారా! నేను చెప్పునట్టి విషయమును శ్రద్ధగా వినండి. దీని వలన మీకెల్లరకు శ్రేయస్సు కలుగును. (18)

శ్లో॥ యాత దానవ దైతేయై స్తావత్సంధిర్విధీయతామ్ ।
కాలేనాను గృహీతైస్తైః యావద్వో భవ ఆత్మనః ॥19॥

టీ :–యాతేతి. వః ఆత్మనః.స్వతో యావద్భవో వృద్ధిర్భవతి (19)

మీరిప్పుడు వెళ్ళి దైత్యులు, దానవులతో సంధిని చేసికొనుడు. మీకు బలము సిద్ధించి మరల అనుకూలమైన కాలము వచ్చు వరకు వేచియుండుడు. ఇప్పుడు మీరు రాక్షసులతో యుద్ధమును పరిహరించుటే శ్రేయస్కరము.(19)

శ్లో॥ అరయోఽపి సంధేయాః సతి కార్యార్థ గౌరవే ।
అహిమూషక వద్దేవా హ్యర్థస్య పదవీం గతైః ॥20॥

టీ :-అరయ ఇతి. అర్థస్యప్రయోజనస్య. పదవీం ః సిద్ధిం.ప్రాప్తైః పశ్చాత్. అహిమూషకవద్వధ్యఘాతుకభావేన పర్తితవ్యమితి శేషః.యద్వా. పేటికాయం నిరుద్ధః అహిః.యథా నిర్గమద్వార విధానార్థం. ప్రథమం మూషకేణ సంధిం ధత్తే.పశ్చాత్తమేవ కదాచి ద్భక్షయతి. తథార్థమార్గప్రవృత్తైః ప్రథమం సంధేయా ఇత్యర్థః.(20)

అవసరమైన కార్యమున్నప్పుడు ప్రయోజనమును సిద్ధింప జేసుకొనుటకై శత్రువులతోనైనను సంధి జేసికొనవలెను. ఆ తర్వాత అనుకూల సమయము వచ్చినపుడు పాము- ఎలుకవలె అంటే ఎలుకను చంపి తినుటకై పాము ఒదిగి దాగి యున్న విధముగా వధ్య ఘాతుక భావమున వర్తించవచ్చును. లేదా పెట్టెలో చిక్కుకొని పోయిన సర్పము మొదట బైటకు వచ్చు మార్గము కొరకు ఎలుకతో సంధి చేసుకుని పిమ్మట ఎలుక చేసిన రంధ్రమునుండి బైటకు వచ్చుచు, ఆ ఎలుకనే భక్షించిన విధముగా తమ కార్యమును నెరవేర్చుకొనుటకై ముందుగా రాక్షసులతో సంధి చేయవలెనని చెప్పినాడు.(20

శ్లో॥ అమృతోత్పాదనే యత్నః క్రియతామవిలంబితమ్ ।
యస్యపీతస్యవై జంతుః మృత్యుగ్రస్తోఽమరోభవేత్॥21॥

టీ:- తతస్తైస్సహ యత్కార్యం తదాహ. అమృతేతి. యస్య అమృతస్య పీతస్య సతః ॥21॥

ఆ రాక్షసులతో కలిసి చేయవలసిన పనిని ఇప్పుడు వివరించుచున్నాడు. అమృతమును పుట్టించు ప్రయత్నమును ఆలసించక చేయుడు. అమృతపానము చేసినచో మరణించెడి జీవి కూడా మృత్యువు లేనిదగును. (21)

శ్లో॥ క్షిప్త్వా క్షీరోదధౌ సర్వావీరుత్తృణ లతౌషధీః ।
మంథానం మందరం కృత్వా నేత్రం కృత్వాతు వాసుకిం॥22॥

టీ :-క్షిప్త్వేతి. నేత్రం రజ్జుం. ॥22॥

పాలసముద్రమున సమస్తమైన తృణములు, లతలు, ఔషధములు వేసి మందర పర్వతమును కవ్వముగను, సర్పరాజైన వాసుకిని కవ్వపు త్రాడుగను చేసి (మథించవలెనని తర్వాతి శ్లోకముతో అన్వయము) . (22)

శ్లో॥ సహాయేన మయా దేవా నిర్మంథధ్వ మతంద్రితాః ।
క్లేషభాజో భవిష్యంతి దైత్యా యూయం ఫలగ్రహాః॥23॥

టీ :-సహాయేనేతి. నను తర్హి తే-ప్యమృతపానేనామరాస్స్యుః. తత్రాహ. క్లేశభాజ ఇతి. (23)

రాక్షసులుగూడా అమృతపానముతో అమరత్వమును పొందుదురా? అను దానికి సమాధానము చెప్పుచున్నాడు. ఓ దేవతలారా ! నా సహాయముతో అలసటలేక పాలసముద్రమును మథించండి. పాపమతులైన రాక్షసులకు మాత్రము పలు దుఃఖములు కలుగును. వారికి శ్రమనే మిగులును. ఫలితము కాదు. మీకే ఎల్ల ఫలితములు ప్రాప్తించగలవు.(23)

శ్లో॥ యూయం తదను మోదధ్వం యదిచ్ఛంత్యసురాః సురాః।
న సంరంభేణ సిధ్యంతి సర్వే-ర్థాః సాంత్వయా యథా॥24॥

టీ :-బలిభిః సహకారిభిః. సాధ్యా అర్థాః. తదనుసరణం వినా న సిధ్యంతీతి కృత్వా. సామాదికముపదిశతి ద్వాభ్యాం. యూయమితి. హే సురాః.సంరంభేణ సంభ్రమేణ సాంత్వయా సామమార్గేణ యథా సిధ్యంతి. ॥24॥

బలవంతులైనవారి సహాయమును పొందుటకై వారిని అనుసరించి నట్లుండవలెను. లేనిచో సాధించుకొనవలసిన కార్యములు సిద్ధించవు. అందువలన కార్యసాఫల్యమునకై సామరస్యమును దేవ రాక్షసులకు రెండు శ్లోకములలో వుపదేశించుచున్నాడు. ఓ దేవతలారా ! మీరందరు వేగిరపాటు వలన ఏ పనిని సాధించలేరు. సామోపాయముచేత సర్వకార్యములు నెరవేరగలవు. అందువలన అసురులు కోరినవాటిని అంగీకరించండి. (24)

శ్లో॥ నభేతవ్యం కాలకూటాత్ విషాజ్జలధి సంభవాత్ ।
లోభః కార్యో న వోజాతు రోషః కామస్తు వస్తుషు॥25॥

టీ :-నేతి. వస్తుషు మథనాదుత్పన్నేషు ॥25॥

సముద్రమును చిలుకుచుండగా ముందుగా దానినుండి కాలకూటమనే భయంకరమైన విషము ఉద్భవించును. ఇంకను అందునుండి పుట్టు వస్తు సామగ్రిపై కామరోషములతో వాటిని పొందుటకై ప్రయత్నించవద్దు. (25)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతి దేవాన్సమాదిశ్య భగవాన్పురుషోత్తమః ।
తేషామంతర్దధే రాజన్ స్వచ్ఛంద గతిరీశ్వరః ॥26॥

శ్లో॥ అథ తస్మై భగవతే నమస్కృత్య పితామహః ।
భవశ్చ జగ్మతుః స్వం స్వం ధామోపేయుర్బలింసురాః॥27॥

టీ :-అథేతి. సురాస్తు బలిము పేయుః ఉపజగ్ముః. ॥26-27॥

శ్లో॥ దృష్ట్వాఽరీనప్య సంయత్తాన్ జాతక్షోభాన్ స్వనాయకాన్।
న్యషేధద్దైత్యరాట్ శ్లోక్యః సంధి విగ్రహ కాలవిత్॥28॥

టీ :-దృష్ట్వేతి. అసంయత్తానపి దృష్ట్వా స్వనాయకా్ స్వభటాన్ యుద్ధోద్యుక్తాన్. న్యషేధత్. శ్లోక్యః కీర్త్య ర్హః. ॥28॥

శ్లో॥ తే వైరోచని మాసీనం గుప్తంచాసుర యూథిపైః ।
శ్రియా పరమ యాజుష్టం జిత శేషముపాగమన్॥29॥

టీ :-తఇతి,వైరోచనిం బలిం జిత మశేషం త్రైలోక్యం యేన తమ్.(29)

**శుకమహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! భగవంతుడైన పురుషోత్తముడు ఈ విధముగా దేవతలకు వుపదేశించి ఇచ్ఛాధీన గమనము కలిగిన ఈశ్వరుడు అదృశ్యుడయ్యెను.(26)

పిమ్మట ఆ మహాపురుషునికి నమస్కరించి బ్రహ్మదేవుడు, ఈశ్వరుడు తమ తమ స్థానములకు వెళ్ళినారు. దేవతలు సంప్రదించుటకై బలి చక్రవర్తి వద్దకువెళ్ళిరి, (27)

శత్రు జయమును కలిగించునట్టి సంధి, విగ్రహములనే ఉపాయములందు, కార్యాకార్యములందు నిపుణులైన బలి చక్రవర్తి యుద్ధప్రయత్నమున లేనట్టివారు, బాధపడుచున్నవారై తనవద్దకు వచ్చుచున్న తమ శత్రువులైన దేవతలను అడ్డగించుటకు ప్రయత్నము చేయుచున్న తన సైన్యాధికారులను కీర్తనీయుడైన బలి నివారించినాడు. (28)

ముల్లోకములు జయించినవాడు, అనంత రాజ్య సంపతదతో కూడినవాడు, అపారమై సేనాధిపతుల రక్షణ వలయమున ఉన్నవాడు, విరోచన సుతుడైన బలి చక్రవర్తిని సమీపించిరి. (29)

శ్లో॥ మహేంద్ర శ్లక్ష్ణయా వాచా సాంత్వయిత్వా మహామతిః।
అభ్య భాషత తత్సర్వం శిక్షితం పురుషోత్తమాత్॥30॥

టీ :-మహేంద్ర ఇతి. తత్సర్వం అమృతోన్మథనాది. ॥30॥

దేవనాథుడైన ఇంద్రుడు ఉదారమైన బుద్ధితో బలి చక్రవర్తిని అనునయించుచూ మెల్లని కంఠధ్వనితో పురుషోత్తముడు తనకు ఉపదేశించిన విధముగా అమృతమునకై సముద్రమును మథించుట మొదలైన సర్వ విషయములను వివరించినాడు. (30)

శ్లో॥ తదరోచిత దైత్యస్య తత్రాన్యే యేఽసురాధిపాః ।
శంబరో-రిష్టనేమిశ్చ యేచ త్రిపురవాసినః ॥31॥

టీ :-తదితి. తత్రయే అన్యేచ.అసురాధిపాః. పౌలోమకాలకే యాదయః శంబరాదయశ్చ. తేభ్యశ్చారోచత. ॥31॥

ఇంద్రుడు చెప్పిన అమృత మథన విషయము బలి చక్రవర్తికి, ఇతరులైన పౌలోమ కాలకేయాది దనుజులకు, శంబరుడు, అరిష్టనేమి, త్రిపురవాసులైన రాక్షసులకు అంగీకారమైనది. (31)

శ్లో॥ తతో దేవాసురాః కృత్వా సంవిదం కృత సౌహృదాః ।
ఉద్యమం పరమం చక్రుః అమృతార్థే పరంతప !॥32॥

టీ :-తత ఇతి. సంవిందం సమయం. ॥32॥

ఓ శత్రుంజయా ! తర్వాత దేవ దానవులు స్నేహముతో సమరసమైన ఒడంబడికను చేసికొన్నారు. అమృతమును సాధించుటకు అర్హమైన గొప్ప ప్రయత్నమును ప్రారంభించినారు. (32)

శ్లో॥ తతస్తే మందరగిరిమోజసోత్పాట్య దుర్మదాః ।
నదంత ఉదధిం నిన్యుః శక్తాః పరిఘ బాహవః ॥33॥

పిమ్మట దేవదానవులందరు శక్తి, ఇనుపగుదియలు మొదలైన ఆయుధములు ధరించిన వారై తమ తమ పరాక్రమములను గొప్పగా పొగడుకొనుచు మందరగిరిని పెగిలించి సముద్రమునకు చేర్చుటకై మోసికొనుచు తెచ్చిరి. (33)

శ్లో॥ దూర భారోద్వహ శ్రాంతాః శక్ర వైరోచనాదయః ।
అపారయంతస్తం వోఢుం వివశా విజహుః పథి॥34॥

చాలా దూరము భారమును మోయుటవలన శక్తి నశించిన వారైన ఇంద్రుడు, బలి మొదలైనవారు ఇక మీదట మోయుటకు శక్తిలేనివారై మార్గమధ్యముననే భూమిపై జారవిడిచిరి (పడవేసిరి). (34)

శ్లో॥ నిపతన్ స గిరిస్తత్ర బహూనమర దానవాన్ ।
చూర్ణయామాస మహతాభారేణ కనకాచలః ॥35॥

అపారమైన బరువుగల కులపర్వతమైన మందరము ( కనకాచలము) క్రిందపడుచు అనేకులు దేవతలు, దానవులను నుగ్గు నుగ్గుగా చేసినది.(35)

శ్లో॥ తాన్ తథా భగ్నమనసో భగ్న బాహూరు కంధరాన్ ।
విజ్ఞాయ భగవాన్ తత్ర బభూవ గరుడధ్వజః ॥36॥

విఱిగిన మెడలు, భుజములు, తొడలు కలవారై ఆ విధముగా నలిగిన దేవదానవుల దురవస్థను గమనించి భగవంతుడైన గరుడధ్వజుడు వారి యెదుట సాక్షత్కరించినాడు. (36)

శ్లో॥ గిరిపాత వినిష్పిష్టా న్విలోక్యామరదానవాన్ ।
ఈక్షయా జీవయామాస నిర్జరాన్నిర్వ్రణాన్సదా ॥37॥

పర్వతము మీదపడినందున చూర్ణమైన దేవదానవులను చూచి చూపుతోనే దేవతలను క్షతిలేనివారుగా ( గాయములులేక పూర్వవిధముగనే ఉండునట్లుగా) బ్రతికించినాడు. (37)

శ్లో॥ గిరిం చారోప్య గరుడే హస్తేనైకేన లీలయా ।
ఆరుహ్యా ప్రియయావబ్ధిం సురాసుర గణైర్వృతః॥38॥

శ్రీమహా విష్ణువు మంథర గిరిని విలాసముగా ఒక్క చేతితో ఎత్తి గరుత్మంతునిపై పెట్టి తానధిరోహించి దేవదానవుల సముదాయము వెంటరాగా సముద్ర సమీపమునకు బయలుదేరెను. (38)

టీ :-తతఇతి.పరిఘా ఇవ బాహవో యేషాం॥33 - 38॥

శ్లో॥ ఆరోప్య గిరిం స్కంధాత్సుపర్ణః పతతాం వరః ।
యయౌ జ్వలాంత ఉత్సృజ్య హరిణా స విసర్జితః॥39॥

టీ :- అవరోప్యేతి. విసర్జితః ప్రస్థాపితః సుపర్ణే తత్ర స్థితే, వాసుకేరాగమనాయోగాదితి భావః. ॥39॥

శ్రీహరి ఎత్తి పెట్టిన మంథరగిరిని పక్షిరాజైన గరుత్మంతుడు తన మూపురమున గట్టిగా నిలుపుకొని వెళ్ళి జలముకడ దింపి తన స్వామి అనుమతితో వెళ్ళెను. (39)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
అమృతమథనే,మంథరాచలాయనం నామ షష్ఠోధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే అమృతమథనము,
మందరాచలాయనమను అను
షష్ఠాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ సప్తమే మథనోద్భూత విషభీత్యాఖిలైర్జనైః ।
స్తుతః సన్కృపయా రుద్రః పపౌ విషమితీర్యతే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ తే నాగరాజ మామంత్ర్య ఫలభాగేన వాసుకిమ్ ।
పరివీయ గిరౌ తస్మిన్నేత్రమబ్ధిం ముదాన్వితాః ॥1॥

టీ :- తఇతి. ఫలభాగేన తవాప్యమృతే భాగో భవిష్యతీతి సంమంత్ర్యవాసుకిం నేత్రం గిరౌ. పరివీయ సంవేష్ట్య అబ్ధిం॥1॥

శ్లో॥ ఆరేభిరే సుసంయత్తా అమృతార్థం కురూద్వహ ! ।
హరిః పురస్తాజ్జగృహే పూర్వం దేవాస్తతోఽభవన్ ॥2॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

ఏడవ అధ్యాయమున సముద్రమథనము వలన ఉద్భవించిన కాలకూట విషప్రభావముతో భీతి చెందిన దేవదానవులెల్లరు ప్రార్థించగా దయతో రుద్రుడు ఆ విషమును త్రాగిన విషయము చెప్పబడును.

**శుక మహర్షి ఈ విధముగా చెప్పినాడు :-**

దేవదానవులు నాగరాజైన వాసుకిని పిలిపించి అతనికి సముద్ర మథనమువలన లభించునట్టి అమృతమున భాగమిచ్చునట్లు చెప్పి అతనిని ఒడంబరిచి ఆ పర్వతమునకు కవ్వపుత్రాడుగా చుట్టి ( చిలుకుటకు ఆరంభించిరని తర్వాతి శ్లోకముతో అన్వయము. (1)

చిలుకుచునప్పుడు రాపిడివలన విషము క్రక్కునట్టి తీవ్రమైన వాసుకి ముఖభాగమును రాక్షసులచేత పట్టించవలెనను ఎత్తుగడతో విష్ణువు ముందుగనే వాసుకి పడగల భాగమును పట్టుకొనగా దేవతలందరూ ఆయనను అనుసరించినారు. (2)

శ్లో॥ తన్నైచ్ఛన్‌దైత్య పతయో మహాపురుష చేష్టితమ్ ।
న గృహ్ణీమో వయం పుచ్ఛమహేరంగ మమంగలమ్॥3॥

మహాపురుషుడైన శ్రీహరి పన్నాగమును గ్రహించలేక దేవతలు వాసుకి తలభాగమును పట్టుకొనుట రాక్షస నాయకులు ఇష్టపడలేదు. సర్పము యొక్క అమంగళమైన తోక భాగమును మేము స్వీకరించమని చెప్పినారు. (3)

శ్లో॥ స్వాధ్యాయ శ్రుత సంపన్నాః ప్రఖ్యాతా జన్మకర్మభిః ।
ఇతి తూష్ణీం స్థితాన్ దైత్యాన్విలోక్య పురుషోత్తమః ॥4॥

జన్మచేత, కర్మచేత ప్రసిద్ధులము, వేదాధ్యయనమున, శాస్త్రవిజ్ఞానమున సంపన్నులమైన మేము తోకభాగమును పట్టుకొనము. అని ఉదాసీనముగా నిలిచిన రాక్షసులను చూచి శ్రీమహా విష్ణువు (తలభాగమును వదిలి తోకభాగమును స్వీకరించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము) (4)

టీ :-ఆరేభిర ఇతి. మథితుమారేభిరే. వాసుకేర్ముఖం తీవ్రం దైత్యాన్ గ్రాహయితుయేవ పూర్వం హరిః.పురస్తాన్ముఖం జగృహే. తతోఽభవన్ ముఖం జగృహుః. ॥2,3,4॥

శ్లో॥ స్మయమానో విసృజ్యాగ్రం పుచ్ఛం జగ్రాహ సామరః ।
కృతస్థాన విభగాస్త ఏవం కశ్యప నందనాః ॥5॥

శ్రీహరి చిఱునవ్వు నవ్వుచు దేవతలతో కలిసి వాసుకి తలభాగమును విడిచి తోకభాగమును పట్టుకొనెను. ఈ విధముగా కశ్యప ప్రజాపతి సంతానమైన దేవదానవులు కవ్వపు త్రాడైన వాసుకిని లాగుటకు దేవతలు తోకభాగము, రాక్షసులు తలభాగమును పట్టుకొనవలెనని స్థానభాగ నిర్ణయమును ఏర్పరచుకొనిరి. (5)

శ్లో॥ మమంథుః పరమాయత్తా అమృతార్థం పయోనిధిమ్ ।
మథ్యమానేఽర్ణవే సోఽద్రిరనాధారో హ్యపోవిశత్ ॥6॥

సముద్రమధ్యమున మంథరపర్వతము నుంచి అమృతోత్పాదనకై గట్టి ప్రయత్నముతో దేవదానవులు చిలుకుటకు ప్రారంభించిరి. సముద్రమును మథించుచుండగా ఆ మంథరగిరి ఆధారము లేనిదై నీటియందు మునిగినది. 6

టీ :-స్మయమాన ఇతి. కృతో ధారణే స్థానవిభాగో యైః.॥5,6

శ్లో॥ ధ్రియమాణోఽపి బలిభిర్గౌరవాత్పాండు నందనః ।
తేసు నిర్విణ్ణ మనసః పరిమ్లాన ముఖశ్రియః ।
ఆసన్న్వ పౌరుషే నష్టే దైవేనాతి బలీయసా ॥7॥

టీ :–తేత్వితి. దైవేన హేతునా స్వపౌరుషే నష్టే సతి. ॥7॥

ఓ పాండవేయా ! బలవంతులైన దేవదానవులు గట్టిగా పట్టుకున్నను పర్వతము క్రుంగినది. అప్పుడు వారందరు వాడిన ముఖములతో నిరాశ చెందినారు. బలీయమైన విధిముందు వారి యత్నము వ్యర్థమైనది. (7)

శ్లో॥ విలోక్య విఘ్నేశవిధిం తదేశ్వరో
దురంత వీర్యోవితథాభి సంధిః ।
కృత్వా వపుః కాచ్ఛప మద్భుతం మహ
త్ప్రవిశ్యతోయం గిరిముజ్జహార ॥8॥

టీ :–విలోక్యేతి. విఘ్నేశస్య విధిం తేన రచితం విఘ్నం. విఘ్నం. అవితథః సత్యః. అభిసంధిః సంకల్పోయస్య. ॥8॥

విఘ్నేశ్వరుడు కల్పించిన విఘ్నమునుచూచి అప్పుడు అపార పరాక్రముడు, సత్యసంకల్పుడు, ఈశ్వరుడైన శ్రీమహావిష్ణువు గొప్పదైన, ఆశ్చర్యకరమైన తాబేలు రూపమును ధరించి, సముద్రజలమున ప్రవేశించి పర్వతమును ఉద్ధరించెను. (8)

శ్లో॥ తముత్థితం వీక్ష్య కులాచలం పునః
సముత్థితా నిర్మథితుం సురాసురాః ।
దధార పృష్ఠేన సలక్షయోజన
ప్రస్తారిణా ద్వీప ఇవాపరో మహాన్ ॥9॥

టీ :–తమితి. లక్షయోజనవిస్తారోఽస్యాస్తీతి తథా. తేన పృష్ఠేన. ॥9॥

ఈ విధముగా హరి ఉద్ధరించిన మంథరగిరిని చూచి దేవదానవులు మరల సముద్రమును మథించుటకు సిద్ధపడిరి. అప్పుడు శ్రీహరి లక్షయోజనముల వైశాల్యము కలిగిన ఇదొక రెండవ ద్వీపమా ! అనే విధముగానున్న గొప్పదైన తన వీపున మందరగిరిని ధరించినాడు. (9)

శ్లో॥ సురాసురేంద్రైర్భుజవీర్యవేపితం
పరిభ్రమంతం గిరిమంగ పృష్ఠతః ।
బిభ్రత్తదావర్తన మాది కచ్ఛపో
మేనేఽంగ కండూయన మప్రమేయః ॥10॥

టీ :- సురేతి. తస్యగిరేరావర్తనం భ్రమణం. అంగం కండూయనం మే నే. ॥10॥

దేవాసుర నేతలయొక్క భుజబలము చేత కదలుచు వీపుమీద తిరుగుచున్న మంథరపర్వతమును భరించుచు ప్రమాణములకందని ఆది కూర్మస్వామి ఆ పర్వతము తిరుగుడును శరీరపు దురద పోవుటకు గోకుటగా భావించినాడు. 10

శ్లో॥ తథాసురానావిశదాసురేణ
రూపేణతేషాం బలవీర్య మీరయన్ ।
ఉద్దీపయన్ దేవ గణాంశ్చ విష్ణుః
దైవేన నాగేంద్ర మబోధ రూపః ॥11॥

అప్పుడు దేవతలను దేవతల రూపముతోను, రాక్షసులను రాక్షస రూపముతోను వారి వారి బల పరాక్రమములను పొగడుచు దేవగణములను మంథనక్రియకు ప్రోత్సహించుచు, తన దివ్య శక్తితో తరి త్రాడైన వాసుకికి పర్వతము యొక్క రాపిడి వలన పీడ కలుగకూడదని అదృశ్య రూపముతో విష్ణువు అతనిని ఆవేశించి ఉండెను. ఈ విధముగా విష్ణువు సర్వరూపుడై ఉండగా చిలికేవారు (దేవదానవులు), చిలుకుటకు ఉపకరించు కుదురు (కూర్మము), తరిత్రాడు (వాసుకి), తరి కవ్వము (మందరగిరి) అన్నియును తానే అయినాడు. 11

శ్లో॥ ఉపర్యగేంద్రం గిరిరాడివాన్య
ఆక్రమ్య హస్తేన సహస్రబాహుః ।
తస్థౌదివి బ్రహ్మ భవేంద్ర ముఖ్యైః
అభిష్టువద్భిః సుమనోఽభివృష్టః ॥12॥

సహస్రబాహువులు కలిగిన శ్రీమహావిష్ణువు మంథరగిరిపై మరొక పర్వతశ్రేష్ఠమువలె తన హస్తముతో అన్నింటిని ఆక్రమించి బ్రహ్మ, ఈశ్వరుడు, ఇంద్రుడు మొదలైనవారు స్తుతించుచు ఆకసమునుండి పుష్ప వర్షము కురిపించుచుండగ విరాజిల్లెను. (12)

టీ :- తదేతి. ఆసురేణ అసురాకారేణ దైవేన వాకారేణ రూపేణావిశత్. (11,12)

శ్లో॥ ఉపర్యథశ్చాత్మని గోత్ర నేత్రయోః
పరేణతే ప్రావిశతా సమేధితాః ।
మమంథురబ్ధిం తరసా మదోత్కటా
మహాద్రిణా క్షోభిత నక్ర చక్రమ్ ॥13॥

పైన ఆకాశమంతయు నిండి, క్రింద దృఢమైన మందరగిరి రూపముతో, అభేద్యమైన అజ్ఞాన రూపముతో నున్న తరి త్రాడు వాసుకితో సముద్రమున కూర్మరూపముతోనున్న పరాత్పరుడవైన నీ వలన వృద్ధిని పొంది మదగర్వితులైన దేవదానవులు కవ్వమై తిరుగునట్టి పర్వతమువలన నక్రాది సమస్త జల జంతువులు సుడివడునట్లుగా సముద్రమును మథించిరి. (13)

టీ :- ఉపరీతి. ఆత్మని దేవదైత్యమధ్యే. గోత్రే దార్ఢ్యరూపేణ. నేత్రే అభేద్యరూపేణ. పరేణహరిణా. క్షోభితం నక్రాణాం చక్రం సమూప హో యస్మిన్. ॥13॥

శ్లో॥ అహీంద్ర సాహస్ర కఠోర దృఙ్ముఖ
శ్వాసాగ్ని ధూమా హతవర్చసో-సురాః ।
పౌలోమ కాలేయ బలీల్వలాదయో
దవాగ్ని దగ్ధాః సరలాఇవాఽభవన్ ॥14॥

సర్పరాజైన వాసుకి క్రూరమైన కన్నులతోనున్న ముఖమునుండి వెలువడు ఉచ్ఛ్వాస నిశ్వాసముల రూపమైన అగ్ని పొగలచేత తేజమును కోల్పోయిన పౌలోముడు, కాలేయుడు, బలి, ఇల్వలుడు మొదలైన రాక్షసులందరు అరణ్యాగ్నికి కాలిపోయిన సరళద్రుమము వలె నిస్సారులైనారు. (14)

టీ :- అహీంద్రేతి. దృశశ్చ ముఖాని చ శ్వాసాశ్చ. అహీంద్రస్య సాహస్ర అపరిమితాః. కఠోరాః మే దృగాదయః. తేభ్యోనిర్గతాభ్యామగ్ని ధూమా హతం వర్చో యేషాం తే సరళాః ద్రుమ శేషాః. ॥14॥

శ్లో॥ దేవాంశ్చ దచ్ఛ్వాస శిఖాహత ప్రభాన్ ।
ధూమ్రాంబర స్రగ్వర కంచు కాననాన్ ।
సమభ్య వర్షన్భగవద్వశా ఘనా
వపుస్సముద్రోర్మ్యుపగూఢ వాయవః ॥15॥

వాసుకి నిశ్వాసరూపమైన అగ్ని జ్వాలలచేత దెబ్బతిని శక్తి నశించినవారు, నీలతోహితమైన వస్త్రములు, దండలు, చొక్కాలు, ముఖములతోనున్న దేవతలను వుద్దేశించి దైవ వశముచేత మేఘములు హఠాత్తుగా, సమృద్ధిగా వర్షించినవి. సముద్రపుటలల తాకిడికి ఎగసిన తుంపరలతో కూడిన చల్లని గాలులు వారి శరీర తాపము పోవునట్లుగా వీచినవి. (15)

శ్లో॥ మథ్యమానాత్తథా సింధో ర్దేవాసుర వరూథపైః ।
యదా సుధా న జాయేత నిర్మమంథాఽజితస్స్వయమ్ ॥16॥

దేవ దానవులు ఎంతగా సముద్రమును మథించినను అమృతము వుద్భవించలేదు. అప్పుడు అపజయమే లేనట్టి జయశీలుడైన విష్ణువు తనే స్వయముగా సముద్రమును మథించినాడు. (16)

టీ :- దేవానితి.దేవాంస్తు భగవద్వశా ఘనాః. సమభ్యవరః. సముద్రోర్మిభిః ఉపగూఢాః యవశ్చ శీతలాః వపుః వాంతిస్మ. కథంభూతాన్? తస్య హీంద్రస్య శ్వాసశిఖాగ్నిభిర్నిహతా ప్రభా యేషాం. ధూమ్రాణ్యంబరాదీని యేషాం. ॥15,16॥

శ్లో॥ మేఘశ్యామః కనకపరిధిః కర్ణ విద్యోతవిద్యు ।
న్మూర్ధ్ని భ్రాజద్విలులిత కచః స్రగ్ధరో రక్తనేత్రః ।
జైత్రైర్దోర్భిర్జగుద భయదైర్దంద శూకం గృహీత్వా ।
మథ్నన్ మథ్నా ప్రతిగిరిరివా శోభతాఽధోద్ధృతాద్రిః॥17

టీ :-మేఘశ్యామ ఇతి.ఉద్ధృతోఽద్రిర్యేన సః ఉద్ధృతాద్రిః. భగవాన్పర మపురుషోఽనంతరమశోభతేత్యన్వయః. కథంభూతః కనకపరిధిః పీతవాసాః.కర్ణయోర్విద్యోతమానా విద్యుత్ కుండలలక్షణా యస్య స తథా.మూర్ధ్ని భ్రాజంతో విలులితాః కచా యస్య స తథా. జైత్రైర్జిష్ణుభిః. దందశూకం సర్పం.ప్రతిగిరిః ప్రతిద్వంద్వీ పర్వత ః. ॥17॥

మందరగిరి సముద్రమున కవ్వమై తిరుగుచుండగా దానిక్రింద అనగా మందరమును ధరించిన ఆది కూర్మస్వామి అయిన శ్రీమహావిష్ణువు నల్లని మేఘకాంతితో, పీతాంబరమును ధరించి, చెవులందు ప్రకాశించుచున్న కుండలములకాంతితో, తలపై ప్రకాశించుచు జారుచున్న వెంద్రుకలు, పూలదండలతో, ఎఱ్ఱని కన్నులతో విరాజిల్లుచు జయశీలములై, లోకమునకు అభయమును ప్రధానము చేయు తన భుజములతో, కవ్వపు త్రాడైన వాసుకిని రెండువైపుల బిగించి పట్టుకొని రెండవ మందరగిరివలె ప్రకాశించినాడు.(17)

శ్లో॥ నిర్మథ్యమానా దుదధేర భూద్విషం
మహోల్బణం హాలహలాహ్వమగ్రతః ।
సంభ్రాంత మీనోన్మకరాహి కచ్ఛపాత్
తిమి ద్విపగ్రాహ తిమింగిలా కులాత్ ॥18॥

టీ :-నిర్మథ్యేతి. హాలహలమిత్యాహ్వా నామ యస్య. సంభ్రాంతా మీనాః ఉద్గతా మకరాదయశ్చ యస్మిన్. తిమ్యాదిభిరాకులాత్. 18

సముద్రమును తీవ్రమైన వేగముతో చిలుకుచుండగా మిక్కిలి తీవ్రమైన హాలాహలమనే పేరుగల భయంకరమైన విషము ముందుగా ఉద్భవించినది. దాని అపారమైన వేడిమికి, వాడికి దిక్కుతోచక చేపలు, మొసళ్ళు, తాబేళ్ళు, తిములనెడు చేపలు, తిములను మ్రింగగలిగెడు మిక్కిలి పెద్ద శరీరము కలిగిన తిమింగిలములనెడు చేపలు, రెండు తలలతో నీరు త్రాగెడు పెద్ద నీటిపాములు మొదలైన సముద్రమునందలి జలచరములన్నియు వ్యాకులతను పొందినవి. 18

శ్లో॥ తదుగ్రవేగ దిశిదిశ్యుపర్యథో
విసర్పదుత్సర్ప దసహ్యమప్రతి ।
భీతాః ప్రజా దుద్రువు రంగ సేశ్వరా
అరక్ష్యమాణాః శరణం సదాశివమ్ ॥19॥

టీ :-తదితి. తద్విషం అప్రతి అప్రతిమం. ప్రతిక్రియా శూన్యమితివా. కుతః? ఉగ్రో వేగో యస్య తదేవాహ దిశిదిశీతి. యద్వా ఉగ్రావేగా రో మాంచస్వేదాదయో యస్మాత్ అత ఏవ అసహ్యం. విలోక్య భీతాః. అన్యేన కేనాప్యరక్ష్యమాణాః. సదా శివం శరణం దుద్రువుః జగ్ముః. ॥19॥

ఆ హాలాహల విషము సహించుటకు శక్యముగాని విధముగా, అప్రతిమానముగా, ప్రతి క్రియారహితముగా దిక్కులంతటా భూనభో మండలములలో భయంకరమైన వేగముతో ఎగబ్రాకుచు వ్యాపించినది. అందువలననే దేవదానవాదులు తమ తమ నాయకులతో ఆ విష తీవ్రతను భరించలేక భీతి చెందినవారై మరే ఇతర రక్షణలేనివారై తమను ఆ విషమునుండి కాపాడుటకై శరణుకోరి సదాశివుని ఆశ్రయించినారు. (19)

శ్లో॥ విలోక్య తం దేవవరం త్రిలోక్యా
భవాయ దేవ్యాభిమతం మునీనామ్ ।
ఆసీన మద్రావపవర్గ హేతోః
తపో జుషాణం స్తుతిభిః ప్రణేముః ॥20॥

టీ :– విలోక్యేతి. త్రిలోక్యా ఉద్భవాయ దేవ్యాసహ. అద్రౌకైలాసే ఆసీనం. తథాపి. మునీనామభిమతం. తేషామేవాపవర్గాయ తపో జుషాణం. ॥20॥

ముల్లోకములను సృష్టించు పార్వతీ దేవితో గూడి కైలాస శిఖరముపై సుఖాసీనుడై మునీశ్వరుల అభిమతమైన తపస్సులకు పరితృప్తిని బొందిన ఆ మహాదేవుని దర్శించి తమను కాపాడుమని పెక్కు స్తుతులతో ప్రార్థించి ప్రణమిల్లిరి. (20)

**ప్రజాపతయ ఊచుః :–**

శ్లో॥ దేవ దేవ మహాదేవ భూతాత్మన్ భూతభావన ।
త్రాహిణః శరణాపన్నాం స్త్రైలోక్య దహనాద్విషాత్॥21॥

శ్లో॥ త్వమేకః సర్వజగత ఈశ్వరో బంధమోక్షయోః ।
తం త్వామర్చయంతి కుశలాః ప్రసన్నార్తి హరం గురుమ్॥22॥

టీ :– శ్లో. నిర్గుణం సగుణం చైవ శివం హరిపరాక్రమైః స్తువంతశ్చ ప్రజేశానానామన్యంతాంతింతయోః. శ్రీధరీయో ఽ యంశ్లోకః. (21,22)

**ప్రజాపతులిట్లని స్తుతించిరి :–**

ఓ దేవ దేవా ! మహాదేవా ! సర్వభూతములకు అంతర్యామియైనవాడా! భూతములను పుట్టించినవాడా ! పోషించువాడా ! ముల్లోకములను దహించు విషమునుండి ఆపన్నులమై శరణు పొందిన మమ్ములను కాపాడుమని బ్రహ్మాది దేవతలు, దానవులు ప్రార్థించినారు. (21)

ఈ శ్లోకమునకు వ్యాఖ్యాన ప్రాయముగా శ్రీధరాచార్యులు " నిర్గుణం సగుణం చైవ శివం హరి పరాక్రమైః । స్తువంతస్తు ప్రజేశానా నామన్యంతాంతరం తయోః॥" అనే శ్లోకమును రచించినాడు. నిర్గుణుడైన శివుడు, సగుణుడైన విష్ణువుల యొక్క పరాక్రమాదులను చూచి సృష్టి కారకులైన

ఆ శివ కేశవులను బ్రహ్మాదులు స్తుతించుచు వారిరువురి మధ్య భేదమును తెలియలేక పోయిరి. అద్వైత దృష్టితో స్తుతించిరని భావము.

ఓ ఈశ్వరా ! నీవొక్కడవే సమస్త జగత్తుయొక్క బాధలకు (బంధములకు), బాధావిముక్తికి ( మోక్షమునకు ) అధినాయకుడవు. ఆపన్నుల సంకటములను నాశనము చేయు రక్షకుడవు, గురుడవు అయిన నిన్ను తత్వమెరిగిన నిపుణులు నిత్యము అర్చించుచున్నారు. (22)

శ్లో॥ గుణమయ్యా స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్విభో ।
ధత్సే యదా స్వదృగ్భూమన్ బ్రహ్మ విష్ణు శివాభిధామ్॥23॥

టీ :- నన్వేవంభూతో విష్ణురితి ప్రసిద్ధం తత్రాహ గుణమయ్యేతి. అస్య జగతః. యదా సర్గాదీన్ ధత్సే. తదా హే భూమన్ స్వదృక్ స్వతస్సిద్ధజ్ఞానః త్వం బ్రహ్మాదిసంజ్ఞాంధత్సే ॥23॥

గుణాత్మకుడు, గుణమయుడు విష్ణువని ప్రసిద్ధము కదా! మరి శివునకు ఈ విశేషమెట్లు తగును? అనే విషయము చెప్పుచున్నాడు. ఓ సర్వవ్యాపకుడా ! ఈ జగత్తుయొక్క సృష్టి, స్థితి, శుభములను ఒనగూర్చునప్పుడు త్రిగుణాత్మకమైన నీ శక్తిని స్వీకరింతువు. అప్పుడు సహజమైన జ్ఞానముతోనీవు బ్రహ్మ (సృష్టికాలమున), విష్ణువు (స్థితి కాలమున), మహేశ్వరుడు ( సుఖతయములు కలిగించు కాలమున) అనే నామములను పొందుదువు. (23)

శ్లో॥ త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావ భావనః ।
నానా శక్తి భిరాభాత స్త్వమాత్మా జగదీశ్వరః ॥24॥

టీ :- త్వమితి. తత్ర హేతుః. త్వం బ్రహ్మేతి. సదసతోర్భావాన్

దీనికి కారణము చెప్పుచున్నాడు. ఓ దేవా నీవు మిక్కిలి రహస్యమైన (వాక్కు మనసులకందని) వాడవు. ఉత్కృష్టమైన, నీచమైన విషయములను భావింపజేయునట్టి మానవులు, పశుపక్ష్యాదులను సృష్టించే బ్రహ్మవు. వాస్తవమునకు నీకంటే వేరైన వస్తువేదియును లేదు. నిన్ను నీవే అనేక శక్తులచేత

దేవతిర్యగాదిరూపాన్. భావయతీతి తథా. సృజ్యంతు తద్వ్యతిరిక్తం నాస్తీ త్యాహుః. ఆత్మైవ త్వం. నానాశక్తిభిః జగద్రూపేణాభాతః యస్మాదీశ్వరః. (24)

జగద్రూపముగా భావింపజేయుటవలన నీవే ఈశ్వరుడవు. (24)

శ్లో॥ త్వం శబ్దయోనిర్జగదాదిరాత్మా
ప్రాణేంద్రియ ద్రవ్య గుణ స్వభావః ।
కాలః క్రతుః సత్యమృతంచ ధర్మః
త్వయ్యక్షరం యత్రివృదామనంతి ॥25॥

టీ :- స్వతస్సిద్ధజ్ఞావముపపాదయంతః జగదాత్మనా ఆభాసప్రకారమాహుః త్వమితి. త్వం శబ్దస్య వేదస్య యోనిః. అతః.స్వతస్సిద్ధజ్ఞానః. త్వం జగదాదిర్మహత్తత్త్వం. ఆత్మా చ అహంకారః.కథంభూతః? ప్రాణేంద్రియద్రవ్యాణాం కారణభూతా యే గుణా యస్య. రాజసాది త్రివిధ ఇత్యర్థః. స్వభావాదయశ్చ. త్వమేవ.క్రతుః సంకల్పః. సత్యమృతం చేతి యో ధర్మః సత్వం మహదాదిరూపత్వే హేతుః. త్రివృత్ త్రిగుణాత్మకం యదక్షరం ప్రధానం. త్వయి త్వదాశ్రయం తదామనంతి. యద్వా. ఏవం భూతే త్వయి.త్రివృదక్షరం ప్రణవం ప్రకాశకమాహురిత్యర్థః. (25)

పరమాత్ముని స్వతః సిద్ధ జ్ఞానత్వమును ప్రతిపాదించుచు ఆయన జగద్రూపముగా ప్రకాశించిన విధమును వివరించుచున్నాడు. నీవే (పరమాత్మనే) వేదములకు జన్మభూమి. అందువలననే సహజమైన జ్ఞాన పరిపూర్ణత. నీవే జగత్తు మొదలైన మహత్తత్వమవు. ఆత్మ అంటే అహంకారము నీవే. ప్రాణము, ఇంద్రియములు, పృథ్వి మొదలైన పంచభూతములు మొదలగు వానికి మూలకారణమైన సత్వము, రజస్సు, తమములనే గుణములతో కూడిన అహంకారము నీవే. స్వభావ జనితమైన ప్రకృతినీవే. కాలము, సంకల్పము (క్రతువు), సత్యము ఋతము అనే ధర్మము నీవే. త్రిగుణాత్మకమైన ( త్రివృత్) ప్రధానము- మూల ప్రకృతి ( అక్షరము ) నీయందే, నీదే అని చెప్పుచున్నాడు. లేక ఇట్టి నీయందే త్రివృత్తులయిన ( అ,ఉ,మ అనే మూడు విధములుగానున్న ప్రణవము ప్రకాశించుచున్నదని చెప్పుదురు.) (25)

శ్లో॥ అగ్నిర్ముఖం తేఽఖిల దేవతాత్మా
క్షితిం విదుర్లోక భవాంఘ్రి పంకజమ్ ।
కాలం గతిం తేఽఖిల దేవతాత్మన్
దిశశ్చ కర్ణౌ రసనాం జలేశమ్ ॥26॥

టీ:- అగ్నిరితి. అఖిలదేవతాత్మా. శ్రు."అగ్నిస్సర్వా దేవతా"ఇతి శ్రుతేః స అగ్నిస్తే ముఖం. హే లోకభవ ద్వితీయాంతేషు విదురిత్యస్య సంబంధః. ॥26॥

సర్వదేవతాత్మకుడైన ఓ ఈశ్వరా ! నీవు సర్వదేవతాత్ముడైన అగ్ని నీ ముఖము- ' అగ్నిః సర్వాదేవతాః ' అని శ్రుతి (ఇక్కడ ద్వితీయాంతములైన 'ముఖం, క్షితిం' మొదలైనవి ఆయా అవయవములుగా ఈశ్వరుని సావయవతను తెలియవలెనని భావము) . భూమి నీకు పాదపద్మము. కాలము మార్గము. దిక్కులు చెవులు. జలేశుడు నాలుక. (26)

శ్లో॥ నాభిర్నభస్తే శ్వసనం నభస్వాన్
సూర్యశ్చ చక్షూంషి జలం స్మరేతః ।
పరావరాత్మా శ్రయణం తవాత్మా
సోమోమనో ద్యౌ భగవన్ శిరస్తే ॥27॥

టీ :-నాభిరితి. పరే అపరే చ యే ఆత్మానః జీవాస్తేషామాశ్రయస్తే ఆత్మాహంకారః. (27)

ఓ భగవంతుడా ! ఆకాశము నీబొడ్డు. వాయువు శ్వాసము. సూర్యుడు కన్నులు. జలము శుక్లము. ఉచ్ఛ నీచములైన సర్వజీవులకు ఆశ్రయము నీ ఆత్మ అనగా అహంకారము. చంద్రుడు నీ మనస్సు. త్రివిష్టము నీ శిరస్సు.(27)

శ్లో॥ కుక్షిః సముద్రా గిరయోఽస్థి సంఘా
రోమాణి సర్వౌషధి వీరుధస్తే ।
ఛందాసి సాక్షాత్తవ సప్తధాతవః
త్రయీ మయాత్మన్ హృదయం సర్వ ధర్మః॥28॥

ఓ వేదత్రయమూర్తీ ! సముద్రము నీ జఠరము. పర్వతములు నీ ఎముకలు. సర్వౌషధులు లతలు జడలు గట్టిన నీ వెంద్రుకలు. వేదములు సప్తధాతువులు. సర్వధర్మ సమూహము నీ హృదయము. (28)

టీ :-కుక్షిరితి. హే త్రయీమయాత్మన్ వేదత్రయమూర్తే.॥28॥

శ్లో॥ ముఖాని పంచోపనిషదస్త వేశ
యై స్త్రింశదష్టోత్తర మంత్రవర్గః ।
యత్తచ్ఛివాఖ్యం పరమార్థ తత్త్వం
దేవ స్వయంజ్యోతి రవస్థితిస్తే ॥29॥

ఓ ఈశ్వరా ! ఉపనిషత్తులు తత్పురుష, అఘోర, సద్యోజాత, వామదేవ, ఈశాన రూపములైన పంచములు. మంత్రములు- ముఖములవలన ఏర్పడిన ముప్పది యెనిమిది మంత్రములయొక్క సముదాయము. ఆ మంత్రముల పరిచ్ఛేదము వలన ముప్పది యెనిమిది కళాత్మకములైన మంత్రము లేర్పడును (పంచ ముఖములనుండి వెలువడిన ముప్పది యెనిమిది కళలే ముప్పది యెనిమిది మంత్రములని భావము) . ఈ విధముగా శివుడను పేరు గలిగిన పరతత్త్వము యొక్క రూపమే స్వయం జ్యోతిగా ఉన్నది. (యత్కించిదేకం మహః) . (29)

టీ :-ముఖానీతి. పంచోపనిషదః అత్ర వర్ణాధిక్యమార్షం. తత్పురుషాఘో రసద్యోజాత వామదేవేశానరూపా మంత్రాః, యైర్ముఖైరష్టోత్తరత్రింశన్మంత్రాణాం వర్గః తేషా మేవ మంత్రాణాం పదచ్ఛేదేన అష్టోత్తర త్రింశత్కళాత్మకా మంత్రా ఇత్యర్థః అవస్థితిః ఉపరతావస్థా. ॥29॥

శ్లో॥ ఛాయా త్వ ధర్మోర్మిషుయై ర్విసర్గో
నేత్రత్రయం సత్త్వ రజస్తమాంసి ।
సాంఖ్యాత్మనః శాస్త్ర కృతస్త వేక్షా
ఛందోమయోదేవ ఋషిః పురాణః ॥30॥

ఛందోమయుడవైన ఓ దేవా ! నీ నీడ ( ఛాయ ) అధర్మమము. అధర్మ సంబంధమైన ఆకలి, దప్పి, శోకము, మోహము, జర, మరణము మొదలైన షడూర్ములు, దంభము, లోభము మొదలైన వానియందు విసర్గము ( త్యాగము) .ప్రతి సర్గము సంహారము. లేక సత్త్వము, రజస్సు, తమస్సులనే త్రిగుణములచేత కలుగు పలువిధములైన సృష్టులు-త్రినేత్రములు. పురాతనమైన వేదము ఋషి. సాంఖ్యశాస్త్రము ప్రతిపాదించిన తత్త్వముల విచారము చూపు. (30)

టీ :-ఛాయోతి. అధర్మస్యోర్మిషు దండ భాదిషు. యైరూర్మిభిర్వి సర్గః. సంహారః. యద్వా. యైః సత్త్వాదిభిర్వివిధః సర్గః తాని నేత్ర

త్రయం హే దేవఛందోమయః ఋషిర్వేదః, సతవేక్షా ఈక్షణం. సాక్షాన్మనురితి పాఠే మనుర్వేదః. (30)

శ్లో॥ నతే గిరిత్రాఖిల లోకపాల
విరించి వైకుంఠ సురేంద్ర గమ్యమ్ ।
జ్యోతిః పరం యత్ర రజస్తమశ్చ
సత్త్వం న యద్బ్రహ్మ నిరస్త భేదమ్ ॥31॥

టీ :– తదేవాహ. నేతి. హేగిరిత్ర. తే పరం జ్యోతిరఖిలానాం లోకపాలాదీనా. సభవతి. కుతః? యత్ర రజ ఆది నాస్తి.కిం తజ్జ్యోతిః? యన్నిరస్తభేదం బ్రహ్మ. ॥31॥

ఓ గిరిత్రా ! నీ సర్వోత్కృష్టమైన తేజోరూపము సర్వలోకపాలకులైన బ్రహ్మ, విష్ణువు, సురేంద్రులు పొందలేనిది (దర్శించలేనిది) . ఎందుకంటే అది సత్త్వము, రజస్సు, తమములనే గుణములు లేనిదై సర్వభేదములను తిరస్కరించి బ్రహ్మ (జ్ఞాన) రూపమైనది. (31)

శ్లో॥ కామాధ్వర త్రిపురకాల గరాద్యనేక
భూతద్రుహః క్షపయతః స్తుతయే న తత్తే ।
యస్త్వంతకాల ఇదమాత్రకృతం స్వనేత్ర
వహ్ని స్ఫులింగ శిఖయా భసితం న వేద ॥32॥

టీ :– కామేతి కామశ్చ. అధ్వరశ్చ దక్షయజ్ఞః.త్రిపురాదయశ్చ యే,తే అనేకే భూతద్రుహస్తాన్. క్షపయతస్సంహరతస్తే తత్కర్మస్తుతయే న భవతి. అత్యల్పమేతదిత్యర్థః. గరభక్షణస్యాప్యవశ్యంభావిత్వేన

మన్మథుడు, దక్షయజ్ఞము, త్రిపురాసురులు, యముడు మొదలైన అనేక భూత హింసకులను సంహరించిన కర్మ నీకు స్తుతి పాత్రము కాదు. అది నీకు మిక్కిలి అల్పమైన కార్యము. కాలకూట విషము నీచేత నాశనము కాబోవుట కూడా గొప్పగా స్తుతించుటకు సరిపోదు. ఎందుకంటే ప్రళయకాలమున నీచేత నిర్మితమైన ఈ జగత్తు నీ నేత్రాగ్ని విస్ఫులింగము యొక్క మంటతో భస్మమగుట ( భావి వృత్తాంతము కావున ) తెలియుటలేదు. సంహారకర్తయైన రుద్రునకివేమియు గొప్ప విషయములు కావని భావము. (32)

సిద్ధవన్నిర్దేశఃస్తుతయే ఆలం న భవతీత్యత్ర హేతుః యస్తు భవాన్ స్వనేత్రవహ్నివిస్ఫులింగస్య. శిఖయా. ఇదం జగత్. భసితం భస్మసాజ్జాతం న వేద. నాలోడయత్యపి. ॥32॥

శ్లో॥ యేత్వాత్మ రామ గురుభిః హృది చింతి తాంఘ్రి
ద్వంద్వం చరంతముమయా తపసాభి తప్తమ్ ।
కత్థంత ఉగ్రపరుషం నిరతం శ్మశానే
తే నూనమూతిమవిదంస్తవ హాతలజ్జాః ॥33॥

టీ :– త్వామేవం నిత్యం పరానుగ్రహే వ్యగ్రం. యే నిందంతి. తేఽతిమూర్ఖా ఇత్యాహుః. యేత్వితి. యే త్వాం ఉమయా సహచరంతం. తస్యాం నితరాం రతం. కామినం కత్థం తే. ప్రలపన్తి తథా శ్మశానే చరన్తం ఉగ్రం క్రూరం పరుషం చ హింస్రం కత్థన్తే. కథంభూతం? ఆత్మారామాశ్చ తే గురవశ్చ. విశ్వహితోపదేష్టారస్తైర్హృది చింతితమంఘ్రిద్వంద్వం యస్య తథాభూతమపి. తపసాభితప్తమపి తే నూనం. తవఊతిమవి దన్నితి కాకుః. కింతు త్వల్లీలాం నైవ విదురిత్యర్థః. అతః హీనలజ్జాః కథమాత్మా రామైస్సేవిత చరణయుగళస్య కామత్వాదికమితి భావః. కథం వా తపసాభితప్తస్య శాంతస్యోగ్రత్వం పరుషత్వం వా సంభవతీత్యవిచార్యై ప్రలపంతీత్యర్థః. ॥33॥

ఆ విధముగా ఎల్లప్పుడు సర్వ జగత్తులకు సుఖకరుడవైన నిన్ను నిందించువారు అతిమూర్ఖులు. అని చెప్పుచున్నాడు. కొందరు నిన్ను నిరంతరము అర్ధాంగి యైన ఉమాదేవితో తిరుగుచు ఆమెను రమించు కాముకుడవని వదఱుదురు. అట్లే శ్మశానమున సంచరించు భయంకరుడు, క్రూరుడు, హింసకుడు నీవని కొందరు చెప్పుచున్నారు. అది ఎట్లు కుదురును. ఆత్మ తత్వవేత్తలు, ఎల్ల లోకములకు హితమును ఉపదేశించువారైన గురువులు హృదయమున నిరంతరము నీ పాద ద్వంద్వమును ధ్యానింతురు. ఈ విధముగా యోగిధ్యేయ పదారవిందుడవై నిత్యము యోగధ్యానములో నున్న నిన్నా నిందించుట. ఈ నిందకులందరు తప్పక నీ రక్షణ తెలియలేని వారని కాకువు. నీ లీలను తెలియలేని వారని అర్థము. అందుకే వారు సిగ్గులేని వారు. ఆత్మారాములైన యోగీశ్వరులచేత పూజింపబడు పాదపద్మములుగల శివునికి కాముకత్వము ఎట్లు సంభవించును. తపస్సుచేత దీప్తమైన తేజముతో పరమ శాంత భావమున ఉన్న సదాశివునికి క్రూరత్వము, పరుషత్వములు ఎట్లు కలుగగలవని విచారించకయే నిన్ను నిందించువారు వదరుచున్నారని భావము. (33)

శ్లో॥ తత్త్వస్య తే సదసతోః పరతః పరస్య
నాంజః స్వరూపగమనే ప్రభవంతి భూమ్నః ।
బ్రహ్మాదయః కిముత సంస్తవనే వయం తు
తత్సర్గ సర్గ విషయా అపి శక్తి మాత్రమ్ ॥34॥

టీ :–అస్తాం తావన్నిందకానాం వార్తా. మహాంతోఽపి తవ తత్త్వం న జానంతీత్యాహుః తదితి. తత్తస్మాత్తవ స్వరూపస్య గమనేజ్ఞానే. బ్రహ్మాదయోఽపి న సమర్థాః. సంస్తవనే తు కుతః శక్తాస్స్యుః? తత్ర వయం కథం ప్రభవేమ? యతస్తేషాం సర్గే అత్యంత మర్వాచీనాః, తథాపి యదేతత్ స్తవనం ఏతదాత్మశక్తి పరిమితమాత్రమిత్యర్థః. ॥34॥

నిన్ను నిందించు వారి విషయము అటుండని. మహాత్ములు కూడా నీ తత్త్వమును గ్రహించలేరని చెప్పుచున్నాడు. సదసత్తుల (ఉన్నవి లేనివి అయిన వస్తుజాలముల) కంటే పరాత్పరమైన నీ వాస్తవ స్వరూప జ్ఞానము పొందుటకు బ్రహ్మాది పండితులు కూడా సమర్థులు కారు. ఇక వారు (నీ స్వరూపమే తెలియని వారు) స్తుతించుటకు ఎట్లు సమర్థులు కాగలరు. మావంటి అల్పమైన బుద్ధిగలవారికి నిన్ను స్తుతించుట ఎట్లును సాధ్యముకాదు. ఎందుకంటే ఈ జీవసృష్టి మిక్కిలి ఆధునిక (అర్వాచీన ) మైనది. ఐనప్పటికీ ఈ నీ గొప్పదనమును కీర్తించుట కేవలము ఈఆత్మ శక్తికి మాత్రమే సాధ్యమగునని అర్థము. (34)

శ్లో॥ ఏతత్పరం ప్రపశ్యామో న పరంతే మహేశ్వర ।
మృడనాయ హిలోకస్య వ్యక్తిస్తేవ్యక్త కర్మణః ॥35॥

ఆ విషయమునే చెప్పుచున్నాడు. ఓ మహేశ్వరా ! నీ సర్వోత్కృష్ట తత్త్వ స్వరూపమును దర్శించలేకయినను లోక శుభము కొఱకు ప్రత్యక్షమైన అవ్యక్త కర్ముడవైన నీ యొక్క ఈ రూపదర్శనము చేతనే మేమందరము కృతార్థులమైతిమి. 35

**శ్రీశుక ఉవాచ :–**

శ్లో॥ తద్వీక్ష్య వ్యసనం తాసాం కృపయా భృశ పీడితః ।
సర్వభూత సుహృద్దేవ ఇదమాహ సతీం ప్రియామ్॥36

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :–**

బ్రహ్మాదులకు కాలకూటవిషము వలన కలిగిన సంకటమును చూచి దయతో అధికముగా కలత చెందినవాడై సర్వజీవులకు సుఖమును కలిగించు సదాశివుడు

టీ :–తదేవాహుః. ఏతదితి. ఏతత్ పరిమితం నాపరం రూపం, తథాపి, త్వద్దర్శనాదేవ కృతార్థావయమిత్యాహుః.మృడనాయ హీతి. ॥35,36॥

**శివ ఉవాచ :–**

శ్లో॥ అహెూ బత భవాన్యేతత్ప్రజానాం పశ్యవైశసమ్ ।
క్షీరోద మదనోద్భూతాత్కాలకూటాదుపస్థితమ్ ॥37॥

టీ :–మత్ప్రభావమవిచార్య విషపానే ప్రవృత్తం మాం. కథంచిదియం ప్రియా వారయతీతి శంకయా తామనుజ్ఞాపయ న్నాహ. సార్ధైశ్చతుర్భిః అహోబతేతి. వైశసం దుఃఖం. ॥37॥

శ్లో॥ ఆసాం ప్రాణ పరీప్సూనాం విధేయమభయం హి మే ।
ఏతావాన్ హి ప్రభోరర్థో యద్దీన పరిపాలనమ్॥38॥

టీ :–ఆసామితి. ప్రాణేప్సూనాం ప్రాణరక్షణేచ్ఛూనాం, మే మయా, ప్రభోః సమర్థస్య. అర్థః కార్యం. ॥38॥

తన ప్రియ సతితో ఈ విధముగా చెప్పినాడు. (36)

**పరమ శివుడు ఈ విధముగా చెప్పినాడు :–**

నా ప్రభావమును తెలియలేక విషమును పానము చేయ సంకల్పించిన నన్ను ఏ విధముగానైన నా యీ ప్రియపత్ని నివారించగలదను అనుమానముతో ఆమె అనుమతి కోరుచు శివుడిట్లు చెప్పుచున్నాడు. అయ్యో ఓ భవానీ ! పాలసముద్రమును మథించుట వలన ఉద్భవించిన కాలకూట విషము వలన ఈ బ్రహ్మాదుల దుఃఖమును చూడుము. (37)

ప్రాణ రక్షణను కోరి ప్రార్థించిన వీరికి నేను అభయము ఇచ్చితిని. దీనులను కాపాడుటయే కదా సమర్థులైన నాయకులకు చేయదగిన కార్యము (38).

శ్లో॥ ప్రాణైః స్వైః ప్రాణినః పాంతి సాధవః క్షణ భంగురైః ।
బద్ధ వైరేషు భూతేషు మోహితేష్వాత్మ మాయయా॥39॥

టీ :- కించ.ప్రాణైరితి. బద్ధవైరేషు భూతేషు పరస్పరం జిఘాంసత్సు. ॥39॥

ఆత్మ మాయచేత (స్వార్థ సంపాదన కాంక్షతో) భ్రాంతి జెంది పరస్పరము చంపుకొనుటకు సిద్ధపడు ప్రాణులను అశాశ్వతములైన తమ ప్రాణములను సైతము గణించక సత్పురుషులు కాపాడుచున్నారు. (39)

శ్లో॥ పుంసః కృపయతో భద్రే సర్వాత్మ ప్రీయతే హరిః ।
ప్రీతే హరౌ భగవతి ప్రీయేహం స చరాచరః ।
తస్మాదిదం గరం భుంజే ప్రజానాం స్వస్తిరస్తు మే 40

టీ :- పుంస ఇతి. కృపయతః కృపాం కుర్వతః పుంసః మే మత్తః స్వస్తిశ్శోభనా సత్తా సుఖేన జీవిత మస్త్విత్యర్థః. ॥40॥

శోభనవతీ ! దయగల ( పరోపకారియైన ) పురుషునివలన సర్వాత్ముడైన శ్రీహరి సంతుష్టుడౌతాడు. ఓ ప్రియురాలా ! శ్రీహరి పరితృప్తిని బొందినచో చతుర్దశ భువనములు తృప్తి పొందును. అందువలన సర్వజీవులకు క్షేమము కలుగునట్లుగా నేనీ విషమును భుజింతును. (40)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవమామంత్ర్య భగవాన్ భవానీం విశ్వ భావనః ।
తద్విషం జగ్ధు మారేభే తం భవాన్యన్వమోదత ॥41॥

టీ :- ఏవమితి. జగ్ధుం అత్తుం. ॥41॥

**శుకమహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా జగత్కారణుడు, భగవంతుడైన శివుడు తన పత్నియైన భవానితో చెప్పి కాలకూటమును భుజించుటకు ఆరంభించెను. పరమశివుని ఈ మహత్కార్యమును ఆ సర్వమంగళ ఆమోదించినది. (41)

శ్లో॥ తతః కరతలీకృత్య వ్యాపి హాలాహలం విషమ్ ।
అభక్షయన్మహాదేవః కృపయా భూత భావనః ॥42॥

పిమ్మట అంతటా వ్యాపించు అనంతమైన హాలహల విషమును చేతియందుంచుకొని అనగా అర చేతియందు మాత్రమే ఇముడునట్టి పరిమాణము

టీ :-తత ఇతి. కరతలీకృత్య కరతలపరిమితమాత్రం కృత్వా. ॥42॥

కలదిగా చేసి జగత్కారణుడైన మహాదేవుడు దయతో భక్షించినాడు. (42)

శ్లో॥ తస్యాపి దర్శయామాస స్వవీర్యం జలకల్మషః ।
యచ్చ కార గలే నీలం తచ్చ సాధోర్విభూషణమ్ ॥43

ఆ జలదోష సంబంధమైన విషమునకు పరమేశ్వరుడు తన ప్రతాపమును చూపి దానిని శిక్షించుటకై భక్షించినాడు. ఆ విషమును కంఠమున నిగ్రహించుటచేత సర్వధవళ వర్ణుడైన శివుని కంఠము నల్లనైనది. ఐనను లోకరక్షణ కృపాలుడైన ఆ పరమేశ్వరునికి అది ఆభరణమే అయినది. (43)

శ్లో॥ తప్యంతే లోక తాపేన సాధవః ప్రాయశో జనాః ।
పరమారాధనం తద్ధి పురుషస్యాఖిలాత్మనః ॥44॥

జగత్తు దుఃఖమునకు బాధపడుట పరమదయాళురైన మహాత్ములకు సహజమైన స్వభావము. సర్వజీవులు తమనుగా భావించుచు ఎల్ల లోకములకు శ్రేయస్సును కోరునట్టి పురుషులకు లోకమును సంతోష పెట్టుటయే నైజము కదా. (44)

శ్లో॥ నిశమ్య కర్మ తచ్ఛంభోః దేవ దేవస్య మీఢుషః ।
ప్రజా దాక్షయణీ బ్రహ్మ వైకుంఠశ్చ శశంసిరే ॥45॥

దేవ దేవుడు, భక్తులకు సుఖమును కలిగించువాడైన ఈశ్వరుని యొక్క హాలాహలభంజనమనే ( భక్షణము ) అద్భుత కర్మను చూచి దేవాసురులు, సతీదేవి, బ్రహ్మదేవుడు, శ్రీమహా విష్ణువు గొప్పగా ప్రశంసించినారు. (45)

టీ :-తస్యేతి. జలకల్మషం జలదోషః విషం. యస్మాత్తం,గళే నీలం చకార. సాధోః కృపాళో ః. ॥43,44,45॥

శ్లో॥ ప్రసన్నం పిబతః పాణేర్యత్కించిజ్జగృహుః స్మ తత్ ।
వృశ్చికాహి విషౌషధ్యో దంద శూకాశ్చయే పరే ॥46॥

టీ॥ ప్రస్కన్నమితి.ప్రస్కన్నం గళితం. అపరే చ యే సవిషాః. తేఽపి జగృహుః.అనేన విషస్య తీవ్రతోక్తా. ॥46॥

ఈశ్వరుడు చులుకమున ( అరచేత ) పట్టి విషమును త్రాగుచుండగా ఆయన అరచేతినుండి జారిన కొన్ని విషబిందువులను తేళ్లు, సర్పములు, ఇతర విష జంతువులు గ్రహించినవి. (46)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే అమృతమథనే,హాలాహల భక్షణం నామ సప్తమోధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే అమృతమథనము,హాలాహల భక్షణం అను సప్తమాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ అష్టమే మధ్యమానేబ్ధే లక్ష్యా విష్ణో వృతేసురైః ।
ధన్వంతరేర్వృతే సోమే మోహిన్యుద్భవ ఈర్యతే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ పీతే గరే వృషాంకేణ ప్రీతాస్తేమర దానవాః ।
మమంథుస్తరసా సింధుం హవిర్ధానీ తతో భవత్ ॥1॥

టీ :-పీత ఇతి. హవిర్ధానీ సురభిః. ॥1॥

శ్లో॥ తామగ్నిహోత్రీ మృషయో జగృహుర్బ్రహ్మ వాదినః ।
యజ్ఞస్య దేవయానస్య మేధ్యాయ హవిషేనృప ॥2॥

టీ :-తామితి. దేవయానస్య బ్రహ్మలోకమార్గప్రాపకస్య యజ్ఞస్య సంబంధినే హవిషే ॥2॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

అష్టమాధ్యాయమున మోహినీ అవతారము వర్ణితము. సముద్రమునుండి ధన్వంతరి అమృతభాండమును తీసుకొనిరాగా దాని కొఱకై రాక్షసులు లక్ష్మీసహితుడైన శ్రీమహా విష్ణువును చుట్టుముట్టినారు. వారిని వంచించుటకై శ్రీహరి మోహినీ రూపమును ధరించినాడు.

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈశ్వరుడు విషమును తాగిన (నిగ్రహించిన) తర్వాత దేవదానవులందరు తృప్తి పొందినారు. సముద్రమును ఇంకను వేగముగా చిలుకుటకు ఆరంభించిరి. అప్పుడు కామధేనువు ఉద్భవించినది. (1)

ఓ రాజా ! ఆత్మ జ్ఞాన పరాయణులైన మహామునులు బ్రహ్మలోక స్థితిని కలిగించు పవిత్రమైన యజ్ఞములను నిర్వహించుటకు అవసరమైన హోమద్రవ్యములైన పాలు, పెరుగు, నెయ్యి, గోమూత్రం, గోమయం, పంచగవ్యములను ప్రసాదించునట్టి అగ్నిహోత్రి అని కామధేనువును గ్రహించినారు. (2)

శ్లో॥ తత ఉచ్చైశ్రవానామ హయోభూచ్చంద్ర పాండురః ।
తస్మిన్ బలి స్పృహాం చక్రేనేంద్ర ఈశ్వర శిక్షయా ॥3॥

టీ :-తత ఇతి. ఈశ్వరశిక్షయా ప్రాగేవకృతయా ॥3॥

తర్వాత ఉచ్చైశ్రవమను పేరుగల తెల్లని గుఱ్ఱము సముద్రమునుండి పుట్టినది. దానిని బలి చక్రవర్తి కోరినాడు. ఈశ్వరుడు వారించినందున ఇంద్రుడు దానిని ఆశించలేదు. (3)

శ్లో॥ తత ఐరావతో నామ వారణేంద్రో వినిర్గతః ।
దంతైశ్చతుర్భిః శ్వేతాద్రేర్హరన్భగవతో మహిమ్ ॥4॥

ఆ తర్వాత ఐరావతమను పేరుగల తెల్ల ఏనుగు సముద్రమున ఉద్భవించినది. అది ఈశ్వరుని వాస స్థానమైన తెల్లటి పర్వతము కైలాసము యొక్క మహిమను, గొప్పదనమును శిఖరకల్పములైన తన నాలుగు దంతములతో హరించి మిక్కిలి తెల్లనిదై ప్రకాశించినది. (4)

శ్లో॥ కౌస్తుభాఖ్యహభూద్రత్నం పద్మరాగో మహోదధేః ।
తస్మిన్ హరిః స్పృహాం చక్రే వక్షోలంకరణే మణౌ ॥5॥

టీ :-తత ఇతి.శ్వేతాద్రిః లాసః తస్య మహి మహిమానం దంతైః శిఖరతుల్యైః హరన్ చంద్రవత్పాండర ఇత్యనుషంగః ॥4,5॥

అప్పుడు సముద్రమునందు కౌస్తుభమను పేరు గలిగిన పద్మరాగమణి వుద్భవించినది. దానిని విష్ణువు తన వక్షస్థలమున అలంకారముగా స్వీకరించినాడు. (5)

శ్లో॥ తతో భవత్పారిజాతః సురలోక విభూషణమ్ ।
పూరయత్యర్థినో యోర్థైః శశ్వద్భువి యథాభవన్ ॥6॥

టీ :-తతశ్చేతి. వల్గుభిః గత్యాదిభిః స్వర్గిణాం రమణ్యః రతికర్త్ర్యః. ॥6॥

పిమ్మట స్వర్గమునకు అలంకారముగా పారిజాత వృక్షము పుట్టినది. అది అర్థించిన వారి ఎల్లకోరికలను తీర్చగలదు. నిరంతరము ఈ భవిపై నీవు అర్థుల సర్వకామములను తీర్చునట్లుగా అని పరీక్షిత్తునుద్దేశించి శుకుని మాట. (6)

శ్లో॥ తత అప్సరసో జాతా నిష్కకంఠ్యః సువాససః ।
రమణ్యః స్వర్గిణాం వల్గు గతి లీలా విలోకనైః ॥7॥

టీ :-తత ఇతి. సుదామార్వతః. తత్రైకస్యాం దిశి జాతా సౌదామినీ స్ఫటికమణిమయగిరిశృంగేష్వధికం విస్ఫురంతీ విద్యుదివంత్యా దిశో రంజయంతీ. శ్రీః సంపత్. సాక్షాన్మూర్తి ధారిణీ సతీ. సైవ భగవత్పరా రమా. విరభూదిత్యర్థః. ॥7॥

పిమ్మట అప్సర స్త్రీలు జన్మించినారు. కాసులదండ అని ప్రస్తుతము పిలువబడుచున్న ఒక సువర్ణహారము కంఠమందుకల, చక్కని వస్త్రములు, మనోహరమైన నడకలు, విలాసమైన చూపులు కలవారై స్వర్గవాసులకు ప్రీతిని కలిగించు భోగకాంతలు అయినారు. (7)

శ్లో॥ తతశ్చావిరభూత్సాక్షాచ్ఛ్రీరమా భగవత్పరా ।
రంజయంతీ దిశః కాంత్యా విద్యుత్సౌదామనీ యథా॥8॥

టీ :-తస్యామితి.తస్యాం రూపాదిమహిమ్నా ఆక్షిప్తం చేతో యేషాం. ॥8॥

పిమ్మట భగవత్పర (భగవంతునికి చెందిన) అయిన సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి అవతరించినది. సుదామమను ఐరావతముతో కూడి యుండునది, సుదామమనెడి పర్వతమునకు ఒక వైపున ఉండి ప్రకాశించునది సౌదామిని. స్ఫటికనిర్మితమైన పర్వతశిఖరములకంటె అధికముగా ప్రకాశించునది విద్యుత్తు (విశేషముగా ప్రకాశించునది). ఆ లక్ష్మీదేవి విద్యుత్తువలె సర్వదిక్కులను తన శరీర కాంతితో ప్రకాశింపజేసినది.(8)

శ్లో॥ తస్యాం చక్రుః స్పృహాం సర్వేససురాసుర మానవాః ।
రూపౌదార్య వయోవర్ణ మహిమాక్షిప్త చేతసః ॥9॥

టీ :-భగవద్వక్షసి తయా శ్రియా విలోకితానాం దేవానాం యథాపూర్వం సర్వసంపత్ప్రాప్తిం.అసురాణాం చ తద్వి ర్యయం

ఆ లక్ష్మీదేవి సౌందర్యము, మహనీయత, వయస్సు, ఔన్నత్యములచేత ఆకర్షింపబడిన మనస్సుకలవారై సకల దేవతలు, రాక్షసులు, మానవులు ఆమెను కాంక్షించిరి. (9)

వక్తుం తస్యా అభిషేకాదిమహోత్సవపూర్వకం.బ్రహ్మాదిపరిహారేణ భగవత్ప్రాప్తి ప్రకారం తావదాహ తస్యా ఆసన మిత్యారభ్య అథాసీద్వారుణీత్యతః ప్రాక్తనేనగ్రంథేన. ॥9॥

శ్లో॥ తస్యా ఆసన మానిన్యే మహేంద్రో మహదద్భుతమ్ ।
మూర్తి మత్యః సరిచ్ఛ్రేష్టా హేమకుంభైర్జలం శుచి ॥10॥

టీ :- అభిషేచనికా తి. అభిషేచనికాః. అభిషేకోచితాః. పంచపవిత్రాణి పంచగవ్యాని. మధుమాధవౌ చైత్రవైశాఖౌతద్భం ఫలపుష్పాది. పాఠాం తరే-పి.ద్వంద్వైక్యే స ఏవార్థః. మధుమాసే భవం మధ్వితి వా. ॥10॥

మహేంద్రుడు ఆ లోకమోహనయైన లక్ష్మీదేవికి గొప్ప అద్భుతాసనమును, సర్వనదీ నదములు సశరీరములై అర్ఘ్య, పాద్య, ఆచమన, స్నానవిధులకై బంగారు కలశములతో నిర్మల జలములను సమకూర్చిరి. శ్రీమహా విష్ణువు వక్షస్థలమున నున్న లక్ష్మీదేవి చూపుల ప్రసాదము లభించిన దేవతలకు పూర్వము వలెనే సంపదలు, ఆమె దృష్టి నోచని రాక్షసులు దారిద్ర్యమును, నష్టములు ప్రాప్తించుటను చెప్పుటకు అభిషేకాది ఉత్సవరూపముగా (బ్రహ్మేశ్వరాదులను మినహాయించి) భగవదనుగ్రహ విధమును చెప్పుచున్నాడు. వారుణియైన (సముద్రజాత అయిన) లక్ష్మీదేవి ఇక్కడ వెలయుగాతయని ఆసనార్ఘ్యపాద్యాదులు సమర్పించిరని. (పూర్వ గ్రంథమున) (10)

శ్లో॥ ఆభిషేచనికా భూమిరాహరత్సకలౌషధీః ।
గావః పంచ పవిత్రాణి వసంతో మధు మాధవౌ ॥11॥

జల ప్రోక్షితమైన భూమి పంచపల్లవములను (ఓషధులను), గోవులు పంచగవ్యమును (పాలు, పెరుగు, నెయ్యి, పంచితము, గోమయము), వసంతుడు తేనెను (ఇప్ప పూవుల మకరందమును) సమర్పించిరి. (11)

శ్లో॥ ఋషయః కల్పయాం చక్రు రభిషేకం యథావిధి ।
జగుర్భద్రాణి గంధర్వా నాట్యస్య నన్నృతుర్జగుః ॥12॥

సశాస్త్రీయముగా దేవిని అభిషేకించుటకై మునీశ్వరులు కల్పమును చెప్పిరి. గంధర్వ కామినులు మంగళకరమైన స్తుతులను పాడుచు నాట్యము సల్పిరి.(12)

శ్లో॥ మేఘా మృదంగ పణవమురజానక గోముఖాన్ ।
వ్యనాదయన్ శంఖ వేణు వీణాస్తుముల నిఃస్వనాన్॥13॥

మేఘములు మద్దెల, తప్పెట, భేరి, గోముఖము, శంఖము, వేణువు, వీణ మొదలైన మంగళవాద్యములను ప్రోగించినవి. (13)

శ్లో॥ తతోఽభిషిచుర్దేవీం శ్రియం పద్మకరాం సతీమ్ ।
దిగ్గజాః పూర్ణకలశైః సూక్త వాక్యైర్ద్విజేరితైః ॥14॥

అప్పుడు బ్రహ్మ వేత్తలు శ్రీసూక్తాది స్తుతులను స్వరయుక్తముగా గానము చేయుచుండగా దిగ్గజములు పూర్ణకలశములతో పద్మహస్త అయిన శ్రీదేవిని అభిషేకించినవి . (14)

శ్లో॥ సముద్రః పీత కౌశేయ వాససీ సముపాహరత్ ।
వరుణః స్రజం వైజయంతీం మధునా మత్త షట్పదమ్ ॥15॥

సముద్రుడు పీతాంబర యుగళమును, మధువును గ్రోలుటకు మూగిన తుమ్మెదతో విరాజిల్లు సువాసనా భరితమైన వైజయంతీమాలను వరుణుడు శ్రీదేవికి సమర్పించినారు. (15)

శ్లో॥ భూషణాని విచిత్రాణి విశ్వకర్మా ప్రజాపతిః ।
హారం సరస్వతీ పద్మమజో నాగాశ్చ కుండలే ॥16॥

చిత్రవిచిత్రములైన ఆభరణములను ప్రజాపతియైన విశ్వకర్మ, ముత్యాలహారమును సరస్వతీదేవి, బ్రహ్మదేవుడు పద్మమును, నాగులు కుండలముల జంటను సమర్పించినారు.(16)

శ్లో॥ తతః కృతస్వస్త్యయనోత్పల స్రజం
న దద్విరేఫాం పరిగృహ్య పాణినా ।
చచాల వక్త్రం సుకపోల కుండలం
సవ్రీడహాసం దధతీ సు శోభనమ్ ॥17॥

పిమ్మట స్వస్త్యయనము మంగళములకు స్థానమైన మకరంద పానమున మత్తుగా ధ్వనించు తుమ్మెదలు చుట్టుముట్టిన పద్మమాలను లక్ష్మీదేవి తన హస్తాబ్జములతో స్వీకరించినది. చక్కని చెక్కిళ్ళపై ప్రకాశించు కుండలముల కాంతితో వన్నెకెక్కిన ముఖము వయ్యారముగా త్రిప్పినది. మంగళకరమైన సిగ్గులు వెదజల్లు చిరునవ్వు నవ్వినది. (17)

టీ :-ఋషయ ఇతి. అభిషేకం అభిషేకోచితం విధిం. నట్యః నటానాం స్త్రియః. మేఘా ఇతి. శంఖవేణువీణాశ్చ. వ్యనాదయన్. తుములోనిస్వనో యేషాం తాన్ మృదంగాదీన్. ॥11- 17॥

శ్లో॥ స్తనద్వయం చారుకృశోదరీ సమం
నిరంతరం చందన కుంకుమోక్షితమ్ ।
తతస్తతో నూపుర వల్గు సింజితై
ర్విసర్పతీ హేమలతేవ సా బభౌ ॥18॥

మిక్కిలి సన్నని నడుముతో, ఎల్లప్పుడు మంచి గంధము, కుంకుమ పొడులు చల్లబడిన సమాన పరిమాణముతో ఒప్పు స్తనములతో మనోహరమైనదై అప్పుడప్పుడు కాలి అందెలు రమణీయముగా మ్రోగుచుండగా ఆ లక్ష్మీదేవి సంచరించు బంగారు తీగవలె భాసించినది. (సంచారిణియైన స్వర్ణలతవలె నడయాడినదని భావము) . (18)

టీ :-విలోకయంతీతి. ధ్రువం నిత్యం. పదం ఆశ్రయః. అవ్యభిచారిణో నిత్యాః సంతో గుణాః యస్మిన్ తన్నాన్వవిందత క్వచిత్కస్యచిద్దోషస్య సద్భావాత్. ॥18॥

శ్లో॥ విలోకయంతీ నిరవద్యమాత్మనః
పదం ధ్రువంచావ్యభిచారి సద్గుణమ్ ।
గంధర్వ యక్షసుర సిద్ధచారణ
త్రైవిష్ట పేయాదిషు నాన్వవిందత ॥19॥

టీ :-తదేవాహ త్రిభిః. నూనమితి. మన్యునిర్జయో నాస్తిదుర్వాసః ప్రభృతిషు గురుశుక్రాదిషు సంగవర్జితం. జ్ఞానం నాస్తి. మహత్త్వే-పి బ్రహ్మసోమాదౌ న కామనిర్జయః పరితో వ్యపాశ్రయః పరాపేక్షః ఇంద్రాదిః స కిమీశ్వరః. ॥19॥

తన చుట్టు త్రివిష్టప వాసులైన గంధర్వ, యక్ష, రాక్షస, సిద్ధ, చారణాదులను చూచుచు వీరందరితో ఎన్నడూ మార్పులేని ( అవ్యభిచారి ), మచ్చలేని నిత్యమైన ఆశ్రయము తనకు ఎవ్వరా అనగా వీరందరిలో ఎవ్వరిని వరింపవలెనా అని తనలో విచారించినది (ఎందుకంటే ప్రతివానిలోను ఏదో ఒక దోషము కనపడుచున్నది) (19)

శ్లో॥ నూనం తపోయస్య న మన్యు నిర్జయో
జ్ఞానం క్వచిత్తచ్చ న సంగ వర్జితమ్ ।
కశ్చిన్మహంస్తస్య న కామ నిర్జయః
స ఈశ్వరః కిం పరతో వ్యపాశ్రయః ॥20॥

టీ :-ధర్మ ఇతి. న భూతసౌహృదం పరశురామాదిషు. న ముక్తికారణం. త్యాగః. శిబిప్రభృతిషు. పుంసః కార్తవీర్యాదే ర్వీర్యమస్తి. అజవేగనిష్కృతం పరిహృతం త్యక్తం న భవతి. అపితు కాలవేగనాశిత మేవేతి భావః. గుణసంగవర్జితః సనకాదిః ద్వితీయః మమ పరః. న హి సమాధినిష్ఠత్వాత్. 20

సత్యముగా మహాతపస్సంపన్నులైనను దుర్వాసాదులు కోపమును జయించలేకపోయిరి. అపారమైన జ్ఞానమున్నను బృహస్పతి, శుక్రాచార్యులందు సంగమును, బంధమును ( ఇతర గ్రహ సంబంధమును ) వీడలేకపోయిరి. అధికమైన ప్రతిభావంతులైనను బ్రహ్మ, కుబేరుడు మొదలైనవారు కామమునకు బానిసలు. ఇంద్రాదులందు పరాపేక్ష. ఈ విధముగా ఇన్ని దోషములతో కూడిన వారు నాకెట్లు ఈశ్వరులగుదురని శ్రీదేవి తనలో వితర్కించినది. (20)

శ్లో॥ ధర్మః క్వచిత్తత్ర నభూత సౌహృదం
త్యాగః క్వచిత్తత్ర న ముక్తి కారణమ్ ।
వీర్యం న పుంసోస్త్యజవేగ నిష్కృతం
నహి ద్వితీయో గుణసంగ వర్జితః ॥21॥

టీ :– క్వచిదితి. చిరాయుష్యపి మార్కండేయాదౌ శీలమంగళం నాస్తి ఇంద్రియదమనశీలత్వాత్. క్వచిత్త దప్యస్తి హిరణ్యకశిపుప్రభృతౌ, ఆయుషస్తు స్థైర్యం న వేద్యం దుర్విజ్ఞానం భగవద్ద్వేషేణాకస్మాదేవ మృత్యుసంభవాత్. యత్ర కుత్రచ శ్రీరుద్రే. మార్కండేయాదివత్. ఇంద్రియదమనాద్యభావాత్. శీలమంగళం ఆయుర్నిశ్చయశ్చేత్యుభయ మస్తి. న చాన్యః పూర్వోక్తః కశ్చిద్దోషః తథాపి సోఽప్య మంగళః. శ్మశానవాసాద్యమంగళచేష్టితః. శ్రీముకుందం లక్ష్మీకృత్యాహ కశ్చేతి. కశ్చిత్సు మంగళః నిరవద్యశ్చ స తు మాం న హి కాంక్షతె. ఆత్మారామత్వాత్. (21)

ధర్మమున్నను పరుశురామాదులందు భూతదయ లేదు. శిబి మొదలైనవారియందు త్యాగమున్నది కాని ముక్తి కాంక్షలేదు. పురుషులైన కార్తవీర్యాదులయందు పరాక్రమమున్నది కాని కాలవేగమును అధిగమించలేదు. అనగా ఎల్లప్పుడు విజయము సాధించలేదు. పరుశురాముని చేతిలో అతని పరాక్రమము నశించినది. సర్వసంగ పరిత్యాగులైన సనకసనందనాది యోగీశ్వరులు నిరంతరము యోగనిష్ఠలో యున్నందున నాకు ద్వితీయులు ఈశ్వరులు కాలేరు. (21)

శ్లో॥ క్వచిచ్చిరాయు ర్నహి శీల మంగలం
క్వచిత్తదప్యస్తి న వేద్యమాయుషః ।
యత్రోభయం కుత్ర వసోప్యమంగలః
సుమంగలః కశ్చన కాంక్షతే హిమామ్ ॥22॥

మార్కండేయాదులందు చిర ఈశిత్వమున్నను స్వభావ శుభము (శీలమంగళములేదు) . వారు కోరికలను (ఇంద్రియములను) అణచు కొన్నవారు కనుక సుఖములేదు. స్వాభావిక సుఖభోగులైన హిరణ్యకశిప్వాదులకు స్థిరమైన ఆయువు లేదు. వారికి ధర్మరక్షకుడైన విష్ణువుయొక్క విపరీత రూపధారణలతో మృత్యువు సిద్ధమగును. పరమేశ్వరుని యందు

టీ :- ఏవమితి.ఏవం విమృశ్యరమా నిరపేక్షమపి ముకుందమేవ వరం వవ్రే తత్కిం. అవ్యభిచారిభిః సద్భిర్ధర్మజ్ఞానాదిభిర్గుణైః నిజైకాశ్రయతయా చ నైరపేక్ష్యేణ వరం సర్వోత్తమం తత్రహేతుః అగుణాశ్రయం ప్రకృతిగుణాతీతం. పాఠాంతరేఽపి. అయమేవార్థః. అతేవ స్వస్యా ఈప్సితం కిం చ. సర్వైర్గుణైరణిమాదిభిరపే క్షితం వృతం అయం భావః. యద్యపి స్వయమాత్మారామత్వేన నిరపేక్షః. తథాప్యాశ్రితాః. అణిమాదిసిద్ధిర్యథా నోపేక్షతే. తావత్రైవ తత్సేవయాహం కృతార్థాస్యాం. కిమన్యైః ప్రాకృతైరితితమేవ వృతవతీతి. ॥22॥

మార్కండేయాదులవలె ఇంద్రియదమనత్వము లేనందున శీలమంగళము, ఆయువు రెండును వున్నవి. ఐనను దోషయుక్తమే. శ్మశానవాసము, చర్మధారణము, కపాలభక్షణము మొదలైన అమంగళములున్నందున వరుడుగా తగడు. చివరకు విష్ణువును గురించి చెప్పుచున్నది. ఒకానొకడు మాత్రము మంగళకరుడు, దోషరహితుడు అయినను ఆత్మారాముడై నన్ను కోరుటలేదని నిశ్చయించినది. (22)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం విమృశ్యా వ్యభిచారి సద్గుణైః
వరం నిజైకాశ్రయతా గుణాశ్రయమ్ ।
వవ్రేవరం సర్వగుణై రపేక్షితం
రమా ముకకుందం నిరపేక్ష మీప్సితమ్॥23॥

టీ :- తదేవాహ తస్యేతి తస్యాంసదేశే. కమనీయాం నవ కంజమాలాం. నిధాయ. తదనుగ్రహం. ప్రతీక్షమాణా తూష్ణీం తస్య నికటే తస్థౌ. కథంభూతాం? మాలాం? మాద్యంతో యే మధువ్రతాః.

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా ఆలోచించి రమాదేవి తనని కోరనివాడైనను ముకుందునే భర్తగా ఎన్నుకున్నది. మార్పులేని, నశించని జ్ఞానాది గుణములచేత తనకు ఆశ్రయమివ్వగలడని లోపములేని సర్వోత్తముని చేపట్ట దలచినది. నిర్గుణుడు అంటే ప్రకృతి గుణాలైన సత్వ రజ స్తమస్సులకంటే అతీతుడైనందుననే ఆయన నన్ను కోరనిది. ఇంకను అనేకములైన అణిమాది సర్వగుణములకు ఆశ్రితుడు. స్వయముగా ఆత్మారాముడై ఇతరములను కోరక తనను ఆశ్రయించిన అణిమాది సిద్ధులను తిరస్కరించినందున నన్ను కూడా విష్ణువు స్వీకరించడు.

తేషాం వరూథస్య యూథస్య గిరా ఉపఘుష్టాం నాదితాం కథంభూతా శ్రీః? సవ్రీడహాసేన వికసన్నయనాంతేన. తస్య ఉరః స్వధామ. యాతా సతీ. వక్షః ప్రతీక్షమాణా తస్థావిత్యర్థః. (23)

అట్లైనను ఆయన సేవచేత నేను తరింతును. ఇతర సామాన్యులవలన ప్రయోజనమేమని లక్ష్మీదేవి విష్ణువునే భర్తగా వరించినది. (23)

శ్లో॥ తస్యాంసదేశ ఉషతీం నవకంజమాలాం
మాధ్యన్మధువ్రత వరూథ గిరోప ఘుష్టామ్ ।
తస్థౌ నిధాయ నికటే తదురః స్వధామ
సవ్రీడ హాస వికసన్నయనేన యాతా ॥24॥

ఆ విష్ణుమూర్తి వక్షస్థలమున మనోహరమై మకరందపానముచే మదించి మధురముగా ధ్వనించు తుమ్మెదలతో ఆవరింపబడిన నూతన పద్మమాలను వేసి భర్తగా వరించి సిగ్గుతో చిఱునవ్వు నవ్వుచు వికసించు కన్నులతో అతని వక్షస్థలము తన ఇల్లుగా పొందుటకై ఆయన అనుగ్రహమును కాంక్షించుచు అతని సమీపమున ఊరక నిలుచున్నది.(24)

శ్లో॥ తస్యాః శ్రియ స్త్రిజగతో జనకో జనన్యాః
వక్షోనివాస మకరోత్పరమం విభూతేః ।
శ్రీః స్వాః ప్రజాః స కరుణేన నిరీక్షణేన
యత్ర స్థితై ధయత సాధిపతీం స్త్రిలోకాన్॥25॥

టీ :-భగవానపి త్రైలోక్యాభివృద్ధయే స్వవక్షస్తస్యాః స్థానం దదావిత్యాహ తస్యా ఇతి. విశిష్టా భూతయో విభవాః యస్యాః త్రిజగతో జనన్యాః శ్రియః.పరమం సుస్థిరం ఐధయత అపర్ధయత్. ॥24,25॥

విష్ణువు కూడా ముల్లోకముల అభివృద్ధి కొఱకై తన వక్షస్థలమును ఆ లక్ష్మీదేవికి స్థానముగా ఇచ్చినాడని చెప్పుచున్నాడు. అపారమైన విభూతులు కలిగినది, త్రిలోక జనని అయిన లక్ష్మీదేవి తన వక్షస్థలమున సుస్థిరమైన స్థానమును పొంది తన ప్రజలను, ప్రజాపతులను, ముల్లోకములను తన దయగల చూపులతో వృద్ధిపొందించగలదని విష్ణువు ఆ స్థానమును ఆమెకు కల్పించినాడు. (25)

శ్లో॥ శంఖతూర్య మృదంగానాం వాదిత్రాణాం పృథుః స్వనః
దేవానుగానాం స స్త్రీణాం నృత్యతాం గాయతామభూత్ ॥26॥

శంఖనాదము, మృదంగాది మంగళవాయిద్యముల మ్రోత మిన్ను ముట్టినది. దేవతలను అనుసరించుచున్న స్త్రీలు పాటలు పాడుచు నాట్యములు సల్పిరి. (26)

శ్లో॥ బ్రహ్మ రుద్రాగ్నిరో ముఖ్యాః సర్వే విశ్వ సృజే విభుమ్ ।
ఈడిరే–వితథైర్మంత్రై స్తల్లింగైః పుష్పవర్షిణః ॥27॥

బ్రహ్మ, రుద్రుడు, అగ్ని మొదలైన సర్వ ప్రజాపతులు పూలవర్షమును కురిపించుచు విష్ణు ప్రతిపాదకములై యదార్థతను ప్రకటించు మంత్రములతో స్తుతించిరి. (27)

శ్లో॥ శ్రియా విలోకితా దేవాః స ప్రజాపతయః ప్రజాః ।
శీలాది గుణసంపన్నాం లేభిరే నిర్వృతిం పరామ్॥28॥

లక్ష్మీదేవి అనుగ్రహముతో కూడిన కడగంటి చూపులలో పడిన దేవతలు, ప్రజాపతులు, ప్రజలు, శీలము, వ్రతము, దానము మొదలైన సద్గుణములతో కూడిన శ్రేష్ఠమైన సుఖమును పొందిరి. (28)

టీ :–బ్రహ్మేతి. తల్లింగైర్విష్ణుప్రతిపాదకైః. అవిత థైర్యథార్థైః. (26–28)

శ్లో॥ నిస్సత్వా లోలుపా రాజన్ నిరుద్యోగా గతత్రపాః ।
యదా చోపేక్షితా లక్ష్మ్యా బభూవుర్దైత్య దానవాః ॥29॥

ఓ రాజా ! లక్ష్మీదేవి నిర్లక్ష్యము చేసిన దైత్య దానవులు శక్తిహీనులు, వ్యామోహపరాయణులు, కర్తవ్యమూఢులు, సిగ్గులేని వారుగా అయినారు. 29

శ్లో॥ అథాసీద్వారుణీదేవీ కన్యా కమలలోచనా ।
అసురా జగృహుస్తాం వై హరేరనుమతేన తే ॥30॥

అప్పుడు వరుణ దేవతా సంబంధమైన అన్నమయమైన సుర ( మద్యము) పద్మనయన అయిన కన్యగా ఉద్భవించినది. విష్ణువు అనుమతితో రాక్షసులు సురను సేవించినారు.(30)

టీ :- అథేతి. వారుణీ వరుదైవత్యం. యదన్నం. తన్మయీ సురా. (29,30)

శ్లో॥ అథోదధేర్మథ్యమానాత్కాశ్యపై రమృతార్థిభిః ।
ఉదతిష్ఠన్మహారాజ ! పురుషః పరమాద్భుతః ॥31॥

అప్పుడు అమృతమును ఆశించిన కశ్యప ప్రజాపతి ప్రజలైన దేవదానవులు చేసిన సముద్రమథనము వలన మిక్కిలి అద్భుత తేజస్సుతో ఒకానొక దివ్యపురుషుడు ఆవిర్భవించినాడు. (31)

టీ :- దీర్ఘేతి. దీర్ఘౌ పీవరౌ దోర్దండౌ యస్య కంబుగ్రీవః. శంఖనాభిరివ త్రిరేఖా సువృత్తా గ్రీవా యస్య. (31)

శ్లో॥ దీర్ఘ పీవర దోర్దండః కంబుగ్రీవోఽరుణేక్షణః ।
శ్యామలస్తరుణః స్రగ్వీ సర్వాభరణ భూషితః ॥32॥

ఆ దివ్యపురుషుడు బలమై పొడవైన భుజములు, శంఖము వంటి కంఠము (శంఖనాభి వంటి మూడు రేఖలతో గుండ్రమైన కంఠము), ఎఱ్ఱని కన్నులు, చామన ఛాయ కలిగి పూలమాలలు, సర్వాభరణములతో అలంకృతుడైన యువకుడు. (32)

టీ :- పీతేతి. స్నిగ్ధః కుంచితశ్చ కేశానామంతో యస్య.॥32॥

శ్లో॥ పీతవాసా మహోరస్కః సుమృష్ట మణికుండలః ।
స్నిగ్ధకుంచిత కేశాంతః సుభగః సింహ విక్రమః॥33॥

ఆ దివ్య పురుషుడు పీతాంబరధారి. విశాలమైన వక్షస్థలము కలవాడు. చక్కగా ప్రకాశించు మణికుండలములతో నొప్పినవాడు. దట్టమై ఉంగరములుగా తిరిగిన వెండ్రుకలు కలవాడు. భాగ్యవంతుడు. కేసరి పరాక్రముడు. (33)

టీ :- అమృతేతి. ఇజ్యభాక్ యజ్ఞ భాగభోక్తా. ॥33॥

శ్లో॥ అమృతాపూర్ణ కలశం బిభ్రద్వలయ భూషితః ।
స వై భగవతః సాక్షాద్విష్ణోరంశాంశ సంభవః ॥34॥

ఆ పురుషుడు సాక్షాత్తు శ్రీమహా విష్ణువు అంశాంశనుండి సంభవించి మణి కంకణములు ప్రకాశించు చేతులందు అమృత కలశమును ధరించినాడు. (34)

శ్లో॥ ధన్వంతరిరితి ఖ్యాత ఆయుర్వేద దృగిజ్యభాక్ ।
తమాలోక్యాసురాః సర్వే కలశం చామృతా భృతమ్॥35॥

టీ :-తమితి. అమృతేన ఆభృతేన పరిపూర్ణం. ॥34,35॥

ఆ పురుషుడు ధన్వంతరి అను పేరుగల ఆయుర్వేద వైద్యుడు. యజ్ఞములందు హవిర్భాగము కలవాడు. ఆ పురుషుని చేతియందున్న అమృత పూర్ణమైన కలశమును చూచి రాక్షసులెల్లరు ( ముందరి శ్లోకముతో అన్వయము) (35)

శ్లో॥ లిప్సంతః సర్వ వస్తూని కలశం తరసా హరన్ ।
నీయమానేఽసురై స్తస్మిన్కలశేఽమృత భాజనే ॥36॥

టీ :-ఇతీతి. దైత్యానాం పరస్పరం కలహోత్పాదనేన యోగమాయయా మోహిన్యా. వః అర్థం సాధయిష్యామి. అతో మాఖిద్యతేతి. ఆహేతి శేషః. ॥36॥

అమృతపానము వలన బలము, తేజము మొదలైనవి ప్రాప్తించి సర్వ వస్తువులను సంపాదించుకొన వచ్చునను అభిప్రాయముతో ఆ అమృత కలశమును రాక్షసులు శీఘ్రముగా అపహరించిరి. (36)

శ్లో॥ విషణ్ణ మనసో దేవా హరిం శరణమాయయుః ।
ఇతి తద్దైన్యమాలోక్య భగవాన్ భృత్య కామకృత్ ।
మాఖిద్యత మిథోఽర్థం వః సాధయిష్యే స్వమాయయా ॥37॥

వికలిత హృదయులైన దేవతలు విష్ణువును శరణు వేడిరి. ఈ విధమైన దేవతల దీనావస్థను ఆ భక్తపాలన కళా పారీణుడైన విష్ణువు వారిని చింతించవద్దని ధైర్యము చెప్పి అమృతమునకై రాక్షసుల మధ్యనే పరస్పరము కలహమును కలిగించి యోగమాయచేత అనగా మోహినీ రూపధారణతో అమృత పానాసక్తులైన మీ

టీ :-తదేవాహ మిథ ఇతి. తర్షః కామః. తద్యుక్తాని చేతాంసి యేషాం. ఇత్యేవం సమబలానాం కలిరభూత్. ॥37॥

కోర్కె తీర్చెదనని సాంత్వన పర్చినాడు. (37)

శ్లో॥ మిథః కలిరభూత్తేషాం తదర్థే తర్ష చేతసామ్ ।
అహం పూర్వమహం పూర్వం న త్వం నత్వమితి ప్రభో ॥38॥

ఓ రాజా ! అమృతపానమునకై తహ తహ లందు కామముచే పీడితులైన, సమబలవంతులైన రాక్షసుల మధ్య నేను ముందు నేను ముందు, నీవు కాదు నీవు కాదు అంటూ గొప్ప కలహము మొదలైనది. (38)

శ్లో॥ దేవాః స్వభాగమర్హంతి యే తుల్యాయా స హేతవః ।
సత్రయాగ ఇవ తస్మిన్నేష ధర్మః సనాతనః ॥39॥

దుర్బలురైన దేవతలు ఆక్రోశించిన విధము చెప్పుచున్నాడు. దేవతలు కూడా సముద్ర మథనమున, అమృతోత్పాదనమున సమానమైన క్లేశమును పొంది దానిని సాధించినారు. కార్యఫలమునకు వారూ కారకులే. సత్రయాగమున అందరికీ సమాన ఫలితము లభించునట్లుగా దేవతలు అమృతమున తమ భాగమునకు అర్హులు. సత్రయాగమున పాల్గొన్న వారందరికి సమాన ఫలితము కలుగుట ప్రసిద్ధము. 'ఋద్ధికామాః సత్రమాసీరన్' అని, 'యే యజమానాస్తే ఋత్విజ ఇతి చ ' అని శృతి వాక్యములు (అంటూ కొందరు తమ వారిని నివారించిరని తర్వాత శ్లోకముతోఅన్వయము) (39)

శ్లో॥ ఇతి స్వ్వస్పృత్యషే ధన్వే దైతేయా జాతమత్సరాః ।
దుర్బలాః ప్రబలాన్ రాజన్ ! గృహీత కలశాన్ముహుః ॥40॥

ఆ విధముగా తమను అడ్డగించిన రాక్షసులను తిరస్కరించి మాత్సర్యముతో తమలో తాము బలవంతులైన దుష్ట రాక్షసులు బలహీనులైన వారినుండి మాటి మాటికి అమృతభాండమును లాగుకొనుచుండిరి.(40)

టీ :- దుర్బలానాం త్వాక్రోశప్రకారమాహ ద్వాభ్యాం. దేవా ఇతి. యే దేవాః తుల్యే ఆయాసే హేతవః సాధకాః, తుల్యఆయాసో హేతుశ్చ ధనాదిర్యేషామితి వా. సత్ర యాగే యథా సర్వేషాం సమం ఫలం తద్వత్ .తథా చ శ్రుతిః.బుద్ధికామాస్సత్రమాసీదన్నితి. యే యజమానాస్తే ఋత్విజ ఇతి చ. (38 - 40)

శ్లో॥ ఏతస్మిన్నంతరే విష్ణుః సర్వోపాయ విదీశ్వరః ।
యోషి ద్రూపమనిర్దేశ్యం దధార పరమాద్భుతమ్॥41

టీ :- తద్రూపం వర్ణయతి పంచభిః ప్రేక్షణీయేతి. ప్రేక్షణీయ ముత్పలమివ శ్యామం. సర్వేష్వవయవేషు సుందరం సమానయోః కర్ణయోరాభరణేయస్మిన్. సుకపోలం చతదుత్కృష్టనాసికం చాననేయస్మిన్. ॥41॥

రాక్షసులు ఈ విధముగా తమలో తాము కలహించుచుండగా సామదాన భేద దండోపాయములనే సమస్త ఉపాయముల తత్త్వమెరిగిన సర్వసమర్థుడైన విష్ణుమూర్తి నిరుపమాన సౌందర్య శోభితమై మిక్కిలి అద్భుతమైన స్త్రీరూపమును ధరించెను. (41)

శ్లో॥ ప్రేక్షణీయోత్పల శ్యామం సర్వావయవ సుందరమ్ ।
సమాన కర్ణాభరణం సుకపోలోన్ననాసనమ్ ॥42॥

టీ :- నవేతి.నవయౌవనేన నిర్వృత్తయోః ప్రవృద్ధయోః స్తనయోః భారేణేవ.కృశం ఉదరం యస్మిన్. ముఖస్యామోదః సౌరభః తస్మిన్నను రక్తానామళీనాం హుంకారేణ ఉద్విగ్నే లోచనే యస్మిన్. ॥42॥

ఐదు శ్లోకములతో ఆ జగన్మోహిని సౌందర్యమును వర్ణించుచున్నాడు. మనోహరమైన నల్ల కలువలవలె శ్యామల వర్ణముతో కూడిన శరీర కాంతి, అపురూపమైన అవయవముల పొందిక, చక్కని కమ్మలు, అందమైన చెక్కిళ్ళు, ఎత్తైన ముక్కుతో కూడిన ముఖము కలది ఆమె. (42)

శ్లో॥ నవయౌవన నిర్వృత్త స్తనభార కృశోదరమ్ ।
ముఖామోదాను రక్తాలి ఝుంకారోద్విగ్న లోచనమ్॥43॥

నూతన యవ్వనముచేత ఉత్పన్నమైన చక్కని, గుండ్రని స్తనముల జంట, సన్నని నడుము, నోటి సువాసనకు ఆకర్షితమై మత్తెక్కిన తుమ్మెదల ఝుంకారముతో విలాసముగా చలించు చూపులు ఆమెవి. (43)

టీ :-బిభ్రదితి.సుష్ఠుగ్రీవా యస్మిన్ కంఠే ఆభరణం యస్మిన్. తచ్చ తచ్చ. శోభనా గ్రీవా యేన తత్కంఠాభరణం యస్మిన్నితి వా. సుభు జయోరంగదాభ్యాం భూషితం.॥43॥

శ్లో॥ బిభ్రత్స్వకేశ భారేణ మాలా ముత్ఫుల్ల మల్లికామ్ ।
సుగ్రీవ కంఠాభరణం సుభుజాంగద భూషితమ్॥44॥

చక్కగా వికసించి చక్కని సువాసనను వెదజల్లు మల్లెల దండను తన సిగన సింగారించినది. అందమైన కంఠమున రమ్యమైన హారము, చక్కని భుజములందు నాగొత్తులను ఆ జగన్మోహిని ధరించినది. (44)

టీ :-విరజేతి. విరజాంబరేణ సంవీతో నితంబ ఏత ద్వీపః విశాలత్వాత్ తత్ర శోభా యస్యాః.తయా కాంచ్యా కషేణ విలసత్ వల్గు యథా భవత్యేవం చలతోశ్చ రణయోర్నూపురే యస్మిన్. 44

శ్లో॥ విరజాంబర సంవీత నితంబ ద్వీపశోభయా ।
కాంచ్యా ప్రవిలసద్వల్గు చలచ్చరణ నూపురమ్ ॥45॥

శుభ్రమైన వస్త్రము మీద బిగించిన చక్కని వడ్డాణముతో కూడిన ద్వీపముల వంటి విశాలమైన పిరుదుల కాంతితో, విశేషముగా ప్రకాశించు చక్కని కాలి అందెలతో ఆమె విరాజిల్లినది. (45)

శ్లో॥ సవ్రీడస్మిత విక్షిప్త భ్రూవిలాసావలోకనైః ।
దైత్య యూధప చేతస్సు కామ ముద్దీపయన్ ముహుః

॥46॥

సిగ్గుతో కూడిన చిఱునవ్వుతో అందముగా కంపించు కను బొమల విలాసముతో కూడిన చూపులతో ఆ జగన్మోహిని రాక్షస సైన్యాధిపతుల మనస్సులను మాటి మాటికి కామోద్రేకమును కలిగించినది. (46)

టీ :-సవ్రీడేతి. సవ్రీడేన స్మి తేన సహ విక్షిప్తా. కంపి తా యా భ్రూః తస్యా విలాసేన సహ యాన్యవలోకనాని తైర్దైత్యయూధపానాం చేతస్సు ముహుర్ముహుః కామముద్దీ పయన్. ॥45, 46॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
మోహినీ రూపధారణం నామ అష్టమోధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే మోహినీ రూపధారణం అను
అష్టమాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ నవమే మోహితైర్దైత్యై రర్పితేఽమృత భాజనే ।
తద్వంచనేన దేవేభ్యోఽమృతం దత్తంతయేర్యతే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ తే-న్యోన్యతో సురాః పాత్రం హరంతస్త్య క్త సౌహృదాః ।
క్షిపంతో దస్యు ధర్మేణ ఆయాంతీం దదృశుః స్త్రియమ్॥1

టీ :- నవమే మోహితైర్దైత్యై రర్పితేఽమృత భాజనే, తద్వంచనేన దేవేభ్యోఽమృతం దత్తంతయేర్యతే. ఇయం చాధ్యాయార్థ సూచికాకారికా కేషుచిద్వ్యాఖ్యాన గ్రంథేష్వన్యథా వర్తతే. తథాహి విమోహ్య నవమే దైత్యాన్ స్త్రీతన్వాపాయయన్ సురాన్, సుధాం తమశ్శిరశ్ఛిత్వా రక్షద్దేవానితీర్యతే. (1)

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

తొమ్మిదవ అధ్యాయమున జగన్మోహినీ రూపలావణ్యములకు భ్రమసిన రాక్షసులు సక్రమముగా అమృతమును విభజించి పంచుటకై ఆమెకు అమృత కలశమును అందించుట, ఆమె రాక్షసులను వంచించి దేవతలకు అమృత ప్రదానము చేయుట చెప్పబడును.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఒకరి నుండి మరొకరు అమృతకలశమును గుంజుకొనుచు, స్నేహము లేని వారైన అసురులు తమ రాక్షస ప్రవృత్తిని ప్రకటించుచుండగా వారి కెదురుగా వచ్చు ఒకానొక అద్భుత స్త్రీమూర్తిని దర్శించిరి. (1)

శ్లో॥ అహోరూప మహోధామ అహో అస్యా నవం వయః
ఇతి తే తామభిద్రుత్య పప్రచ్ఛుర్జాత హృచ్ఛయాః ॥2॥

టీ :-ఆహో ఇతి. అహో రూపం సౌందర్యం. ధామ ద్యుతిః ఇతి వదంతః కాత్వ మిత్యాదినా పప్రచ్ఛుః. ॥2॥

శ్లో॥ కా త్వం కంజపలాశాక్షి ! కుతోవా? కిం చికీర్షసి? ।
కస్యాపి వదలామోరు ! మథ్నంతీవ మనాంసినః ॥3॥

టీ :-కాత్వమితి. మథ్నంతీవ క్షోభయంతీవ. ॥3॥

శ్లో॥ న వయం త్వామరైర్దైత్యైః సిద్ధ గంధర్వ చారణైః ।
నా స్పృష్ట పూర్వాం జానీమో లోకేశైశ్చ కుతో నృభిః॥4॥

టీ :-కస్యాసీత్యయుక్తం పృష్టమస్మాభిః యతస్త్వం న కేన చిద్భుక్తపూర్వేత్యాహుః. నేతి. త్వా త్వాం అమరాదిభిరస్పృ ష్టపూర్వాం న జానీమ ఇతి న. కింతు జానీమ ఏవ. ॥4॥

రాక్షసులామెను చూచి ఆమె సౌందర్యమునకు, శరీరకాంతికి, నూతన యౌవన వికాసమునకు అబ్బురపడుచు కామ మోహితులై ఆమె వద్దకు పరిగెత్తుకొని వెళ్ళి అపారమైన ప్రీతితో ఆమె ఎవరు? ఎక్కడనుండి వచ్చినది? మొదలైన ప్రశ్నలు గుప్పించిరి.(2)

రాక్షసులు ఆ సుందరితో ఓ పద్మదళములవంటి కన్నులు కలదానా ! అందమైన ఊరువులు కలదానా ! నీవెవర్తెవు? ఎక్కడనుండి వచ్చితివి? ఏమి చేయుచున్నావు? ఎవరికి సంబంధించినదానవు? నీవు మా మనసులను క్షోభపెట్టుచున్నావు అన్నారు. (3)

నీవెవరి దానవు అని మేమడుగుట తగదు. ఎందుకంటే నిన్నింతకు ముందెవ్వరునూ చూచియుండలేదు అని చెప్పుచున్నాడు. మేమింతకు ముందెన్నడు నిన్ను చూడలేదు. దేవతలు, రాక్షసులు, సిద్ధులు, చారణులు ఇంతకు ముందు లేని నిన్నెరుగము. లోకేశులకే ఎరుగరాని నిన్ను మానవులెట్లు తెలియుదురు? ముందు తెలియకున్నను ఇప్పుడు తెలిసినదానవే అయినావు. అన్నారు రాక్షసులు. (4)

శ్లో॥ నూనం త్వం విధినా సుభ్రూః ! ప్రేసితాసి శరీరిణామ్ ।
సర్వేంద్రియ మనః ప్రీతిం విధాతుం స ఘృణేన కిమ్॥5॥

ఇది ఇటుండనీ. నీ దర్శనము మాకు ఈశ్వరుని అనుగ్రహము వలన కలిగినదని చెప్పుచున్నారు. ఓ సుందరీ ! దేహధారులకు సర్వేంద్రియములు, మనస్సునకు ప్రీతి కలిగించుటకై దయాపరుడైన దైవము నిన్ను పంపినదా? లేక నీవే మమ్మనుగ్రహింప నీ ఇష్టముతో వచ్చితివా? కాదు కాదు నీవు తప్పక దైవ ప్రేరణతో వచ్చినదానవే. అని రాక్షసులు తమలో తాము వితర్కించుకొనిరి.(5)

శ్లో॥ సాత్వం నః స్పర్ధమానానామేక వస్తుని మానిని ! ।
జ్ఞాతీనాం బద్ధవైరాణాం శం విధత్స్వ సు మధ్యమే॥6॥

టీ :-అస్మాకమితం త్వద్దర్శనం త్వీశ్వరేణైవ సంపాదిత మిత్యాహుః. నూనమితి. సర్వేంద్రియాణాం చ మనసశ్చ ప్రీతిం విధాతుం విధాత్రా సఘృణేన కిం ప్రేషితాసి? కిం వాయదృచ్ఛయై వాగతాసి ? నైనం. దైవేన నూనం ప్రేషితైవేత్యర్థః.(5,6)

ఓ మానవతీ ! సుందర మధ్యా ! అమృత పానమునకై వైరముతో పోటీపడు మా అన్నదమ్ముల కలహమును నివారించి మా అందరికి సక్రమముగా అమృతమును పంచి మాకు శుభమును కలిగించుమని రాక్షసులా జగన్మోహినిని ప్రార్థించినారు. (6)

శ్లో॥ వయం కశ్యప దాయాదా భ్రాతరః కృత పౌరుషాః ।
విభజ్య యథాన్యాయం నైవ భేదో యథా భవేత్ ॥7॥

మేము కశ్యప ప్రజాపతి పుత్రులము. సోదరులము. అపారమైన బల పరాక్రమాలు కలవారము. నీవు మాలో వైరము కలుగ కుండునట్లుగా, న్యాయ సమ్మతముగా ఎవరి భాగమును వారికి ఈ అమృతమును పంచుమని కోరినారు. (7)

శ్లో॥ ఇత్యుపామంత్రితో దైత్యైర్మాయా యోషి ద్వపుర్హరిః ।
ప్రహస్య రుచిరాపాంగైః నిరీక్షన్నిదమబ్రవీత్ ॥8॥

టీ :- వయమితి. భేదో విగ్రహో యథా న భవేత్తథా. ॥-,8॥

ఈ విధముగా రాక్షసులు ప్రార్థించగా తన మాయతో జగన్మోహిని రూపమును ధరించిన శ్రీమహా విష్ణువు చిరునవ్వు నవ్వి అందమైన కడగంటి చూపుతో వారిని చూచుచు ఈ విధముగా చెప్పినది.(8)

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ కథం కశ్యపదాయాదాః పుంశ్చల్యాంమయి సంగతాః ।
విశ్వాసం పండితో జాతు కామినీషు న యాంతి హి॥9॥

టీ :-కథమితి. సంగతా అనుసృతాః. ॥9॥

**శ్రీహరి వారితో ఇట్లు చెప్పినాడు :-**

మీరు కశ్యప ప్రజాపతి సంతానమై వుండి కూడా నా వంటి వేశ్యను ఎందుకు ఆశించినారు? న్యాయధర్మములు చక్కగా తెలిసిన పండితులు ఎన్నడును చపల చిత్తలైన స్త్రీలను విశ్వసించుట తగదు కదా ! (9)

శ్లో॥ సాలా వృకాణాం స్త్రీణాం చ స్వైరిణీనాం సురద్విషః ।
సఖ్యాన్యాహు రనిత్యాని నూత్నం నూత్నం విచిన్వతామ్ ॥10॥

టీ :-సాలావృకాణామితి. హే సురద్విషః. ॥10॥

ఓ రాక్షస శ్రేష్ఠులారా ! కుక్కలు, నక్కలు, కోతులు, తోడేళ్ళు మొదలైన వంచించు లక్షణము కలిగిన జంతువులతో, వేశ్యలైన స్త్రీలతో స్నేహము స్థిరముగా నుండదు. అవసరమైనప్పుడు వారు మోసగింతురని భావము. క్షుద్రములైన వంచక మృగములు వేశ్యలు వారి అవసరము తగినట్లుగా నిత్యము క్రొత్తమార్గములను అన్వేశింతురు. (10)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతితే క్ష్మైళి తై స్తస్యా ఆశ్వస్త మనసో-సురాః ।
జహసుర్భావ గంభీరం దదుశ్చామృత భాజనమ్॥11॥

టీ :-ఇతీతి. భావేన కేనాప్యభిప్రాయేణ.గంభీరం యథా భవత్యేవం జహాసుః. ॥11॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా జగన్మోహిని యొక్క పరిహాస పూర్వకమైన మాటలతో ఆమెను విశ్వసించిన మనస్సుగల వారైన రాక్షసులు భావ గంభీరముగా నవ్విరి. వెంటనే వారు మోహినికి విభాగనిమిత్తమై అమృత భాండమును అప్పగించినారు. (11)

శ్లో॥ తతో గృహీత్వామృత భాజనం హరిః
బభాష ఈషత్స్మిత శోభయా గిరా ।
యద్యభ్యుపేతం క్వచ సాధ్వ సాధువా
కృతం మయా వో విభజే సుధామిమామ్ ॥12॥

టీ :-తత ఇతి. ఈషత్స్మితేన శోభాయస్యాస్తయా మయా. కృతం. సాధు అసాధు వా.యద్యభ్యుపేతం అంగీకృతం. తర్హి విభజే.॥12॥

జగన్మోహినీ రూపుడైన విష్ణువు అప్పుడు ఆ అమృత కలశమును స్వీకరించి చిఱునవ్వుతో ప్రకాశించు పలుకులతో వారితో ఇట్లన్నాడు. ఒకవేళ మీకు నేను మంచిచేసినను, చెడు చేసినను మీరు అంగీకరించినచో నేనే అమృత విభాగమును చేసెదను అని రాక్షసులతో చెప్పినది. (12)

శ్లో॥ ఇత్యభి వ్యాహృతం తస్యా ఆకర్ణ్యాసుర పుంగవాః ।
అప్రమాణ విదస్తస్యా స్తత్తథే త్యన్వమం సత ॥13॥

మోహిని యొక్క ఈ మాటలు విని రాక్షస శ్రేష్ఠులు వాస్తవమును గ్రహించలేని వారై ఆమె చేసిన పనికి కట్టు బడిన వారైరి. (13)

శ్లో॥ అథో పోష్య కృతస్నానాహుత్వా చ హవిషాఽనలమ్ ।
దత్వా గోవిప్ర భూతేభ్యః కృత స్వస్త్యయనా ద్విజైః॥14॥

టీ :- ఇతీతి. అసురయూథపాః దైత్యశ్రేష్ఠాః. ప్రమాణమియత్తావ జానంతః ॥13,14॥

అప్పుడు సురాసుర దైత్య సమూహములు ఉపవాసము చేసి, పవిత్ర స్నానము చేసి, అగ్ని దేవునికి హవిస్సులు సమర్పించి, హోమముచేసి, బ్రాహ్మణులకు, గోవులకు, ఇతర జీవరాసులకు శుభములు కలిగించి, బ్రాహ్మణుల చేత స్వస్తివాచకములను పొందినారు. (14)

శ్లో॥ అథోపజోషం వాసాంసి పరిధాయాహతాని తే ।
కుశేషు ప్రావిశన్ సర్వే ప్రాగగ్రేష్వభి భూషితాః ॥15॥

టీ :- యథేతి. యథోపజోషం యథాప్రీతి. అహతస్య లక్షణం. శ్లో. "అహతం యంత్ర నిర్ముక్తంముక్తంవాసః స్వయంభువా,శస్తం తచ్ఛుభ కార్యేషు తావన్మాత్రేణ సర్వదా" ప్రాగగ్రేషు కుశేషు వివిశః15

వారి వారి ఇష్టానుసారముగా క్రొత్త వస్త్రములు ఆహతమైనవి ( ఆహత లక్షణము- " ఆహతం యంత్ర నిర్ముక ముక్తం వాసః స్వయంభువా । శస్తం తన్మాంగలికేషు తావన్మాతేన సర్వదా॥" మగ్గము నుండి అప్పుడే తయారైన కొత్త వస్త్రము ఆహతమని బ్రహ్మ నిర్దేశము. సర్వమంగళకరమైన వాటిలో అది శ్రేష్ఠము. ధరించి, తూర్పు అగ్రముగా నుండునట్టి దర్భాస్తరణములపై ఠీవిగా అలంకరింపబడిన వారై చక్కగా ఆసీనులై ఉండిరి.(15)

శ్లో॥ ప్రాఙ్ముఖేషూప విష్టేషు సురేషుదితి జేషుచ ।
ధూపామోదిత శాలాయాం జుష్టాయాం మాల్యదీపకైః ॥16॥

టీ :-ప్రాఙ్ముఖేతి. ధూపైరామోదితాయాం సురభీకృతాయాం శాలాయాం. ॥16॥

సువాసన ధూపములతో నిండినది, మాలలు, దీపములతో ప్రకాశించినది అయిన విశాలమైన చావడియందు దేవతలు, రాక్షసులు తూర్పుముఖముగా బారులు తీరి కూర్చొనిరి. (16)

శ్లో॥ తస్యాం నరేంద్ర ! కరభోరు రుశద్దుకూల
శ్రోణీ తటాలస గతిర్మదవిహ్వలాక్షీ ।
సా కూజతీ కనక నూపుర శింజితేన
కుంభస్తనీ కలశపాణి రథావివేశ ॥17॥

టీ :-తస్యామితి. హేనరేంద్ర సా కలశపాణిరావివేశ. కథంభూతా. శ్లో. "మణిబంధాదాకనిష్ఠం కరస్య కరభోబహి" రిత్యమరః. కరభసదృశౌ సువృత్తావూరూ యస్యాస్సా. ఉశత్కమనీయం దుకూలం యస్మిన్. తేన శ్రోణీకటేన. విశాలయా శ్రోణ్యా అలసా మందా గతిర్యస్యాస్సా. పాఠాంతరే కరభ సదృశయోరూర్వోర్లసత్ దుకూలం యస్యాస్సా చాసౌ శ్రోణీ తటాలసగతిశ్చ. మదేన విహ్వలే ఆక్షిణీ యస్యాః.(17)

ఓ రాజా ! కరభము ( మణికట్టు మొదలు చిటికెన వ్రేలిదాకా గలచేతి వెలుపల చోటు- కరభము. 'మణిబంధాదా కనిష్ఠం కరస్య కరభో బహిః' ) వంటి గుండ్రనైన తొడలు కలిగినది, కమనీయమైన సన్నని వస్త్రము చేత ఆచ్ఛాదితమైన పిరుదుల భారము చేత మెల్లని నడకలు గలది, బంగారు అందెలు మధురముగా మ్రోగునది, బంగరు కుండలవంటి వక్షోజములు గలది, చేతిలో అమృత భాండమును పట్టుకొన్నది అయిన ఆ జగన్మోహిని అప్పుడా శాలలోనికి ప్రవేశించినది. (17)

శ్లో॥ తాం శ్రీ సఖీం కనక కుండల చారుకర్ణ
నాసా కపోల వదనాం పరదేవతాఖ్యామ్ ।
సంవీక్ష్య సంముముహురుత్స్మిక వీక్షణేన
దేవాసురా విగళిత స్తన పట్టికాం తామ్ ॥18॥

టీ :-తామితి. తాం శ్రియః సఖీం. సంవీక్ష్య దేవాః అసురాశ్చ.

బంగారు కుండలములతో రమణీయమైన చెవులు, అందమైన ముక్కు, ప్రకాశించు చెక్కిళ్ళు, సుందరమైన ముఖము కలిగి, జారిన స్తన వల్కలముతో పరదేవత అను పేరు కలది, లక్ష్మీదేవికి స్నేహితురాలైన ఆమెను దేవదానవులు చిరునవ్వుతో కూడిన చూపులతో చూచి విభ్రాంతులైరి.(18)

సంముముహుః కథంభూతాం? కనకమయే కుండలే యస్యాస్సా చాసౌ చారవః కర్ణాదయో యస్యాస్సా చ.విగళితో విస్రస్తః స్తన పట్టికాయా అంతో యస్యాః. ॥18॥

శ్లో॥ తాం అసురాణాం సుధాదానం సర్పాణామివ దుర్ణయమ్
మత్వా జాతి నృశంసానాం న తాం వ్యభజదచ్యుతః॥19॥

టీ :-ఏవం తాన్మోహయిత్వా. తాన్మోహయిత్వా. యత్కృతవా తదహ త్రిభిః అసురాణామితి.అసురాణాం సుధాదానం. సర్పాణాం క్షీరదానమివ దుర్ణయం అన్యాయ్యం. మత్వా తాం సుధాం తేభ్యోనవ్యభజత్ .అయం భావః. దైత్యైర్మదీయం సాధ్వసాధువాసర్వం అనుమతమేవ అతో మద్భక్త ే దేవానేవ సుధాం ప్రాయయిష్యామి కించ తైర్యథాన్యాయం విభజస్వేత్యుక్తం. న చై తేభ్యో జాత్యైవ క్రూరేభ్యో దానం న్యాయ్యం. అతస్తేభ్యః సుధాం న దదామీతి. ॥19॥

ఈ విధముగా వారిని మోహింపజేసి మోహిని ఏమి చేసినదో మూడు శ్లోకములతో చెప్పుచున్నాడు. రాక్షసులకు అమృతప్రదానము చేయుట సర్పములకు పాలు పోయుటవలె అన్యాయమని భావించి అమృతమును వారి కొఱకు విభాగము చేయలేదు. దీని అర్థమిది రాక్షసులకు నేను మంచి చేసినను, చెడు చేసినను కాదనువారు కారు. అందువలన నా భక్తులైన దేవతలకు మాత్రమే అమృతమును త్రాపుదును. రాక్షసులకు అన్యాయమగునని అమృతమును పంచియిచ్చుట తగదు. జన్మచేతనే క్రూర స్వభావులైన రాక్షసులకు అమృతమును పంచుట ఉచితము కాదు. అందువలన విష్ణువు వారికి అమృతమును విభజించలేదు. (19)

శ్లో॥ కల్పయిత్వా పృథక్పంక్తీరుభయేషాం జగత్పతిః ।
తాం శ్చోపవేశయామాస స్వేషు స్వేషు చ పంక్తిషు॥20

టీ :-కల్పయిత్వేతి. పఙ్క్తీః పృతక్ వివిక్తాః, కల్పయిత్వా

జగన్నాథుడు దేవతలకు, రాక్షసులకు వేరు వేరు పంక్తులను ఏర్పరిచి వారి వారి వరుసలలో వారి వారిని కూర్చొన నియోగించినాడు. ఒకరి వరుసలో మరొకరు అనగా దేవతల వరుసలో రాక్షసులు, రాక్షసుల వరుసలో

విధాయ. తాసు పృక్ష్విషు స్వేషు స్వేషు తత్తత్సజాతీయేషు. తాంశ్చ అసురానపి ప్రతారణార్థమేవోపవేశయామాస. ॥20॥

దేవతలు కూర్చొనకుండా కట్టు దిట్టము చేసినాడు. ఇట్లు రాక్షసులకు వేరే వరుసను ఏర్పరచుట వారిని వంచించుటకే. (20)

శ్లో॥ దైత్యాన్ గృహీత కలశో వంచయన్నుపసంచరైః ।
దూరస్థాన్ పాయయామాస జరామృత్యు హరాంసుధామ్॥21

టీ :-దైత్యానితి. ఉపసంచారైః బహుమానప్రిమవాక్యాదినా. తానతి క్రమ్యాత్రిక్రమ్యగమనైః దూరస్థానపి దేవానేన. (21)

అమృత కలశమును స్వీకరించి రాక్షసులతో గౌరవప్రదమైన ప్రియమైన మాటలతో మభ్యపెట్టుచు వారిని విలాసమైన నడకలతో అతిక్రమించి వంచించుచు దూరమున నున్న దేవతలకు ముసలితనము, మరణము లేనట్టి అమృతమును శ్రీమహా విష్ణువు పంచినాడు. (21)

శ్లో॥ తే పాలయంతః సమయ మసురాః స్వకృతం నృప ! ।
తూష్ణీమాసన్ కృతస్నేహాః స్త్రీవివాద జుగుప్సయా ॥22॥

టీ :-త ఇతి. తయా కృతః స్నేహోయేషు. స్త్రియా సహ వివాదస్య జుగుప్సయా. ॥22॥

ఓ రాజా ! రాక్షసులు వారు చేసిన ఒప్పందమునకు కట్టుబడి చెలిమిని పాటించి ఊరకే కూర్చుని యుండిరి. కాదు కూడదంటే స్త్రీతో గొడవపడినచో రోతయగునని మిన్నకుండిరి.(22)

శ్లో॥ తస్యాం కృతాతి ప్రణయాః ప్రణయా పాయ కాతరాః ।
బహమానేన చా బద్ధా నోచుః కించన విప్రియమ్॥23॥

ఆ జగన్మోహిని పట్ల రాక్షసులు ప్రేమభావనతో చూచుచున్నందున ఆమె పనిని అడ్డుకుంటే ఆమె ప్రేమకు దూరమౌదుమేమో అను భయముతో, ఈదేవతలు అశక్తులు అందువల్ల వారే ముందుగా కొంచెము సేవించనీ, మీరు మిక్కిలి బలవంతులు కనుక క్షణకాలము ఓపిక పట్టుడు. అని గౌరవ

టీ :-తస్యామితి. కృతః అతిప్రణయః స్నేహోయైః ణయాపాయేన కాతరాః భీతాః ఏతే తావత్కృపణాః పూర్వం తావత్పిబంతు యూయం తు క్షణం ప్రతీక్షధ్వమిత్యాది బహుమానేన చ. ఆబద్ధాః నియంత్రితాః. సమయపాలనాదిభిః డ్భిరేతైః కారణైరప్రియం కించిదపి నోచుః. కింతు తూష్ణీమాసన్. (23)

పూర్వకమైన మాటలతో నియంత్రితులై, తామే ముందుగా ఆమె ఏమి చేసినను కాదనమని ఒప్పందము చేసికొనుట, స్త్రీతో కలహించుట రోతయగునను కారణముచేత ఆ జగన్మోహినికి కొంచెము కూడా ఎదురు చెప్పలేక, రాక్షసులు ఊరకయే యుండిరి.(23)

శ్లో॥ దేవలింగ ప్రతిచ్ఛన్నః స్వర్భానుర్దేవ సంసది ।
ప్రవిష్టః సోమమపిబచ్చంద్రార్కాభ్యాం చ సూచితః॥24॥

టీ :-దేవేతి. దేవపంక్తౌ ద్రార్కయోర్మధ్యే ప్రవిష్టః సోమం. అమృతం అపిబత్. ॥24॥

దేవతా సముదాయము నందు దేవతల వేషమున మారురూపమున చంద్ర సూర్యుల నడుమ దేవతల పంక్తియందు కూర్చొని రాహువు అమృత పానమును చేసెను. ఆ విషయమును సూర్యచంద్రులు విష్ణువునకు తెలిపిరి. (24)

శ్లో॥ చక్రేణ క్షుర ధారేణ జహార పిబతః శిరః ।
హరిస్తస్య కబంధస్తు సుధయాఽప్లావితోఽపతత్॥25॥

టీ :-చక్రణేతి.హరిఃపిబతః తస్య శిరోహార.ఆప్లావితః అసంస్పృష్టః ॥25॥

విష్ణువు తన చేతియందలి సుదర్శన చక్రపుటంచుతో రాహువు శిరస్సును ఖండించినాడు. అమృతము తలనుండి ఇంకా క్రిందకు దిగకుండా ఉన్న రాహువు మొండెము క్రిందపడినది. (25)

శ్లో॥ శిరస్త్వమరతాం నీత మజోగ్రహమ చీక్లపత్ ।
యస్తు పర్వణి చంద్రార్కావభి ధావతి వైరధీః॥26॥

అమరత్వము పొందిన రాహువు తలను బ్రహ్మదేవుడు సూర్యాది గ్రహములవలె ఒక గ్రహముగా చేసి (ఛాయా గ్రహము) ఆకాశమున

నిలిపినాడు. వాడు వైర బుద్ధితో పర్వకాలములందు సూర్యచంద్రులను పట్టుచుండును. (26)

శ్లో॥ పీతప్రాయేఽమృతే దేవైర్భగవాన్ లోకభావనః ।
పశ్యతా మసురేంద్రాణాం స్వరూపం జగృహే హరిః॥27॥

టీ :–శిర ఇతి. గ్రహం సూర్యాదిపద్గ్రహత్వాధికారిణం. 26,27

ఒక్క బొట్టు కూడా రాక్షసులకు దొరకకుండా అమృతమంతయు దేవతలకు త్రాగించి లోకభావనుడైన హరి రాక్షస నాథులు కలతచెంది చూచుచుండగా తన రూపమును గ్రహించెను. (27)

శ్లో॥ ఏవం సురాసురగణాః సమదేశకాల
హేత్వర్థ కర్మ మతయోఽపి ఫలే వికల్పాః ।
తత్రామృతం సురగణాః ఫలమంజసాపుః
యత్పాద పంకజ రజశ్రయణాన్న దైత్యాః॥28॥

టీ :–రిభక్తానామేవోద్యమః ఫలతి. నాన్యేషామిత్యేవమాఖ్యానతాత్పర్యమా హ ఏవమితి. సమాః దేశా యో యోషాం. హేతుర్మందరాద్రిః. అర్థః సముద్రే క్షిప్తః వీరుధాది, వివిధః కల్పః ఫలం కేషాం జ్ఞాతం కేషాం చిన్నేతి వైచిత్ర్యం. యేషాం తే ఫలే వైషమ్యవంతో బభూవురిత్యర్థః. తదేవాహ త్ర తేషు యస్య పాదపంకజరజః శ్రయణాదేవామృతం ఫలమాపుః. స ఏవ సేవ్య ఇత్యర్థః. యత్త ర్నిత్యసంబంధాత్. ఏతదేవోపపాదయతి (28)

విష్ణు భక్తుల ప్రయత్నములే ఫలించును. ఇతరులకు ఫలించవని ఈ అమృత మథన కథా తత్త్వమును చెప్పుచున్నాడు. దేవతలు, రాక్షసులు ఒక్కచోటనే సముద్రమును చిలికినది. సముద్రమును చిలుకుటకు కవ్వముగా సాధనమైన మందరగిరి ఒక్కటే. వస్తువులు సముద్రమున వేసిన తృణలతా గుల్మాది ఓషధులు అనే సముద్రమును మథించినందువలన ఏమేమి పుట్టునో, ఎట్టి ఫలితము కలుగునో అను విషయము వారిరువురికి సమానమే. అయినా ఫలమును పొందుటలో భేదము కలవారైరని భావము. ఆ విషయమునే చెప్పుచున్నాడు. భగవంతుని పాదపంకజ రజమును ఆశ్రయించినందున దేవతలు అమృతమును పొందిరి. వారికి విష్ణువే శరణ్యుడని భావము. విష్ణువును ద్వేశించు వారైనందున రాక్షసులు శ్రమపడినను వారికి ఫలితము దక్కలేదు. 28

శ్లో॥ యద్యుజ్యతేఽసువసు కర్మ మనోవచోభిః
దేహాత్మా జాదిషు నృభిస్తద సత్పృథక్త్వాత్ ।
తైరేవ సద్భవతి యత్క్రియతేపృథక్త్వాత్
సర్వస్య తద్భవతి మూల నిశేచనం యత్॥29॥

టీ :– యదితి. అసుః ప్రాణః వసుధనం. తదసత్ వ్యర్థం భవతి. తః. పృథక్త్వాత్. భేదాశ్రయత్వాత్ శాఖానిషేచనవత్. తైరేవ ప్రాణాదిభిరీశ్వరోద్దేశేన యత్క్రి తే. తత్తు సన్మహాఫలం భవతి. కుతః? అపృథక్త్వాత్. ఈశ్వరస్య సర్వత్రానుషక్తత్వాత్. తత్ర దృంష్టాంతః యత్తరోర్మూలనిషేచనం, తత్ యథా సర్వస్యస్కంధ శాఖాదేరపి భవతి. యద్వాల్యబ్లోపే ంచమీ. పృథక్త్వం పర్యాలోచ్య. భేదదృష్ట్యా దేహాద్యుద్దేశేన యత్క్రియతే తదసత్. అపృథక్త్వం ర్యాలోచ్యేశ్వరదృష్ట్యా. తైరేవ తేష్వేవ యత్క్రియతే తత్సద్భవతీతి. శేషం సమానం.॥29॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
అమృత మథనే నవమోధ్యాయః

**శ్రీ గణేశాయ నమః**

ఈ విషయమునే ప్రతిపాదించుచున్నాడు. తమ శరీరము, పుత్రులు, సంపదలు మొదలైన వాని విషయమై ప్రాణము, ధనము, శ్రమ, మనస్సు, మాటలు మొదలైన వానిచేత మానవులు తమ ప్రయోజనములను సాధించుట కొఱకే చేసిన పనులు అసమర్థములగును. అంటే మానవుడు తమకు మేలు కలుగవలెనని సంకల్పించి చేసిన గట్టి ప్రయత్నము గూడా నిష్ఫలమౌతుంది. తాను వేరు, భగవంతుడు వేరు అనే ద్వైత భావనతో చేసినందున స్వార్థ ప్రయోజనములు సమకూరవు. చెట్టు మూలము వేరు, కొమ్మలు వేరనే భావనతో మూలమును విడిచి, పండ్లు కాయునవి కొమ్మలేకదా ! అని కొమ్మలను మాత్రమే తడిపినచో ఆ ప్రయత్నము వ్యర్థమగును. తన శ్రేయస్సు కొఱకు గాకుండా భగవంతునికి అర్పించి ( లోక కల్యాణము కొఱకై) చేసిన ప్రయత్నము మహా ఫలదాయకము కాగలదు. అభిన్నమైనందున ఈశ్వరుడు సర్వగతుడు అనే విషయమును దృష్టాంత పూర్వకముగా చెప్పుచున్నాడు. చెట్టు మూలమును తడిపినచో కొమ్ములు, ఆకులు, పూలు, కాయలు, ఫలములు ఎట్లు పొందునో అట్లే భగవంతుడు తృప్తి బొందిన ఎల్ల లోకములు తృప్తి బొందును. భేద భావమును భావించు, భేద దృష్టితో తమ (శరీరముల) కు మేలు కలిగించు పనులు అసత్ఫలదములు. అనగా ఆశించిన ఫలితము రాకపోగా, విపరీత ఫలితములను కలిగించును. అవే పనులు అభేద భావముతో, ఈశ్వర దృష్టితో చేసినచో ఎల్లరకు అది అనంత ఫలములను ప్రసాదించును. (29)

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే అమృత మథనమునందు
నవమాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ దశమే మత్సరాద్దైత్యై రారబ్ధేతు మృదే సురైః ।
దైత్యమాయా విషణ్ణేషు దేవేష్వావిర్బభౌ హరిః॥

శ్లో॥ తదేవమమృతావాప్తి ర్నా భక్తా నామితీరితమ్ ।
భక్త మత్సరతః ప్రాణహానిః పునరుదీర్యతే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతి దానవ దైతేయా నా విందం నమృతం నృప ।
యుక్తాః కర్మణి యత్తాశ్చ వాసుదేవ పరాఙ్ముఖాః ॥1॥

శ్లో॥ సాధయిత్వా మృతన్ రాజన్ !
పాయయిత్వా స్వకాన్ సురాన్।
పశ్యతాం సర్వభూతానాం
యయౌ గరుడ వాహనః ॥ 2 ॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

పదవ అధ్యాయమున ఈర్ష్యతో రాక్షసులు దేవతలతో యుద్ధమును ప్రారంభించగా దైత్యమాయలతో దేవత్వములు దీనత్వమును పొందగా విష్ణువు ప్రత్యక్షమగుట.

ఈ విధముగా భక్తులు కాని వారికి అమృతప్రాప్తి లేదని చెప్పుట, విష్ణుభక్తులను ద్వేషించుటవలన ప్రాణహాని కలదని చెప్పుట వర్ణితము.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! ఈ విధముగా విష్ణువును ఇష్టపడని ( ఆశ్రయించని ) దైత్య దానవులు అమృతోత్పత్తికి ప్రయత్నించినవారైనను, తమ భాగమును పొందవలసిన వారైనను అమృతమును పొందలేకపోయిరి. (1)

ఓ రాజా ! అమృతమును సాధించి, తన వారైన దేవతలకు అమృత భక్షణము చేయించి గరుడ వాహనమును అధిరోహించి సర్వ భూతములు చూచుచుండగనే శ్రీమహా విష్ణువు వైకుంఠమునకు వెళ్లినాడు. (2)

శ్లో॥ సపత్నానాం పరామృద్ధిం దృష్ట్వాతే దితి నందనాః ।
అమృష్యమాణా ఉత్పేతుః దేవాన్ ప్రత్యుద్యతాయుధాః॥3॥

తమ దాయాదులైన దేవతలయొక్క అమృతభక్షణమనే అభివృద్ధిని చూచి సహించలేని వారై రాక్షసులు దేవతలకు వ్యతిరేకముగా ఆయుధములను ధరించినవారై యుద్ధమున విరుచుకొని పడినారు. (3)

శ్లో॥ తతః సురగణాః సర్వే సుధయా పీతయైె ధితాః ।
ప్రతి సంయుయుధుః శస్త్రైః నారాయణ పదాశ్రయాః॥4॥

టీ :–దశమే మత్సరాద్దైత్యై రారబ్ధేతు మృదే సురైః ,దైత్యమాయా విషణ్ణేషు దేవేష్వావిర్బభౌ హరిః తదేవామమృతావాప్తిర్నా భక్తానామి తీరితమ్, భక్తమత్సరతః ప్రాణహానిః పునరుదీర్యతే. ॥1–4॥

అప్పుడు శ్రీమన్నారాయణుని పాదములను ఆశ్రయించిన దేవతలందరు అమృత పానము చేత వృద్ధిపొందిన వారై రాక్షసులతో ప్రతి ఆయుధములతో యుద్ధమునకు కడంగిరి. (4)

శ్లో॥ తత్ర దేవాసురో నామ రణః పరమదారుణః ।
రోధసుదన్వతో రాజన్ తుములో రోమహర్షణః ॥5॥

టీ :–తత్రేతి. రణః సంగ్రామః ఉదన్వతః సముద్రస్య. రోధసితీరే. బభేవ. ॥5॥

ఓ రాజా ! సముద్రతీరమున దేవాసుర రణమను పేరుతో వెంట్రుకలు నిక్కపొడుచు కొనునట్టి భయంకరమైన దొమ్మియుద్ధము జరిగినది.(5)

శ్లో॥ తత్రాన్యోన్యం సపత్నాస్తే సంరబ్ధమనసో రణే ।
సమాసాద్యాసిభిర్బాణైః నిజఘ్నుర్వివిధాయుధైః ॥6॥

అక్కడ దాయాదులైన దేవదానవులు యుద్ధమునందు ఇచ్ఛగలవారై కత్తులు, బాణములు మొదలగు పలురకములైన ఆయుధములను ధరించి పరస్పర సంహారమునకు సిద్ధపడిరి. (6)

శ్లో॥ శంఖతూర్య మృదంగానాం భేరీ డమరుణాం మహాన్ ।
హస్త్యశ్వరథపత్తీనాం నదతాం నిః స్వనోఽభవేత్ ॥7॥

శంఖము, తూర్యము, మద్దెల, భేరీ, డమరువు మొదలైన యుద్ధ వాద్యముల మ్రోతలు, ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, కాలిబంట్లు మొదలైన చతురంగ బలముల వలన కలిగిన భయంకర శబ్దములు భూమ్యాకాశములందంతట నిండిపోయినవి. (7)

శ్లో॥ రథినో రథిభి స్తత్ర పత్తిభిః సహపత్తయః ।
హయాహయైరిభాశ్చేభైః సమ సజ్జంత సంయుగే ॥8॥

యుద్ధమున రథికులు రథికులతో, కాల్బలము కాల్బలముతో, అశ్వికులు అశ్వికులతో, గజసైనికులు గజసైనికులతో ద్వంద్వ యుద్ధమున తలపడిరి. (8)

శ్లో॥ ఉష్ట్రైః కేచిదిభైః కేచిదపరే యుయుధుః ఖరైః ।
కేచిద్గౌర మృగైరృక్షైః ద్వీపిభిః హరిభిర్భటాః ॥9॥

కొందరు భటులు ఒంటెలు, ఏనుగులు, గాడిదలతోను, కొందరు భటులు గౌరమృగములు, ఎలుగుబంట్లు, చిఱుత పులులు, సింహములతో పోరాడిరి. (9)

శ్లో॥ గృధ్రైః కంకైః బకైరన్యేశ్యేన భాసై స్తిమింగలైః ।
శరభైర్మహిషైః ఖడ్గైర్గోవృషైః గవయారుణైః ॥10॥

కొందరు భటులు గ్రద్దలు, రాబందులు, డేగలు, కోళ్ళు, తిమింగలములు, శరభములు, ఎనుములు, ఖడ్గమృగములు, ఆవులు, ఎద్దులు, గవయవములు, అరుణములనెడి అడవి మృగములు మొదలైన వాహనములపై యుద్ధరంగమున ప్రవేశించిరని తర్వాతి శ్లోకముతో అన్వయము. (10)

శ్లో॥ శివాభిరాఖుభిః కేచిత్కృకలాసైః శశైర్నరైః ।
బస్తైరేకే కృష్ణసారైః హంసైరన్యే చ సూకరైః ॥11॥

కొందరు భటులు నక్కలు, పంది కొక్కులు, తొండలు, కుందేళ్ళు, మేకపోతులు, జింకలు, హంసలు, పందులు మొదలైన వాహనములపై యుద్ధరంగమున ప్రవేశించినారు. (11)

శ్లో॥ అన్యే జలస్థల ఖగైః సత్త్వైర్వికృత విగ్రహైః ।
సేనయో రుభయో రాజన్ ! వివిశుస్తేఽగ్రతోఽగ్రతః॥12॥

టీ :-తత్రేతి. అన్యోన్యం సమాసాద్య నిజఘ్నుః. ॥6-12॥

ఓ రాజా ! ఉభయసైన్యాలవారు ఇంకా అనేకములైన జలపక్షులు, స్థలపక్షులు, వికృతరూపముతోనున్న జంతువులపై నేను ముందు, నేను ముందని యుద్ధరంగమున ప్రవేశించినారు. (12)

శ్లో॥ చిత్రధ్వజపటైః రాజన్ ! ఆతపత్రైః సితామలైః ।
మహాధనై ర్వజ్రదండైః వ్యజనైర్బార్హ చామరైః ॥13॥

ఓ రాజా ! చిత్ర విచిత్రములై తమ తమ గుర్తులతో కూడిన ధ్వజములు, తెల్లని నిర్మలమైన గొడుగులు, చాలా గొప్ప వజ్రపు కామలు కలిగిన హస్తములందలి చామరములు, వింజామరలతో, నదుల సముదాయముతో సముద్రమువలె (దేవదానవ సైన్యములు ప్రకాశించినవని తర్వాతి శ్లోకముతో అన్వయము. ఇక్కడ ‘ మాదసాం ’ అనుష్టిికి తృతీయార్థము ) .. (13)

శ్లో॥ వాతోద్ధూతోత్తరోష్ణీషైః అర్చిభిర్వర్మ భూషణైః ।
స్ఫురద్భిర్విషదైః శస్త్రైః సుతరాం సూర్య రశ్మిభిః ॥14॥

టీ :-చిత్రేతి. చిత్రధ్వజపటాదిభిశ్చ. ॥13,14॥

గాలికి రెప రెపలాడు అంగవస్త్రములు, తలపాగాలతో, కవచములు, ఆభరణముల కాంతితో ప్రకాశించుచు ఎల్లప్పుడు సూర్యకిరణముల తేజముతో, నిర్మలమైన ఆయుధములతో (కూడిన సైన్యమని ముందరి శ్లోకముతో అన్వయము) (14)

శ్లో॥ దేవ దానవ వీరాణాం ధ్వజిన్యౌ పాండునందన ! ।
రేజతుర్వీర మాలాభిర్యాద సామివ సాగరౌ ॥15॥

ఓ పాండు నందనా ! దేవదానవ వీరుల యొక్క సైన్యములు వీరుల

టీ :- దేవదానవేతి. వీరాణాం మాలాధిభిః చామరాదిభిర్దేవ దానవవీ రాణాం ధ్వజిన్యౌ యదసాం. మాలాభిః. సాగరావివ రేజతురితి. త్రయాణామన్వయః. యాదోభిరితి వా. సితైరమలై రాతపత్రైశ్చ బార్హైశ్చామరైశ్చ. వాతేనోద్ధూతైరుత్తరీయైః ఉష్ణీషైశ్చ. సూర్యరశ్మిభిః సుతరాం స్ఫురద్భిః (15)

సముదాయముతో క్రూర జల జంతువులకు నిలయమైన రెండు సముద్రములవలె ప్రకాశించినవి. (15)

శ్లో॥ వైరోచనో బలిః సంఖ్యే సో-సురాణాం చమూపతిః ।
యానం వైహాయసం నామ కామగం మయనిర్మితమ్ ॥16॥

విరోచనుని పుత్రుడు రాక్షస సేనాధిపతి అయిన బలి చక్రవర్తి స్వేచ్ఛగా సంచరించగలది, మయుడు నిర్మించినదైన విహాయసమను పేరుగల విమానముపై (కూర్చుని ఉదయగిరిపై చంద్రునివలె ప్రకాశించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము). (16)

శ్లో॥ సర్వ సాంగ్రామికోపేతం సర్వాశ్చర్యమయం ప్రభో ! ।
అప్రతర్క్యమనిర్దేశ్యం దృశ్యమాన మదర్శనమ్ ॥17॥

ఓ రాజా ! ఆ విమానము సమస్తమైన యుద్ధ సంబంధమైన ఆయుధములు కలది. మిక్కిలి ఆశ్చర్యకరమైనది. అది ఊహకు అందనిది. ఇట్టిదని ప్రతిపాదింప వీలులేనిది. కంటికి కనుపించినను అదృశ్యముగా నున్నది. (17)

టీ :- వైరోచనిరితి. అసురాణాం యా చమూః తస్యాః పతిః స బలిర్యానమాస్థితః. ॥16,17॥

శ్లో॥ ఆస్థితస్త ద్విమానాగ్ర్యం సర్వానీకాధిపైర్వృతః ।
వాలవ్య జన ఛత్రాద్యై రేజే చంద్ర ఇవోదయే ॥18॥

సమస్త సైన్యాధిపతులు వెంటరాగా వింజామరలు, ఛత్రాదులతో కూడినవాడై ఆ విమానముపై బలి చక్రవర్తి ఆసీనుడై తూర్పు కొండపై ఉదయించు చంద్రునివలె విరాజిల్లినాడు. (18)

శ్లో॥ తస్యాసన్సర్వతో యానై ర్యూథానాం పతయోఽసురాః ।
నముచిః శంబరో బాణో విప్రచిత్తి రయోముఖః ॥19॥

ఆ బలి చక్రవర్తి చుట్టు వారి వారి వహనములతో నముచి, శంబరుడు, బాణుడు, విప్రచిత్తి, అయోముఖుడు మొదలైన రాక్షస సైన్యాధిపతులు (పరివేష్టించి యుండిరని తర్వాతి శ్లోకముతో అన్వయము ) .(19)

శ్లో॥ ద్విముఖః కాలనాభో-థ ప్రహేతిర్హేతి రిల్వలః ।
శకుని ర్భూత సంతాపో వజ్రదంష్ట్రో విరోచనః ॥20॥

ద్విముఖుడు, కాలనాభుడు, ప్రహేతి, హేతి, ఇల్వలుడు, శకుని, భూతసంతాపుడు, వజ్రదంష్ట్రుడు, విరోచనుడను వారలు బలి చక్రవర్తి చుట్టూ వుండిరి . (20)

శ్లో॥ హయగ్రీవః శంకుశిరాః కపిలో మేఘదుందుభిః ।
తారకశ్చోగ్రదృక్శుంభో నిశుంభో జంభ ఉత్కలః ॥21॥

హయగ్రీవుడు, శంకుశిరుడు, కపిలుడు, మేఘదుందుభి, తారకుడు,వుగ్రదృక్కు , శుంభుడు, నిశుంభుడు, జంభుడు, ఉత్కలుడు అనే రాక్షస సేనాధిపతులు బలిని చుట్టి ఉండిరి. (21)

శ్లో॥ అరిష్టోరిష్ట నేమిశ్చ మయశ్చ త్రిపురాధిపః ।
అన్యే పౌలోమ కాలేయా నివాత కవచాదయః ॥22॥

ఇంకా ఇతరులైన అరిష్టుడు, అరిష్టనేమి, మయుడు, త్రిపురాసురుడు, పౌలోమి, కాలేయులు, నివాత కవచాది రాక్షసవీరులు బలిని పరివేష్టించి యుండిరి.(22)

శ్లో॥ అలబ్ధ భాగా సోమస్య కేవలం క్లేశ భాగినః ।
సర్వ ఏతే రణముఖే బహుశో నిర్జితామరాః ॥23॥

అమృత ప్రాప్తిలో శ్రమ, అలసటలను మాత్రమే అనుభవించి సుధలో భాగము పొందలేని రాక్షస వీరులందరూ యుద్ధమున పలుమారులు దేవతలను జయించిన వారుగా ఉండిరి. (23)

శ్లో॥ సింహనాదాన్విముంచంతః శంఖాన్ దధ్ముర్మహారవాన్।
దృష్ట్వా సపత్నానుత్సిక్తాన్ బలిభిత్కుపితో భృశమ్ ॥24॥

పెద బొబ్బలు పెట్టుచు భయంకరమైన ధ్వనితో శంఖములను ఊదుచూ బలగర్వితులైన దాయాదులను చూచి ఇంద్రుడు తీవ్రముగా కోపించినాడు.(24)

టీ :-ఆస్థిత ఇతి. ఉదయే ఉదయగిరిశిఖరే స్థితః. చంద్ర ఇవ. రేజే ఇతి త్రయాణామన్వయః. ॥18-24॥

శ్లో॥ ఐరావతం ధిక్కరిణ మారూఢః శుశుభే స్వరాట్ ।
యథాస్రవత్ప్రసరణ ముదయాద్రి మహర్పతిః ॥25॥

తూర్పు కొండపై సూర్యుడు ఉదయించినట్లుగా అపారమైన మదజల ప్రవాహములను స్రవించు దిగ్గజమైన ఐరావతమును అధిరోహించి దేవేంద్రుడు ప్రకాశించినాడు. (25)

టీ :-ఐరావతమితి. స్రవంతి ప్రస్రవణాని యస్మిన్నితి. మదధారా సాదృశ్యం. ॥25॥

శ్లో॥ తస్యాసన్ సర్వతో దేవా నానావాహ ధ్వజాయుధాః ।
లోకపాలాః సహగణై ర్వాయ్వగ్ని వరుణాదయః ॥26॥

ఆ ఇంద్రునికి వాయువు, అగ్ని, వరుణుడు మొదలైన దిక్పాలకులు వారి వారి సైన్యములతో, అనేక విధములైన వాహనములు, పతాకములు, ఆయుధములతో కూడిన దేవతలు పరివేష్టించి రక్షణగా నుండిరి. (26)

టీ :-తస్యేతి. నానావాహాదీని యేషాం. ॥26॥

శ్లో॥ తేఽన్యోన్య మభిసంసృత్య క్షిపంతో మరభిర్మిథః ।
ఆహ్వయంతో విశంతో-గ్రే యుయుధుర్ద్వంద్వ యోధినః॥27॥

టీ :-త ఇతి. తే దేవా అసురాశ్చ. మిథో యుయుదు ః.॥27।

ఆ దేవ దానవులు ఒకరి నొకరు యుద్ధమున ఎదుర్కొని పరస్పరము మర్మావయవములను కలచివేయునట్లు దూషించుచు ఒకరినొకరు తనపై యుద్ధమునకు రావలసినదని ఆహ్వానించుచు వారి వారిపై తమే ముందుగా అక్రమణకై వెళ్ళుచు ఇరువు రిరువురు యోధులు ద్వంద్వయుద్ధమున తలపడిరి.(27)

శ్లో॥ యుయోధ బలిరింద్రేణ తారకేణ గుహోఽస్యత ।
వరుణో హేతినాయుధ్యన్మిత్రో రాజన్ ప్రహేతినా ॥28॥

ఓ రాజా ! బలి చక్రవర్తి ఇంద్రునితో, తారకాసురుడు కుమారస్వామితో, వరుణుడు హేతితో, ప్రహేతి సూర్యునితో ద్వంద్వ యుద్ధమున తలపడిరి.(28)

శ్లో॥ యమస్తు కాలనాభేన విశ్వకర్మా మయేన వై ।
శంబరో యుయుధే త్వష్ట్రా సవిత్రాతు విరోచనః ॥29॥

టీ :-ద్వంద్వాన్యేవాహ యుయోధేత్యాదిసప్తభిః. ॥28,29॥

యముడు కాలనాభునితోను, విశ్వకర్మ మయుని తోను, శంబరుడు ద్వష్ట ప్రజాపతి తోను, సవిత్రుడు విరోచనుని తోను ద్వంద్వ యుద్ధమును చేసిరి. (29)

శ్లో॥ అపరాజితేన నముచి రశ్వినౌ వృష పర్వణా ।
సూర్యో బలి సుతైర్దేవో బాణ జ్యేష్ఠైః శతేనచ ॥30॥

టీ :-పరాజితేనేతి. సూర్యోదేవ ఏవ. శతేన బలిసుతైః. బాణో జ్యేష్ఠో యోషాం తైః (30)

చాక్షుష మను పుత్రుడు అపరాజితుడు నముచితో, అశ్వినీ దేవతలు వృషపర్వునితో, సూర్యదేవుడు ఒక్కడే నూరుగురు బలి చక్రవర్తి కుమారులు బాణుడు మొదలైన వారితో పోరాడిరి. (30)

శ్లో॥ రాహుణాచ తథాసోమః పులోమ్నాయుయుధేఽనిలః ।
నిశుంభ శుంభయోర్దేవీ భద్రకాళీ తరస్వినీ ॥31॥

రాహువుతో భద్రుడు, పులోమునితో వాయుదేవుడు, శుంభ నిశుంభులతో బలము, వేగములు గల దేవి భద్రకాళి పోరాడినది. (31)

శ్లో॥ వృషా కపిస్తు జంభేన మహిషేణ విభావసుః ।
ఇల్వలః సహ వాతాపిర్బ్రహ్మ పుత్రైరరిందమ ! ॥32॥

ఓ శత్రు ఘాతకుడా ! అగ్నిదేవుడు జంభాసురునితో, మహిషాసురుడు విభావసునితో, వాతాపి ఇల్వలులతో బ్రహ్మపుత్రులైన వశిష్ఠాదులు పోరాడినారు. (32)

శ్లో॥ కామదేవేన దుర్మర్ష ఉత్కలో మాతృభిస్సహ ।
బృహస్పతిశ్శోశనసా నరకేణ శనైశ్చరః ॥33॥

మన్మథుడు దుర్మర్షునితో, సప్త మాతృకలతో ఉత్కలుడు, బృహస్పతితో శుక్రాచార్యుడు, నరకాసురునితో శనైశ్చరుడు పోరాడినారు. (33)

శ్లో॥ మరుతో నివాత కవచైః కాలేయైర్వసవో-మరాః ।
విశ్వేదేవాస్తు పౌలోమై రుద్రాః క్రోధవశైః సహ ॥34॥

వాయువు నివాత కవచులతో కాలేయులు, అష్టవసువులు అనే దేవతలతో విశ్వదేవులు, పౌలోములతో, ఏకాదశరుద్రులు క్రోధవశులతో పోరాడినారు. (34)

శ్లో॥ త ఏవ మాజా వసురాః సురేంద్రా
ద్వంద్వేన సంహత్యచ యుధ్యమానాః ।
అన్యోన్య మాసాద్య నిజఘ్నురోజసా
జిగీష వస్తీక్ష్ణ శరాసితోమరైః ॥35॥

ఆ దేవదానవులు ఈ విధముగా యుద్ధమునందు పరస్పరము ద్వంద్వయుద్ధమున కూడినవారై ఒకరినొకరు పట్టుకొని రోషముతో జయమును కాంక్షించువారై తీవ్రమైన బాణములు, కత్తులు, తోమరములు మొదలైన ఆయుధములో కొట్టుకొనిరి. (35)

శ్లో॥ భుశుండి భిశ్చక్ర గదేష్టి పట్టిశైః
శక్త్యుల్కాభిః ప్రాస పరశ్వ ధైరపి ।
నిస్త్రింశ భల్లైః పరిఘైః సముద్గరైః
సభింది పాలైశ్చ శిరాంసి చిచ్ఛిదుః ॥36॥

టీ :-రాహుణేతి. నిశుంభశుంభాభ్యాం దేవీ ॥31 -36॥

భుశుండి, చక్రము, ఈటె, అడ్డకత్తి, శక్తి, కొఱవి, గొడ్డలి, ఖడ్గము, బాణము, ఇనుప గుదియ, సమ్మెట, భిందిపాలము మొదలైన ఆయుధములతో యుద్ధమున పరస్పరము భేదించిరి. (36)

శ్లో॥ గజాస్తురంగాః సరథాః పదాతయః
సారోహ వాహా వివధా విఖండితాః ।
నికృత్త బాహూరు శిరోదరాంఘ్రయః
ఛిన్న ధ్వజ జ్యాసి తనుత్ర భూషణాః ॥37॥

టీ :-గజా ఇతి. ఆరోహంతీత్యారోహాః వాహ్యాః తైస్సహితా అన్యే చ వాహాః.పూర్వం తు కేవలా గజాదయ ఉక్తాః కథం భూతాః. నికృత్తా బాహ్వాదయో యేషాం ఛిన్నాని ధ్వజాదీని యేషాం తే ॥37॥

ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పదాతులు, యోధులెక్కిన అనేక వాహనములు తెగిపడినవి. పలువిధములుగా భుజములు, తొడలు, తలలు, పొట్టలు, పాదములు మొదలైన శరీరావయవములు చీలిపడినవి. పతాకములు, వింటినారులు, కత్తులు, కవచములు, ఆభరణములు ముక్కలు ముక్కలైనవి. (37)

శ్లో॥ తేషాం పదాఘాత రథాంగ చూర్ణితాత్
ఆయోధనాదుల్బణ ఉత్థిత స్తథా ।
రేణుర్దిశః ఖం ద్యుమణించ ఛాదయన్
న్యవర్త తాసృక్ స్రుతిభిః సపరిప్లుతాత్ ॥38॥

టీ :– తేషామితి. తేషాం దేవాదీనాం. పదాఘాతైః. రథంగైశ్చ. చూర్ణితాదాయో ధనాత్ రణభూమేః. ఉత్థితో రేణుః. దిశః. ఖం. ద్యుమణిం చ సూర్యం చ. ఛాదయన్. తదైవ ఖాదేర్న్యవర్తత. కథంభూతాత్ ? అసృక్స్రుతిభిః రక్తక్షరణైః. పరిప్లుతాత్ సిక్తాత్. యద్వా. పరిప్లవనాద్ధేతోః న్యవర్తతభావేక్తః. రక్తధారాణాం తత్పర్యంతముచ్ఛల నాదిత్యర్థః. ప్రథమాంత పాఠే రేణోర్విశేషం. ॥38॥

దేవదానవుల తాకిడి చేత, రథ చక్రములచేత చూర్ణము చేయబడినందున, భయంకరమైన రణము కారణముగా యుద్ధభూమి నుండి ఎగజిమ్మబడిన ధూళి దిక్కులను, ఆకాశమును, సూర్యుని కప్పివేసి రక్త ప్రవాహములందు తడిసి అణిగి పోయినది. అంటే రక్తధారలు కూడా సూర్యమండల పర్యంతము ఎగజిమ్మబడినవని భావము. (38)

శ్లో॥ శిరోభి రుద్ధూత కిరీట కుండలైః
సంరంభ దృగ్భిః పరిదష్టద చ్ఛదైః ।
మహాభుజైః సాభరణైః సహాయుధైః
సాప్రాస్తృతా భూః కరభోరు భిర్బభౌ ॥39॥

టీ :– శిరోభిరితి. శిరోభిర్మహాభుజైశ్చ. కరభసదృశైరూరుభిశ్చ. సారణభూః ప్రకర్షేణాస్తృతా సతీ బభౌ. కథంభూతైః శిరోభిః.

కిరీటములు, కుండలములు తొలిగిపోయిన మొండి శిరస్సులు, గర్వించు కన్నులు, కొఱుకబడిన పెదవులు, ఆయుధములు, ఆభరణములతో కూడిన భుజములు, ఒంటెలవంటి తొడలు మొదలైన తెగిపడిన అవయవములతో నిండిపోయినది ఆ రణభూమి. (39)

ఉద్వృత్తాని ఉత్పతితాని. కిరీటాని కుండలాని చ యేభ్యః. తైః. సంరంభయుక్తాః దృశో యేషు తైః పరిదష్టాః దచ్ఛదా ఓష్ఠా యేషుతైః. ॥39॥

శ్లో॥ కబంధాస్తత్ర చోత్పేతుః పతిత స్వ శిరోక్షిభిః ।
ఉద్యతాయుధ దోర్దండై రాధావంతో భటాన్మృధే॥40॥

యుద్ధమున తమ తలలు తెగినను కన్నులతో చూచుచు వారి వారి మొండెములు తమ హస్తములందలి ఆయుధములను ఎత్తిపట్టుకొని పరిగెత్తుకొని వెళ్ళి శత్రువులపై విఱుచుకొని పడి సంహరించినవి.(40)

టీ :-కబంధా ఇతి. పతితాని యాని శిరాంసి. తత్రత్యైరక్షిభిః తైః పశ్యంత ఇత్యర్థః. ఉద్యతాన్యాయుధాని యైస్తైర్దోర్దండైర్యుక్తాః. ॥40॥

శ్లో॥ బలిర్మహేంద్రం దశభిస్త్రిభిరైరావతం శరైః ।
చతుర్భిశ్చతురో వాహా నేకే నారోహ మార్ఛయత్॥41॥

బలి చక్రవర్తి ఇంద్రుని పది బాణములతో, ఐరావతమును మూడు బాణములతో, ఐరావతమునకు నాలుగు దిక్కులందు రోకులుగా వున్న నలుగురిని నాలుగు బణములతో, మావటి వాడిని ఒక బాణముతో కొట్టినాడు. (41)

శ్లో॥ సతానాపతతః శక్రస్తావద్భిః శీఘ్రవిక్రమః ।
చిచ్ఛేద నిశితైర్భల్లైరసంప్రాప్తాన్ హసన్నివ ॥42॥

ఆ ఇంద్రుడు వెంటనే ప్రతిస్పందించి వీరుడై తనమీద పడునట్టి బలి చక్రవర్తి ప్రయోగించిన ఆ బాణములు తనను సమీపించకముందే వాటిని చిరునవ్వు నవ్వుచు నిశితమైన భల్లములతో బలి ప్రయోగించిన అన్నిటిని ఛేదించినాడు. (42)

టీ :-బలిరితి. వాహాన్ ఐరావతపాదరక్షకాన్. ఆరోహం గజయంతారం ఆర్దయత్ వివ్యాథ. ॥41,42॥

శ్లో॥ తస్య కర్మోత్తమం వీక్ష్య దుర్మర్షః శక్తిమాదదే ।
తాం జ్వలంతీం మహోల్కాభాం హస్తస్థామచ్ఛి నద్ధరిః ॥43॥

ఇంద్రుని ప్రతియుద్ధమును చూచి సహించని బలి చక్రవర్తి శక్తి అనే ఆయుధమును స్వీకరించినాడు. తోకచుక్క ప్రకాశముతో మండునట్టి ఆ శక్తి ఆతని చేతిలో ఉండగనే (బలి ఇంకను ప్రయోగించకముందే) ఇంద్రుడు దానిని ఛేదించినాడు. (43)

శ్లో॥ తతః శూలం తతః ప్రాసం తతస్తోమర మృష్టయః ।
యద్యచ్ఛస్త్రం సమాదద్యాత్సర్వం తదచ్ఛిన ద్విభుః॥44॥

బలి శూలము, ఈటె, ఇనుపగుదియ, ఖడ్గము మొదలైన ఏయే ఆయుధములను స్వీకరించినాడో వానినన్నింటిని ఇంద్రుడు ఖండించినాడు. (44)

శ్లో॥ ససర్జాథాసురీం మాయామంతర్ధానగతోఽసురః ।
తతః ప్రాదురభూచ్ఛైలః సురానీకోపరి ప్రభో ॥45॥

అప్పుడా బలి చక్రవర్తి అదృశ్యుడై ఒక భయంకరమైన రాక్షసమాయను కల్పించినాడు. ఆ తర్వాత దేవసైన్యము పై భాగమున ఒక గొప్ప పర్వతము వెలిసినది. (45)

టీ :-తస్యేతి. దుర్మర్షః అసహమానో బలిః ॥43-45॥

శ్లో॥ తతో నిపేతు స్తరవో దహ్యమానా దవాగ్నినా ।
శిలా సంకట శిఖరాచ్చూర్ణయంత్యో ద్విషద్బలమ్॥46॥

అప్పుడు అరణ్యాగ్ని చేత కాలుచూ, కూలుచున్న వృక్షములు, పదునైన అంచులుగల శిలలు శత్రు ( దేవ ) సైన్యమును పొడి పొడి చేసినవి. (46)

శ్లో॥ మహోరగాః సముత్పేతుః దందశూకాః స వృశ్చికాః ।
సింహ వ్యాఘ్ర వరాహాశ్చ మర్దయంతో మహాగజాన్॥47

అప్పుడు అజగరములు ( కొండచిలువలు ), కాటువేయు సర్పములు, తేళ్ళు, సింహములు, పెద్దపులులు, అడవి పందులు మొదలైనవి దేవసైన్యమందలి ఏనుగు సముదాయమును పొడి చేసినవి.(47)

శ్లో॥ యాతు ధాన్యశ్చ శతశః శూలహస్తా వివాససః ।
ఛింది భిందీతి వాదిన్యస్తథా రక్షోగణాః ప్రభో ! ॥48॥

ఓ రాజా ! వందలకొలది రాక్షస స్త్రీలు దిశమొలతో, శూలములను ధరించి ఛేదన, భేదన భాషణములు అనగా చీల్చుడు, పగులగొట్టుడు అని పలికి కమ్ముకొనిరి. అట్లే రాక్షసగణములును దేవసైన్యమును ఆక్రమించినవి. 48

టీ :-తత ఇతి. టంకవత్తీక్ష్ణాగ్రైః శిఖరైః. సహితాః.॥46-48॥

శ్లో॥ తతో మహాఘనావ్యోమ్ని గంభీర పురుష స్వనాః ।
అంగారాన్ముముచుర్వాతై రహుతా స్తన యత్నవః ॥49॥

అప్పుడు ఆకాశమున మేఘములు గొప్పగా, భయంకరముగా ఉఱుముచు గాలి తాకిడి రాపిడి వలన పుట్టిన అగ్నిని వర్షించినవి. (49)

టీ :-తత ఇతి. స్తనయిత్నవశ్చ. అంగారాన్ముముచురిత్యనుషంగః॥49॥

శ్లో॥ సృష్టో దైత్యేన సుమహాన్వహ్నిః శ్వసన సారథిః ।
సంవర్తక ఇవాత్యుగ్రో విబుధ ధ్వజినీ మథాన్ ॥50॥

బలి చక్రవర్తి తన మాయా శక్తితో గొప్ప అగ్నిని సృష్టించినాడు. దానికి ప్రచండమైన వాయువు తోడై ప్రళయ కాలము నాటి అగ్నివలె మిక్కిలి భయంకరమైన దేవతల సైన్యమును దహించినది.(50)

టీ :-సృష్ట ఇతి. అధాత్ అధాక్షీదిత్యర్థః. వర్ణలోప ఆర్షః. (50)॥

శ్లో॥ తతః సముద్ర ఉద్వేలః సర్వతః ప్రత్యదృశ్యత ।
ప్రచండవాతై రుద్ధూత తరంగావర్త భీషణః ॥51॥

అప్పుడు తీవ్రమైన గాలివేగముచేత ఎగర గొట్టబడిన అలలు, సుడులతో భయంకరమైనదై అంతటా చెలియలి కట్టను మీరి ఎగిసి పడినదిగా సముద్రము కనుపట్టినది. (51)

టీ :-తత ఇతి. ఉద్ధూతైస్తరంగైరావర్తైశ్చ భీషణః. ॥51॥

శ్లో॥ ఏవం దైత్యైర్మహా మాయై రలక్ష్య గతి భీషణైః ।
సృజ్యమానాసు మాయాసు విషేదుః సుర సైనికాః॥52॥

టీ :-ఏవమితి. ఏవమన్యైశ్చ దైత్యైః. సృజ్యమానాసు .॥52॥

ఈ విధముగా గొప్ప మాయావులు, తమ మాయతో తమ ఉనికి తెలియ లేని విధముగా నుండి భయంకరముగా ప్రవర్తించు వారైన రాక్షసులు సృష్టించిన పెను మాయలకు దేవ సైనికులు దుఃఖించిరి. (52)

శ్లో॥ న తత్ప్రతివిధిం యత్ర విదురింద్రాదయో నృప ! ।
ధ్యాతః ప్రాదురభూత్తత్ర భగవాన్విశ్వ భావనః ॥53॥

టీ :-నేతి. యత్ర యదా . తత్ర తదా. తైర్ధ్యాతస్సన్.॥53॥

ఓ రాజా ! ఆ రాక్షసులను ప్రతిఘటించు విధానము ఇంద్రాదులకును తెలియదు. అప్పుడు వారందరు విశ్వభావనుడైన భగవంతుని శ్రీమహా విష్ణువును ప్రార్థించగా ఆయన వారి యెదుట ప్రత్యక్షమైనాడు. (53)

శ్లో॥ తతః సుపర్ణాంస కృతాంఘ్రి పల్లవః
పిశంగవాసా నవ కంజలోచనః ।
అదృశ్యతాష్టాయుధ బాహురుల్లసత్
శ్రీ కౌస్తుభానర్ఘ్య కిరీట కుండలః ॥54॥

టీ :-తత ఇతి. అష్టౌ ఆయుధయుక్తా బాహవో యస్య. శ్రీశ్చ కౌస్తుభశ్చ అర్ఘ్యంకిరీటం చ కుండలే చ. ఉల్లసంతి శ్రీకౌస్తుభాదీని యస్మిన్. ॥54॥

అప్పుడు గరుత్మంతుని మూపురమున చిగురాకులవంటి పాదములు మోపినవాడు, కపిల వర్ణముతో కూడిన వస్త్రమును ధరిచినవాడు, క్రొత్తగా వికసించు పద్మములవంటి కన్నులతో, హస్తములందు ఎనిమిది ఆయుధములు ప్రకాశించు చుండగా మంగళ కరమైన కౌస్తుభమణి, కాంతులీను గొప్ప కిరీటము, కుండలములతో కూడినవాడై శ్రీమహా విష్ణువు సాక్షాత్కరించినాడు. (54)

శ్లో॥ తస్మిన్ ప్రవిష్టేసురకూట కర్మజా
మాయావి నేశుర్మహినా మహీయసః ।
స్వప్నో యదా హి ప్రతిబోధ ఆగతే
హరిస్మృతిః సర్వ విపద్విమోక్షణమ్ ॥55॥

టీ :- తస్మిన్నితి. అసురాణాం కూటం. కర్మమంత్రాదిప్రయోగః. తస్మాజ్జాతాః మహినా మహిమ్నా హరేః స్మృతిరేవ సర్వాసాం విపదాం విమోక్షణరూపా. కిముత హరేః ప్రవేశ ఇత్యర్థః. (55)

విష్ణువక్కడ ప్రత్యక్ష మైనంతటనే రాక్షసుల మాయలు, మంత్ర విద్యలవలన ఉత్పన్నమైన మాయలు విష్ణువు యొక్క అపారమైన మహిమతో, నిద్రించినవాడు మేలుకొనిన వెంటనే నిద్రలో అతడు కాంచిన స్వప్నము నాశనమైన విధముగా నశించిపోయినవి. కేవలము హరి నామ స్మరణమే సమస్త ఆపదలను తొలగించుననగా శ్రీమహా విష్ణువే ప్రత్యక్షమైనచో ఇక చెప్పవలెనా ! (55)

శ్లో॥ దృష్ట్వామృధే గరుడవాహ మిభారి వాహః
ఆవిద్యశూల మహినో దధకాలనేమిః ।
తల్లీలయా గరుడ మూర్ధ్ని పతద్గృహీత్వా
తేనాహ సన్నృప ! సవాహ మరిం వ్యధీశః॥56॥

టీ :-దృష్ట్వేతి. ఇవభారివాహః సింహవాహః అహిణోత్ నిక్షేప. లీలయైతద్గృహీత్వా అహనత్. హే నృప ॥56॥

ఓ రాజా ! యుద్ధరంగమున విష్ణువు కనపడి నంతనే కాలనేమి సింహవాహనా రూఢుడై శూలమును బలముగా ఊపుచు గరుత్మంతుని పైకి ప్రయోగించినాడు. గరుడుని తలపై పడుచున్న శూలమును విలాసముగా శ్రీమహా విష్ణువు ముందుగనే పట్టుకొని దానినే మరల కాలనేమిపై ప్రయోగించి సింహ వాహన సహితముగా కాలనేమిని వధించినాడు. (56)

శ్లో॥ మాలీ సుమాల్యతి బలౌ యుధిపేత తుర్యత్
చక్రేణ కృత్త శిరసావధ మాల్యవాంస్తమ్ ।
ఆహత్య తిగ్మ గదయాఽహన దండజేంద్రం
తావచ్ఛిరోఽచ్ఛిన దరేర్నదతోఽరిణాద్యః॥57॥

మాలి, సుమాలి అనే మిక్కిలి బలవంతులైన రాక్షసులు యుద్ధమున ఎదిరించగా విష్ణువు చక్రముతో వారి తలలను ఖండించినాడు. అప్పుడు మాల్యవంతుడు సమీపించి తీక్షణమైన గదతో గరుత్మంతుని మోదినాడు. అప్పుడు విష్ణువు ( ఆద్యః ) మ్రోగునట్టి చక్రముతో మాల్యవంతుని శిరమును ఖండించినాడు. (57)

టీ :-మాలీతి. యస్య చక్రేణ కృత్తశిరసౌ పేతతుః తం తథాభూతమపి. అహత్య సంహత్య అండజేంద్రం గరుడమహనత్. తం హంతుం. గదామున్నిన్యఇత్యర్థః. ఆద్యో హరిః. ॥57॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
దేవాసుర సంగ్రామే దశమోధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే దేవాసుర సంగ్రామమునందు
దశమాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

శ్లో॥ ఏకాదశేషు దేవేషు దైత్యఘాతిషు నారదః ।
దేవాన వవారయజ్చుక్రో మృతాన్ దైత్యా న జీవయత్॥

పదకొండవ అధ్యాయమున రాక్షసులను దేవతలను నారదుడు వారించినాడు. రాక్షస గురువైన శుక్రాచార్యుడు మరణించిన రాక్షసులను పునర్జీవింప జేసినాడు.

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ అథో సురాః ప్రత్యుపలబ్ధ చేతసః
పరస్య పుంసః పరమాను కంపయా ।
జఘ్నుర్భృశం శక్ర సమీరణాదయః
తాం స్తాన్ రణేష్వై రభిసంహతాః పురా ॥1॥

**శ్రీ శుకమహర్షి ఇట్లు చెప్పినాడు :-**

అప్పుడు పరాత్పరుని దయతో మరల చైతన్యమును పొందినవారై ఇంద్రుడు, అనిలుడు మొదలైన దేవతలు ఏయే రాక్షసుల చేతిలో మొదట తాము యుద్ధమున దెబ్బతిన్నారో వారిని అధికముగా సంహరించిరి. (1)

టీ :-శ్లో. " ఏకాదశే తు భగవత్కృపయాతిబలోద్ధతైః, అమరైస్సమరే దైత్యా బలిప్రభృతయో జితాః". ॥1॥

శ్లో॥ వైరోచనాయ సంరబ్ధో భగవాన్పాకశాసనః ।
ఉదయచ్ఛద్యదా వజ్రం ప్రజా హాహేతి చుక్రుశుః ॥2॥

దేవనాథుడైన ఇంద్రుడు బలి చక్రవర్తితో పోరాడుటకై సన్నాహముతో వజ్రాయుధమును ఎత్తిపట్టుకొన్న వెంటనే సమస్త జనులు హాహాకారములు చేసిరి. (2)

శ్లో॥ వజ్రపాణి స్తమాహేదం తిరస్కృత్య పరః స్థితమ్ ।
మనస్వినం సుసంపన్నం విచరంతం మహామృధే ॥3॥

టీ :–వైరోచనాయేతి. ఉదయచ్ఛత్ ఉన్నిన్యే. ॥2, 3॥

ఇంద్రుడు వజ్రహస్తుడై తన ఎదురుగా మహాయుద్ధమున జాగరూకుడై యుద్ధ ప్రయత్న సమృద్ధితో పరాక్రమించుచున్న బలి చక్రవర్తిని ఉద్దేశించి ఇట్లు పలికినాడు. (3)

శ్లో॥ నటవన్మూఢ ! మాయాభిర్మాయేశాన్నో జిగీషసి ।
జిత్వా బాలాన్నిబద్ధాక్ష న్నటో హరతి తద్ధనమ్ ॥4॥

టీ :–నటవదితి. నిబద్ధాన్యక్షీణి యేషాం తాన్ బాలాన్. జిత్వా నటః కపటవృత్తిర్యథా తేషాం ధనం హరతి తథా. హేమూఢ. మాయేశాన్ అస్మాన్ జేతుమిచ్ఛసి. ॥4॥

ఓ మూర్ఖుడా ! బాలుర (అమాయకుల) కన్నులు మూసి నటుడు (ఇంద్రజాలికుడు) వారిని జయించి వారి ధనమును హరించినట్లు కపట వృత్తితో నీవు సర్వ మాయలకు అధీశులమైన మమ్ము మాయలతో జయించదలచితివా?. (4)

శ్లో॥ ఆరు రుక్షంతి మాయాభిరుత్సి సృప్సంతి యాదివమ్ ।
తాన్దస్యూన్విధునో మ్యజ్ఞాన్పూర్వస్మాచ్చ, పదాదధః॥5॥

నా ప్రభావమును వినుమని చెప్పుచున్నాడు. మాయలతో స్వర్గమును అధిరోహించుటకై పైకి గంతు వేయ ప్రయత్నించు ( మోక్షప్రాప్తికై యత్నించు ) నీ లాంటి శత్రువులనందరను మీరంతకు ముందున్న స్థానము కంటే గూడా మిమ్ములను అధఃపతనము చేయుదును. (5)

శ్లో॥ సోహం దుర్మాయినస్తేద్య వజ్రేణ శతపర్వణా ।
శిరో హరిష్యే మందాత్మన్ ఘటస్వ జ్ఞాతిభిః సహ ॥6॥

ఓ మందబుద్ధీ ! (బలిని ఉద్దేశించినది) నేను నూరంచులు గలిగిన వజ్రాయుధముతో దుష్టమాయావియైన నీ శిరస్సును ఖండింతును. నీ వారందరితో కూడుకొని ఎదిరించుము. అని ఇంద్రుడు బలిని ఆక్షేపించినాడు. (6)

**బలిః ఉవాచ :-**

శ్లో॥ సంగ్రామే వర్తమానానాం కాలచోదిత కర్మణామ్ ।
కీర్తిర్జయోజయో మృత్యుః సర్వేషాం స్యు రనుక్రమాత్॥7॥

యుద్ధరంగమునందు కాల ప్రేరితులై పరస్పరము యుద్ధము చేయుటకై సిద్ధపడి నిలిచిన యోధులందరికి జయము చేత కీర్తి, ఓటమి చేత మరణము క్రమముగా కలుగును. (7)

టీ :-మత్ప్రభావం శృణ్విత్యాహ ఆరురుక్షంతీతి. ఆరురుక్షంతి. ఆరోఢుమిచ్ఛంతి. యే చ ఉత్సర్పంతి ఉల్లంఘితుమిచ్ఛంతి మోక్షమిచ్ఛంతీత్యర్థః. అథో విధునోమి పాతయామి. ॥5-7॥

శ్లో :- తదిదం కాలరశనం జనాః పశ్యంతి సూరయః ।
న హృష్యంతి న శోచంతి తత్ర యూయమపండితాః॥8॥

యుద్ధము నందు జయాపజయములు కాలాధీనములు. జయము వలన కీర్తి , అపజయము వలన మృత్యువు కలుగును. అని భావించి దానికి విచారము చెందరు. అనగా యుద్ధముల ఫలములైన జయాపజయములపై సంతోషముకాని, దుఃఖమును కానీ పొందరు. నీ వంటి అజ్ఞానులు మాత్రమే విఱ్ఱవీగుదురు.(8)

టీ :-తమితి. కాలరశనం కాలయంత్రితం. అతో న హృష్యంతి తత్ర. ఏవం వివేకే యూయమపండితాః అనిపుణాః. ॥8॥

శ్లో॥ న వయం మన్యమానానా మాత్మానం తత్ర సాధనమ్ ।
గిరో వః సాధు శోచ్యానాం గృహ్ణీమో మర్మ తాడనాః॥9॥

జయము వలన కీర్తి లభించుటకు తమ పరాక్రమమే కారణమని భావించుచు విచారించే మీవంటివారి మర్మచ్ఛేదకములైన మాటలను మేము సరియైనవిగా గ్రహించము. (9)

టీ :-నేతి. తత్ర కీర్తిజయాదౌ. ఆత్మానం దేహం సాధనం మన్యమానానాం వో గిరో వ గృహ్ణీమః. మర్మతాడనాః. ॥9॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యాక్షిప్య విభుం వీరో నారాచైర్వీర మర్దనః ।
ఆకర్ణ పూర్ణై రహనదాక్షేపై రాహతం పునః ॥10॥

టీ :-ఇతీతి. విభుమింద్రం. ॥10॥

శ్లో॥ ఏవం నిరాకృతో దేవో వైరిణా తథ్యవాదినా ।
నమృష్యత్త దధిక్షేపం తోత్రా హత ఇవ ద్విపః ॥11॥

టీ :-ఏవమితి. తోత్ర మంకుశం తేనాహత ఇవ. ॥11॥

శ్లో॥ ప్రాహరత్కులిశం తస్మా అమోఘం పరమర్దనః ।
సయానో న్యపతద్భూమౌ ఛిన్న పక్ష ఇవాచలః ॥12॥

శ్లో॥ సఖాయాం పతితం దృష్ట్వా జంభో బలి సఖః సుహృత్ ।
అభ్యయాత్సౌహృదం సఖ్యుః హతస్యాపి సమాచరన్ ॥13॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

వీరులను పొడిచేయగల పరాక్రమవంతుడైన బలి చక్రవర్తి ఇంద్రుని ఈ విధముగా ఆక్షేపించి ఆకర్ణాంతము లాగిన బాణములతో కొట్టినాడు. నానావిధ వీరాలాపములతో ఎత్తి పొడిచినాడు.(10)

ఈ విధముగా సత్యము పలికిన శత్రువైన బలిచేత తిరస్కరింపబడి ఇంద్రుడు, అంకుశముతో పొడవబడిన ఏనుగువలె బలి చక్రవర్తి ఆక్షేపములను గణించలేదు.(11)

ఇంద్రుడు శత్రుచ్ఛేదకుడై అమోఘమైన వజ్రాయుధమును గ్రహించి బలి చక్రవర్తి పై వేయగా ఆయన రెక్కలు తెగిన పక్షివలె తన విమాన సహితముగా భూమిపై కూలిపోయినాడు. (12)

తన స్నేహితుడైన బలి యుద్ధరంగమున పడిపోగా చూచి బలి సఖుడైన జంభాసురుడు తన మిత్రుడు దెబ్బ దిన్నప్పటికి చెలిమిని పాటించి ఇంద్రునిపై పగ సాధించుటకై వెళ్ళెను.(13)

శ్లో॥ స సింహ వాహ ఆసాద్య గదాముద్యమ్య రంహసా ।
జత్రావతా దయచ్ఛక్రం గజంచ సుమహాబలః ॥14॥

మహా బలవంతుడైన ఆ జంభాసురుడు సింహ వాహనుడై గదను ఎత్తి పట్టుకొని వేగముగా ఇంద్రుడు, ఐరావతముల కంఠమూల దేశమున కొట్టినాడు. (14)

శ్లో॥ గదా ప్రహార వ్యథితో భృశం విహ్వలితో గజః ।
జానుభ్యాం ధరణీం స్పృష్ట్వా కశ్మలం పరమం యయౌ॥15॥

ఐరావతము జంభాసురుని గద దెబ్బలతో మిక్కిలిగా అవయవములు స్వాధీనము తప్పినవై మోకాళ్ళపై వంగి పడి దేహధ్యాస లేక మూర్ఛపోయినది. (15)

శ్లో॥ తతో రథో మాతలినా హరిభిర్దశ శతై ర్వృతః ।
ఆనీతో ద్విపముత్సృజ్య రథమారు రుహే విభుః ॥16॥

అప్పుడు వేయి గుఱ్ఱముల రథమును సిద్ధపరిచి మాతలి తీసికొని రాగా దేవేంద్రుడు ఐరావతమును విడిచి రథమును అధిరోహించినాడు.(16)

టీ :-ప్రాహిణోదితి. సయానః విమానసహితో బలిః భూమౌ పపాత. ॥12-16॥

శ్లో॥ తస్య తత్పూజయన్కర్మ యంతు ర్దానవ సత్తమః ।
శూలేన జ్వలతా తంతు స్మయమినో హనన్మృధే॥17॥

రాక్షస శ్రేష్ఠుడైన జంభాసురుడు రథచోదకుడై వచ్చిన మాతలి సరియైన సమయమున ఇంద్రునికి తోడుపడుటను గౌరవించి చిరునవ్వు నవ్వుచు మండుచున్న శూలముతో మాతలిని పొడిచినాడు. (17)

శ్లో॥ సేహే రుజం సుదుర్మర్షాం సత్త్వమాలాంబ్య మాతలిః ।
ఇంద్రో జంభస్య సంక్రుద్ధో వజ్రేణా పాహరచ్ఛిరః॥18॥

జంభాసురుని శూలపు దెబ్బవలన కలిగిన సహించలేని అధికమైన బాధను బలవంతుడైన మాతలి సహించినాడు. ఇంద్రుడు తీవ్రమైన కోపముతో జంభాసురుని శిరస్సును వజ్రాయుధముతో ఖండించినాడు. (18)

టీ :- తస్యేతి. యంతుః మాతలేః. తస్యేంద్రస్యానయనం కర్మ. పూజయ జంభః. తం శూలే నాభ్యహనత్. ॥17,18॥

శ్లో॥ జంభం శ్రుత్వా హతం తస్య జ్ఞాతయో నారదాదృషేః ।
నముచిశ్చ బలః పాక స్తత్రాపేతుస్త్వరాన్వితాః ॥19॥

జంభాసురుని మరణవార్తను దేవర్షియైన నారదుని వలన విని అతని సోదరులైన నముచి, బలుడు, పాకుడను వారు వెంటనే యుద్ధరంగమునకు వచ్చిరి. (19)

శ్లో॥ వచోభి పరుషైరింద్ర మర్దయంతోస్య మర్మసు ।
శరైర వాకిరన్మేఘా ధారాభిరివ పర్వతమ్ ॥20॥

నముచి, బలుడు, పాకుడు ఇంద్రుని కఠినమైన మాటలతో నిందించుచు పర్వతము పై మేఘము జలధారలు కురిపించిన విధముగా అతని మర్మావయవములపై బాణములను కురిపించిరి. (20)

టీ :- జంభమితి. నముచిఃబలః పాకశ్చేతి. త్రయ ఆజగ్ముః. ॥19,20॥

శ్లో॥ హరీన్ దశ శతాన్యాజౌ హర్యశ్వస్య బలః శరైః ।
తావద్భిరర్దయామాస యుగ పల్లఘు హస్తవాన్ ॥21॥

ముగ్గురు రాక్షస శ్రేష్ఠుల పరాక్రమమును వేరు వేరుగా మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. దేవేంద్రుని వేయి గుఱ్ఱములను బలాసురుడు నైపుణ్యముతో ఒకేసారి వేయి బాణములతో కొట్టినాడు. (21)

శ్లో॥ శతాభ్యాం మాతలిం పాకో రథం సావయవం పృథక్ ।
సకృత్సంధాన మోక్షేణ తదద్భుత మభూద్రణే ॥22॥

టీ :-త్రయాణాం పృథగ్విక్రమానాహ త్రిభిః. హరీనితి. హర్యశ్వస్య ఇంద్రస్య. తావద్భిః దశభిః శతైః. ॥21,22॥

పాకుడు రెండు వందల బాణములతో మాతలిని, వేరు వేరుగా రథమును, ఇంద్రుని అన్ని అవయవములపై బణములు వేసి బాధించినాడు. పాకుడు బాణములు వారిపై సంధించుట, ప్రయోగించుట తెలియకుండ యుద్ధము చేయుట మిగుల ఆశ్చర్యకరమైనది. (22)

శ్లో॥ నముచిః పంచదశభిః స్వర్ణ పుంఖైర్మహేషుభిః ।
ఆహత్య వ్యనదత్సంఖ్యే సతోయ ఇద తోయదః ॥23॥

టీ :-నముచిరితి. ఆహత్య ఇంద్రం విధ్వా. ॥23॥

నముచి బంగారు పిడులు కలిగిన పదునైదు గొప్పబాణములతో కొట్టి సజల జలదము యొక్క భయంకరమైన ఉఱుము వలె యుద్ధమున భయంకరముగా సింహనాదము చేసినాడు . (23)

శ్లో॥ సర్వతః శూరకూటేన శక్రం సరథ సారథిమ్ ।
ఛాయయామాసుర సురాః ప్రావృట్ సూర్యమివాంబుదాః॥24॥

టీ :-సర్వత ఇతి. ప్రావృట్కాలీనం సూర్యం ॥24॥

రథము, సారథితో కూడా ఇంద్రుని నలుదిక్కుల పాక్షసయోధ సముదాయము వానకాలమున సూర్యుని మేఘ సమూహములు కప్పివేసినట్లు చుట్టు మూగినవి.(24)

శ్లో॥ అలక్షయంతస్తమసీవ విహ్వాలా
విచుక్రుశుర్దేవ గణాః సహానుగాః ।
అనాయకాః శత్రుబలేన నిర్జితా
వణిక్పథాభిన్న నవో యథాఽర్ణవే ॥25॥

ఇంద్రుని అనుసరిచుచున్న దేవతా సైన్యములు చీకటి యందువలె రాక్షస సైన్యముచేత ఆవరింపబడిన ఇంద్రుని కానలేక భీతి జెంది, నడిపించు నాయకుడు లేక వర్తకుల నౌక నడిసముద్రమున పగిలి పోయినట్లుగా శత్రువులైన

టీ :- అలక్షయంత ఇతి. వణిక్పథాః వణిజః భిన్నా నౌరేష్యాం తే. అత్ర దీర్ఘాభావ ఆర్షః. భిన్ననావ ఇత్యర్థః. ॥25॥

రాక్షస సైన్యము చేతిలో ఓడిపోయి కకావికలై ఆక్రోశించినవి.(25)

శ్లో॥ తతస్తు రాషాడిషు బద్ధ పంజరాత్
వినిర్గతః సాశ్వరథ ధ్వజాగ్రణీః ।
బభౌదిశః స్వం పృథివీంచ రోచయన్
స్వతేజసా సూర్య ఇవ క్షపాత్యయే ॥26॥

అప్పుడు రాక్షసబాణ నిర్మితమైన పంజరమును భేదించుకొని రథము, గుఱ్ఱములు, పతాకము, సారథి మొదలైన వానితో క్షతి లేనివాడై ఇంద్రుడు ఆ బాణముల పంజరము నుండి బైటపడి తన తేజస్సుతో రాత్రి గడిచిన తర్వాత ప్రకాశించు సూర్యుని వలె తనను, దిక్కులను, భూమండలమును వెలిగించుచు మెఱిసినాడు.(26)

శ్లో॥ నిరీక్ష్య పృతనాం దేవః పరైరభ్యర్థితాం రణే ।
ఉదయచ్ఛద్రిపుల హంతుం వజ్రం వజ్రధరో రుషా॥27॥

శత్రు సైన్యముచేత దెబ్బదిన్న సైన్యమును ఇంద్రుడు ఓదార్చి కోపముతో శత్రువును సంహరించుటకై వజ్రాయుధమును పట్టినాడు. (27)

శ్లో॥ సతే నైవాష్ట ధారేణ శిరసీ బల పాకయోః ।
జ్ఞాతీనాం పశ్యతాం రాజన్ ! జహార జనయన్ భయమ్॥28॥

ఓ రాజా ! ఇంద్రుడు ఎనిమిది అంచులుగల వజ్రాయుధముతోనే బలుడు, పాకుడు అనే ఇరువురు రాక్షసుల శిరస్సులను ఖండించినాడు. దానితో వీరి వధలను చూచుచున్న వారి చుట్టములు, సైన్యాధిపతులు మొదలైనవారు భీతితో విహ్వాలులైనారు. (28)

టీ :- తత ఇతి. తురాషాడింద్రః. అశ్వాదిసహితో వినిర్గతః అగ్రణీః సారథిః. ॥26-28॥

శ్లో॥ నముచి స్తద్వధం దృష్ట్వా శోకామర్ష రుషాన్వితః ।
జిఘాంసురింద్రం నృపతే ! చకార పరమోద్యమమ్॥29॥

టీ :- నముచిరితి. శోకామర్షభ్యాం యుక్తయా రుషా క్రోధేనాన్విత స్సన్ ఇంద్రం హంతుం. పర మోద్యమం చకార. ॥29॥

ఓ రాజా ! పాకుడు, బలుని ఇంద్రుడు సంహరించగా వారి వధను చూచిన నముచి, దనుజుడు దుఃఖము, అసహనము, కోపములతో ఇంద్రుని సంహరించుటకై గొప్ప ప్రయత్నమును చేసినాడు.(29)

శ్లో॥ అశ్మసారమయం శూలం ఘంటావద్ధేమ భూషణమ్ ।
ప్రగృహ్యాభ్యద్రవత క్రుద్ధో హతోఽసీతి విసర్జయన్ ।
ప్రాహిణోద్దేవ రాజాయ నిసదన్మృగరాడివ ॥30॥

బంగారముతో అలంకృతమై గంటలు మ్రోగునట్టి ఇనుప ( బండవలె కఠినమైన) శూలమును స్వీకరించి కోపముతో నముచి పరిగెత్తుకొని వెళ్ళుచు నీవు నాచే చచ్చిన వాడవైవాడవని బెదిరించుచు సింహము వలె గర్జించుచు దానిని ఇంద్రునిపై ప్రయోగించినాడు.(30)

శ్లో॥ తదాపతద్గగనతలే మహాజవం
విచిచ్ఛిదే హరిరిషుభిః సహస్రధా ।
తమా హనన్ నృప ! కులిశేన కంధరే
రుషాన్వితః త్రిదశపతిః శిరోహరన్ ॥31॥

టీ :- అశ్మేతి. ఘంటావత్ ఘంటాభిర్యుక్తం. ॥30,31॥

ఓ రాజా ! తనవైపు వేగముగా ఆకసమున వచ్చుచున్న నముచి ప్రయోగించిన శూలమును ఇంద్రుడు బాణములతో వేయి ముక్కలుగా ఖండించినాడు. కోపముతో ఇంద్రుడు నముచి శిరమును ఖండించుటకై అతని మెడపై వజ్రాయుధముతో కొట్టినాడు.(31)

శ్లో॥ న తస్య హి త్వచమపి వజ్రఊర్జితో
బిభేదయః సురపతి నోజసేరితః ।
తదద్భుతం పరమతి వీర్యవృత్రభిత్
తిరస్కృతో నముచి శిరోధర త్వచా ॥32॥

ఇంద్రుడు బలముతో ప్రయోగించిన శక్తిమంతమైన వజ్రాయుధము నముచి చర్మమును కూడా ఛేదించలేక పోయినది. ఈ విధముగా మిక్కిలి బలవంతమైన, వృత్రాసురుని వధించిన వజ్రాయుధము నముచి తలక్రింది (మెడమీది) చర్మమును (ఛేదించలేక వ్యర్థమగుట మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయము) .(32)

శ్లో॥ తస్మాదాధోబిభేచ్ఛత్రోర్వజ్రః ప్రతిహతోయతః ।
కిమిదం దైవ యోగేన భూతం లోక విమోహనమ్॥33॥

టీ :-నేతి. అతివీర్యం వృత్రం భి నత్తీతి తథా. ॥32,33॥

వజ్రాయుధము విఫలమైనందున ఈ వజ్రాయుధము శత్రువును ఛేదించలేక ఎందుకు వ్యర్థమైనది? జగత్తునకు ఆశ్చర్యకరముగా దైవ ప్రేరణచేత ఇది జరిగినదా? (అని విచారించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము)(33)

శ్లో॥ యేనమే పూర్వ మద్రీణాం పక్షచ్ఛేదః ప్రజాత్యయే ।
కృతో నివిశతాం భారైః పతత్రైః పతతాం భువి ॥34॥

టీ :-యేనేతి. పతత్రైః పక్షైః. ॥34॥

పూర్వము బలమైన ఱెక్కలతో భూమిపై వాలుచు మరల పైకి లేచుచు పర్వతములు జన నాశనము చేయుచుండగా నేను ( ఇంద్రుడు ) వజ్రాయుధముతో పర్వతముల రెక్కలు ఖండించినాడను. (అట్టి వజ్రాయుధము ఇపుడెందుకు వ్యర్థమైనదని విచారించినాడు) (34)

శ్లో॥ తపః స్సారమయం త్వాష్ట్రం వృత్రో యేన విపాటితః ।
అన్యేచాపి బలోపేతాః సర్వాస్త్రై రక్షత త్వచః ॥35॥

త్వష్ట యొక్క కఠోరమైన తపస్సు ఫలమైన వృత్రాసురుని, ఇంకను బలవంతులైన సమస్త అస్త్రములచేత దెబ్బతినకుండ రక్షితమైన చర్మము కలవారైన పెక్కురు రాక్షసులను కూడా వజ్రాయుధము చీల్చివేసినది.

టీ :- తప ఇతి. సారమయం వీర్యాధికం. త్వాష్ట్రం తప ఏవ వృత్రః స యేన వజ్రేణ మయా విపాటితః. ॥35॥

( మరి ఇప్పుడెందుకు వ్యర్థమైనదని ఇంద్రుడు చింతించినాడు ). (35)

శ్లో॥ సో-యం ప్రతిహతో వజ్రో మయాముక్తోఽసురోఽల్పకే ।
నాహం తదాదదే దండం బ్రహ్మతేజోఽప్య కారణమ్॥36॥

అంత శక్తి మంతమైన బ్రాహ్మణ తేజస్సుతో ఉద్భవించిన వజ్రాయుధమును ఈనాడొక సామాన్యమైన రాక్షసునిపై ప్రయోగించగా నిష్ప్రయోజనమై వెనుకకు మరలినది. ఒకవేళ నేనేమైనా పొరబడి వజ్రాయుధమును వదిలి సామాన్యమైన చేతికట్టెను స్వీకరించితినా? అనగా నావజ్రాయుధము ఊత కఱ్ఱగా మాత్రమే ఉపయోగపడినదని వ్యంగ్యార్థము. అని ఇంద్రుడు విచారించినాడు. (36)

శ్లో॥ ఇతి శక్రం విషీదంతమాహ వాగ శరీరిణీ ।
నాయం శుష్కై రథోవార్ద్రై ర్వధమర్హతి దానవః॥37॥

అని ఈ విధముగా చింతించుచున్న ఇంద్రునితో ఆకాశవాణి ‘ ఈ నముచి ఎండిన వానితో గాని, తడిసిన వానితో గాని చావడు’ అని చెప్పినది.(37)

టీ :- సఇతి. దండం లగుడతుల్యం బ్రహ్మతేజః దధీచేః సామర్థ్యం. ॥36,37॥

శ్లో॥ మయాస్మై యద్వరో దత్తో మృత్యుర్నైవార్ద్ర శుష్కయోః ।
అతోన్యశ్చింతనీయస్త ఉపాయో మఘవన్ ! రిపోః॥38

ఓ ఇంద్రుడా ! నేను నముచికి తడివాని చేతగాని, పొడివానిచేత గాని మృత్యువు కలుగనట్లు వరమిచ్చితిని. అందువలన ఆతని వధకు వేరే ఉపాయమును ఆలోచించుము అని అశరీరవాణి చెప్పినది. (38)

శ్లో॥ తాం దైవీం గిరమాకర్ణ్య మఘవాన్ సుసమాహితః ।
ధ్యాయన్ ఫేన మథా పశ్య దుపాయ ముభయాత్మకమ్ ।39।

ఆ దేవతా సంబంధమైన మాటలను విని ఇంద్రుడు ఏకాగ్రచిత్తముతో ఆలోచించి నుఱుగును తడి పొడి కాని తదుభయాత్మకమైనదిగా నిర్ణయించుకొనెను.(39)

టీ :-మయేతి. ఆర్ద్రశుష్కాభ్యాం. మత్యుః నైవేతి. ॥38,39॥

శ్లో॥ న శుష్కేణ న చాంద్రేణ జహార నముచేః శిరః ।
తం తుష్టువుర్మునిగణా మాల్యైశ్చావాకిరన్ విభుమ్॥40॥

ఎండినది, తడిది కాని నురుగుతో ఇంద్రుడు నముచి శిరమును ఖండించినాడు. " అపాం ఫేనేన నముచేః శిరః ఇంద్రో దవర్తయత్ " అని శ్రుతి. దుష్టదానవుని సంహరించిన దేవనాథుని కార్యమునకు సంతసించిన ఋషుల సముదాయము అతనిపై పూలదండలు వేసిరి. (40)

శ్లో॥ గంధర్వ ముఖ్యౌ జగతు ర్విశ్వావసు పరావసూ ।
దేవ దుందుభయోనే దుర్నర్తక్యో ననృతు ర్ముదా ॥41॥

గంధర్వ శ్రేష్ఠులైన విశ్వావసు పరావసు లిరువురు ఇంద్రుని కీర్తిని గానం చేసినారు. దేవదుందుభులు మ్రోగినవి. అప్సర స్త్రీలు సంతోషముతో నాట్యము చేసినారు. (41)

శ్లో॥ అన్యేప్యేవం ప్రతి ద్వంద్వాన్ వాయ్వగ్ని వరుణాదయః ।
సూదయామాసు రస్త్రౌఘై ర్మృగాంకే సరిణో యథా॥42॥

ఇతరులైన వాయువు, అగ్ని, వరుణుడు మొదలైన దేవతలు తమను ఎదిరించిన ఇతర రాక్షస వీరులను ఈ విధముగనే మృగరాజు జింకలను వేటాడినట్లుగా అమ్ములవానతో సంహరించినారు. (42)

శ్లో॥ బ్రహ్మణా ప్రేషితో దేవాన్ దేవర్షిర్నారదో నృప ! ।
వారయామాస విబుధాన్ దృష్ట్వా దానవ సంక్షయమ్॥43॥

నారద ఉవాచ :-

శ్లో॥ భవద్భి రమృతం ప్రాప్తం నారాయణ భుజాశ్రయైః ।
శ్రియా సమేధితాః సర్వ ఉపారమత విగ్రహాత్ ॥44॥

టీ :- ఉభయాత్మకత్వమేవాహ నేతి. న శుష్కేన న చార్ద్రేణ ఫేనేన. తథా చ శ్రుతిః. అపాం ఫేనేన శిరఉదవర్తయదిత్యాది. ॥40-44॥

శ్రీ శుక ఉవాచ :-

శ్లో॥ సంయమ్య మన్యు సంరంభం మానయంతో మునేర్వచః।
ఉపగీయమానానుచరైర్యయుః సర్వే త్రివిష్టపమ్ ॥45॥

శ్లో॥ యే ఽవశిష్టా రణే తస్మిన్ నారదానుమతేన తే ।
బలిం విపన్నమాదాయ అస్తంగిరి ముపాగమన్ ॥46॥

టీ :- సంయమేతి. అనుచరైరనుగీయమానా ఇత్యర్థః. ఉపగీయమానై రనుచరైస్సహేతి వా. ॥45,46॥

ఓ రాజా ! ఈ విధముగా రాక్షసుల నాశనమునకు పూనుకున్న దేవతలను బ్రహ్మచేత పంపబడిన నారదుడు నివారించినాడు. (43)

నారద మహర్షి ఇట్లు చెప్పినాడు :-

ఓ దేవతలారా ! శ్రీమన్నారాయణుని పరాక్రమము వలన మీరు అమృతమును పొందినారు. అందువలన సంపదలతో వృద్ధి పొందినారు. అందువలన ఇకనైనా రాక్షసుల విరోధమును మానుకొనుడని నారదుడు వారికి చెప్పి వారించినాడు. (44)

శుక హహర్షి ఇట్లు చెప్పినాడు :-

దేవతలు నారదముని ఆదేశమును గౌరవించి కోప వేగమును నిగ్రహించి యుద్ధమును విరమించి అనుచరులు కీర్తించుచుండగా అందరును స్వర్గమునకు వెళ్లిరి. (45)

ఆ యుద్ధమున చావగా మిగిలిన రాక్షస సైన్యము బాధితుడైన బలి చక్రవర్తిని తోడ్కొని నారద మహాముని అనుమతితో పడమటి కొండకు వెళ్ళిరి. (46)

శ్లో॥ తత్రా వినష్టా వయవాన్ విద్యమాన శిరోధరాన్ ।
ఉశనా జీవయామాస సంజీవిన్యా స్వవిద్యయా ॥47॥

టీ :-తథేతి. వినష్టా అవయవా యేషాం. విద్యమానాః శిరోధరాః యేషాం తాన్. ॥47॥

అక్కడ అవయవములను కోల్పోయిన దెబ్బతిన్న మెడలతో నున్న రాక్షసుల నందరను రాక్షస గురువైన శుక్రాచార్యుడు తన యొక్క మృతసంజీవని విద్యతో పునర్జీవితులను చేసినాడు. (47)

శ్లో॥ బలిశ్చో శనసా స్పృష్టః ప్రత్యాపన్నేంద్రియ స్మృతః ।
పరాజితోఽపి నాఖిద్య ల్లోక తత్త్వ విచక్షణః ॥48॥

టీ :-బలిరితి. ప్రత్యాపన్నా పునః ప్రాప్తానీంద్రియాణి స్మృతిశ్చ యేన సః ॥48॥

శుక్రాచార్యుని అనుగ్రహ స్పర్షతో బలి చక్రవర్తి శరీరము నందలి బాధ పూర్తిగా తొలిగినవాడై ఇంద్రియములను, స్మృతిని పొంది ఓటమి పాలైనప్పటికీ లోకతత్త్వమును తెలిసినందున దుఃఖించలేదు. (48)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
దేవాసుర సంగ్రామే ఏకాదశోఽధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే దేవాసుర సంగ్రామమునందు
ఏకాదశాధ్యాయము ఆంధ్రానువాదము. ః

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

శ్లో॥ ద్వాదశే మోహినీ రూప విభ్రమాలోకనోత్సుకమ్ ।
భవం సమ్మోహయామాస హరిః పునరసాంత్వయత్॥

పండ్రెండవ అధ్యాయమున జగన్మోహిని రూపలావణ్యములను చూడకోరిక కలిగిన శివుని సమ్మోహన పరవశుని చేసి విష్ణువు మరల ఊరడించినాడు.

శ్లో॥ అముహ్యన్న సురావిష్ణు మాయయా న తదద్భుతమ్ ।
ఇతి వక్తుం మహాదేవ మోహోయముపవర్ణ్యతే॥

విష్ణువు తన మాయా మోహినీ రూపముతో రాక్షసులను మోహింపజేయుట ఆశ్చర్యము కాదని చెప్పుటకై పరమాశ్చర్యకరముగా కామజేత అయిన సదాశివుని మోహితుని జేయుట ఇందు చక్కగా వర్ణించబడినది.

**శ్రీ బాదరాయణ ఉవాచ :-**

శ్లో॥ వృషధ్వజో నిశమ్యేదం యోషిద్రూపేణ దానవాన్ ।
మోహయిత్వా సురగణాన్ హరిః సోమ మపాయత్ ।1॥

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

స్త్రీరూపముతో శ్రీ మహావిష్ణువు రాక్షసులను వంచించి దేవతా సముదాయమునకు అమృతపానము చేయించిన విషయము విని వృషధ్వజుడైన పరమేశ్వరుడు (మోహినీ రూపమును దర్శించుటకై వెళ్లినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము) .(1)

శ్లో॥ వృషమారుహ్య గిరిశః సర్వభూత గణైర్వృతః ।
సహదేవ్యా యయౌ ద్రష్టుం యత్రాస్తే మధుసూదనః॥2॥

ఈశ్వరుడు వృషారూఢుడై సమస్త గణములతో, పార్వతీ దేవితో కూడుకొని విష్ణుమూర్తి ఉన్నచోటికి మోహినీ రూపమును చూడవలెనని వెళ్ళెను. (2)

టీ :-"శ్లో. ద్వాదశే మోహినీ రూప విభ్రమాలోకనోత్సుకమ్, భవం సమ్మోహయామాస హరిః పునరసాంత్వయత్." అముహ్యాన్నసురా విష్ణుమాయయా న తదద్భుతం, ఇతి వక్తుం మహాదేవ మోహోఽ యముపర్ణ్యతే. వృషధ్వజమితి. హరిః సోమమపాయ యదితీదం నిశమ్య. స యత్రాస్తే తత్ర ద్రష్టుం యయావిత్యుత్తరేణాన్వయః.॥1,2॥

శ్లో॥ సభాజితో భగవతా సాదరం సోమయాభవః ।
సూపవిష్ట ఉవాచేదం ప్రతిపూజ్య స్మయన్ హరిమ్॥3॥

విష్ణువుచేత ఆదరముతో, ఆలింగనాది మర్యాదలతో సంభావింపబడిన ఉమాసహితుడైన పరమేశ్వరుడు సభాసనమున కూర్చున్నవాడై, విష్ణువును కుశలప్రశ్నలమొనరించెను.(3)

**శ్రీ మహాదేవ ఉవాచ :-**

శ్లో॥ దేవదేవ ! జగద్వ్యాపిన్ ! జగదీశ ! జగన్మయ !
సర్వేషామపి భావానాం త్వమాత్మా హేతురీశ్వరః ॥4॥

టీ :-సభాజిత ఇతి. సోమయా ఉమయా సహ. త్వయి కించిన్న చాశ్చర్యం వయం త్వాశ్చర్యమానసాః, ఇతి వక్ష్యన్మహాదేవ స్తుష్టావ హరి శ్రీధరీయోఽయం శ్లోకః. త్వయి మహామాయావిని పరమేశ్వరే న హి కిల కించిదఘటితమివ. పరమకౌతూహలేన

**శ్రీ మహాదేవుడు ఇట్లు చెప్పినాడు :-**

ఓ విష్ణుదేవా ! నీ విషయమున కొంచెము కూడా ఆశ్చర్యము లేదు. మేమే ( అజ్ఞానము చేత కప్పబడి ) నీ లీలల విషయమై ఆశ్చర్యపడుదుము. అంటూ పరమేశ్వరుడు ఎనిమిది శ్లోకములలో స్తుతించినాడు. మహామాయావివి, పరమేశ్వరుడవైన నీకు అసాధ్యమైనది కొంచెముకూడా లేదు. మేము మిక్కిలి వుత్సాహముతో మిమ్ములను దర్శింప వచ్చితిమని అనేక విధముల పేర్కొనుచు ఈశ్వరుడు స్తుతించినాడు. ఓ దేవదేవ ! నేను నిన్ను దేవుడవని సంబోధించుటకు కారణము నీవు జగత్తంతయు నిండియుండుటే.

ద్రష్టుమాగతా ఇతి. బహుధా సంబోధయంస్తౌతి దేవదేవేతి. హే కుతోఽహం దేవానాం దేవ ఇత్యద ఆహ హే జగద్వ్యాపిన్ .తత్కుతః? హే జగన్మయ. ప్రధానం. న. హే జగదీశ. తచ్చ కుతః? తత్రాహ సర్వేషామపి త్వం హేతుః ఆత ఆత్మత్వాచ్చ న జడం ప్రధానం త్వమిత్యర్థః. ॥3,4॥

నీవు జగన్మయుడవు. ఓ జగదీశ్వరా! నీకన్న ప్రధానమైనది లేదు. ఎందుకంటే అన్నింటికి నీవే కారణము. అందువల్లనే ఈశ్వరుడవు. జడమైన ప్రకృతి కాకుండా పరమాత్మత్వము చేత నీవే ముఖ్యుడవు. (4)

శ్లో॥ ఆద్యంతావస్య యన్మధ్య మిదమన్యదహం బహిః ।
యతోఽవ్యయస్య నైతాని తత్సత్యం బ్రహ్మ చిద్భవాన్॥5॥

టీ :– నను జగన్మయత్వోక్త్యా జగత ఉత్పత్త్యా త్యత్వేన చ జాడ్యేన చ. మమాపి కిం తథా త్వ బ్రూషే? న హీత్యాహ ఆద్యంతావితి. మధ్యం చ. అస్య జగతః యతః బ్రహ్మణో భవంతి. యస్య చ అవ్యయస్య ఏతాని ఆద్యంత న సంతి. యచ్చ బ్రహ్మ. ఇదం కార్యాస్పదం దృశ్యం. అహం కారణాస్పదం ద్రష్టృచ. అన్యత్ భోక్తృచ.తత్సత్యం చ చిద్రూపం చ బ్రహ్మైవ భవాన్ . అతో న తవ వికారః. ॥5॥

ఐతే జగన్మమయత్వమనే మాటతో జగత్తుయొక్క ఉత్పత్త్యాదులు జడత్వము చేత అసత్యమైనందున నాకును జడత్వము తప్పలేదని చెప్పుచున్నాడు. ఈ జగత్తు యొక్క ఆది, మధ్య, అంతాలు పరమాత్ముడవైన నీవలననే కలుగుచున్నవి. అవ్యయుడవైన నీకు ఆది, మధ్య, అంతములు లేవు. పరమాత్మ, ఈ జగత్తనే దృశ్యము, నేననుకొనే జీవుడనే ద్రష్ట, తత్ అనే సత్యము, చిద్రూపమైన బ్రహ్మము నీవే. (వికారములుండునేమోయన్న శంక నీ విషయమున కలుగదు.) (5)

శ్లో॥ తవైవ చరణాంభోజం శ్రేయః కామా నిరాశిషః ।
విసృజ్యో భయతః సంగం మునయః సముపాసతే ॥6॥

శ్రేయః కాములు – మోక్షమును కోరువారు ప్రాపంచికమైన కోరికల పట్ల ఆసక్తి లేని యోగీశ్వరులు ఇహపరలోక బంధమును విడిచి నీ పాద పద్మములనే సేవించుచున్నారు. (6)

టీ॥ తవైవంభూతత్వే ముముక్షూణామాచారః ప్రమాణ మిత్యాహ. తవైతేతి. ఇహాముత్ర చ సంగం త్యక్త్వా.॥6॥

శ్లో॥ త్వం పూర్ణ బ్రహ్మమమృతం విగుణం విశోకం
ఆనందమాత్ర మవికార మనన్య దన్యత్ ।
విశ్వస్య హేతు రుదయ స్థితి సంయమానాం
ఆత్మేశ్వరశ్చ తదపేక్ష తయాఽనపేక్షః ॥7॥

టీ :-నను బ్రహ్మైవ చేదహం తర్హ్య సంగోదాసీనస్య ంఘ్రోజోపాసనయా కిం తేషాం ? తత్రాహ త్వమితి. బ్రహ్మత్వేఽపి త్వం. నాత్యంతము విశ్వస్య ప్రపంచస్యోదయాదీనాం హేతుః. తదుపాధీనామాత్మనాం జీవానామీశ్వరశ్చ. తర్హి కిం రాజాదివత్కయాప్యపేక్షయా సేవకేభ్యః సేవాఫలం దదామి?నహి. అన తర్హి. కిమీశ్వరత్వేన?తత్రాహ తైరాత్మభిః తత్తత్ఫల దానార్థమనేకృత ఇతి తద భావస్తదపేక్షతాతయా. అనపేక్షత్వమేవ దర్శయయితుం తదీయం బ్రహ్మత్వం విశినష్టి. తం చ సుఖరూపం విషయసుఖవైలక్షణ్యార్థమాహ అవికారం నిత్యం. ఆనందమాత్రం కం. తత్కుతః? విగుణం. కిం చ. అనన్యత్ న విద్యతే అన్యద్యస్మాత్. తస్మాత్ త్వద్వ్య నిరపేక్షస్త్వమిత్యర్థః. తర్హి.

నేను బ్రహ్మనైనట్లైతే సర్వసంగములు లేని ఉదాసీనుడైన నాకు నీ పాదపద్మములను సేవించుట ( ఉపాసించుట ) ఇతరులకు ఎందుకు? అనే విషయమును చెప్పుచున్నాడు. ఓ పరాత్పరా ! నీవు బ్రహ్మత్వముతో ఎట్టి బంధములందు తగుల్కొనవు. తటస్థుడవైనప్పటికీ బొత్తిగా ( అత్యంతముగా) ఉదాసీనుడవు కాదు. ఎందుకంటే నీవు ఈ పాంచభౌతికమైన విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములకు కారకుడవు. ఈ జగత్తు యొక్క ఉపాధులకు, జీవులకు ఈశ్వరుడవై వారి వారికి ఆయా ఫలముల నొసగువాడవు. ఐతే ప్రభువులవలె సేవకులెవరి మీదనైనా ఎక్కువ ఆసక్తితో విశేషఫలములను ఇచ్చుచున్నానా? అని నీవు అడుగవచ్చును. లేదు. నీవు అనపేక్షుడవు. ఐతే ఈశ్వర తత్త్వము చేతనా? అనే విషయమును చెప్పుచున్నాడు. జీవులకు ఫలదానము కొఱకు కాంక్షించు చున్నావా? అంటే జీవులకే కోరికలుండును. వారి వారి భావములే వారి వారి కోరికలు.పరమాత్ముని నిరీహత్వమును చూపుటకు ఆయన బ్రహ్మత్వము విశేషముగా చెప్పబడినది. పరమాత్మస్వరూపము పరిపూర్ణముగా అమృతమయము. పరమాత్మకు విషయాసక్తి లేకపోవుటను చెప్పుచున్నాడు. పరమాత్మ అవికారుడు. నిత్యము ఆనందమాత్రుడు. ఎందుకంటే బ్రహ్మము పూర్తిగా శోకము లేనిది. దానికి కారణమేమనగా బ్రహ్మము గుణములు

సర్వాత్మకత్వేతత్తద్వికారప్రసంగో దుర్వారః. తత్రాహ వ్యతిరిక్తం చ. కారణత్వాత్. న హ్యేవంభూతసుఖాత్మకబ్రహ్మస్వరూపస్య తవాన్యా పేక్షాస్తి. అతః. కేవలం భక్తానుగ్రహార్థమేవతవైశ్వర్యం న స్వార్థమిత్యర్థః. ॥7॥

శ్లో॥ ఏకస్త్వమేవ సదసద్వయ మద్వయంచ
స్వర్ణం కృతా కృత మివేహ న వస్తుభేదః ।
అజ్ఞాన తస్త్వయి జనైర్విహితో వికల్పో
యస్మాద్గుణ వ్యతికరో నిరుపాధికస్య॥8॥

టీ :- అన్యత్వమనన్యత్వం చైకస్య కుత ఇత్యాశంక్య దృష్టాంతేనోపపాదయతి ఏక ఇతి. సదసత్కార్యకారణరూపద్వయమద్వయం చ. పరమకారణం త్వమేవైకః. కృతం కుండలాదిరూపం ద్వయం.

లేనిది. సత్వ, రజస్సు, తమములనే ప్రాపంచిక మాలిన్యములే వ్యామోహమును కలిగించునవి. బ్రహ్మము అనన్యమైనది. తనకన్న వేరు ఏదియూ లేకపోవుటయే అనన్యతా బ్రహ్మము కంటే వేరైనది పూర్తిగా లేనప్పటికీ నిరపేక్షత్వమని అర్థము. పరమాత్మ సర్వాత్మకుడైనప్పుడు ఆయా జీవుల వికారములు బ్రహ్మమునకు అంటకుండా నివారింప శక్యము కాదు కదా ! అనే విషయమును చెప్పుచున్నాడు. బ్రహ్మము సర్వ సృష్టికంటే వేరైనది. ఎందుకంటే అది సర్వమునకు కారణమైనది. ఆ విధముగా సర్వాత్మకమైన బ్రహ్మస్వరూపమునకు ఇతరాపేక్ష ఉండదు కదా!. అందువలన భక్తులను అనుగ్రహించుట కొఱకే భగవంతుని సర్వశక్తులు, ఐశ్వర్యము వినియోగమగును కానీ స్వార్థమునకు కాదని తాత్పర్యము. (7)

ఒకే దానికి ( భగవంతునకు ) అన్యత్వము ( భిన్నత్వము ) అనన్యత్వము (ఏకత్వము) ఎట్లు సాధ్యమగును. అను శంకకు (పూర్వపక్షమునకు) సమాధానముగా దృష్టాంతమును చెప్పుచున్నాడు. సత్తు ( ఉన్నదానికి), అసత్తు ( లేనిదానికి ) కారణరూపుడు, ద్వయము ( భిన్నత్వము ), అద్వయము (ఏకత్వము), పరమకారణము అన్నీ నీవొక్కడవే. ఎందుకంటే కుండలము, కంకణములు, హారములు మొదలైన ఆభరణముల రూపములు భిన్నముగా కనిపించుచున్నను, ఎట్టి వికారములు లేక ముద్దగా ఉన్నను బంగారము ఏ విధముగా వస్తుభేదము లేకుండ ఒక్కటే యగునో ఆ విధముగనే ఇక్కడ

అకృతం చ కేవలమద్వయం. స్వర్ణం యథైక మేవ తద్వదేవేహ త్వయి వస్తుతో భేదో నాస్తి. కథం తర్హి, భేదప్రతీతిస్తత్రాహ అజ్ఞా నత ఇతి. కుత? యస్మాన్నిరునాధికస్త్యైవ తవాయం గుణైర్వ్యతికరో భేదః న స్వతః.॥8॥

కూడా పరమాత్మ విషయమున వస్తుభేదము లేదు. ఐతే భేద ప్రతీతి ( భేదముగా ఉన్నట్లు తెలియుట ) ఎట్లు కలుగుచున్నది. అను దానిని వివరించుచున్నాడు. జనుల అజ్ఞానత్వము (బంగారము, ఆభరణములు వేరు వేరని భావించుట) తో భేదత్వము కల్పించబడినది. ఎందుకంటే ఉపాధి ( శరీరము, దాని ద్వారా సంక్రమించు ఇంద్రియాంతఃకరణాదులు ) లేనట్టి పరమాత్మకు సత్వము, రజస్సు. తమస్సులనే గుణములతో సమ్మేళన రూపమైన భేదము సహజసిద్ధముగా లేదు. (8)

శ్లో॥ త్వాం బ్రహ్మ కేచి దవయంత్యుత ధర్మమేక
ఏకేపరం సదసతోః పురుషః పరేశమ్ ।
అన్యేవయంతి నవశక్తియుతం పరం త్వాం
కేచిన్మహాపురుషమవ్యయ మాత్మతంత్రమ్ ॥9॥

టీ :-అత ఏవం త్వాం బహుధా వర్ణయంతి తత్త్వతస్తు కేపి న జానంతీత్యాహ ద్వాభ్యాం. త్వామితి. త్వాం బ్రహ్మవేదాంతినః. అవయంతి మన్యంతే. త్వామేవ ధర్మం మీమాంసకా మన్యంతే. ప్రకృతి పురుషయోః పరం పుమాంసం సాంఖ్యాః శ్లో. "విమలోత్కర్షణీ జ్ఞానాక్రియాయోగా తథైవ చ, ప్రజ్ఞాస త్యాతథేశానానుగ్రహా నవ శక్తయః" ఇత్యేవం, నవశక్తియుతం.

అందుకే భగవంతుని పలువురు పలువిధములుగా భావించుచున్నారు. యధార్థముగా ఎవరినీ పరమాత్మ వాస్తవ తత్వము తెలియదు. " ఏకం సద్విప్రా బహుధావదంతి । ధర్మస్య తత్వం నిహితం గుహాయాం॥" నిన్ను వేదాంతులు ' బ్రహ్మము' అని భావించుచున్నారు. మీమాంసకులు నీవే ' ధర్మము ' అని తలచుచున్నారు. ప్రకృతిపురుషులకంటే వేరుగా, ఉత్కృష్టముగా నున్న ' పరమ పురుషుడని ' సాంఖ్యులు ఎంచుచున్నారు. " విమలోత్కర్షిణీ జ్ఞానా క్రియా యోగా తథైవచ । ప్రజ్ఞా సత్యా తథేశానానుగ్రహా నవశక్తయః॥" విమలా (విమలత) ఉత్కర్షిణీ (ఉత్కర్షము), జ్ఞానా (జ్ఞానము), క్రియా (క్రియ), యోగా (యోగము), ప్రజ్ఞా (ప్రజ్ఞ) (ప్రహ్వ=నమ్రత), సత్యా (సత్యము), ఈశానా (ఈశిత), అనుగ్రహా (అనుగ్రహము) అనే తొమ్మిది శక్తులు కలిగి సర్వోత్కృష్టుడైన వాడు పరమాత్మయని పాంచరాత్రులు, మహా పురుషుడని

పరం పాంచరాత్రాః. మహాపురుషం పాతంజలాః.॥9॥

శ్లో॥ నాహం పరాయు ఋషయో న మరీచి ముఖ్యాః
జానంతి యద్విరచితం ఖలు సత్త్వ సర్గాః ।
యన్మాయయా ముషిత చేతస ఈశ దైత్య
మర్త్యాదయః కిముత శశ్వదభద్ర వృత్తాః॥10॥

టీ :–నేతి. పరాయః బ్రహ్మాసత్త్వసర్గాః. సత్త్వగుణేన సృష్టా అపి. యేన త్వయా. విరచితం విశ్వమపి. ఖలు. తత్త్వతోన జానంతి. కిం పునస్త్వాం. హే ఈశ అభద్రం రాజసంతామసం చ వృత్తం ఉత్పత్తిర్వృత్తిశ్చ యేషాం తే. న జానంతీతి కిము వక్తవ్యం.॥10॥

శ్లో॥ సత్త్వం సమీహిత మదః స్థితి జన్మనాశం
భూతేహితం చ జగతో భవబంధ మోక్షౌ ।
వాయుర్యథా విశతి ఖం చ చరాచరాఖ్యం
సర్వం తదాత్మకతయాఽవగమోఽవరుంత్సే॥11॥

టీ :– కింతు త్వం సర్వం జానాసీత్యాహ. సత్త్వమితి. సత్త్వం సర్వం అవకుంత్సే వ్యాప్నోషి జానాసి. కిం తత్సర్వం. సమీహితం స్వకృతం.

పాతంజలులు పరతత్వమును పెక్కువిధాలుగా వ్యాఖ్యానించినారు.(9)

పరాయువనగా పరమాత్మ, బ్రహ్మము. ఓ ఈశ్వరా ! నీయొక్క సత్వ గుణము చేత ఉత్పన్నులమైన నేను, మరీచి మొదలైన మహర్షులు నీవు రచించిన ఈ విశ్వమును గుఱించిన యధార్థజ్ఞానమును (తత్వమును) తెలియలేము. అభద్రము అనగా రక్షణలేని (జరా మరణాదులతో సతమతమగు) తామస, రాజస గుణములచే ఉద్భవించిన రాక్షసులు, మానవులు మొదలైనవారు తెలియలేరని వేరుగా చెప్పవలెనా?. (10)

నీకు అన్నీ తెలియునని చెప్పుచున్నాడు. నీవు సర్వమును వ్యాపించి తెలియు చున్నావు. ( సృష్టి కార్య నిర్వహణ కాంక్షతో ) తన యొక్క రేతస్సు ( వీర్యము, శక్తి) తో ఈ జగత్తుయొక్క ఉత్పత్తి, పాలన, నాశములు, సర్వజీవుల కోరికలు, ఈ జగత్తుయొక్క బంధము, మోక్షము మొదలైన వన్నియు నీచేత వ్యాప్తమై నీకు తెలిసినవి. వ్యాప్తికి దృష్టాంతము చరాచరములను, సర్వదేహములందును, ఆకాశమునను వాయువు ఆవరించిన విధమున నీవును వ్యాపించినావు. సర్వ చరాచరములయొక్క ఆత్మత్వముచే వ్యాపించినావని

అదః స్థితిజన్మనాశం అముష్య జగతో జన్మాది. భూతానామీహితంచ. జగతో భవబంధమోక్షం చ. వ్యాపౌ దృష్టాంతః. చరాచరాఖ్యం దేహజాతం ఖం చ. యథా వాయురావిశతి. తథా. కథమవరుంత్సే. తదాత్మకతయా తస్య సర్వస్యాత్మతయోత్యర్థః. ఆత్మత్వే హేతుః అవగమః జ్ఞానరూప ఇతి. ॥11॥

అర్థము. సర్వాత్మకత్వమునకు కారణము జ్ఞాన రూపత్వము. (11)

శ్లో॥ అవతారా మయా దృష్టా రమమాణస్యతే గుణైః ।
సోహం తద్ద్రష్టుమిచ్ఛామి యత్తే యోషిద్వపుర్ధృతమ్ ।12।

ఈశ్వరుడు ఈ విధముగా విష్ణువును స్తుతించి ప్రస్తుతము తను వచ్చిన కోరికను రెండు శ్లోకములలో అర్థించుచున్నాడు. నీ గుణములచేత శోభిల్లిన నీ అవతారములను నేను చూచినాను. ఐతే ప్రస్తుతము నీవు స్త్రీరూపమును ధరించిన అవతారమును చూడగోరుచున్నాను. (12)

శ్లో॥ యేన సమ్మోహితాః దైత్యాః పాయితాశ్చామృతం సురాః ।
తద్దిదృక్షవ ఆయాతాః పరం కౌతూహలం హినః॥13॥

రాక్షసులను మోహింపజేసి దేవతలకు అమృతపానము చేయించిన నీ స్త్రీ రూపమును దర్శించగోరినవాడనై నేను వచ్చితిని. నాకు మిక్కిలి ఉత్సాహము కలుగుచున్నది. అని శివుడు అర్థించినాడు. (13)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవ మభ్యర్థితో విష్ణుర్భగవాన్ శూలపాణినా ।
ప్రసహ్య భావ గంభీరం గిరిశం ప్రత్యభాషత ॥14॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా ఈశ్వరుడు ప్రార్థించగా విష్ణుమూర్తి చిఱునవ్వునవ్వుచూ గంభీర భావముతో శివునికి సమాధానము చెప్పినాడు. (14)

టీ :-ఏవం స్తుత్వా ప్రస్తుతం విజ్ఞాపయతి. ద్వాభ్యాం అవతారా ఇతి. ॥12-14॥

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ కౌతూహలాయ దైత్యానాం యోషిద్వేషో మయాకృతః ।
పశ్యతా సురకార్యాణి గతే పీయూష భాజనే ॥15॥

టీ :-కౌతూహలాయేతి. సురకార్యాణి యోషిద్వేషేణ భవిష్యంతీతి పశ్యతా. అయం భావః. అవశ్యం తావదున్మత్తాన్ దైత్యా పంచయిత్వా.దేవేభ్యః అమృతం దేయం.న చైవం వైషమ్యం రూపాంతరేణ కర్తుముచితం. అతో వంచనమోహనాదిసారం కామినీరూపం. మయా ధృతమితి. ॥15॥

**విష్ణుమూర్తి ఇట్లు చెప్పినాడు :-**

దేవతల పనులు (అమృత విభాగము) స్త్రీవేశముతో నయితే సిద్ధించునని అట్లు చేసితిని. ఉన్మత్తులైన రాక్షసులకు ఉత్కంఠ కలిగించి, వంచించి దేవతలకు అమృతమును పంచుటకు, దేవ రాక్షసులమధ్య వైశమ్యమును నివారించుటకు, వేరే రూపముతో వంచించుటకు సాధ్యముకాదని, మోహింప జేయుటకు స్త్రీ రూపము తగినదని ధరించితిని. (15)

శ్లో॥ తత్తేహం దర్శయిష్యామి దిదృక్షోః సురసత్తమ ! ।
కామినాం బహుమంతవ్యం సంకల్ప ప్రభవోదయమ్ ॥16॥

ఓ సురశ్రేష్ఠా ! పరమేశ్వరా ! కాముకులు మిక్కిలి చింతించి కోరదగినది.(వృద్దీపనకరమైనది) , మన్మథ ప్రేరకమైనదైన ఆ మోహినీ రూపమును దర్శించ కోరికగలనీకు చూపుదును. ఉపాసన చేతనే శ్రేష్ఠమైన స్త్రీప్రాప్తి కలుగునని భావము. (16)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతి బ్రువాణో భగవాంస్తత్రైవాంతర ధీయత ।
సర్వతశ్చారయంశ్చక్షుర్భవ ఆస్తే సహోమయా ॥17॥

టీ :- తదితి. తద్రూపం దర్శయిష్యామి. సంకల్పప్రభవః కామః తస్యోదయో యస్మాత్. ॥16,17॥

శ్లో॥ తతో దదర్శోపవనే వరస్త్రియం
విచిత్రపుష్పారుణ పల్లవద్రుమే ।
విక్రీడతీం కందుక లీలయా లసత్
దుకూల పర్యస్త నితంబ మేఖలామ్ ॥18॥

టీ :- తత ఇతి. విచిత్రాణి పుష్పాణి. అరుణాః పల్లవాశ్చ. యేషాం తే ద్రుమా యస్మిన్. లసద్దుకూలేన పర్యస్తే పరివృతే నితంబే మేఖలా యస్యాః తాం. ॥18॥

శ్లో॥ ఆవర్తనోద్వర్తన కంపితస్తన
ప్రకృష్ట హారోరు భరైః పదే పదే ।
ప్రభజ్యమానామివ మధ్యతశ్చలత్
పద ప్రవాలం నయతీం తతస్తతః ॥19॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈశ్వరుడు ఈ విధముగా చెప్పుచు భగవంతుడైన శ్రీమహా విష్ణువు అక్కడనే అదృశ్యుడైనాడు. ఈశ్వరుడు పార్వతితో గూడా అన్ని దిక్కులను ఉత్కంఠతతో కలియజూచుచుండెను. (17)

అప్పుడు విచిత్రమైన పుష్పములు, ఎఱ్ఱని చిగురులతో విలసిల్లు వృక్షములతో కూడిన ఉద్యాన వనమున ప్రకాశించు సన్నని వస్త్రము చేత ఆవరింపబడిన పిఱుదులు, ఒడ్డాణములతో విరాజిల్లుచు, కందుకముతో నాటలాడు ఒకానొక అపూర్వ సౌందర్యవతియైన స్త్రీమూర్తిని ఈశ్వరుడు దర్శించినాడు. (18)

ఎగురుచు, క్రిందపడుచున్న బంతిని లీలా విశేషముతో పట్టుకొనుటకై చుట్టూ తిరుగుట, ఎగురుటల వలన క్రిందికి పైకి ఊగుచున్న స్తనముల వలన, అతిశయించు హారముల యొక్క బరువు వలన అడుగడుగున వేరు వేరు విలాసములతో నొప్పునట్టి చిగుఱుటాకులవంటి కోమలమైన పదములతో నడయాడునట్టి స్త్రీని ( చూచినాడని ముందరి శ్లోకముతో అన్వయము) . (19)

టీ :-ఆవర్తన ఇతి. ఉత్పతత్కందుకలీలావశేవ, యే ఆవర్తనో ద్వర్తనే నమనోన్నమనే తాభ్యాం కంపితయోః స్తనయోః. ప్రకృష్టహారాణాం చ. ఉరుభారైః. ప్రతిపదం. మధ్యేప్రభజ్యమానా మివ. చలత్పదమేవ ప్రవాళ వత్కోమలం తతస్తతో నయంతీం. 19

శ్లో॥ దిక్షు భ్రమత్కందుక చాపలైర్భృశం
ప్రోద్విగ్న తారాయత లోల లోచనామ్ ।
స్వకర్ణ విభ్రాజిత కుండలోల్ల సత్
కపోల నీలాలక మండితాననామ్ ॥20॥

దిక్కులందు పరుగిడు బంతియొక్క చలనముల వలన విశేషముగా కదులునట్టి కనుగ్రుడ్లతో విశాలమై, చంచలమైన కన్నులు కలది, తన చెవులందు ప్రకాశించు కుండలములచేత మెఱిసి పోవుచున్న చెక్కిళ్లపై విలాసముగా కదులునట్టి ముంగురులచేత అలంకృతమైన ముఖము కల్గిన స్త్రీమూర్తిని ( శివుడు చూచినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము). (20)

టీ :-దిక్ష్వితి. దిక్షు. భ్రమతః కందుకస్య చాపలైశ్చాంచల్యైః భృశం ప్రోద్విగ్నతారేఆయతే. లోలేలోచనేయస్యాః. స్వకర్ణాభ్యాం విభ్రాజితే యే కుండలే తాభ్యాముల్లసంతౌ కపోలౌ తాభ్యాం. నీలాలకైశ్చ మండితమాననం యస్యాః. ॥20॥

శ్లో॥ శ్లథద్దుకూలం కబరీంచ విచ్యుతాం
సన్నహ్యతీం వామకరేణ వల్గునా ।
వినిఘ్నతీమన్య కరేణ కందుకం
విమోహయంతీం జగదాత్మ మాయయా ॥21॥

జారుచున్న చీరను, మడివీడిన సిగను చక్కనైన ఎడమచేతితో బంధించుచు, ఇంకొక చేతితో బంతిని పట్టుకొనుచు, తన మాయావిలాసపుటొయ్యారములతో లోకమును మోహింపజేయుచున్న స్త్రీని (శివుడు చూచినాడు) .(21)

టీ :- శ్లథదితి. సన్నహ్యతీం బధ్నంతీం. జగద్విమోహయంతీం. 21

శ్లో॥ తాం వీక్ష్యదేవ ఇతి కందుక లీల మేషత్
వ్రీడా స్ఫుట స్మిత విసృష్ట కటాక్ష ముష్టః ।
స్త్రీప్రేక్షణ ప్రతి సమీక్షణ విహ్వలాత్మా
నాత్మానమంతిక ఉమాం స్వగణాంశ్చ వేద॥22॥

టీ :- తామితి. తాం వీక్ష్య. దేవః శ్రీరుద్రః ఆత్మానం. అంతికే స్థితాముమాం. స్వగణాంశ్చ. న వేద. కథంభూథః. ఇతి ఏవంభూతయా. కందుకలీలయా. యా ఈషద్వ్రీడా తయా. అస్ఫుటం స్మితం తేన సహ. విసృష్టో యః కటాక్షః. తేన ముష్టః వంచితః. అతఏవ. స్వయం యత్ స్త్రియః ప్రేక్షణం తయా చ ప్రతిసమీక్షణం. తాభ్యాం. విహ్వలః ఆత్మా మనో యస్య.(22)

పరమేశ్వరుడు బంతి ఆటతో కొంచెము సిగ్గుపడుచు కనపడినదని సుందర దరహాసముతో కూడిన కడగంటి చూపుల వేడిమికి తాళలేని వాడై, రమణీయ రమణిని మిక్కిలి సమీపమున దర్శించి ఆమె మరల తనపై చూపులు నిగుడించగా వంచితుడై (ఆకర్షితుడై) తనను, చెంతనే వున్న అర్ధాంగి పార్వతిని, తన ప్రమథ గణములను గమనించలేని పరవశత్వమును అనగా స్త్రీ లౌల్యమును పొందినాడు. (22)

శ్లో॥ తస్యాః కరాగ్రాత్సతు కందుకోయదా
గతో విదూరం తమనుప్రజత్ స్త్రియా ।
వాసః ససూత్రం లఘు మారుతో-హరత్
భవస్య దేవస్య కిలాను పశ్యతః ॥23॥

ఆ మోహిని హస్తతాడనమున బంతి దూరముగా వెళ్ళగనే ఆమె దానిని మరల పట్టుకొనుటకై దాని వెంట పరుగిడినది. అప్పుడు పరమేశ్వరుడు చూచుచుండగా ఉత్కంఠత రేకెత్తించునట్లుగా, ఆమె వివృతజఘన యగునట్లుగా ఆమె ధరించిన సన్నని వస్త్రము మొలనూలుతో కలిసి గాలికి ఎగిరిపోయినది.(23)

టీ :-తస్యా ఇతి. కందుకం. అనువ్రజంత్యాః స్త్రియః. లఘు సూక్ష్మం వాసః. సూత్రం కాంచీసహితం. ॥23॥

శ్లో॥ ఏవం తాం రుచిరాపాంగీం దర్శనీయాం మనోరమామ్।
దృష్ట్వా తస్యాం మనశ్చక్రే విషజ్జంత్యాం భవః కిల॥24॥

టీ :-ఏవమితి. విషజ్జంత్యాం లజ్జాకుంచితకటాక్షైరాత్మానం నిరీక్షమాణాయాం. ॥24॥

ఈ విధముగా మనోహరమైన కడగంటి చూపులు గలది, అందమైనది, మనోజ్ఞమైనది, తలవంచి కడగంటి చూపులతో సాభిలాషముగా తనను చూచుచున్నదైన మోహినిని చూచి ఈశ్వరుడు ఆమెయందు కోరికతో మనసును నిలిపినాడు.(24)

శ్లో॥ తథాప హృత విజ్ఞానః తత్కృత స్మరవిహ్వలః ।
భవాన్యా అపి పశ్యంత్యా గతహ్రీ స్తత్పదం యయౌ॥25॥

అప్పుడు విచక్షణను కోల్పోయి, ఆ స్త్రీయందలి వ్యామోహముతో మదన పీడితుడై తన అర్ధాంగియైన పార్వతి చూచుచుండగనే సిగ్గువిడిచినవాడై శివుడు మోహిని సమీపమునకు ( రతి కాంక్షతో ) వెళ్ళినాడు. (25)

శ్లో॥ సాతమాయాంత మాలోక్య వివస్త్రా వ్రీడితాభృశమ్ ।
నిలీయమానా వృక్షేషు హసంతీ నాన్వతిష్ఠత ॥26॥

ఆ జగన్మోహిని తన వైపు వచ్చుచున్న ఈశ్వరుని చూచి తన శరీరముపై వస్త్రము లేనందున అధికముగా సిగ్గుపడుచు శివునకు అందకుండా వృక్షముల మాటున దాగి చిఱునవ్వు నవ్వుచు అటు ఇటు తిరుగుచుండెను.(26)

శ్లో॥ తామన్వగచ్ఛద్భగవాన్భవః ప్రముషితేంద్రియః ।
కామస్య చ వశంనీతః కరేణుమివ యూథపః ॥27।

భగవంతుడైన ఈశ్వరుడు ఇంద్రియవశుడై, కామపీడితుడై ఆడ యేనుగు వెంటబడు గజరాజువలె ఆ జగన్మోహిని వెంట బడినాడు. (27)

శ్లో॥ సోఽనువ్రజ్యాతి వేగేన గృహీత్వాఽనిచ్ఛతీం స్త్రియమ్ ।
కేశబంధ ఉపానీయ బాహుభ్యాం పరిషస్వజే ॥28॥

శివుడు శీఘ్రముగా వెళ్ళి పట్టుకొని ఆమెకు ఇష్టము లేక వలదనుచున్నను ఆమె సిగముడిని పట్టుకొని దగ్గరకు తీసుకొని తన బాహువులతో కౌగిలించుకున్నాడు.(28)

శ్లో॥ సోపగూఢా భగవతా కరిణా కరిణీ యథా ।
ఇతస్తతః ప్రసర్పంతీ విప్రకీర్ణ శిరోరుహ ॥29॥

మోహిని బలవంతముగా శంకరునిచే, ఆడేనుగు మగయేనుగుచేత కౌగిలింపబడి విడిపించుకొనుటకై పెనుగులాడగా ఆమె శిరోజములు చెల్లా చెదురైనవి.(29)

టీ :-తయేతి. తత్పదం తస్యాస్సమీపం యయౌ. ॥25-29॥

శ్లో॥ ఆత్మానం మోహయిత్వాంగ సురర్షభ భుజాంతరాత్ ।
ప్రాద్రవత్సా పృథుశ్రోణీ మాయా దేవ వినిర్మితా॥30॥

ఓ రాజా ! సురశ్రేష్ఠుడైన పరమేశ్వరుని కౌగిలింతనుండి తప్పించుకొని ఆ స్థూల జఘన అయిన మాయావధూటి పారిపోయినది. (30)

శ్లో॥ తస్యాసౌ పదవీం రుద్రో విష్ణోరద్భుత కర్మణః ।
ప్రత్య పద్యత కామేన వైరిణేవ వినిర్జితః ॥31॥

అద్భుత కార్యుడైన విష్ణువు మయా స్త్రీరూపమును కామించిన శివుని మరల మన్మథుడు జయించినాడా అనునట్లుగా శివుడు ఆమెవెంట పడినాడు.(31)

టీ :-ఆత్మానమితి. అంగ హే రాజన్ సురర్షభభుజాంతరాత్. మహేశ బబాహుమధ్యప్రదేశాత్. ॥30,31॥

శ్లో॥ తస్యానుధావతో రేతశ్చ స్కందామోఘరేతసః ।
శష్మిణో యూథపస్యేవ వాసితామనుధావతః ॥32॥

బలమైన గజపతి ఆడ ఏనుగు వెంటబడినట్లుగా ఆ జగన్మోహిని వెంటతగిలిన శివునికి రేతస్కలనమైనది. (32)

శ్లో॥ యత్ర యత్రా పతన్మహ్యాం రేతస్తస్య మహాత్మనః ।
తాని రూప్యశ్చ హేమ్నశ్చ క్షేత్రాణ్యాసన్మహీపతే ॥33॥

ఓ మహారాజా ! మహాపురుషుడైన పరమేశ్వరుని వీర్యము భూమిపై పడిన స్థలములన్నియు వెండి, బంగారు భూములైనవి. (33)

టీ :-తస్యేతి. శుష్మిణఃమత్తస్య వాశితాం పుష్పవతీం గజీం.॥32,33॥

శ్లో॥ సరిత్సరస్సు శైలేషు వనేషూప వనేషుచ ।
యత్ర క్వచాసన్ ఋషయస్తత్ర సన్నిహితో హరః॥34॥

మోహిని వెంటదగిలి నదులు, సరస్సులు, పర్వతములు, అడవులు, ఉద్యానవనములు మొదలగు వానిలో మహర్షులున్న స్థలములనన్నిటిలో శివుని ఋషులు దర్శించినారు. (34)

టీ :-సరిదితి. ఏవం తామనుధావన్ హరః సరిత్సరసుః శైలాదిషు చ సన్నిహితో బభూవ. ॥34॥

శ్లో॥ స్కన్నే రేతసిసో-పశ్యదాత్మానం దేవమాయయా ।
జడీకృతం నృపశ్రేష్ఠ ! సన్న్యవర్తత కశ్మలాత్ ॥35॥

ఓ మహారాజా ! వీర్యపతనమగుటను గమనించి, దేవ (విష్ణు మాయవలన జడత్వమును పొందిన తనను తాను తెలుసుకొని మోహమును వీడి శివుడు మరలినాడు. (35)

శ్లో॥ అథావగత మాహాత్మ్య ఆత్మనో జగదాత్మనః ।
అపరిజ్ఞేయ వీర్యస్య నమేనే తదుహాద్భుతమ్ ॥36॥

తెలియవీలులేని లీలావిలాసములుగల జగదాత్ముడైన పరమాత్ముని (విష్ణుని) గొప్పదనము తెలిసినవాడై శివుడు దేవమాయతో తాను మూర్ఖత్వమును పొందుటను తెలియలేదు.(36)

శ్లో॥ తమవిక్లమ మవ్రీడ మాలక్ష్య మధుసూదనః ।
ఉవాచ పరమప్రీతో బిభ్రత్స్వాం పౌరుషీం తనుమ్॥37॥

టీ :-స్కన్నఇతి. కశ్మలాత్ మోహాతిరేకాత్. జడీకృతం కర్తవ్యాకర్తవ్యవిచారశూన్యతయా కృతం. ॥35-37॥

కలత చెందకుండ, సిగ్గుపడకుండ ఉన్న పరమేశ్వరుని చూచి నారాయణుడు ప్రీతిజెంది తన పురుషరూపమును యథా పూర్వముగా ధరించి ఈ విధముగా చెప్పినాడు.(37)

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ దిష్ట్యాత్వం విబుధశ్రేష్ఠ ! స్వాంనిష్ఠా మాత్మనా స్థితః ।
యన్మే స్త్రీరూపయా స్వైరం మోహితోప్యంగ మాయయా॥38॥

శ్లో॥ కోను మే-తితరేన్మాయాం విషక్తస్త్వ దృతే పుమాన్ ।
తాంస్తాన్ విసృజతీం భావాన్ దుస్తరామ కృతాత్మభిః॥39

టీ :-ధిష్ట్యేతి. స్వాం నిష్ఠాం ప్రకృతిం. ॥38,39॥

**శ్రీ మహా విష్ణువు ఈ విధముగా చెప్పినాడు :-**

ఓ పరమేశ్వరా ! నా మోహినీ రూపమాయతో నీవు యథేచ్ఛగా మోహితుడవైనప్పటికి దైవికముగా నీవు మరల నీ ప్రకృతిని పొందితివి.(38)

ఆత్మ సంయమనము లేని వారెవరును ఆయా భావములను ఉద్దీపింపజేయునట్టి మేరలేని నా మాయను దాటలేరు. మోహితుడవైనను మరల వెంటనే తెలియగలిగిన నీకే నా మాయను తరించుట (ఛేదించుట) సాధ్యమైనదని విష్ణువు ఈశ్వరునితో చెప్పినాడు. (39)

శ్లో॥ సేయం గుణమయీ మాయా నత్వామభి భవిష్యతి ।
మయా సమేతా కాలేన కాలరూపేణ భాగశః ॥40॥

నా యీ గుణాత్మకమైన మాయ నిన్ను పొందబోదు. ఈ మాయ సృష్ట్యాది నిమిత్తముగా కాలరూపుడైన నాతో భాగములుగా అనగా సృష్టికాలమున రజస్సుగా, స్థితి కాలమున సత్వముగా, ప్రళయ కాలమున తమస్సుగా ఆయా అంశలతో కూడినదై నా అధీనమై వుండును. (40)

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం భగవతా రాజన్ ! శ్రీవత్సాంకేన సత్కృతః ।
ఆమంత్ర్య తం పరిక్రమ్య సగణః స్వాలయం యయౌ ॥41॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! విష్ణువు ఈ విధముగా సన్మానవాక్యములతో పరమేశ్వరుని సంభావించగా ఆయన శ్రీమహా విష్ణువు అనుమతితో తన ప్రమథ గణములతో కైలాసమునకు వెళ్ళినాడు. (41)

శ్లో॥ ఆత్మాంశ భూతాం తాం మాయాం భవానీం భగవాన్భవః।
శంసతామృషి ముఖ్యానాం ప్రీత్యాచష్టాథ భారత !॥42॥

టీ :- సేతి. కాలేన సృష్ట్యాదినిమిత్తేన. మయా కాలరూపేణ. భాగశో రజఆద్యంశేన సమేతా మదధీనాసతీ. ॥41,42॥

ఓ భరత వంశ శ్రేష్ఠా ! విష్ణువు అంశమైన, ఆ మాయా రూపిణియైన మోహినిని గురించి స్తుతింపదగిన ఋషీశ్వరుల నడుమ ప్రీతిగా పార్వతితో ఆ పరమేశ్వరుడు ఈ విధముగా చెప్పినాడు. (42)

**శ్రీ రుద్ర ఉవాచ :-**

శ్లో॥ అపి వ్యపశ్యస్త్వ మజస్యమాయాం
పరస్య పుంసః పరదేవతాయాః ।
అహం కలానా మృషభో విముహ్యే
యయా వశోన్యే కిముతా స్వతంత్రాః ॥43॥

**రుద్రుడీ విధముగా చెప్పినాడు :-**

ఓ పార్వతీ ! పరాత్పరుడు, పరమపురుషుడైన శ్రీమహా విష్ణువు యొక్క మాయను నీవు కూడా విశేషముగా చూచితివి కదా !. అణిమాది అష్టసిద్ధులకు, కామజయమునకు శ్రేష్ఠుడనైన నేను కూడా జగన్మోహిని మాయలకు వశుడనైతిని. ఇక తమపై తమకు స్వాతంత్ర్యము లేనివారు, మాయకు లొంగెడు వారైన ఇతర సామాన్యుల విషయము ఏమని చెప్పవచ్చును.(43)

శ్లో॥ యం మామ పృచ్ఛస్త్వముపేత్య యోగాత్
సమాసమస్రాంత ఉపారతం వై ।
స ఏవ సాక్షాత్ పురుషః పురాణో
న యత్ర కాలో విశతే న వేదః ॥44॥

యోగధ్యానమున నిర్వికల్ప సమాధిలో వేయిసంవత్సరములు పరమానందమున నుండిన నా వద్దకు వచ్చి నీవు ఏ పరాత్పరుని గుఱించి అడిగితివో ఆ పురాణపురుషుడు కాలమునకు, వేదమునకు అతీతుడైన భగవంతుడు ఈ శ్రీమహా విష్ణవే అని ఈశ్వరుడు పార్వతికి చెప్పినాడు. 44

టీ :-అయీతి. అయి హే పార్వతి కళానాం అణిమాది సిద్ధీనాం. అవశః అస్వాధీనః అపశ్యః దృష్టవత్యసి. (43,44)

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతితేభిహితస్తాత ! విక్రమ శార్ఙ్గధన్వనః ।
సింధోర్నిర్మథనే యేన ధృతః పృష్టేమహా చలః ॥45॥

టీ :-ఇతీతి. అష్టాధ్యాయార్థనిగమనం. ఇతీతి. ॥45॥

ఇప్పుడు అమృత మథన వృత్తాంతమునకు చెందిన ఎనిమిది అధ్యాయముల (5-12) సారమును, ఫలశృతిని చెప్పుచున్నాడు. ఓ నాయనా ! పరీక్షిత్తు ! శ్రీమహా విష్ణువు మందరగిరిని ఉద్ధరించుటకై కూర్మరూపమును ధరించుట, మోహినీ రూపమున రాక్షసులను మోహింపజేసి, సురలకు అమృతము పంచుట మొదలైన విక్రమమునకు చెందిన విషయములు ( సుఖప్రదములని తర్వాతి శ్లోకముతో అన్వయము) (45)

శ్లో॥ ఏతన్ముహుః కీర్తయతోఽను శృణ్వతో
న రిష్యతే జాతు సముద్యమః క్వచిత్ ।
యదుత్తమ శ్లోక గుణాను వర్ణనం
సమస్త సంసార పరిశ్రమాపహమ్ ॥46॥

ఈ వృత్తాంతమును మాటిమాటికి కీర్తించినవారు, విన్నవారు తలపెట్టిన ప్రయత్నములు ఎప్పుడును వ్యర్థము కావు. అన్ని ఫలించునని భావము. సర్వ శ్రేష్ఠుడైన పరమాత్మ విలాసమును కీర్తించుట సర్వప్రాపంచిక దుఃఖమును దూరము చేయును.(46)

టీ :-ఏతత్కీర్తనాదేః ఫలమాహ ఏతదితి ॥46॥

శ్లో॥ అసద విషయ మంఘ్రిం భావగమ్యం ప్రపన్నాన్
అమృతమమర వర్యా నాశయత్సింధు మథ్యమ్ ।
కపట యువతి వేషోమోహయన్యః సురారీన్
తమహముప సృతానాం కామపూరం నతోస్మి॥47॥

టీ :-భగవతా కృతం భక్తపక్షపాతం స్మరన్నమస్కరోతి అసదితి. అసతా మవిషయం. భావో భజనం. తేన గమ్యమంఘ్రిం ప్రపన్నా. సింధుమధ్యం సిధోర్మథనేన జాత మమృతం. యః ఆశయత్ అభోజయత్. ॥47॥

భగవంతుడు భక్త పక్షపాతముతో చేసిన పనిని స్మరించుచూ నమస్కరించు చున్నాడు. అసత్తు (అసత్యము, జడము) నకు పొందరానిది (అసద్విలక్షణము-అని ఆదిశంకరులు), భావగమ్యము- భావమనగా భజనము, భజనతో పొంద దగినది. ఆసన్నులై శరణు కోరివచ్చిన దేవతా శ్రేష్ఠులకు సముద్రమథనముచేత అమృతమును భుజింపజేసినది. మాయావధూటి రూపమున రాక్షసులను మోహింప జేసినది, ఆశ్రయించిన వారి కోరికలు తీర్చునది అయిన భగవంతుని పాదమునకు నేను నమస్కరించుచున్నాను. (47)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
శంకర మాయా మోహనం నామ ద్వాదశోऽధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే శంకర మాయా మోహనమను
ద్వాదశాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ త్రయోదశేతు వర్ణ్యంతే సప్తమాదీన్యను క్రమాత్ ।
మన్వంతరాణి సర్వాణి షడ్విధాని పృథక్ పృథక్॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ మనుర్వివస్వతః పుత్రః శ్రాద్ధదేవ ఇతి శ్రుతః ।
సప్తమో వర్తమానో యస్తదపత్యాని మే శృణు ॥1॥

శ్లో॥ ఇక్ష్వాకుర్నభగశ్చైవ ధృష్టః శర్యాతి రేవచ ।
నరిష్యంతోథ నాభాగః సప్తమో దిష్ట ఉచ్యతే ॥2॥

శ్లో॥ కరూషశ్చ పృషధ్రశ్చ దశమో వసుమాన్ స్మృతః ।
మనోర్వైవస్వతస్త్వేతే దశపుత్రాః పరంతప ! ॥3॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

పదమూడవ అధ్యాయమున ఏడవ మనువు మొదలుకొని వరుసగా మొత్తము పదునలుగురు మనువుల అంతరములు ఆరు విధములుగా మనువు, మనుపుత్రులు, దేవతలు, ఇంద్రుడు, ఋషులు, హరి అంశావతారము అను భేదములతో వేరు వేరుగా వర్ణితమైనవి.

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

వర్తమానమున నడుచుచున్నది సప్తమ మన్వంతరము. ఈ మన్వంతరమున వైవస్వతుడైన శ్రాద్ధదేవుడనువాడు మనువు. అతని సంతాన విషయమును వినుము. (1)

శత్రుచ్ఛేదకుడవైన ఓ పరీక్షిన్మహారాజా ! వైవస్వతమనువునకు ఇక్ష్వాకుడు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూషకుడు, పృషధ్రుడు, వసుమంతుడు అను పది మంది కుమారులు.(2,3)

టీ :-"శ్లో.త్రయోదశే తు వర్ణ్యంతే సప్తమాదీన్యయుక్రమాత్, మన్వంతరాణి సర్వాణి షడ్విధాని పృథక్పృథక్". మనురితి. సప్తమాదిమన్వంతరాణ్యాహ మనురిత్యాదినా యావదధ్యాయ సమాప్తిః (1 - 3)

శ్లో॥ ఆదిత్యా వసవో రుద్రా విశ్వేదేవా మరుద్గణాః ।
అశ్వినా వృషవో రాజన్ ! ఇంద్రస్తేషాం పురందరః ।4॥

ఓ రాజా ! ఆదిత్యులు, వసువులు, రుద్రులు, విశ్వేదేవులు, మరుత్తులు, అశ్వినులు అను వారు దేవతలు. పురందరుడనువాడు ఇంద్రుడు. (4)

శ్లో॥ కశ్యపోఽత్రి ర్వసిష్ఠశ్చ విశ్వామిత్రోఽథ గౌతమః ।
జమదగ్ని ర్భరద్వాజ ఇతి సప్తర్షయః స్మృతాః ॥5॥

కశ్యపుడు, అత్రి, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు అను వారు సప్త ఋషులు. (5)

టీ :-ఆదిత్యా ఇతి. ఆదిత్యాదయో దేవా ఇత్యన్వయః. ॥4,5॥

శ్లో॥ అత్రాపి భగవజ్జన్మ కశ్యపాదదితే రభూత్ ।
ఆదిత్యానామ వరజో విష్ణుర్వామన రూపధృక్ ॥6॥

అందు కశ్యపునకు అదితి గర్భమున విష్ణుడు వామన రూపుడై జన్మించి ఆదిత్యాదులకు తమ్ముడైనాడు. (6)

టీ :-తత్రేతి. భగవతే జన్మ అవతారః. తమేవాహ ఆదిత్యానాం వివస్వానర్యమా పూషేత్యాద్యుక్తానాం మధ్యే అవరం జన్మ యస్య సః.॥6॥

శ్లో॥ సంక్షేపతో మయోక్తాని సప్త మన్వంతరాణి తే ।
భవిష్యాణ్యథ వక్ష్యామి విష్ణోః శక్త్యాన్వితానిచ ॥7॥

టీ :-సంక్షేపత ఇతి. శక్త్యా అవతారేణాన్వితాని. ॥7॥

ఓ రాజా ! ఇప్పుడు నీకు ఏడు మన్వంతరములు సంక్షిప్తముగా చెప్పితిని. విష్ణువు యొక్క శక్తితో కూడిన రాబోవు మన్వంతరములను కూడా చెప్పుదును.(7)

శ్లో॥ వివస్వతశ్చ ద్వే జాయే విశ్వకర్మ సుతే ఉభే ।
సంజ్ఞా ఛాయాచ రాజేంద్ర ! యే ప్రాగభిహితే తవ॥8॥

టీ :-అష్టమం మనుం వక్తుం కథామాహ త్రిభిః. వివసస్వత ఇతి. ॥8॥

ఏడవ మనువును గురించి మూడు శ్లోకములలో చెప్పినాడు. ఓ చక్రవర్తీ! వివస్వంతునికి ( సూర్యునికి ) సంజ్ఞ, ఛాయ అనే భార్యలు ఇద్దరు. వీరిరువురు విశ్వకర్మ కూతుళ్లని ముందే చెప్పితిని. (8)

శ్లో॥ తృతీయాం బడబామేకే తాసాం సంజ్ఞా సుతాస్త్రయః ।
యమో యమీ శ్రాద్ధదేవశ్ఛాయాయాశ్చ సుతాన్ శృణు॥9॥

టీ :-తృతీయామితి. ఏకే బడబాం తృతీయామాహుః. మమ తు సంజ్ఞైవ బడబేతి మతం తదుక్తం. షష్ఠే. " శ్లో. సైవ భూత్వాథ బడబానాసత్యౌ సుషువే భువీ"తి. యమశ్చ. "యమీ యమునా శ్రాద్ధదేవశ్చేతిత్రయః సుతాః". ॥9॥

సూర్యునికి బడబ అను పేరుగల స్త్రీ మూడవ భార్య యని కొందరు చెప్పుదురు. ( సంజ్ఞాదేవియే బడబ అని శ్రీధరుల వారి అభిప్రాయము. ఆ విషయమే షష్ఠ స్కంధమున ' సైవ భూత్వాథ బడబా నా సత్యా సుషువే భువి ' ఆమెనే బడబ అయి లోకమున నా సత్యులను ప్రసవించినదని చెప్పి తన అభిప్రాయమును శ్రీధరుడు సమర్థించుకున్నాడు ) . సూర్యుని భార్యలలో సంజ్ఞాదేవికి ఇరువురు పుత్రులు, ఒక పుత్రిక. యముడు, యమున, శ్రాద్ధదేవుడను వారలు ఛాయ యొక్క సంతానమును గురించి చెప్పుదును వినుము. (9)

శ్లో॥ సావర్ణి స్తపతీ కన్యా భార్యా సంవరణస్య యా ।
శనైశ్చరస్తృతీయో౽భూదశ్వినౌ బడవాత్మజౌ ॥10॥

ఛాయా దేవికి సావర్ణి అను కొడుకు సంవరుణుడు అనే వానికి భార్యయైన తపతి అనే కూతురు, శనైశ్చరుడు అనే ముగ్గురు (ఇరువురు కుమారులు, ఒక కుమార్తె) సంతానము. మూడవ భార్యయైన బడబకు అశ్వినీ దేవతలు కలిగిరి.(10)

శ్లో॥ అష్టమే-ంతర ఆయాతే సావర్ణిర్భవితా మనుః ।
నిర్మోక విరజస్కాంద్యాః సావర్ణి తనయా నృపాః ॥11॥

ఓ రాజా ! అష్టమ మన్వంతరము వచ్చినపుడు సావర్ణి మనువగును. నిర్మోకుడు, విరజస్కుడు మొదలైనవారు మనువు పుత్రులు.(11)

శ్లో॥ తత్ర దేవాః సు తపసో విరజా అమృత ప్రభాః ।
తేషాం విరోచన సుతో బలిరింద్రో భవిష్యతి ॥12॥

అప్పుడు సు తపస, విరజులు, అమృత ప్రభులను వారు దేవతలు కాగలరు. వారికి విరోచన తనయుడైన బలి ఇంద్రుడు కాగలడు. (12)

టీ :-సావర్ణిరితి. సావర్ణిః పుత్రః. ॥10-12॥

శ్లో॥ దత్వే మాం యాచమానాయ విష్ణవే యః పదత్రయమ్ ।
రాద్ధమింద్రపదం హిత్వా తతః సిద్ధిమవాప్స్యతి ॥13॥

మూడడుగుల నేలను యాచించిన విష్ణువునకు ఈ సమస్త భూతలమును ఈ సప్తమ మన్వంతరమున దానము చేసి బలి చక్రవర్తి అష్టమ మన్వంతరమున విష్ణువు అనుగ్రహించిన ఇంద్ర పదవిని కూడా తృణీకరించి సిద్ధిని పొందగలడు. (13)

శ్లో॥ యో౽సౌ భతవతా బద్ధః ప్రీతేన సుతలే పునః ।
నివేశితో౽ధికే స్వర్గా దధునాస్తే స్వరాడివ ॥14॥

బలి చక్రవర్తి శ్రీమహా విష్ణువు చేత బంధింప బడినప్పటికి అతని దాన వీరత్వమునకు, ఆత్మ నివేదన రూపమైన భక్తి తత్పరతకు ప్రీతి చెందిన

టీ :-దత్వేతి. పదత్రయం యాచమానాయ ఇమాం సర్వాం మహీం సప్తమే మన్వంతరే దత్వా. అష్టమే మన్వం తరే విష్ణోః ప్రసాదేనైవ. రాద్ధం లబ్ధమింద్రపదం భుక్త్వేత్యర్థః. ॥13,14॥

విష్ణువు అతనిని అనుగ్రహించి స్వర్గము కన్న మిన్న అయిన సుతలాలయమున ఇంద్రునివలె ఉండ నియమించినాడు. (13)

శ్లో॥ గాలవో దీప్తిమాన్ రామో ద్రోణ పుత్రః కృపస్తథా ।
ఋష్యశృంగః పితాస్మాకం భగవాన్ బాదరాయణః॥15॥

శ్లో॥ ఇమే సప్తర్షయస్తత్ర భవిష్యంతి స్వమోగతః ।
ఇదానీ మాసతే రాజన్ ! స్వే స్వే ఆశ్రమ మండలే॥16॥

గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, ఋష్యశృంగుడు, ద్రోణపుత్రుడు అశ్వత్థామ, కృపాచార్యుడు, మా తండ్రిగారైన (శుక మహర్షి) బాదరాయణుడు అను వారేడుగురు ఋషులు కాగలరు. ఇప్పుడు వారు తమ తమ యోగబలమున తమ ఆశ్రమములందున్నారు. (15,16)

శ్లో॥ దేవ గుహ్యాత్సరస్వత్యాం సార్వభౌమ ఇతి ప్రభుః ।
స్థానం పురందరా ద్ధృత్వా బలయే దాస్యతీశ్వరః॥17॥

దేవ గుహ్యుడనువానికి సరస్వతి యను నామెయందు సార్వభౌముడను పేర శ్రీహరి జన్మించి ఇంద్రపదవిని పురందరుని నుండి గ్రహించి బలి చక్రవర్తిని ఇంద్రుడుగా చేయగలడు.(17)

శ్లో॥ నవమో దక్ష సావర్ణి ర్మనుర్వరుణ సంభవః ।
భూతకేతు ర్దీప్తకేతు రిత్యాద్యాస్తత్సుతా నృప ॥18॥

ఓ రాజా ! ఆ తర్వాత కాలమున వరుణనందనుడైన దక్షసావర్ణి యనువాడు తొమ్మిదవ మనువు కాగలడు. అతని కుమారులు భూతకేతుడు, దీప్తికేతుడు మొదలైన వారు రాజులు. (18)

శ్లో॥ పారామరీచి గర్భాద్యా దేవా ఇంద్రోద్భుతః స్మృతః ।
ద్యుతిమత్ప్రముఖస్తత్ర భవిష్యంత్యృషయస్తతః ॥19॥

పారామరీచి గర్భాదులు దేవతలు. అద్భుతుండనువాడు ఇంద్రుడు. ద్యుతిమంతుడు మొదలైనవారు ఋషులయ్యెదరు. 19

శ్లో॥ ఆయుష్మతోఽంబుధారాయాం ఋషభో భగవత్కలా ।
భవితా యేన సంరాద్ధాం త్రిలోకీం భోక్ష్యతేఽద్భుతః॥20॥

భగవంతుడైన శ్రీహరి ఆయుష్మంతుడు, అంబుధార అనువారలకు జన్మించి ఋషభుడను పేర రక్షించు చుండగా మూడు లోకములను ఆనందముతో అద్భుతుడను ఇంద్రుడు పరిపాలించ గలడు.(20)

శ్లో॥ దశమో బ్రహ్మ సావర్ణి రూపశ్లోక సుతో మహాన్ ।
తత్సుతా భూరిషేణాద్యా హవిష్మత్ప్రముఖా ద్విజాః॥21॥

ఉపశ్లోకుని కుమారుడైన బ్రహ్మ సావర్ణి పదవ మనువు కాగలడు. అతని పుత్రులు భూరిషేణాదులు రాజులు. హవిష్మంతుడు మొదలైనవారు ఋషులు. (21)

శ్లో॥ హవిష్మాన్ సుకృతిః సత్యో జయో మూర్తిస్తదా ద్విజాః ।
సువాసన విరుద్ధాద్యా దేవాః శంభుః సురేశ్వరః॥22॥

టీ :-గాలవ ఇతి.రామః.పరుశురామః ద్రోణపుత్రోఽశ్వత్థామా ॥15॥

టీ :-ఇమఇతి. ఇదానీం తు స్వయోగత ఆసతే. ॥16-22॥

హవిష్మంతుడు, సుకృతి, సత్యుడు, జయుడు మూర్తి అను వారలు బ్రహ్మసావర్ణి మన్వంతరమున ఋషులు. సువాసనుడు, విరుద్ధుడు మొదలైనవారు దేవతలు. శంభుడు ఇంద్రుడు. (22)

శ్లో॥ విష్వక్సేనో విశూచాంతు శంభోః సఖ్యం కరిష్యతి ।
జాతః స్వాంశేన భగవాన్ గృహే విశ్వసృజో విభుః॥23॥

విశ్వసృజుని ఇంట భగవంతుడైన శ్రీహరి తన అంశతో విష్వక్సేనుడను పేరుతో విషూచి యందు జన్మించి ఇంద్రుడైన శంభునితో స్నేహము నెఱుపును. (23)

టీ :–హవిష్మ త్ప్రముఖా ఇత్యుక్తానామేవ కేషాంచిన్నామా న్యాహ. హవిష్మా ఇతి. ॥23॥

శ్లో॥ మనుర్వై ధర్మ సావర్ణిరేకాదశమ ఆత్మవాన్ ।
అనాగతాస్తత్సుతాశ్చ సత్య ధర్మాదయో దశ ॥24॥

ఆ తర్వాత రాబోవు కాలమున ఆత్మవంతుడైన ధర్మసావర్ణి పదనొకండవ మనువు కాగలడు. మనుపుత్రులు సత్యధర్మాదులు పదుగురు రాజులు కాగలరు. (24)

టీ :–విష్వక్సేన ఇతి. విషూచ్యాం జాతస్సన్. ॥24॥

శ్లో॥ విహంగమాః కామగమా నిర్వాణ రుచయః సురాః ।
ఇంద్రశ్చ వైధృతస్తేషాం ఋషయశ్చారుణాదయః॥25॥

విహంగమ, కామగమన, నిర్వాణరుచులను వారలు దేవతలు. వైధృతుడనువాడు ఇంద్రుడు. అరుణాదులు ఋషులు కాగలరు. (25)

శ్లో॥ ఆర్యకస్య సుతస్తత్ర ధర్మసేతు రితి స్మృతః ।
వైధృతాయాం హరేరంశ స్త్రిలోకీం ధారయిష్యతి ॥26॥

వైధృతయందు పుండరీకాక్షుడు ఆర్యకుని పుత్రుడై ధర్మసేతువను పేరున జన్మించి వైభవముతో ఆనందించునట్లు ముల్లోకములను రక్షించ గలడు. (26)

శ్లో॥ భవితా రుద్రసావర్ణీ రాజన్ ! ద్వాదశమో మనుః ।
దేవవానుపదేవశ్చ దేవ శ్రేష్ఠాదయః సుతాః ॥27॥

ఓ రాజా ! తదనంతర కాలమున రుద్రసావర్ణి యనువాడు పండ్రెండవ మనువు కాగలడు. దేవవంతుడు, ఉపదేవుడు, దేవశ్రేష్ఠుడు మొదలైనవారు అతని సుతులు రాజులు. (27)

శ్లో॥ ఋతధామా చ తత్రేంద్రో దేవాశ్చ హరితాదయః ।
ఋషయశ్చ తపోమూర్తి స్తపస్యాగ్నీధ్రకాదయః ॥28॥

ఋతుధాముడను వాడు ఇంద్రుడు. హరితాదులు దేవతలు. తపోమూర్తి, తపస్వి, ఆగ్నీధ్రుడు మొదలైన వారు ఋషులు కాగలరు.(28)

శ్లో॥ స్వధామాఖ్యో హరేరంశః సాధయిష్యతి తన్మనోః ।
అంతరం సత్య సహసః సూనృతాయాః సుతో విభుః॥29

శ్రీహరి స్వధాముడనుపేర, సత్యసహసుడు, సూనృత అనువారలకు జన్మించి రుద్రసావర్ణి మన్వంతరమున మనువు సంతసిచునట్లు లోకమును రక్షించగలడు. (29)

టీ :-మనురితి. ఏకాదశమ ఇత్యాదిరార్షః. ॥25-29॥

శ్లో॥ మనుస్త్రయోదశో భావ్యో దేవసావర్ణిరాత్మవాన్ ।
చిత్రసేన విచిత్రాద్యా దేవసావర్ణి దేహజాః ॥30॥

ఆ తర్వాతి కాలమున ఆత్మవంతుడైన దేవసావర్ణి అనునతడు పదమూడవ మనువగును. చిత్రసేన విచిత్రాదులు మనుపుత్రులైన రాజులు. 30

శ్లో॥ దేవాః సుకర్మ పుత్రామ సంజ్ఞా ఇంద్రో దివస్పతిః ।
నిర్మోక తత్వ దర్శ్యాద్యా భవిష్యంత్స్ ృషయస్తదా ॥31॥

ఆ రుద్రసావర్ణి మన్వంతరమున సుకర్మ, సుత్రాములను పేరుగలవారు దేవతలు. దివస్పతి ఇంద్రుడు. నిర్మోక, తత్త్వదర్శ్యాదులు ఋషులు కాగలరు.(31

శ్లో॥ దేవహోత్రస్య తనయ ఉపహర్తా దివస్పతేః ।
యోగేశ్వరో హరేరంశో బృహత్యాం సంభవిష్యతి॥32॥

దేవహూతునకు, బృహతి అనునామెకు శ్రీహరి అంశతో యోగేశ్వరుడు జన్మించి ఇంద్రునికి మిక్కిలి ఉపకారి కాగలడు. (32)

టీ :- స్వాధామేతి. తస్య మనో రంతరం సాధయిష్యతి సత్యతపసః సూనృతాయాశ్చపతస్సన్. ॥30-32॥

శ్లో॥ మనుర్వా ఇంద్రసావర్ణి శ్చతుర్దశమ ఏష్యతి ।
ఉరు గంభీర బుద్ధాద్యా ఇంద్రసావర్ణి వీర్యజాః ॥33॥

ఆ తర్వాత రాబోవు కాలమున ఇంద్రసావర్ణి అనువాడు పదునాల్గవ మనువు కాగలడు. అతని కుమారులు ఉఱు, గంభీర, బుద్ధాదులు రాజులు. 33

శ్లో॥ పవిత్రాశ్చాక్షుషా దేవాః శుచిరింద్రో భవిష్యతి ।
అగ్నిర్బాహుః శుచిః శుద్ధో మగధాద్యాస్తపస్వినః ॥34॥

పవిత్ర, చాక్షుషులనువారు దేవసముదాయములు. శుచియనువాడు ఇంద్రుడు. అగ్ని, బాహువు, శుచి, శుద్ధుడు, మగధాదులు ఋషులయ్యెదరు. 34

శ్లో॥ సత్రాయణస్య తనయో బృహద్భానుస్తదాహరిః ।
వితానాయాం మహారాజ! క్రియాతంతూన్వితాయితా॥35॥

టీ :-దేవహోత్రస్యేతి. దివస్పతేరింద్రస్య ఉపహర్తా సంపాదకః సంభవిష్యతి. ॥33-35॥

ఓ రాజా ! సత్రాయణునకు వితాన అనునామెయందు బృహద్భానుడను పేరున శ్రీహరి సుతుడుగా ఉద్భవించి సర్వకార్యములను దేవతా ప్రీతికరముగా చేయగలడు. (35)

శ్లో॥ రాజం శ్చతుర్దశైతాని త్రికాలానుగతానితే ।
ప్రోక్తాన్యేభిర్మితః కల్పో యుగసాహస్ర పర్యయః ॥36॥

టీ :-సత్రాయణస్యేతి. క్రియాతంతూన్ కర్మసంతతీః. వితాయితా విస్తారయిష్యతి. ॥36॥

ఓ రాజా ! త్రికాలానుగతమైన ( భూత, వర్తమాన, భవిష్యత్తులందలి) మనువుల అంతరములు చెప్పితిని. ఈ పదునాలగు మన్వంతరముల కాలము వేయి యుగముల ప్రమాణము కలది. దానిని కల్పమందురు. ఇది బ్రహ్మదేవునికి ఒక దినము. (36)

శ్లో॥ చతుర్దశ మనూనాం చ కథాం యః కీర్తయేన్నరః ।
శృణుయాద్వాపి రాజేంద్ర ! తస్య విష్ణుః ప్రసీదతి॥37॥

టీ :- రాజన్నితి. యుగసహస్రేణ పర్యయః పరివర్తో యస్య యుగసహస్రప్రమాణ ఇత్యర్థః. ॥37॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే మన్వంతరాను వర్ణనం నామ త్రయోదశోఽధ్యాయః

ఈ ఫలశ్రుతితో కూడిన శ్లోకము కొన్ని ప్రతులందున్నట్లు లేదు. అందువలననే కుండలీకరిచబడినది. ఓ రాజా ! ఈ పదునలుగురు మనువుల వృత్తాంతమును కీర్తించినను, విన్నను అట్టి వారికి విష్ణువు అనుగ్రహము లభించును. అని చెప్పబడినది.(3-)

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే మన్వంతర అనువర్ణనమను త్రయోదశాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

శ్లో॥ చతుర్దశేతు సర్వేషాం మన్వాదీనాం యథా యథమ్ ।
పృథక్కర్మాణి వర్ణ్యంతే భగవద్వశ వర్తినామ్॥

**రాజోవాచ :-**

శ్లో॥ మన్వంతరేషు భగవన్ ! యథామన్వాదయస్త్విమే ।
యస్మిన్ కర్మణి యేయేన నియుక్తా స్తద్వదస్వ మే ॥1॥

టీ :- చతుర్దశేతు సర్వేషాం మన్వాదీనాం యథా యథమ్, పృథక్కర్మణి వర్ణ్యంతే భగవద్వశ వర్తినామ్. ॥1॥

**ఋషిరువాచ :-**

శ్లో॥ మనవో మను పుత్రాశ్చ మునయశ్చ మహీపతే ! ।
ఇంద్రాః సురగణాశ్చైవ సర్వే పురుష శాసనాః ॥2॥

టీ :- మనవ ఇతి. పురుషేణ ఈశ్వరేణ. యజ్ఞాద్యవతారైః శాస్యంతే నియుజ్యంత ఇతి తథా. ॥2॥

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

పదునాల్గవ అధ్యాయమున భగవంతుని వశవర్తులైన మనువులందరి యొక్క యథాతథముగా వేరు వేరుగా వారు వారు చేసిన పనులు వివరించబడును.

**పరీక్షిన్మహారాజు ఈ విధముగా అడిగినాడు :-**

ఓ పరమ పూజ్యుడవైన శుక మహర్షీ ! ఈ మనువు మొదలైన వారందరు ఏ విధముగా యే యే కర్మలందు ఎవరెవరు ఎవరి చేత నియోగింపబడిరో ఆ విషయములన్నియు నాకు చెప్పుమని రాజు అడిగినాడు.(1)

**శుకమహర్షి ఈ విధముగా వివరించినాడు :-**

ఓ రాజా ! మనువులు, మనుపుత్రులైన రాజులు, సప్తఋషులు, ఇంద్రులు, దేవతా సముదాయము మొదలైన వారందరు పరమపురుషుడైన ఈశ్వరునిచేత యజ్ఞాది అవతారములచేత ఆయా కార్యములందు నియోగింపబడిరి. (2)

శ్లో॥ యజ్ఞాదయో యాః కథితాః పౌరుష్యస్తనవో నృప ! ।
మన్వాదయో జగద్యాత్రాం నయంత్యాభిః ప్రచోదితాః॥3॥

టీ :-తదేవాహ యజ్ఞాదయ ఇతి. ॥3॥

నీకు చెప్పిన యజ్ఞుడు మొదలైన వారందరు ఆ శ్రీహరి పౌరుషాకృతులు. ఆ మనువులు హరి అంశలైన ప్రభువుల సహాయ శక్తియుక్తులతో జగములు నడుపుదురు. (3)

శ్లో॥ చతుర్యుగాంతే కాలేన గ్రస్తాన్ శ్రుతి గణాన్ యథా ।
తపసా ఋషయో-పశ్యన్యతో ధర్మః సనాతనః ॥4॥

టీ :-ఋష్యాదీనాం కర్మాణ్యాహ. చతుర్భిః. చతుర్యుగేతి. యతః యేభ్యః శ్రుతిగణేభ్యః. ॥4॥

నాలుగు యుగముల కడపట కాలగ్రస్తమైన వేదరాశిని వ్యాసమహాముని వ్యవస్థీకరించిన విధముగనే, సనాతన ధర్మమును తమతమ తపోబలమున మరల ఋషీశ్వరులు దర్శించిరి ( ఉద్ధరించిరి ). (4)

శ్లో॥ తతో ధర్మం చతుష్పాదం మనవో హరిణోదితాః ।
యుక్తాః సంచారయంత్యద్ధా స్వే స్వే కాలే మహీంనృప!॥5॥

టీ :-తత ఇతి. ఉదితా ఉక్తాః. సంయతాస్సంతః మహీం ధర్మం సంచారయంతి మహ్యాం ధర్మం ప్రవర్తయంతీత్యర్థః.॥5॥

ఓ రాజా ! విష్ణుమూర్తి చెప్పిన విధముగా ఆయా కార్యములందు నియుక్తులైన వారై మనువులు తమ తమ అంతరములందు ప్రభుని యానతితో జగతిలో ధర్మమును ప్రవర్తింపజేసిరి. (5)

శ్లో॥ పాలయంతి ప్రజాపాలా యావదంతం విభాగశః ।
యజ్ఞభాగ భుజోదేవా యేచ తత్రాన్వితాశ్చలైః ॥6॥

ప్రజలను పాలించు మను పుత్రులైన రాజులు తమ తండ్రులైన మనువుల అంతరము ముగియు వరకు పుత్ర పౌత్రాది క్రమముతో తమ తమ కాలములను

టీ :-పాలయంతీతి. ప్రజాపాలా మనుపుత్రాః తం ధర్మం పాలయంతి. యావదంతం యావన్మన్వంతరావసానం. విభాగశః పుత్రపౌత్రాదిక్రమేణ. యే చాన్యే ద్యావాపృథివ్యాదయః. అత్ర కర్మణి. భోక్తృత్వేనాన్వితాః. తైశ్చసహ. ॥6, 7॥

విభాగించుకొని ధర్మమును నడిపింప జేసిరి. యజ్ఞ భాగమును భుజించు ఆయా దేవతలు తమ తమ కాలములందు మనువులతో, రాజులతో కూడియుండిరి. వీరితో కూడి ఇంకను మిగిలిన ద్యావా పృథివ్యాదులు ఆయా కర్మలందు భోక్తృత్వముతో కూడియుండెను.(6)

శ్లో॥ ఇంద్రో భగవతా దత్తాం త్రైలోక్యశ్రియ మూర్జితామ్ ।
భుజానః పాతిలోకాన్ త్రీన్ కామంలోకే ప్రవర్షతి ॥7॥

ఇంద్రుడు భగవంతుడిచ్చిన అసామాన్యమైన సంపదను అనుభవించుచు ముల్లోకములందలి జనులను కాపాడును. ఈ లోకమునందు యథేష్టముగా వర్షాధికారియై వర్షములను కురిపించును.(7)

శ్లో॥ జ్ఞానం చాను యుగం బ్రూతే హరిః సిద్ధ స్వరూప ధృక్।
ఋషిరూపధరః కర్మయోగం యోగేశరూప ధృక్ ॥8॥

టీ :-ప్రసంగా ద్రూపాంతరైరపి జగద్యాత్రాప్రవర్తనమాహ ద్వాభ్యాం. జ్ఞానమితి. సిద్ధేశాస్సనకాదయః ఋషయో యజ్ఞవల్క్యాదయః. యోగేశాః దత్తాత్రేయాదయః. తత్తద్రూపస్సన్ జ్ఞానం కర్మ చ. యోగం చ బ్రూతే. ॥8॥

ప్రసంగవశమున శ్రీమహా విష్ణువే అనేక రూపములను ధరించి జగత్తు యాత్రాక్రమమును అనగా ప్రజల జీవన విధానములను, ధర్మములను నిర్దేశించునని చెప్పుచున్నాడు. హరి ఆయా యుగధర్మానుసారముగా సిద్ధాకృతితో సనకాదుల రూపముతో జ్ఞానమును ఉపదేశించును. యాజ్ఞవల్క్యాదులైన ఋషుల రూపముతో యజ్ఞ యాగాదులు మొదలైన నిత్య నైమిత్తిక కర్మలను, ధర్మములను ప్రవర్తింపజేయును. దత్తాత్రేయాదులైన యోగేశ్వరుల రూపమున పురుషార్థములందు సర్వోత్తమమైన మోక్షప్రాప్తిని కలిగించు జీవ బ్రహ్మల సాయుజ్యరూపమైన యోగమును అనుభవగమ్యము చేయును. (8)

శ్లో॥ సర్గం ప్రజేశరూపేణ దస్యూన్ హన్యాత్స్వరాడ్వపుః ।
కాలరూపేణ సర్వేషామభావాయ పృథగ్గుణః ॥9॥

టీ :-సర్గమితి. ప్రజేశా మరీచ్యాదయః. తేన రూపేణ. సర్గం కరోతి శేషః. స్వరాడ్వపుః రాజమూర్తిః. సర్వేషామభావాయ భవతి. పృథగ్విధా గుణాః శీతోష్ణాదయో యస్య. ॥9॥

మరీచ్యాది ప్రజాపతుల రూపముతో సృష్టికార్యమును నిర్వహించును. ఆయా మన్వంతరములందు ఇంద్రరూపుడై రాక్షసులను, దొంగలను సంహరించును. కాలరూపుడై అందరినీ నశింపజేయును. శీతోష్ణాది భిన్నగుణములతో సృష్ట్యాది కార్యములను నడిపించును. (9)

శ్లో॥ స్తూయమానో జనైరేభిర్మాయయా నామరూపయా ।
విమోహితాత్మభిర్నానా దర్శనైర్నచ దృశ్యతే ॥10॥

టీ :-స్తూయమాన ఇతి. నామరూపాత్మికయా మయయా. మోహితాత్మభిరేభిర్జనైః. నానాదర్శనైః. శాస్త్రైః స్తూయమానో నిరూప్యమాణోఽపి. నైవ దృశ్యత ఇత్యర్థః. ॥10॥

భగవంతుని యొక్క నామరూపాత్మకమైన అనగా జగద్రూపముగా ఉన్న మాయచేత వ్యామోహితులైన ఆత్మతత్త్వవేత్తలైన మహానుభావులు జగత్కారణమును (పరమాత్ముని) పలువిధములైన దర్శన శాస్త్రములచేత (సిద్ధాంతములచేత) పరి పరి విధముల నిర్వహించి నిరూపించినప్పటికీ పరమాత్మ తత్త్వము ఎవ్వరికినీ దర్శనము కాలేదు. అనగా శాస్త్ర విజ్ఞానమునకు పరతత్త్వముయొక్క స్వరూప, స్వభావములు పూర్తిగా అందలేదని భావము (ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామ్) . (10)

శ్లో॥ ఏతత్కల్ప వికల్పస్య ప్రమాణం పరికీర్తితమ్ ।
యత్రమన్వంతరాణ్యాహుశ్చతుర్దశ పురావిదః ॥11॥

టీ :-ప్రాసంగికం నిరూప్య ప్రస్తుతమేవోపసంహరతి. ఏతదితి. ఏతత్కల్పవికల్పస్య అవాంతరకల్పసస్య. ॥11॥

ప్రాసంగిక విషయమును నిరూపించి ఇప్పుడు దానిని ముగించుచున్నాడు. ఓ పరీక్షిన్మహారాజా ! ఈ ప్రకారముగా నేను నీకు మహాకల్పము, అవాంతర కల్పముల పరిమాణమును బోధించితిని. పురాతత్వవేత్తలైన పండితులు ప్రత్యేకముగా అవాంతర కల్పమునందు పధ్నాలుగు మన్వంతరములను తెలిపినారు. (11)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
మన్వంతరాను వర్ణనం నామ చతుర్దశోఽధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే మన్వంతర అనువర్ణనమను
చతుర్దశాధ్యాయము ఆంధ్రానువాదము.

**శ్రీ గణేశాయ నమః**

**శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

**శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ**

**భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః**

శ్లో॥ బలిం పంచదశే విశ్వజితాచార్య అయాజయన్ ।
తతోఽసౌస్వర్గ మజయత్భయాద్దేవా నిలిల్యిరే॥

పదునైదవ అధ్యాయమున బలితో శుక్రాచార్యుడు విశ్వజిద్యాగము చేయించినాడు. దానివలన అతడు స్వర్గమును జయించగా ఇంద్రాది దేవతలందరు భీతితో అజ్ఞాతమున దాగిరి.

శ్లో॥ అత్రేర్యతే నవాధ్యాయైః వామం వామన చేష్టితమ్ ।
నిగ్రహోచ్ఛలతో యత్ర బలేర్భ్యానానుగ్రహః॥

ఇక్కడ తొమ్మిది అధ్యాయములలో మోసముతో బలిని నిగ్రహించుట, మరల అనుగ్రహించుట అనే మనోహరమైన వామనావతార చేష్ట చెప్పబడినది.

**రాజోవాచ :-**

శ్లో॥ బలేః పాదత్రయం భూమేః కస్మాద్ధరి రయాచత ।
భూతేశ్వరః కృపణవల్లబ్ధార్థో-పి బబంధ తమ్ ॥1॥

**రాజు ఈ విధముగా అడిగినాడు :-**

బలిని పుండరీకాక్షుడు తాను సర్వేశ్వరుడై కూడా ఎందులకై మూడడుగుల నేలను యాచించినాడు? లక్ష్మీ సంపన్నుడై దీనుని వలె ఆ బలిచే దానము పుచ్చుకొని కూడా అతనిని ఎందుకు బంధించినాడు?.(1)

శ్లో॥ ఏతద్వేదితుమిచ్ఛామో మహత్కౌతూహలం హి నః ।
యజ్ఞేశ్వరస్య పూర్ణస్య బంధనం చాప్యనాగసః ॥2॥

యజ్ఞాధిపతి, పూర్ణుడు, నిశ్చలుడై తప్పులేని నిష్కలుశుడైన బలిని బంధించిన విషయము మీనుండి తెలిసికొనుటకై మాకు మిక్కిలి కుతూహలము కలుగుచున్నది అని రాజు అడిగినాడు. (2)

టీ :-" శ్లో. అత్రేర్యతే నవధ్యాయ్యా వామం వామన చేష్టితమ్ నిగ్రహోచ్ఛలతో యత్ర బలేర్భ్యాయానుగ్రహః. బలిం పంచదశే విశ్వజితాచార్యాహ్యాయాజయన్ , తతో-సౌ స్వర్గమజయద్భ యాద్దేవానిలిల్యిరే." బలేరితి. ఈశ్వరః స్వయం కృపణవత్ కస్మాద్ధేతోరయాచత. లబ్ధార్థో భూత్వాపి తం కస్మాద్బబంధ. ॥1,2॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ పరాజిత శ్రీరసుభిశ్చ హాపితో
హీంద్రేణ రాజన్ ! భృగుభిః సజీవితః ।
సర్వాత్మనా తానభజద్భృగూన్ బలిః
శిష్యో మహాత్మార్థ నివేదనేన॥3॥

టీ :- తత్ర తావద్బలేస్త్రిలోకీమపహర్తుం యాచ్ఞాదిఛలం కృతవానితి వక్తుం బ్రాహ్మణారాధనబలేన బలేరకాండ ఏవ స్వర్గ విజయక్రమమాహ యావదధ్యాయపరిసమాప్తి. పరాజితేతి. యుద్ధే పరాజితా శ్రీర్యేన సః. ఇంద్రేణాసుభిశ్చ త్యాజితస్సన్. భృగూన్ భృగోర్వంశ్యాన్ శుక్రాదీన్ మహాత్మా ఉదారచిత్తః అర్థానాం నివేదనేనార్పణేన.॥3॥

అప్పుడు బలి చక్రవర్తినుండి త్రిలోకాధిపత్యమును అపహరించవలెనని శ్రీహరి యాచన అనే మిషను కల్పించినాదని చెప్పుటకు ఈ ' పరాజితశ్రీః' అనే శ్లోకమునుండి అధ్యాయ సమాప్తి వరకు బ్రాహ్మణారాధనతో బలి హఠాత్తుగా స్వర్గవిజయమును సాధించిన క్రమమును చెప్పుచున్నాడు. ఇంద్రునితో జరిగిన యుద్ధమున పరాజిత ప్రాభవుడై ప్రాణములు కోల్పోయిన బలిచక్రవర్తి భృగివంశ్యులైన శుక్రాచార్యాదుల అనుగ్రహముతో పునర్జీవితుడై ఎల్ల విధముల వారిని ఉదార చిత్తముతో సర్వ సంపదలొసగి శిష్యుడై సేవించినాడు. (3)

శ్లో॥ తం బ్రాహ్మణా భృగవః ప్రీయమాణా
అయాజయాన్విశ్వజితా త్రిణాకమ్ ।
జిగీషమాణం విధినాభిషిచ్య
మహాభిషేకేన మహానుభావాః ॥4॥

టీ :-తమితి. త్రిలోకం స్వర్గం జేతుం ఇచ్ఛంతం విశ్వజితా యాగేన. అయాజయన్. మహాభిషేకేణ ఐంద్రేణ, బహ్వృచ బ్రాహ్మణే ప్రసిద్ధేన.॥4॥

బలి చక్రవర్తి ఆరాధనతో సంతుష్టులైన భార్గవులు స్వర్గమును జయించుటకు ఇష్టపడుచున్న బలి చక్రవర్తిని ఋగ్వేదీయమైన బహ్వృచ బ్రాహ్మణమున ప్రసిద్ధమైన మహాభిషేక పద్ధతితో యథావిధిగా అభిషేకించి మహానుభావులై విశ్వజిద్యాగమును చేయించిరి. (4)

శ్లో॥ తతో రథః కాంచన పట్టబద్ధో
హయాశ్చ హర్యశ్వ తురంగ వర్ణాః ।
ధ్వజశ్చ సింహేన విరాజమానో
హుతాశనాదాస హవిర్భిరిష్టాత్ ॥5॥

టీ :-తతఇతి.హర్యశ్వస్యేంద్రస్య. యే తురంగా స్తేషామివ వర్ణో యేషాం. ॥5॥

అప్పుడు బంగారు వస్త్రముల చేత ఆవరింపబడిన రథము, ఇంద్రుని గుఱ్ఱముల వంటి హరిత వర్ణముతో కూడిన గుఱ్ఱములు, సింహపు గుర్తుతో ప్రకాశించు ధ్వజము ఇష్టమైన హోమ ద్రవ్యములతో సంతుష్టుడైన అగ్నిహోత్రుని నుండి బయలువెడలినవి. (5)

శ్లో॥ ధనుశ్చ దివ్యం పురటోపనద్ధం
తూణావరిక్తే కవచంచ దివ్యమ్ ।
పితామహస్తస్య దదౌచ మాలా
మమ్లా న పుష్పాం జలజం చ శుక్రః ॥6॥

టీ :- ధనురితి. పురటం సువర్ణం తూణౌ ఇషుధీ అరిక్తౌ అక్షయశరౌ. పితామహః. ప్రహ్లాదః. జలజం శంఖం. ॥6॥

పిమ్మట అగ్నిహోత్రుని నుండి బంగారముతో కట్టబడిన దివ్య ధనువును, అక్షయ బాణములతో కూడిన అమ్ముల పొదలజంట, దివ్యకవచము బయలువెడలినవి. బలిచక్రవర్తి తాతయైన ప్రహ్లాదుడు వాడిపోని పూలదండను, శుక్రాచార్యుడు శంఖమును ఇచ్చినారు. (6)

శ్లో॥ ఏవం స విప్రార్జిత యోధనార్థస్తైః
కల్పిత స్వస్త్యయనోఽథ విప్రాన్ ।
ప్రదక్షిణీ కృత్య కృత ప్రణామః
ప్రహ్లాద మామంత్ర్య నమశ్చకార ॥7॥

టీ :- ఏతమితి. విప్రైరార్జితః సంపాదితో యోధనార్థో యుద్ధపరికరో యస్య. తైరేవకృతం కల్పితం. స్వస్త్యయనం మంగళవాచనాది యస్య అమంత్ర్యపృష్ట్వా. ॥7॥

ఈ విధముగా బలిచక్రవర్తి భృగువులు అనుగ్రహించి ఇప్పించిన యుద్ధపరికరములతో, బ్రాహ్మణులు మంగళవాక్యములు పలుకుచుండగా వారికి ప్రదక్షిణముచేసి నమస్కరించినాడు. ప్రహ్లాదునికి నమస్కరించి యుద్ధమునకు వెళ్ళుటకై ఆయన అనుమతిని అర్థించినాడు. (7)

శ్లో॥ అథారుహ్య రథం దివ్యం భృగుదత్తం మహారథః ।
సుస్రగ్ధరోథసన్నహ్య ధన్వీ ఖడ్గీ ధృతేషుధిః ॥8॥

టీ :-అథేతి. అథారుహ్యరరాజేతి ద్వయోరన్వయః. సుస్రగ్ధరః. శోభనమాలాధరః. ॥8॥

పిమ్మట శుక్రాచార్యుని అనుగ్రహమున పొందిన దివ్యరథమును అధిరోహించి, శోభనమాలను ధరించి, యుద్ధప్రయత్నమునకై విల్లు, అమ్ముల పొదులు, ఖడ్గమును గ్రహించినవాడై మహారథుడైన బలిచక్రవర్తి (ప్రకాశించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము ) . (8)

శ్లో॥ హేమాంగద లసద్బాహుః స్ఫురన్మకరకుండలః ।
రరాజ రథమారూఢో ధిష్ణ్యస్థ ఇవ హవ్యవాట్ ॥9॥

టీ :-హేమాంగదేతి. హేమాంగదాభ్యాంలసంతౌ బాహూ యస్య. ధిష్ణ్యస్థః భవనే ప్రజ్వాలితః కుండస్థ ఆహవనీయ ఇవేతి వా.॥9॥

బంగారు భుజకీర్తులతో విరాజిల్లు బాహువులతో, ప్రకాశించు మకరకుండలముల శోభతో అరణ్యమున ప్రజ్వలించు దావానలమువలె బలి రథా రూఢుడై విరాజమానుడైనాడు. అగ్ని కుండమున వెలుగు ఆహవనీయము వలె వెలిగినాడని కూడా చెప్పవచ్చును. (9)

శ్లో॥ తుల్యైశ్వర్య బలశ్రీభిః స్వయూథైర్దైత్య యూథపైః ।
పిబద్భిరివ ఖం దృగ్భిర్దహద్భిః పరిధీనివ ॥10॥

టీ :-తుల్యేతి. తుల్యమైశ్వర్యం బలం చ. శ్రీశ్చ యేషాం తైర్దైత్యై ర్యూథపైర్వృతో యయావితి ద్వయోరన్వయః. పరిధీ దిశః. ॥10॥

తనతో సమానమైన ఐశ్వర్యము, పరాక్రమము,సంపదలతో ఒప్పినవారై తమ తమ సైన్యములతో కూడిన రాక్షస సేనాధిపతులు ఆకాశమును త్రాగువారివలె, చూపులతో దిక్కులను దహించువారివలె ఉన్న వారిచే (ఆవృతుడై బలి యుద్ధమునకు వెడలినట్లు తర్వాతి శ్లోకముతో అన్వయము) (10).

శ్లో॥ వృతో వికర్షన్మహతీ మాసురీం ధ్వజినీం విభుః ।
యయావింద్రపురీం స్వృద్ధాం కంపయన్నివ రోదసీ॥11

టీ :-వృత ఇతి. ఋద్ధాం అతిసమృద్ధాం. ॥11॥

మహాబలయుతమైన రాక్షస సైన్యము భూమ్యాకాశములను కంపింపజేయు నట్లుగా నడిపించుచు సకల సంపత్సమృద్ధులతో నొప్పు అమరావతిపై దండయాత్రకు బలిచక్రవర్తి వెడలినాడు. (11)

శ్లో॥ రమ్యాముపవనోద్యానైః శ్రీమద్భిర్నందనాదిభిః ।
కూజద్విహంగ మిథునై ర్గాయన్మత్త మధువ్రతైః ॥12॥

టీ :-ధిగ్రాజ్యసుఖం. తథావిధాం పురీం అకస్మాదేవ పరిత్యజ్యేంద్రాదయః పలాయితా ఇతి వైరాగ్యార్థమింద్రపురీ మనువర్ణయతి సార్థైరేకాదశభిః. రమ్యామితి. ఉపవనాని ఫలప్రదానాని నికటాని చ ఉద్యానాని పుష్పప్రధానాని దూరస్థాని చ్ఛతైః రమ్యాం కూజంతి విహగమిథునాననియేషు. గాయంతో మత్తా మధువ్రతా యేషు.॥12॥

ఛీ ఛీ ఈ తుచ్ఛమైన రాజ్యసుఖములు అనవసరములని భావించి హఠాత్తుగా అమరావతిని పరిత్యజించి ఇంద్రాదులు పారిపోయినారని వైరాగ్యమును కలిగించుటకే స్వర్గపట్టణమును రమ్యమైనదిగా పదకొండున్నర శ్లోకములతో వర్ణించుచున్నాడు. శ్రుతి మధురముగా కలకూజితములుచేయు శుకపికాది పక్షుల జంటలతో, మకరంద పానము చేత మదించిన తుమ్మెదల గానములతో, విలసిల్లు ఫల పుష్పములతో నిండిన, సమీపమున నున్న పండ్ల తోటలు, పూలతో నిండి దూరమున నున్న ఉద్యానవనముల్లైన నందనోద్యానములతో మనోహరమైన (అమరావతిని గుఱించి బలిచక్రవర్తి వెళ్ళినాడని ముందరి శ్లోకముతో అన్వయము) . (12)

శ్లో॥ ప్రవాల ఫల పుష్పోరుభార శాఖామర ద్రుమైః ।
హంస సారస చక్రాహ్వ కారండవ కులా కులాః ।
నలిన్యో యత్ర క్రీడంతి ప్రమదాః సుర సేవితాః॥13॥

చిగుఱులు, పుష్పములు, ఫలముల భారముతో నున్న కొమ్మలతో గూడిన మందారాది దేవతా వృక్షములతో కూడినవి, అమరావతియందలి ఉద్యానవనములు. హంసలు, బెగ్గురు పక్షులు, చక్రవాకములు, జలపక్షులు మొదలైన వానితో నిండి, దేవతలు ఆనందించునట్లుగా నారీజనములు

టీ :-ప్రవాలేతి. ।పవాళాదీనామురుభారో యాసు తాః. శాఖా యేషాం తే అమరద్రుమాయేషు. ॥13॥

జలక్రీడలాడునట్టి సరస్సులు ఆ ఉద్యాన వనములందున్నవి. (13)

శ్లో॥ ఆకాశ గంగయా దేవ్యా వృతాం పరిఖ భూతయా ।
ప్రాకారేణాగ్ని వర్ణేన సాట్టాలేనోన్నతేన చ ॥14॥

టీ :-నళిన్య ఇతి. తైర్యత్ర యాసు. సురసేవితాః ప్రమదాః క్రీడంతి. తాః హంసాదికులైరాకులాః వ్యాప్తాః. నళిన్యః. సరాంసి. యత్ర ఏషు సంతి. తైరుపవనోద్యానైః రమ్యామితి పూర్వేణాన్వయః. కించ. పరిఘభూత యా ఆకాశగంగయా. వృతాం. ॥14॥

దేవతల సౌకర్యార్థము దిగుడు బావివలె పవిత్రమైన గంగానది అమరావతికి చుట్టుగా అగడ్తవలె పరివేష్టించి యున్నది. అమరావతికి అగ్నివలె ప్రకాశించు బంగారు ప్రహరీగోడ యున్నది. ప్రాకారములమీద నిర్మితమైన ఫిరంగులు మొదలైన భారీయుద్ధ పరికరములనుంచుటకు వీలైన ఎత్తైన బురుజులున్నవి. (14)

శ్లో॥ రుక్మ పట్ట కపాటైశ్చ ద్వారైః స్ఫటిక గోపురైః ।
జుష్టాం విభక్త ప్రపథాం విశ్వకర్మ వినిర్మితాం ॥15॥

టీ:- ప్రాకారేణేతి. ప్రాకారేణ సౌవర్ణేనావృతాం. అట్టాలాః ప్రాకారోపరి రచితాన్యున్నతాని యుద్ధస్థానాని. తత్సహితేన. రుక్మపట్టాని కవాటాని యేషు. తైర్ద్వారైరవాంతరైః స్ఫటిక మయైర్గోపురైశ్చ పురద్వారైశ్చ॥15॥

బంగారు తోరణాలు అలంకరించిన కవాటములుగల లోపలి ద్వారములు, ప్రధాన పురద్వారములతో ఒప్పినది అమరావతి. విశాలమై సమవిభక్తమైన రాజమార్గములతో విశ్వకర్మ తన పరిపూర్ణమైన నైపుణ్యముతో నిర్మించినది అమరావతి.(15)

శ్లో॥ సభా చత్వర రథ్యాఢ్యాం విమానైర్యర్బుదైర్యుతామ్ ।
శృంగాటకై ర్మణిమయైర్వజ్రవిద్రుమ వేదిభిః ॥16॥

టీ :- జుష్టామితి. జుష్టాం స్వభ్యుతాం. విభక్తాః ప్రపథారాజమార్గా యస్యాం సభాఉపవేశస్థానాని చత్వరాణి అంగ ణాని. రథ్యా రథమార్గాః తైరాఢ్యాం సంపన్నాం న్యర్బుదం దశకో టయః. తైర్గణనీయైరనం తైర్విమానైర్యుతాం. వజ్రవిద్రుమమయ్యో వేదయో యేషు తైః శృంగాటకైః చతుష్పథైర్యుతాం. ॥16॥

సుఖాసనములతో కూడిన సభలు, విశాలమైన ముంగిళ్ళు, ఉపమార్గములు మొదలైన వానితో సంపన్నమైనది. అనేక సౌధములతో కూడినది. మణులు, వజ్రములు, పగడములు మొదలైన వానిచేత నిర్మితమైన వేదికలు, చతుష్పథములతో రమ్యమైనది అమరావతి. (16)

శ్లో॥ యత్ర నిత్య వయోరూపాః శ్యామా విరజవాససః ।
భ్రాజంతే రూపవన్నార్య అర్చిర్భిరివ వహ్నయః ॥17॥

టీ :- యత్రేతి. నిత్యం. వయస్తారుణ్యం. రూపం చ సౌకుమార్యం. యాసాం తాః. రూపవన్నార్యః స్వలంకృతాః స్త్రియః. యత్ర యస్యాం భ్రాజంతే.॥17॥

అమరావతిలో నిత్య తారుణ్యము (పదునారేడుల ప్రాయము), సౌకుమార్యములతో కూడిన సుందర రూపములతో, మాసిపోని ( దుమ్ముపట్టని) విలాసవంతమైన వస్త్రములతో స్త్రీలు జ్వాలలతో ప్రకాశించు అగ్నులవలె విరాజిల్లుచున్నారు. (17)

శ్లో॥ సురస్త్రీ కేశ విభ్రష్ట నవసౌగంధిక స్రజామ్ ।
యత్రామోద ముపాదాయ మార్గ ఆవాతి మారుతః॥18॥

అమరావతిలో దేవతా స్త్రీల సిగలనుండి జారిన సుగంధభరితములైన దండలయొక్క సురభిళములైన గాలులు మార్గమున మత్తెక్కించునట్లుగా వీచును. (18)

టీ :- సురేతి. సురస్త్రీణాం. కేశేభ్యో విభ్రష్టానాం. నవసౌగంధికస్రజా మామోదం. ॥18॥

శ్లో॥ హేమజాలాక్ష నిర్గచ్ఛ ద్ధూమేనా గురు గంధినా ।
పాండురేణ ప్రతిచ్ఛన్న మార్గేయాంతి సురస్త్రియః॥19॥

టీ :- హేమేతి. హేమగవాక్షేభ్యో నిర్గచ్ఛతా ధూపేన. సురస్త్రియః అప్సరసః. ॥19॥

అమరావతిలో బంగారు కిటికీల రంధ్రములనుండి బయటకు వెడలు మంచిగంధపు సువాసనలతో కూడిన తెల్లని పొగలచేత ఆవరింపబడిన మార్గమునందు అప్సర స్త్రీలు వెళ్ళుచున్నారు.(19)

శ్లో॥ ముక్తావితానైర్మణిహేమ కేతుభిః
నానాపతాకావలభీభిరావృతామ్ ।
శిఖండి పారావత భృంగ నాదితాం
వైమానిక స్త్రీ కలగీత మంగలామ్ ॥20॥

టీ॥ ముక్తేతి. ముక్తామయైర్వితానైర్మణి హేమమయైః కేతుభిశ్చ. ధ్వజైః నానాపతాకాయుక్తాభిర్వలభీభిశ్చ. విమానానాం పురోశాగ్రైరావృతాం వ్యాప్తాం. వైమానిక స్త్రీణాం కల గీతైర్మంగళాం. ॥20॥

ముత్యాల సమూహములు, బంగారము, మణులతో నిర్మితమైన టెక్కములతో, పలుపతాకములతో కూడిన మేడలపై ఇండ్లతో (చంద్రశాలలతో), శిఖరములతో ఒప్పినది, నెమళ్ళు, పావురములు, తుమ్మెదల ధ్వనులతో కూడినది, ఇండ్ల పై భాగములనుండి గానము చేయునట్టి స్త్రీల మధుర గీతములతో మంగళకరమైనది అమరావతి. (20)

శ్లో॥ మృదంగ శంఖానక దుందుభిస్వనైః
సతాల వీణా మురజర్ష్టి వేణుభిః ।
నృత్త్యైః సవాద్యైరుపదేవ గీతకైః
మనోరమాం స్వప్రభయా జితప్రభామ్ ॥21॥

మద్దెలలు, శంఖములు, తప్పెటలు, భేరులు మొదలైన వాద్యముల మ్రోతలతో, తాళములతో కూడిన వీణలు, మద్దెలలు, వేణువులు మొదలైన మంగళవాద్యములతో కూడిన నాట్యములతో, గంధర్వాది ఉపదేవతల గానములతో మనోహరమైనది. తన కాంతులతో కాంతిదేవతను జయించినది అమరావతి. (' జిత గ్రహాం ' అను పాఠాంతరమున తన కాంతిచే సూర్యాది గ్రహముల కాంతిని జయించినది అని కానీ, దీని కాంతిని జయించగల ఇతర కాంతులేవీ లేనిదని కానీ అమరావతియని చెప్పవచ్చును). (21)

శ్లో॥ యాం నవ్రజంత్య ధర్మిష్ఠాః ఖలా భూతద్రుహః శఠాః ।
మానినః కామినో లుబ్ధాః ఏభిర్విునా వ్రజంతి యత్॥22॥

అధర్మపరులు, దుర్మార్గులు, జీవహింస చేయువారు, వంచకులు, గర్విష్టులు, కాముకులు, దుష్టస్వభావులు అమరావతిలోనికి ప్రవేశించలేరు. ఈ దుర్గుణములన్నియు లేనివారే అందులో ప్రవేశించగలరు. (22)

టీ :-మృదం గేతి. ఉపదేవానాం గంధర్వాదీనాం. గీతైశ్చ మనోరమాం. జితా. ప్రభాసాక్షాద్దీప్త్యధిష్ఠాత్రీ దేవతా యయా తాం. అన్యైరజితప్రభామితి వా. జితగ్రహామితి పాఠంతరే జితా గ్రహాః సూర్యాదయోయయా. ॥21,22॥

శ్లో॥ తాం దేవధానీం స వరూధినీ పతిః
బహిః సమంతాద్రురుధే పృతన్యయా ।
ఆచార్య దత్తం జలజం మహాస్వనం
దధ్మౌ ప్రయుంజన్ భయమింద్ర యోషితామ్॥23॥

సర్వరాక్షస సైన్యాధిపతియైన బలిచక్రవర్తి ఆ దేవతల రాజధానియైన అమరావతీ నగరమునకు వెలుపల ఉన్న ప్రదేశమున విడిచి దానిని అన్ని వైపులనుండి సైన్యముతో బంధించినాడు. శుక్రాచార్యుడిచ్చిన అపారమైన ధ్వని కలిగిన శంఖమును ఇంద్రుని స్త్రీలకు భీతిని గొలుపునట్లుగా పూరించినాడు. (23)

శ్లో॥ మఘవాంస్తమభిప్రేత్య బలేః పరమముద్యమమ్ ।
సర్వదేవ గణోపేతో గురుమేతదువా చ హ ॥24॥

టీ :-తామితి. పృతన్యయా సేనయా. ॥23,24॥

బలిచక్రవర్తియొక్క తీవ్రమైన యుద్ధ ప్రయత్నమును చూచి ఇంద్రుడు సర్వదేవతల సహితముగా బృహస్పతిని ఈ విధముగా అడిగినాడు. (24)

శ్లో॥ భగవన్నుద్యమో భూయాన్బలేర్నః పూర్వవైరిణః ।
అవిషహ్యమిమం మన్యే కేనాసీత్తేజసోర్జితః ॥25॥

టీ :-భగవన్నితి. కేన హేతునా. ఏవం తేజసా ఊర్జిత ఆసీత్.॥25॥

ఓ మహానుభావా ! పూర్వశత్రువులైన మనకు, బలిచక్రవర్తికి మరల యుద్ధ ప్రయత్నము కలిగినది. ప్రస్తుతము బలిచక్రవర్తి యుద్ధమున అసాధ్యుడుగా అగుపించుచున్నాడు. అతనికి ఏ కారణముచేత ఇంతటి పరాక్రమవృద్ధి కలిగినది?(25)

శ్లో॥ నైనం కశించత్కుతోవాపి ప్రతివ్యోఢు మధీశ్వరః ।
పిబన్నివ ముఖేనేదం లిహన్నివ దిశో దిశ ।
దహన్నివ దిశో దృగ్భిః సంవర్తాగ్ని రివోత్థితః ॥26॥

టీ :-నేతి. ప్రతివోఢుం అపాకర్తుం. ॥26॥

ప్రస్తుతము బలిని ఎవరికైనను, ఏ సాధనముతోనైనను, నిగ్రహించుటకు సాధ్యముకాదు. ఈ సర్వ జగత్తును నోటితో త్రాగునట్లును, పది దిక్కులను నాకివేయునట్లును, ప్రళయకాలమున పెల్లుబికిన ప్రచండాగ్నివలె చూపులతో సర్వదిక్కులను దగ్ధముచేయు వానివలె కనపడుచున్నాడు. (26)

శ్లో॥ బ్రూహికారణమేతస్య దుర్ధర్షత్వస్య మద్రిపోః ।
ఓజః సహో బలం తేజోయత ఏతత్సముద్యమః॥27॥

ఈ నా శత్రువుయొక్క ఈ ఎదురులేని తనమునకు, పరాక్రమము, శత్రువును నిగ్రహించు శక్తి , బలము, ధైర్యములతో కూడిన యుద్ధ ప్రయత్నమునకు కారణము చెప్పుము అని బృహస్పతిని ఇంద్రుడు అడిగినాడు. (27)

టీ :-దహన్నితి. యత్ యస్మాత్కారణాత్. ఏతస్య ఓజ ఆదిః ఏతస్య సముద్యమః. ॥27॥

**గురు రువాచ :-**

శ్లో॥ జానామి మఘవన్ ! శత్రోరున్నతే రస్య కారణమ్ ।
శష్యాయోపభృతం తేజో భృగుభిర్బ్రహ్మ వాదిభిః ॥28॥

శ్లో॥ భవద్విధో భవాన్వాపి వర్జయిత్వేశ్వరం హరిమ్ ।
నాస్య శక్తః పురః స్తాతుం కృతాంతస్య యథా జనాః॥29॥

టీ :-జానామీతి. ఉపభృతం సంచితం. ॥28,29॥

శ్లో॥ తస్మాన్నిలయ ముత్సృజ్య యూయం సర్వే త్రివిష్టపమ్ ।
యాతకాలం ప్రతీక్షంతో యతః శత్రోర్విపర్యయః॥30॥

టీ :-తత్రోచితమంత్రమాహ తస్మాదితి. తస్మాద్యూయం. త్రివిష్టపము త్సృజ్య. నిలయమదర్శనం. యాత. యతః కాలాత్. ॥30॥

**బృహస్పతి ఇట్లు చెప్పినాడు :-**

ఓ ఇంద్రా ! ఈ శత్రువుయొక్క ఉన్నతికి కారణము నాకు తెలియును. బ్రహ్మావాదులైన భార్గవులు తమ శిష్యుడైన బలిచక్రవర్తికి అతనిని వృద్ధిపొందించుటకై తమ తేజమును పరాక్రమము సంపాదించి పెట్టినారు. 28

ఇప్పుడా బలిచక్రవర్తిని ఎదిరించుటకు శివ కేశవులిరువురు తప్ప నీవును, నీవంటివారితరులు, నీకన్న అధికులును, యమధర్మరాజు ఎదుట ప్రాణులు నిలువలేనట్లు నిలువలేరు. మీరెవ్వరును అతనిని ఎదిరించలేరు. 29

బృహస్పతి ఇంద్రునకు తగిన ఆలోచన చెప్పుచున్నాడు. అందువలన మీరందరు స్వర్గమును విడిచి ఎక్కడికైనను అజ్ఞాత ప్రదేశమునకు వెళ్ళండి. బలికి చెడు కాలము దాపురించువరకు నిరీక్షించండి. (30)

శ్లో॥ ఏష విప్ర బలోదర్కః సంప్రత్యూర్జిత విక్రమః ।
తేషామేవాప మానేన సానుబంధో వినంక్ష్యతి ॥31॥

టీ :- కేనాస్య విపర్యయస్స్యాదిత్యత ఆహ. ఏష ఇతి వి॥పాణాం బలేన. ఉదర్కః ఉత్తరోత్తరమధికం బలం యస్య సః. ॥31॥

దేని వలన బలికి నాశము కలుగునో చెప్పుచున్నాడు. ఈ బలి ఇప్పుడు బ్రహ్మతేజమున ఉత్తరోత్తరము అధికముగా వృద్ధిని పొందు పరాక్రమముతో తేజరిల్లుచున్నాడు. రాగల కాలమున ఆ బ్రాహ్మణులనే అవమానించి తన వారందరితో గూడా నశించగలడు. (31)

శ్లో॥ ఏవం సుమంత్రితార్థాస్తే గురుణార్థాను దర్శినా ।
హిత్వా త్రివిష్టపం జగ్ముః గీర్వాణాః కామరూపిణః॥32॥

ఈ విధముగా కార్యము (చేయవలసినపని), కాలములను (అనువులను) చక్కగా తెలిసిన గురువు బృహస్పతి ఆలోచించి నియోగించిన విధముగా దేవతలు కామరూపులై తమకు అనుకూలమైన నెలవులకు వెళ్ళిరి. 32

శ్లో॥ దేవేశ్వథ విలీనేషు బలిర్వైరోచనః పురీమ్ ।
దేవధానీ మధిష్ఠాయ వశం నిన్యే జగత్త్రయమ్ ॥33॥

టీ :-ఏవమితి. సుమంత్రితః అర్థః కార్యం యేషాం తే. నిలయం జగ్ముః. ॥32,33॥

దేవతలందరు ఆయా స్థలములందు అజ్ఞాతముగా ఉండగా పిమ్మట బలి చక్రవర్తి అమరావతిని ఆక్రమించి ముల్లోకములను తన అధీనము చేసుకొనెను. (33)

శ్లో॥ తం విశ్వ జయినం శిష్యం భృగవః శిష్యవత్సలాః ।
శతేన హయమేధానామనువ్రత మయాజయన్ ॥34॥

ఆ విధముగా విశ్వమును జయించిన శిష్యుడు బలిచక్రవర్తి శుక్రాచార్యాదులైన గురువులను భక్తితో అనుసరించినాడు. అతనిపట్ల అపారమైన వాత్సల్యము కలిగిన భార్గవులు బలికి సంప్రాప్తించిన ఇంద్రపదవిని స్థిరము చేయుటకై ఆయనచేత నూరు అశ్వమేధ యాగములను చేయించినారు. (34)

శ్లో॥ తతస్తదనుభావేన భువన త్రయ విస్తృతామ్ ।
కీర్తిందిక్షు వితన్వానః సరేజ ఉడురాడివ॥35॥

టీ :-తమితి.ఏవం ప్రాప్తమింద్రపదం. స్థిరీకర్తుమయాజయన్ అనువ్రతం అనువర్తినం . ॥34,35॥

పిమ్మట త్రైలోక్యరాజ్య సంపత్తితో, నూరుయాగముల ప్రభావముతో ముల్లోకములందు పొగడదగిన కీర్తిని దిక్కులందు వ్యాపింపజేయుచు బలిచక్రవర్తి చంద్రునివలె ప్రకాశించినాడు. (35)

శ్లో॥ బుభుజేచ శ్రియం స్వృద్ధాం ద్విజదేవోపలంభితామ్ ।
కృతకృత్య మివాత్మానం మన్యమానో మహామనాః॥36॥

టీ :-బుభజ ఇతి. ద్విజదేవైః బ్రాహ్మణైః ఉపలంభితాం ప్రాపితామ్.॥36॥

బ్రాహ్మణుల ( భృగువుల ) అనుగ్రహముచేత రాజ్యసంపదలను పొంది తనను కృతార్థుడుగా భావించుకొనుచు గొప్ప మంచి మనస్సు కలవాడై అనుభవించినాడు. (36)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
పంచదశోఽధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే పంచదశాధ్యాయము ఆంధ్రానువాదము.

## శ్రీ గణేశాయ నమః
## శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ షోడశే పుత్ర నాశేన శోచంత్యా అదితేః పతిః ।
ప్రార్థితః కశ్యపః ప్రాహ పయోవ్రత మితీర్యతే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం పుత్రేషు నష్టేషు దేవమాతా–దితి స్తదా ।
హృతే త్రివిష్టపే దైత్యైః పర్యతప్యదనాథవత్ ॥1॥

శ్లో॥ ఏకదా కశ్యపస్తస్యా ఆశ్రమం భగవానగాత్ ।
నిరుత్సవం నిరానందం సమాధేర్విరతశ్చిరాత్ ॥2॥

టీ :- “షోడశే పుత్ర నాశేన శోచంత్యా అదితేః పతిః,ప్రార్థితః కశ్యపః ప్రాహ పయోవ్రత మితీర్యతే” యద్వా. షోడశే కశ్యపో॰

## శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ
## భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

పదునారవ అధ్యాయమున తన పుత్రాదులైన ఇంద్రాదులు రాజ్యభ్రష్టులై అజ్ఞాతమునకు వెళ్ళుటవలన సంకటపడిన అదితి తన భర్తయైన కశ్యపుని దీనికి నివారణోపాయమును తెలుపుమని ప్రార్థించగా అతడామెను పయోభక్షణమను పేరుగల వ్రతమును చేయుమను విషయము చెప్పబడినది.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఇప్పుడు వామనావతార ప్రసంగమును చెప్పుచున్నాడు. ఈ విధముగా తన కుమారులైన ఇంద్రాదులు అదృష్టహీనులై రాక్షసుల వలన స్వర్గ సామ్రాజ్యమును కోల్పోగా దేవమాత అయిన అదితి రక్షకులు లేనిదై తీవ్రముగా విలపించినది.(1)

ఒకప్పుడు భగవంతుడైన కశ్యప ప్రజాపతి వేడుకలు, ఆనందములు కరువై, తపస్సులు లేక వెల వెల బోవు అదితి ఆశ్రమమునకు వచ్చినాడు.(2)

దిత్యా ప్రార్థితో లీనపుత్రయా, మహాచ్ఛ్రేయస్కరం తస్యై పయోవ్రతముపాదిశత్. ఇదానీం శ్రీవామనావతారప్రసంగమాహా యావదధ్యాయపరిసమాప్తి. ఏవమితి. నష్టేషు అదృష్టేషు సత్సు.॥1,2॥

శ్లో॥ స పత్నీం దీనవదనాం కృతాసన పరిగ్రహః ।
సభాజితో యథాన్యాయ మిదమాహ కురూద్వహ ॥3॥

టీ :-స ఇతి. సః కశ్యపః పత్నీమిదమాహ ॥3॥

ఓ కురువంశ శ్రేష్ఠా ! కశ్యపుడు దైన్యముతోనున్న భార్య సమీపమున కూర్చుని సంప్రదాయ మర్యాదలుపొంది యుక్తి యుక్తముగా ఈ విధముగా పలికినాడు. (3)

శ్లో॥ అప్యభద్రం న విప్రాణాం భద్రే ! లోకేऽధునాగతమ్ ।
న ధర్మస్య న లోకస్య మృత్యోశ్ఛందానువర్తినః ॥4॥

టీ :-దీనవదనత్వా దికమాలక్ష్య బహుధా వికల్పయన్ పృచ్ఛతి సప్తభిః అపీతి. హేభద్రే. మృత్యోః. ఛందమిచ్ఛాం అనువర్తత ఇతి. తథా. మృత్యువశవర్తినో జనస్యేత్యర్థః ॥ 4॥

దీనత్వమున నున్నందువలన అందుకు కారణమేమని పలువిధములుగా అడుగుచున్నాడు. ఓ మంగళకరమైన భార్యామణీ ! ఇప్పుడు లోకమున బ్రాహ్మణులకు, ధర్మమునకు, మృత్యువునకు వశులై వర్తిల్లు మానవులకు ఎట్టి అశుభములు కలుగుట లేదు కదా! . (4)

శ్లో॥ అపి వా కుశలం కించిద్గృహేషు గృహమేధిని ! ।
ధర్మస్యార్థస్య కామస్య యత్ర యోగో హ్యయోగినామ్॥5॥

ఓ ఇల్లాలా ! ఏ ఇంటియందు తమ ధర్మములను అనుష్ఠించుట వలన కర్మిష్ఠులైన వారికిని అనగా అయోగులకును యోగము యొక్క ఫలము

టీ :- అపీతా. హే గృహేషు. అయోగి నామపి యోగః. స్వధర్మాదినా యోగఫలం భవతి. ॥5॥

ప్రాప్తించునట్టి నీ ఇంటిలో ధర్మార్థ కామములకు ఎట్టి అశుభము కలుగలేదు కదా !. (5)

శ్లో॥ అపివాఽతిథయోఽభ్యేత్య కుటుంబాసక్తయా త్వయా ।
గృహాద పూజితా యాతాః ప్రత్యుత్థానేన వా క్వచిత్॥6॥

టీ :- అపీతి.కించ. త్వయా అపూజితా ఏవ అభ్యేత్య గృహాద్యాతాః ॥6॥

గృహ కృత్యములందు మునిగిన నీవు ఇంటికి వచ్చిన అతిథులను గమనించ లేకపోయినందున ఎదురేగి స్వాగత సత్కారాదులను పొందలేని వారై పూజలందుకొన కుండనే తిరిగి వెళ్ళిపోలేదు కదా ! . (6)

శ్లో॥ గృహేషు యేష్వతిథయో నార్చితాః సలిలైరపి ।
యది నిర్యాంతి తే నూనం ఫేరు రాజ గృహోపమాః॥7

టీ :- గృహేష్వితి. నార్చితాః అనర్చితాస్సంతః. యది నిర్గచ్ఛంతి. తే గృహాః. ఫేరురాజః సృగాలరాజః. తదీయవివరతుల్యాః. ॥7॥

కనీసము మంచినీరైనా త్రాగకుండా అతిథులు అనర్చితులై గృహములనుండి వెడలిపోయినట్లైనచో అట్టి ఇండ్లు నక్కల బొరియలతో సమానము. (7)

శ్లో॥ అప్యగ్నయస్తు వేలాయాం నహుతా హవిషా సతి ।
త్వయోద్విగ్నధియా భద్రే ! ప్రోషితే మహి కర్హిచిత్ ॥8॥

టీ :- అప్యగ్నయఇతి. వేలాయాం హోమకాలే. కర్హి చిత్. న హుతాః కిం. ॥8,9॥

ఓ మంగళకరమైన భార్యామణీ ! నేను పరప్రాంతమునకు వెళ్ళిన సమయమున నేనింట లేనందువలన ప్రోషిత పతికవై ఆందోళనతో కూడిన మనస్సు కలదానవై ఎన్నడైనా సకాలమున హోమద్రవ్యములతో అగ్నిని ఆరాధించుటలో ఏమరుపాటు పడలేదు కదా !. (8)

శ్లో॥ యత్పూజయాకామ దుఘాన్యాతి లోకాన్ గృహాన్వ్రతః ।
బ్రాహ్మణోగ్నిశ్చ వై విష్ణోః సర్వదేవాత్మనో ముఖమ్ ॥9॥

బ్రాహ్మణులను, అగ్నిని ఆరాధించిన గృహస్థులు కోరదగిన గొప్ప లోకములను ( ముక్తిని ) పొందగలరు. సర్వదేవమయుడైన శ్రీమహా విష్ణువునకు బ్రాహ్మణులు, అగ్ని ముఖమై యున్నారు. (9)

శ్లో॥ అపి సర్వే కుశలినస్తవ పుత్రా మనస్విని ! ।
లక్షయే స్వస్థమాత్మానం భవత్యా లక్ష ణై రహమ్॥10॥

టీ :-అపీతి. భవత్యాః ఆత్మానం మనః. అస్వస్థప్రకృతిస్థం. లక్షణైర్ముఖ మ్లానాదిభిః లక్షయామి. ॥10॥

ఓ ఇంతీ ! నీ పుత్రులందరును క్షేమముగా ఉన్నారా? నీ మనస్సు ఏదో ఆందోళనతో ఉన్నట్లు వాడిన నీ ముఖము మొదలైన లక్షణములతో నాకు అవగతమగుచున్నది. (10)

**అదితి రువాచ :-**

శ్లో॥ భద్రం ద్విజ గవాం బ్రహ్మన్ ! ధర్మస్యాస్య జనస్యచ ।
త్రివర్గస్య పరం క్షేత్రం గృహమేధిన్ ! గృహ ఇమే॥11॥

టీ :-అస్వాస్థ్యకారణమన్యదస్తీతి వక్తుం త్వత్పృష్టమభద్రాదికం నాస్తీ త్యాహ ద్వాభ్యాం. భద్రమితి. ఇమే గృహాః. త్రివర్గస్య పరం క్షేత్రం ఉద్భవస్థానం. త్రివర్గో-పియథావద్వర్తత ఇత్యర్థః. ॥11॥

అదితి ఆందోళనకు వేరే కారణమున్నదని చెప్పుటకు కశ్యపుడడిగిన అమంగళములు లేవని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. ఓ బ్రహ్మజ్ఞానీ ! యజమానివైన పతిదేవుడా ! బ్రాహ్మణులకు, గోవులకు, ధర్మమునకు, ప్రజలకు శుభమే. ఈ మన గృహములు పురుషార్థ సాధనలో శ్రేష్ఠముగా నున్నవి. (11)

శ్లో॥ అగ్నయోతిథయో భృత్యా భిక్షవో యే చ లిప్సవః ।
సర్వం భగవతో బ్రహ్మన్ ! అనుధ్యానాన్నరిష్యతి॥12॥

ఓ భగవంతుడా ! నీ ప్రభావము వలన, నేను నిన్ను నిరంతరము ధ్యానించు చుండుట వలన అగ్నులు, అతిథులు, పరిజనులు, యాచకులు

టీ :-అగ్న్యయ ఇతి. భగవతస్తనానుధ్యానం యన్మయా క్రియతే. తస్మాదగ్న యోऽతిథయ ఇత్యాది సర్వం. నరిష్యతి న హీయతే.॥12॥

మొదలైన వారి సర్వ కామములు నెరవేరుచున్నవి. (12)

శ్లో॥ కోను మే భగవన్ కామో న సంపద్యేత మానసః ।
యస్యా భవాన్ ప్రజాధ్యక్ష ఏవం ధర్మాన్ ప్రభాషతే॥13॥

టీ :-ప్రస్తుతం విజ్ఞాపయితుమాహ కోన్వితి. ॥13॥

ప్రస్తుతమును అభ్యర్థించుటకై చెప్పుచున్నది. ఓ పతి శేఖరా ! మీరు ప్రజాపతులై ధర్మములను ఉపదేశించుచుండగా నాకు తీరని మనోరథములు ఏముండును?. (13)

శ్లో॥ తవైవ మారీచ మనః శరీరజాః
ప్రజా ఇమాః సత్వ రజస్తమోజుషః ।
సమో భవాన్ తాస్వ సురాదిషు ప్రభో !
తథాపి భక్తం భజతే మహేశ్వరః ॥14॥

టీ :-సంపాద్యం కామమాహ చతుర్భిః. తవేతి. ॥14॥

ఇప్పుడు తనకవసరమైన కోరికను నాలుగు శ్లోకములలో చెప్పుచున్నది. మరీచి మహాముని పుత్రుడవైన ఓ కశ్యప బ్రహ్మా ! నీ మనస్సు, శరీరములనుండి జన్మించిన ఈ పుత్రులందరు సత్వము, రజస్సు, తమములనే వారి వారికి చెందిన గుణముల వలన లభ్యమైన ఫలములను అనుభవించుచున్నారు. మీరు వారిని సమముగనే చూచుచున్నారు. పరమేశ్వరుడు సముడయ్యును భక్తులపట్ల స్నేహమును ప్రకటించినట్లు ఓ స్వామీ ! మీరును మీ భక్తుడైన ఇంద్రుని అనుగ్రహించుము. (14)

శ్లో॥ తస్మాదీశ ! భజంత్యా మే శ్రేయశ్చింతయ సువ్రత ! ।
హృతశ్రియో హృతస్థానాన్ సపత్నైః పాహినః ప్రభో !॥15

ఓ పతిదేవా ! నిన్ను సేవించుచున్న నాకు మేలు కలిగించుము. దాయాదులైన రాక్షసులవలన సంపదలు కోల్పోయి, నిలయములకు దూరమైన నా పుత్రులను కాపాడవలసినదని అదితి భర్తను ప్రార్థించినది.

(ఇంద్రాదులనుద్దేశించి బహువచనము ప్రయోగించబడినది ). (15)

శ్లో॥ పరైర్వివాసితా సాహం మగ్నా వ్యసన సాగరే ।
ఐశ్వర్యం శ్రీర్యశః స్థానం హృతాని ప్రబలైర్మమ ॥16॥

బలవంతులైన శత్రువులు రాక్షసులవలన ఇంటి నుండి వెడలగొట్టబడి దుఃఖ సముద్రమున మునిగియున్నాను (నా పుత్రులు అనుట). నా (పుత్రుల) ప్రాభవము, సంపద, కీర్తి, నిలయములను శత్రువులు అపహరించినారు.(16)

శ్లో॥ యథా తాని పునః సాధో ! ప్రపద్యేరన్మమాత్మజాః ।
తథా విదేహి కల్యాణం ధియా కల్యాణ కృత్తమ !॥17॥

ఓ సత్పురుషా ! నా కుమారులు ఐశ్వర్యము, స్థానము, సంపద, కీర్తి మొదలైన వానిని మరల ఏ విధముగా పొందగలరో దానికి అవసరమైన మంగళకరమైన కార్యమును శుభములను ఒనగూర్చు వాడవై బుద్ధితో ఆలోచించి నిర్వహించుము. (17)

టీ :-తస్మాదితి. సనత్నైః దైత్యైర్హృతా శ్రీర్యేషాం. హృతం స్థానమేషామితతి పుత్రాభిప్రాయేణ బహువచనమ్. ॥15-17॥

**శ్రీశుక ఉవాచ :-**

శ్లో॥ ఏవమభ్యర్థితోదిత్యా కస్తామాహ స్మయన్నివ ।
అహో మాయాబలం విష్ణోః స్నేహబద్ధ మిదం జగత్॥18॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా అదితి ప్రార్థించగా కశ్యప ప్రజాపతి ఆమెకు పుత్ర వ్యామోహమును తొలగించు నిమిత్తమై చిఱునవ్వు మిషతో యదార్థమును తెలుపుటకై (ఒకటిన్నర శ్లోకములలో) ఇట్లు చెప్పుచున్నాడు. ఆహో ! ఈ జగత్తు సర్వము శ్రీమహా విష్ణువు మాయా శక్తితో ఎంత మమకార బద్ధమైనదో కదా !. (18)

శ్లో॥ క్వ దేహో భౌతికోనాత్మా క్వచాత్మా ప్రకృతేః పరః ।
కస్య కే పతి పుత్రాద్యా మోహ ఏవ హి కారణమ్ ।19॥

టీ :- ఏవమితి. కః కశ్యపః. ప్రథమం తావత్పుత్రస్నేహం త్యాజయితుం విస్మయవ్యాజేన తత్త్వముపదిశతి సార్ధేన అహో ఇతి. ॥18,19॥

షడ్వికారములతో కూడి భౌతికమైన తుచ్ఛమైన, జడమైన, అనాత్మ అయిన ఈ శరీరమునకు, ఈ భౌతిక ప్రకృతికంటే వేరై, సర్వోత్కృష్టమై, శుద్ధచైతన్యమైన ఆత్మ (పరమాత్మ) కు పొంతన కుదరదు. ఎవరికి ఎవరు భర్త? ఎవరు సంతానము? వ్యామోహమే అన్నిటికి కారణము. (19)

శ్లో॥ ఉపతిష్ఠస్వ పురుషం భగవంతం జనార్దనమ్ ।
సర్వభూత గుహావాసం వాసుదేవం జగద్గురుమ్ ॥20॥

టీ :- అత్రాపరితుష్యంతీం ప్రత్యాహ ద్వాభ్యాం. ఉపతిష్ఠస్వేతి.॥20॥

అసంతృప్తితో ఉన్న భార్యతో కశ్యపుడు ఇట్లు చెప్పుచున్నాడు. సమస్త జీవుల హృదయ గుహయందున్నవాడు, పరమ పురుషుడు, భగవంతుడు, సర్వజగత్తునకు గురుడు, జనార్దనుడైన వాసుదేవుని ఆరాధించుమని చెప్పినాడు. (20)

శ్లో॥ స విధాస్యతి తే కామాన్ హరిర్దీనాను కంపనః ।
అమోఘా భగవద్భక్తి రేతరానేతి మతిర్మమ ॥21॥

టీ :- సఇతి. నన్వేవంభూతకామ ప్రాప్తిహేతుర్దేవాంతరసేవా ప్రసిద్ధా తత్రాహ. అమోఘేతి. ॥21॥

ఇట్టి కోరికలు శ్రీమహావిష్ణువు అనుగ్రహమున తప్ప ఇతర దేవతల వలన కలుగదని చెప్పుచున్నాడు. దీనుల పట్ల దయగల శ్రీహరి కోరికలను తీర్చగలడు. విష్ణుభక్తి వ్యర్థముకాదు. పైగా సత్వరముగా ఫలితము నిచ్చును. ఇతర దేవతలకది అసాధ్యమని చెప్పినాడు. (21)

**అదితి రువాచ :-**

శ్లో॥ కేనాహం విధినా బ్రహ్మన్ ! ఉపస్థాస్యే జగత్పతిమ్ ।
యథామే సత్య సంకల్పో విదధ్యాత్స మనోరథమ్॥22॥

టీ :-కేనేతి. స యథా చ మే మనోరథం విదద్యాత్.॥22॥

**అదితి అడిగినది :-**

ఓ మహానుభావా ! సత్యసంకల్పుడైన భగవంతుడు నా కోర్కె తీర్చుటకు నేను ఏ నియమములతో జగన్నాథుని ఉపాసించవలెనో వివరించుమని అడిగినది. (22)

శ్లో॥ ఆదిశత్వం ద్విజశ్రేష్ఠ ! విధిం తదుపధావనమ్ ।
ఆశుతుష్యతి మే దేవః సీదంత్యాః సహపుత్రకైః ॥23॥

టీ :- ఆదిశేతి. యథా చ మే ఆశుతుష్యతి తథా తత్సేవా ప్రకారమాదిశ. ॥23॥

ఓ సర్వవేత్తా ! కొడుకులతో కూడా సంకటపడుచున్న నన్ను శీఘ్రముగా రక్షించుటకై ఆ పరమాత్ముడు ఏ విధమైన జపపారాయణ మననాదులచే తృప్తి బొందునో అట్టి భగవత్సేవా విధానమునకు ఆదేశించండి అని అదితి ప్రార్థించింది. (23)

**కశ్యప ఉవాచ :-**

శ్లో॥ ఏతన్మే భగవాన్ పృష్టః ప్రజాకామస్య పద్మజః ।
యదాహ తే ప్రవక్ష్యామి వ్రతం కేశవ తోషణమ్॥24॥

టీ :-ఏతదితి. మే మయా. పృష్టః పద్మజో యద్వ్రతమాహ ఏతత్తే ప్రవక్ష్యమీత్యన్వయః. ॥24॥

**కశ్యపుడు చెప్పుచున్నాడు. :-**

ప్రజలకు శుభములు చేకూరవలెనని నేను భగవంతుడైన బ్రహ్మను అడుగగా ఆయన నాకు చెప్పిన, విష్ణువును తృప్తి పెట్టగల వ్రతమును గుఱించి చెప్పిన విషయమును నీకు వివరింతును. (24)

శ్లో॥ ఫాల్గునస్యామలే పక్షే ద్వాదశాహం పయోవ్రతః ।
అర్చయేదరవిందాక్షం భక్త్యా పరమయాన్వితః ॥25॥

టీ :-ఫాల్గునస్యేతి. అమలే శుక్లే. ॥25॥

ఫాల్గుణ మాసమున శుక్ల పక్షమున పాడ్యమి మొదలుకొని పండ్రెండు దినములు పరమ భక్తితో పయోభక్షణమను వ్రత విధానమున పుండరీకాక్షుని ఆరాధించవలెను. (25)

శ్లో॥ సినీవాల్యాం మృదాలిప్య స్నాయాత్క్రోడ విదీర్ణయా ।
యది లభ్యేత వై స్రోతస్యేతం మంత్రముదీరయేత్॥26॥

టీ :-తత్రాదౌ పూర్వేద్యుః కృత్యమాహ. సినీవాల్యామిత్యారభ్య బ్రహ్మాచార్యథ తద్రాత్ర్యామిత్యం తేన గ్రంథేన. సినీవాల్యామితి. యది లభ్యతే తర్హి. క్రోడవిదీర్ణయా వన్యవరాహోత్ఖాతయా. ఆలిప్య.॥26॥

వ్రతాచరణకు ముందు దినమున ( పగలు ) చేయదగిన పనిని చెప్పుచున్నాడు. ముందు దినమున అనగా చంద్రకళ కనుపడునట్టి అమావాస్య యందు ఒకవేళ లభించిన పక్షమున అడవి పందులు త్రవ్విన గుంటయందలి మట్టిని వంటిపై పూసుకొని ఏటి యందు ఈ మంత్రమును జపించుచు స్నానము చేయవలెను. (26)

శ్లో॥ త్వం దేవ్యాది వరాహేణ రసాయాః స్థానమిచ్ఛతా ।
ఉద్ధృతాసి నమస్తుభ్యం పాప్మానం మే ప్రణాశయ॥2-॥

టీ :-తత్ర మంత్రః త్వమితి. హే దేవి త్వం రసాయా ఉద్ధృతాసి. ॥27॥

ఇక్కడ ఇది మంత్రము. ఓ భూదేవీ ! సర్వజీవులకు స్థానము కల్పించవలెనను కోరు ఆదివరాహ రూపధరుడైన శ్రీమహావిష్ణువుచేత రసాతలమునుండి పైకెత్త బడినవి. అట్టి నీకు నమస్కారము. నా పాపమును పూర్తిగా నాశనము చేయుము. ఈ మంత్రమును వ్రతము చేయువారు జపించవలెను . (27)

శ్లో॥ నివర్తితాత్మ నియమో దేవమర్చేత్సమాహితః ।
అర్చాయాం స్థండిలే సూర్యే జలే వహ్నౌ గురావపి॥28॥

టీ :-నివర్తితేతి. నివర్తిత ఆత్మనియమో నిత్యనైమిత్తికో యేన.(28)

దైనందిన నిత్య కార్యక్రమములు తీర్చిన పిమ్మట పూజయందు, పూజామందిర సామగ్రుల పరిష్కృతియందు, సూర్యునియందు, జలమునందు, అగ్నియందు, గురువు నందు పరిపూర్ణమైన ఏకాగ్రతతో శ్రీహరిని అర్చించవలెను. (28)

శ్లో॥ నమస్తుభ్యం భగవతే పురుషాయ మహీయసే ।
సర్వభూత నివాసాయ వాసుదేవాయ సాక్షిణే ॥29॥

టీ :-తత్రావాహనాదౌ. నవమంత్రానాహ నమస్తుభ్యమితి. పాద్యాదౌ విశేషస్తు ద్వాదశాక్షరం వక్ష్యతి. ॥29॥

ఈ వ్రత విధానమున ఆవాహనకు ముందు నమః అంటూ తొమ్మిది మంత్రములను చెప్పుచున్నాడు. భగవంతుడా ! పరమపురుషా ! అనంతా! సర్వజీవులందు వైశ్వానర రూపమున విరాజిల్లువాడా ! సర్వసాక్షీ ! వాసుదేవా! నీకు నమస్కారము. (29)

శ్లో॥ నమోవ్యక్తాయ సూక్ష్మాయ ప్రధాన పురుషాయచ ।
చతుర్వింశద్గుణజ్ఞాయ గుణ సంఖ్యాన హేతవే ॥30॥

టీ :-నమ ఇతి. చతుర్వింశతిగుణాస్తత్వాని. తాని జానాతీతా తథా. తస్మై. గుణసంఖ్యానహేతవే సాంఖ్యప్రవర్తకాయ.॥30॥

జగద్రూపముగా వ్యక్తమైనవాడా ! నివ్వరిముల్లు కొనవలె సూక్ష్మమైనవాడా! ప్రకృతి నియామకుడవైన పురుషోత్తమా ! పంచభూతములు, తన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతఃకరణ చతుష్టయములనే ఇరువది నాలుగు తత్వములు తెలిసిన వాడా ! గుణములను లెక్కించుటకు హేతువైనవాడా! నీకు నమస్కారము. (30)

శ్లో॥ నమో ద్విశీర్ష్ణే త్రిపదే చతుః శృంగాయ తంతవే ।
సప్త హస్తాయ యజ్ఞాయ త్రయీ విద్యాత్మనే నమః॥31॥

ఈ విధముగా పరమాత్మ సంబంధమైన సామాన్య నామ కీర్తనతో నమస్కరించి మూడు శ్లోకములలో గుణావతారములను కీర్తించవలెనని

టీ :-ఏవం సామాన్యతో నత్వా. గుణావతారాన్ప్రణమితి త్రిభిః తత్రాదౌ మంత్రోక్తయజ్ఞరూపేణ విష్ణోః ప్రణామః. నమ ఇతి. ద్వే శీర్షే యస్య. త్రయః పాదాః యస్య. తంతవే ఫలవిస్తారకాయ. త్రయ్యాం విద్యాయామాత్మా యస్యేతి త్రిధా బద్ధ ఇత్యస్యార్థః ఉక్తః తథా చ మంత్రః శ్రు."చత్వారి శృంగాత్రయోఽస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య. త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశే"తీతి శ్లో. మార్గముద్గవదాలూనః సోఽయం ప్రాజ్ఞైర్యథాయుధం. విష్ణుస్తు యజ్ఞరూపేణ స్తూయతే తేన తత్త్వతః". అస్యార్థః మార్గః విష్ణ్వారాధనం తస్మిన్ యా ముత్. తాం గచ్ఛంతి యే. సాయైర్గీయతే వా. తే ముద్గాః భక్తాః. తే విద్యంతే యేషు తే ముద్గవంతేః. తేరాలూనః వ్యాప్తః. సాక్షత్కృత ఇత్యర్థః. నివృత్తిమార్గలభ్య మముదానందం తత్ప్రాపకుపాసనామార్గే ముదం గచ్ఛంతి తే మార్గముద్గాః తత్ప్రవర్తకా ఆచార్యాస్తే విద్యంతే యేషు అర్వాచీనేషు. తే మార్గముద్గవస్తైః ఆలూనః పృథక్త్వేనోపాసిత ఇత్యర్థః. పాఠాంతరే ముదం వహంతీతి మార్గముద్వహంతః. తైరాలూనః పృథక్త్వేనోపాసిత ఇత్యర్థః. కించ. పూర్వోదా హృతశ్రుత్యర్థోఽపి యాస్కాచార్యైర్వివృతః. చత్వారిశృంగేతి వేదా ఏవ ఉక్తాః త్రయోఽస్యపాదా ఇతి సవనాని త్రీణి. ద్వేశీర్షేప్రాయ ణీయోదయనీయే. సప్తహస్తాసః

చెప్పుచున్నాడు. వేదమంత్రములందు చెప్పబడిన యజ్ఞరూపుడైన విష్ణువునకు ముందుగా నమస్కరించవలెను. యజ్ఞపురుషునకు రెండు తలలు, మూడు పాదములు, నాలుగు కొమ్ములు, ఏడు చేతులు, త్రివేదమయమైన ఆత్మకలవాడై యజ్ఞఫలమును విరివిగా ప్రసాదించువాడైన పరమాత్మునికి నమస్కారము. "చత్వారి శృంగా త్రయోస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య । త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ॥" అనిశృతి. "మార్గముద్గవదాలూనః సోయం ప్రాజ్ఞైర్యథాయథమ్। విష్ణుస్తు యజ్ఞరూపేణ స్తూయతేనేన తత్త్వతః॥" అని యున్నది. అనగా నివృత్తి మార్గమును తెలియలేక దానిని పొందించే ప్రవృత్తి మార్గమున సంతోషముతో వెళ్ళువారికి వారిని ప్రవర్తింపజేయు ఆచార్యులు కనపడుదురు. వేరు వేరుగనే ఉపాసింతురు. అనగా పరమాత్మను పలువురు పలువిధాలుగా భావించి ఉపాసింతురు. అయితే విష్ణువును తాత్వికముగా ఈ యజ్ఞ రూపుడుగనే స్తుతించుట యుక్తమని అర్థము. ఈ విషయమునే యాస్కాచార్యులు ఇట్లు పేర్కొన్నారు. "చత్వారి శృంగేతి వేదావా । ఏత ఉక్తాస్త్రయోస్యపాదా సవనాని త్రీణి । ద్వేశీర్షే ప్రాయణీయోదయ నీయే । సప్తహస్తాసో సప్తఛందాంసి । త్రిధాబద్ధో మంత్రబ్రహ్మ కల్పైః । వృషభోరోరవీతి । రోవణమస్య సవన క్రమేణ ఋగ్భిర్యజుర్భిః సామభిః యదేన మృగ్భిః శంసంతి । యజుర్భిర్యజంతి । సామభిస్తువంతి । మహాదేవ ఇత్యేషహి మహాన్ దేవో యద్యజ్ఞో మర్త్యాం ఆవివేత్యేషహి మనుష్యానా విశతి యజనాయ॥" అని. అనగా యజ్ఞరూపుడైన

సప్తఛందాసిత్రిధా బద్ధో మంత్రబ్రాహ్మణకల్పైః వృషభో రోరవీతి. రోరవణం అస్య సవనక్రమేణ. ఋగ్భిః యజుర్భిః శ్రు."యదేనమృగ్భిశ్శంసంతి. యజుర్భిర్యజంతి. సామభిః స్తువంతీ"తి. ॥31॥

వృషభమునకు నాలుగు కొమ్ములు – వేదములు. మూడుపాదములు– ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలమున చేయు త్రివిధ సవనములు. ప్రాణీయ, ఉదయనీయములు రెండు తలలు. సప్తవిధ ఛందములు ఏడు చేతులు. మంత్రము, బ్రాహ్మణము, కల్పము అను మూటింటిచేత కట్టబడినది. ( త్రిధాబద్ధము ) ఈ విధమైన వృషభము అనగా సుఖములను వర్షించు యజ్ఞరూపుడైన పరబ్రహ్మము, రోరవీతి గర్జించుచున్నది. ఈ యజ్ఞమే మనుష్యులందు ఆవేశించి ఉండును. అని ఆ యాస్కాచార్యుని వివరణ.(31)

శ్లో॥ నమః శివాయ రుద్రాయ నమః శక్తి ధరాయచ ।
సర్వ విద్యాధిపతయే భూతానాం పతయే నమః ॥32॥

శివుడు, రుద్రుడు, శక్తిధరుడు, ఎల్లవిద్యలకు అధిపతి, భూతములకు నాయకుడైన దేవునికి నమస్కారము. (32)

శ్లో॥ నమో హిరణ్య గర్భాయ ప్రాణాయ జగదాత్మనే ।
యోగైశ్వర్య శరీరాయ నమస్తే యోగహేతవే ॥33॥

దుఃఖమును నశింపజేసి, సుఖమును కలిగించుట హిరణ్యము. రేతో లక్షణము. దానిని గర్భమున ధరించినవాడు, సూత్రాత్మ అయిన ప్రాణరూపుడు, జగదాత్మకుడు, యోగైశ్వర్య శరీరుడు, యోగకారకుడైన దేవునికి నమస్కారము. (33)

శ్లో॥ నమస్తే ఆదిదేవాయ సాక్షిభూతాయ తే నమః ।
నారాయణాయ ఋషయే నరాయ హరయే నమః॥34॥

ఆదిదేవుడు, సాక్షిభూతుడు, నారాయణుడు, ఋషి, నరుడవు అయిన శ్రీహరీ! నీకు నమస్కారము. (34)

టీ :-నమ ఇతి.ప్రాణాయ సూత్రాత్మనే. యోగైశ్వర్యం శరీరం యస్య. ॥31,33,34॥

శ్లో॥ నమో మరకత శ్యామ వపుషేఽధి గతశ్రియే ।
కేశవాయ నమస్తుభ్యం నమస్తే పీతవాససే ॥35॥

గరుడపచ్చలవంటి నల్లని శరీరము కలవాడు, లక్ష్మీ సంపన్నుడు, కనకాంబరుడు అయిన కేశవునికి నమస్కారము. (35)

శ్లో॥ త్వం సర్వవరదః పుంసాం వరేణ్య వరదర్షభ ।
అతస్తే శ్రేయసే ధీరాః పాదరేణుముపాసతే ॥36॥

టీ :-నమ ఇతి. అధిగతా ప్రాప్తా శ్రీః యేన తస్మై. ॥35,36॥

నీవు సర్వులకు సమస్తమైన కోరికలు తీర్చువాడవు. శ్రేష్ఠడవు. వరములొసగు సర్వదేవతలలో ఉత్తమోత్తముడవు. అందువలన బుద్ధిమంతులైనవారు ( యోగులు) తమకు మేలు కలుగవలెనని ( మోక్షము సిద్ధించవలెనని ) నీ పాదధూళిని ఉపాసించుచున్నారు. (36)

శ్లో॥ అన్వ వర్తంత యం దేవాః శ్రీశ్చ తత్పాద పద్మయోః ।
స్పృహయంత ఇవామోదం భగవన్ మే ప్రసీదతామ్॥37॥

టీ :-అన్వవర్తంతేతి. యత్పాదపద్మయోః ఆమోదం స్పృహయంత ఇవ. దేవాశ్చ శ్రీశ్చ యమన్వవర్తంత. స మే ప్రసీదతు. ॥37॥

ఆయన పదకమలములందలి సువాసనను కోరుచున్నవారివలె దేవతలు, లక్ష్మీదేవి అనుసరించి ఉన్నారో అట్టి భగవంతుడు నన్ను అనుగ్రహించుగాక.(37)

శ్లో॥ ఏతర్మంత్రైః హృషీకేశ మావాహన పురస్కృతమ్ ।
అర్చయేత్ శ్రద్ధయాయుక్తః పాద్యోప స్పర్శనాదిభిః॥38॥

ఈ మంత్రముల చేత అధికమైన శ్రద్ధతో ఆవాహనమును మొదట చేయుచు, పాద్యము, అర్ఘ్యము, స్నానాది ఉపచారములను క్రమముగా నిర్వహించుచు హృషీకేశుని ఆరాధించవలెను. (38)

శ్లో॥ అర్చిత్వా గంధమాల్యాద్యైః పయసా స్నాపయేద్విభుమ్ ।
వస్త్రోపవీతాభరణ పాద్యోప స్పర్శనై స్తతః ॥39॥

భగవంతుని గంధము, పూలమాలలతో అర్చించి, పాలతో అభిషేకించి, వస్త్రము, యజ్ఞోపవీతము, ఆభరణములు మొదలైన ఉపచారములతో అర్చించ వలెను. (39)

టీ :-త్రైరితి. ఆవాహనేన పురస్కృతం సన్నిధాపితం.॥38,39॥

శ్లో॥ శృతం పయసి నైవేద్యం శాల్యన్నం విభవేసతి ।
ససర్పిః సగుడం దత్వా జుహుయాన్మూలవిద్యయా॥40॥

సంపద ఉన్నట్లైతే సన్నబియ్యమును పాలతో నెయ్యి, బెల్లములు వేసి వండిన పాయసమును మూలవిద్య అనగా " ఓం నమో భగవతే వాసుదేవాయ" అను ద్వాదశాక్షరి మూల మంత్రముతో హవనము చేయవలెను. (40)

టీ :-గంధేతి. పయసి శృతం పక్వం. ॥40॥

శ్లో॥ నివేదితం తద్భక్తాయ దద్యాద్భుంజీత వా స్వయం ।
దత్త్వాచమన మర్చిత్వా తాంబూలంచ నివేదయేత్॥41॥

మిగిలిన నైవేద్యము విష్ణుభక్తునికి ఇవ్వవచ్చును. లేక కర్తయే స్వయముగా తినవచ్చును. భగవంతునికి ఆచమనమును సమర్పించి, అర్చించి, తాంబూలమును నివేదించవచ్చును. (41)

టీ :-నేతి. మూలవిద్యయా ద్వాదశాక్షరేణైవ. ॥41॥

శ్లో॥ జపేదష్టోత్తరం శతం స్తువీత స్తుతిభిః ప్రభుమ్ ।
కృత్వా ప్రదక్షిణం భూమౌ ప్రణమేద్దండవన్ముదా ॥42॥

పిమ్మట మూలమంత్రమును నూటెనిమిది పర్యాయములు జపించి ముందు చెప్పిన వానితో మరికొన్ని స్తుతులతో దేవదేవుని స్తుతించి, ప్రదక్షిణముచేసి, భూమియందు కఱ్ఱవలె ( సాష్టాంగముగా ) సాగిలపడి సంతోషముతో నమస్కరించవలెను. (42)

టీ :-దత్వేతి. పూర్వోక్తాభిరన్యాభిశ్చ స్తుతిభిః. ॥42॥

శ్లో॥ కృత్వాశిరసి తచ్ఛేషాం దేవముద్వాసయేత్తతః ।
ద్వ్యవరాన్ భోజయేద్విప్రాన్ పాయసేన యథోచితమ్॥43॥

విష్ణుపాద నిర్మాల్యమును శిరస్సున ధరించి దేవునికి ఉద్వాసన చెప్పి సర్వశ్రేష్ఠులైన బ్రాహ్మణులకు పాయసముతో తగిన విధముగా భోజనము పెట్టవలెను. (43)

టీ :-కృత్వేతి. తస్య శేషం నిర్మాల్యం. ॥43॥

శ్లో॥ భుంజీత తైరనుజ్ఞాతః శేషం సేష్టః సభాజితైః ।
బ్రహ్మచార్యథ తద్రాత్ర్యాం శ్వోభూతే ప్రథమేఽహని॥44॥

సగౌరవముగా అర్చించిన బ్రాహ్మణల అనుమతితో ఇష్ట బంధు సహితముగా దైవ శేషములను స్వీకరించవలెను. ఆ రాత్రి బ్రహ్మచర్యముతో గడుపవలెను. (తరువాతి శ్లోకముతో అన్వయము) (44)

టీ :-ద్వీతి. ద్వౌ అవరౌ యేషాం తాన్ అసంభవే ద్వావపి భోజయేది త్యర్థః. సభాజితైస్తైరనుజ్ఞాతస్సన్ శేషం. సేష్టః బంధుభిః సహితః. ॥44॥

శ్లో॥ స్నాతః శుచిః యథోక్తేన విధినా సు సమాహితః ।
పయసా స్నాపయిత్వార్చేద్యావత్ వ్రత సమాపనమ్॥45॥

వ్రత ప్రారంభదినమున ఉదయముననే స్నానాదికములు ముగించుకొని ఏకాగ్రచిత్తముతో శాస్త్రప్రకారమైన పద్ధతితో విష్ణువును పాలతో అభిషేకించి వ్రత సమాప్తియగు వరకు అర్చించవలెను. (45)

టీ :-బ్రహ్మచారీతి. తస్యాం రాత్ర్యాం బ్రహ్మచారీసన్ శ్వోభూతే ప్రభాతేసతి. ॥45॥

శ్లో॥ పయోభక్షో వ్రతమిదం చరేద్విష్ణ్వర్చనా దృతః ।
పూర్వవజ్జుహుయాదగ్నిం బ్రాహ్మణాంశ్చాపి భోజయేత్॥46॥

ముందు చెప్పిన విధముగనే విష్ణువును భక్తి శ్రద్ధలతో అర్చించి, అగ్నిలో హోమము చేసి, బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఈ విధముగా పయోభక్షణమను వ్రతమును ఆచరించవలెను. పాలు మాత్రమే ఆహారముగా స్వీకరించుటవలన దీనికి పయోభక్షణమను పేరు వచ్చినది. 46

శ్లో॥ ఏవం త్వహరహః కుర్యాద్ద్వాదశాహం పయోవ్రతమ్ ।
హరే రారాధనం హోమమర్హణం ద్విజతర్పణమ్॥47॥

ఈ విధముగా ప్రతిరోజు విష్ణువును ఆరాధించుట, హోమము, పూజ, బ్రాహ్మణులను భోజనాదులతో తృప్తి పరచుట పంద్రెండు దినములు పయోభక్షణ వ్రతమును చేయవలెను. (47)

శ్లో॥ ప్రతిపద్దిన మారభ్య యావచ్ఛుక్ల త్రయోదశీ ।
బ్రహ్మచర్య మథః స్వప్నం స్నానం త్రిషవణం చరేత్॥48॥

ఫాల్గుణ శుద్ధ పాడ్యమి మొదలుకొని శుక్ల త్రయోదశి వరకు బ్రహ్మచర్యము, భూశయనము, ముమ్మారు స్నానము లాచరించవలెను. (48)

టీ :-పయసేతి. పయ ఏవ భక్షః ఆహరో యస్య. ॥46-48॥

శ్లో॥ వర్జయే దసదాలాపం భోగానుచ్చా వచాంస్తథా ।
అహింసః సర్వభూతానాం వాసుదేవ పరాయణః ॥49॥

శ్రీమహావిష్ణువునందు చిత్తమునుంచి అసత్యపు మాటలాడుట, సర్వవిధములైన (అవి ఉచ్ఛమైనవికాని, నీచమైనవికాని అయిన ) సుఖములను, జీవహింసను వదిలివేయ వలెను. (49)

టీ :-బ్రహ్మచర్యమితి. అధః స్వప్నం శయనం. ॥49॥

శ్లో॥ త్రయోదశ్యామథో విష్ణోః స్నపనం పంచకైర్విభోః ।
కారయేత్ శాస్త్ర దృష్టేన విధినా విధి కోవిదైః ॥50॥

పిమ్మట త్రయోదశినాడు శాస్త్రకోవిదులు నిర్దేశించిన నిబంధనల ప్రకారము శ్రీమహావిష్ణునకు పంచామృతములతో స్నానము చేయించవలెను. (50)

శ్లో॥ పూజాంచ మహతీం కుర్యాత్ విత్త శాఠ్య వివర్జితః ।
చరుం నిరూప్య పయసి శిపివిష్టాయ విష్ణవే ॥51॥

ధన లోభము లేకుండ కిరణములందు వ్యాపించినవాడు, గరుడవాహనుడైనవాడు అయిన విష్ణువు గురించి పాయసమును భగవదర్పితమైన హవ్యముగా బద్ధముచేసి గొప్పగా పూజను చేయవలెను. (51)

శ్లో॥ శృతేన తేన పురుషం యజేత సుసమాహితః ।
నైవేద్యం చాతి గుణవత్ దద్యాత్పురుష తుష్టిదమ్॥52॥

ఏకాగ్ర చిత్తముతో ఆ హవ్య క్షీరముతో పరాత్పరుని గురించి హోమము చేయవలెను. ఎన్నోరెట్లు రుచికరముగా పరమాత్మ తృప్తిపడునట్లుగా నైవేద్యమును పెట్టవలెను. (52)

శ్లో॥ ఆచార్యం జ్ఞాన సంపన్నం వస్త్రాభరణ ధేనుభిః ।
తోషయే దృత్విజశ్చైవ తద్విద్ధ్యారాధనం హరేః॥53॥

జ్ఞాన సంపన్నుడు అయిన గురువును, ఋత్విక్కులను మంచి వస్త్రములు, ఆభరణములు, పాడియావులు మొదలైన వానితో సంతృప్తి పరచవలెను. ఆ విధముగా బ్రాహ్మణ తోషణమే నిజమైన విష్ణ్వారాధనమని గ్రహించుము. (53)

శ్లో॥ భోజయేత్తాన్గుణవతా సదన్నేన శుచిస్మితే ! ।
అన్యాంశ్చ బ్రాహ్మణాంఛ్ఛక్త్యా యేచ తత్ర సమాగతాః॥54॥

నిర్మలమైన చిఱునగవుల భార్యామణీ ! నీ వ్రతమును దర్శించుటకు విచ్చేసిన ఇతరులైన బ్రాహ్మణులకు భక్తితో చక్కగా నాణ్యమైన అన్నముతో షడ్రసోపేతమైన విందు భోజనమును పెట్టుము. (54)

శ్లో॥ దక్షిణాం గురవే దద్యాత్ ఋగ్విభ్యశ్చ యథార్హతః ।
అన్నాద్యేనా శ్వపాకాంశ్చ ప్రీణయే త్సముపాగతాన్॥55॥

గురువునకు, ఋత్విక్కులకు తగినట్టి సంభావన లీయవలెను. అన్ని చోట్లనుండి తాముగా వచ్చిన చండాలాదులను కూడా భోజనాదికములతో తృప్తి పరచవలెను. (55)

శ్లో॥ భుక్త వత్సుష సర్వేషు దీనాంధ కృపణేషుచ ।
విష్ణోస్తత్ప్రీణనం విద్వాన్ భుంజీత సహ బంధుభిః॥56॥

దీనులు, అంధులు, బోదులు అందరు భుజించినచో శ్రీమహావిష్ణువునకు ప్రీతి కలుగును అప్పుడు యజమాని తన బంధువులతో భుజించవలెను. (56)

శ్లో॥ నృత్య వాదిత్ర గీతైశ్చ స్తుతిభిః స్వస్తివాచకైః ।
కారయేత్తత్కథాభిశ్చ పూజాం భగవతోన్వహమ్ ॥57॥

నాట్యములు, మంగళవాద్యములు, కీర్తనలు, స్తోత్రములు, పుణ్యాహవాచక మంత్రములు, విష్ణువు లీలలను వివరించు కథలు మొదలైన వానితో విష్ణువు పూజలను చేయవలెను. (57)

శ్లో॥ ఏతత్పయో వ్రతం నామ పురుషారాధనం పరమ్ ।
పితామహీనాభిహితం మయా తే సముదాహృతమ్॥58॥

ఈ పయోభక్షణమను వ్రతము భగవంతుని ఆరాధించుటకు సర్వశ్రేష్ఠమైనదని నాకు బ్రహ్మదేవుడు చెప్పిన దానిని ఇప్పుడు నీకు వివరించితిని. (58)

టీ :-అహింస్ర ఇతి. పంచకైః పంచామృతైః. ॥50-58॥

శ్లో॥ త్వం చానేన మహాభాగే ! సమ్యక్చీర్ణేన కేశవమ్ ।
ఆత్మనా శుద్ధ భావేన నియతాత్మా భజావ్యయమ్॥59॥

ఓ నిర్మలమైన మనస్సుగల ఇంతీ ! నేను నీకు చక్కగా వివరించిన ఈ పయోభక్షణమను వ్రతముతో నాశరహితుడైన కేశవుని విధి విధానముతో అకల్మశ చిత్తముతో అర్చించుము. (59)

టీ :-పితామహేనేతి. మయా చ తే సముదాహృతం. ॥59॥

శ్లో॥ అయం వై సర్వయజ్ఞాఖ్యః సర్వ వ్రతమితి స్మృతమ్ ।
తపః సారమిదం భద్రే ! దానం చేశ్వర తర్పణమ్॥60॥

ఓ మంగళకరమైనదానా ! ఈ పయోభక్షణ వ్రతమే సర్వయజ్ఞమని పేరుగలది. అన్ని వ్రతములకంటే శ్రేష్ఠమైన అద్భుత వ్రతము. తపములకు పరాకాష్ఠ అయిన సారరూపమైనది. ఉత్తమమైన దానము. పరమాత్మను తృప్తి పెట్టగల సర్వోత్కృష్ట సాధనము. (60)

శ్లో॥ త ఏవ నియమాః సాక్షాత్త ఏవ చ యమోత్తమాః ।
తపో దానం వ్రతం యజ్ఞో యేన తుష్యత్యధోక్షజః॥61॥

వేని వలన ఇంద్రియజేత అయిన విష్ణువు తృప్తి పడునో అవే సరియైన యమ, నియమములు. అదే తపస్సు, దానము, వ్రతము, యజ్ఞము. (61)

శ్లో॥ తస్మాదేతత్ వ్రతం భద్రే ! ప్రయతా శ్రద్ధయా చర ।
భగవాన్ పరితుష్టస్తే వరామాశు విధాస్యతి ॥62॥

టీ :-ఆత్మనేతి. సర్వయజ్ఞాఖ్యోఽయం యజ్ఞః, సర్వవ్రతమితి చ స్మృతమేతద్వ్రతం. ॥60-62॥

ఓ మంగళకరురాలా ! నిర్మల మనస్సుతో, శ్రద్ధగా నీ వ్రతమును ఆచరించుము. భగవంతుడు నీ సేవలతో తృప్తి పడినచో నీకిష్టమైన వరములను ఆలస్యము లేకుండా ఈయగలడు. అని కశ్యపుడు అదితికి ఉపదేశించినాడు. (62)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
అదితి పయోవ్రతం నామ షోడశోఽధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే అదితి పయోవ్రతం అను
షోడశాధ్యాయము ఆంధ్రానువాదము.

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

శ్లో॥ తతః సప్తదశేదిత్యా కృతే తస్మిన్ వ్రతే హరిః ।
తత్కామ పూరణాయాదౌ తత్పుత్రోభూదితీర్యతే॥

పిమ్మట పదునేడవ అధ్యాయమున అదితి పయోభక్షణ వ్రతమును యథాశాస్త్రముగా చేయగా ఆమె కోరికను నెరవేర్చుటకు ముందుగా శ్రీహరి ఆమె పుత్రుడై అవతరించెనను విషయము చెప్పబడును.

**శ్రీశుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యుక్తా సాదితీ రాజన్ ! స్వ భర్త్రా కశ్యపేనవై ।
అన్వతిష్ఠద్వ్రతమిదం ద్వాదశాహమతంద్రితా ॥1॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! ఈ విధముగా పతి దేవుడైన కశ్యప ప్రజాపతి ఆదేశించినట్లుగా అదితి పండ్రెండు దినములపాటు మిగుల జాగరూకతతో పయో భక్షణ వ్రతమును ఆచరించినది. 1

శ్లో॥ చింతయంత్యేకయా బుద్ధ్యా మహాపురుషమీశ్వరమ్ ।
ప్రగృహ్యేంద్రియ దుష్టాశ్వాన్ మనసా బుద్ధి సారథిః॥2॥

బుద్ధిని సారథిగా చేసుకొని ఇంద్రియములనెడు చెడ్డ గుఱ్ఱములను మనస్సనెడు పగ్గములతో బిగించి పట్టి అనన్య చిత్తముతో మహాపురుషుడైన పరమాత్ముని వుపాసించినది. 2

శ్లో॥ మనశ్చైకాగ్రయా బుద్ధ్యా భగవత్యఖిలాత్మని ।
వాసుదేవే సమాధాయ చచార హ పయోవ్రతమ్॥3॥

సర్వాత్ముడైన శ్రీమహావిష్ణువునందు నిశ్చలమైన బుద్ధితో మనస్సును లగ్నముచేసి అదితి పయోభక్షణమను వ్రతమును ఆచరించినది. 3

శ్లో॥ తస్యాః ప్రాదు రభూత్తాత ! భగవానాది పూరుషః ।
పీత వాసాశ్చతుర్బాహుః శంఖ చక్ర గదాధరః ॥4॥

ఓ నాయనా! అదితి ఆరాధనకు పరితృప్తిని బొందిన ఆదినారాయణు డైన పరమపురుషుడు పీతాంబర ధారియై చతుర్భుజుడు శంఖము, చక్రము, గదలను ధరించినవాడై ఆమె ముందు ప్రత్యక్షమైనాడు. 4

శ్లో॥ తం నేత్ర గోచరం వీక్ష్య సహసోత్థాయ సాదరమ్ ।
ననామ భువి కాయేన దండవత్ప్రీతి విహ్వలా ॥5॥

కనుల ముందు సాక్షాత్కరించిన పరాత్పరుని చూచి అధికమైన గౌరవముతో లేచి నిలిచి భక్తి పారవశ్యముతో భూమిపై కఱ్ఱవలె బోరగిలబడి సాష్టాంగనమస్కారము చేసినది. 5

టీ :- తతః సప్తదశేదిత్యా కృతే తస్మిన్ వ్రతే హరిః,తత్కామ పూరణాయాదే తత్పుత్రోభూదితీర్యతే. ॥1-5॥

శ్లో॥ సోత్థాయ బద్ధాంజలి రీడితుం స్థితా
నోత్సేహ ఆనంద జలా కులేక్షణా ।
బభూవ తూష్ణీం పులకాకులాకృతిః
తద్దర్శనాదుత్సుక గాత్రవేపథుః ॥6॥

పరమాత్మునికి సాష్టాంగపడి లేచిన అదితి చేతులు జోడించి నమస్కరించుటకై నిలిచిన ఆమె ఆనందబాష్పములు పెల్లుబుకు కన్నులతో తడబడి నమస్కార ప్రయత్నము చేయలేకపోయినది. పరమాత్మ దర్శనానందమున శరీరమంతయు పులకలు గ్రమ్మి తహ తహ లాడుచు కంపించి పోవుచు తనను తాను మరిచిపోయి ఊరకనే నిలిచినది. భగవంతుని సాకారముగా దర్శించిన సంతోష పారవశ్యమున అదితిని భక్తితో సాత్విక సంచారి భావములు ముంచెత్తినవని భావము. 6

టీ :- నేతి. ప్రీతివిహ్వలత్వాదేవ. సా బద్ధాంజలిస్సతీ. స్థితా కేవలం. ఈడితుం పునర్నోత్సేహేన శశాక. అపి తు తూష్ణీం బభూవ. కథంభూతా ఆనందజలైరాకులే ఈక్షణే యస్యాః పులకైరాకులా ఆకృతిర్దేహో యస్యాః. తస్య దర్శనేన యోఽ త్యుత్సవః.తేన గాత్రే వేపథుఃకంపో యస్యాః. ॥6॥

శ్లో॥ ప్రీత్యా శనైర్గద్గదయా గిరా హరిం
తుష్టావ సా దేవ్యదితిః కురూద్వహ ।
ఉద్వీక్షతీ సా పిబతీవ చక్షుషా
రమాపతిం యజ్ఞపతిం జగత్పతిమ్ ॥7॥

టీ :- ప్రీత్యేతి. తుష్టావ పిబతీవోద్వీక్షమాణేవేతి చ క్రియా భేదాత్సేత్యస్య ద్విరుక్తిరదోషః. శ్లో. అయత్నతో వినిర్జిత్య దైత్యానత్యూర్జితానపి, భక్తా రక్షితుమీశస్త్వమిత్యస్తౌదదితి స్త్రిభిః. శీధరీయోఽయం శ్లోకః. ॥7॥

ఓ కురువంశ శ్రేష్ఠా ! ఆ అదితి ఆనందముతో గొంతు బొంగురు పోవుచుండగా మెల్లని ధ్వనితో యజ్ఞపతి, జగన్నాథుడు, లక్ష్మీ ప్రియుడైన శ్రీహరిని స్తుతించుచు ఆ దివ్యసుందర విగ్రహమును కన్నులతో త్రాగుచున్నదానిదలె రెప్పవాల్పక ఉత్సాహముతో చూచినది. 7

**అదితి రువాచ :-**

శ్లో॥ యజ్ఞేశ యజ్ఞ పురుషాచ్యుత తీర్థపాద
తీర్థ శ్రవః శ్రవణ మంగళ నామధేయ ।
ఆపన్నలోక వృజినోప శయోదయాద్య
శం నః కృధీశ భగవన్నసి దీననాథః ॥8॥

టీ :- యజ్ఞేశేత్యాదిదశభిః సంబోధనైస్తవాశక్యం కిమపి నాస్తీతి వదంతీ ప్రార్థయతే యజ్ఞేశేతి. శం నః. కృధి కురు. యతః దీనానాం నాథోఽసి త్వం. తీర్థం శ్రవః కీర్తిర్యస్య. శ్రవణమేవ

" అయత్నతో వినిర్జిత్య దైతానత్యూర్జితానపి ।
భక్తాన్రక్షితు మీశస్త్ వ్యమిత్యస్తౌదదితి స్త్రిభిః॥" ( శ్రీధరుల శ్లోకం) మిక్కిలి వృద్ధిపొంది విజృంభించుచున్న రాక్షసులను గూడా అలవోకగా జయించి భక్తులను రక్షించుటకు సమర్థుడవు నీవే అని అదితి మూడు శ్లోకములలో స్తుతించుచున్నది. యజ్ఞేశ మొదలైన పది నామములతో స్తుతించుచు జగదీశుడవైన నీకు అసాధ్యమేమియు లేదని చెప్పుచు ప్రార్థించుచున్నది. ఓ పరమేశ్వరా! నీవు నాకు శుభమును కలిగించుము. నీవు దీనరక్షకుడవు. పవిత్రతీర్థమైన గంగ నీ పాదోద్భవ. జగద్గురుడుగా కీర్తిగాంచిన వాడవు. వీనులకు విందైన నామములు కలవాడవు. శరణాగతులై

మంగళం ఆపన్నానాం శరణం గతానాం లోకానాం వృజినోపశమః. ఉదయో యస్య. ॥8॥

వచ్చిన ఆర్తుల పాపములను దహించువాడవు. 8

శ్లో॥ విశ్వాయ విశ్వభవనస్థితి సంయమాయ
స్వైరం గృహీత పురుశక్తి గుణాయ భూమ్నే ।
స్వస్థాయ శశ్వదుపబృంహిత పూర్ణబోధ
వ్యాపాదితాత్మ తమసే హరయే నమస్తే ॥9॥

టీ :- విశ్వాయేతి. భూమ్నే మహతే నమః మహత్త్వేహేతవః. విశ్వాయ విశ్వస్య భవనస్థితిసంయమార్థం. స్వైరం గృహీతాః పురుశక్తేర్మాయా యూ గుణాయేన. తస్మై తథాపి స్వస్థాయ అప్రచ్యుతస్వరూపాయ. కుతః. శశ్వదుపబృంహితః నిత్యోర్జితః యః పూర్ణో బోధస్తేన. వ్యాపాదితం నిత్యనిరస్తం. ఆత్మనితమో మాయాలక్షణం యేన తస్మై. ॥9॥

మహా ప్రభువునకు నమస్కారము. ఆ ప్రభావమునకు కారణము విశ్వరూపుడు, జగత్తుయొక్క సృష్టి, స్థితి, ప్రళయములను నిర్వహించుటకు తన అపారమైన శక్తి అయిన మాయ యొక్క సత్వ, రజస్తమాది గుణములను స్వీకరించినవాడు. అయినప్పటికీ వికారములు లేని స్వరూపము కలవాడు. నిరంతరము వృద్ధిపొందిన పరిపూర్ణ జ్ఞానముతో ఆత్మయందలి మాయను తిరస్కరించి నశింపజేయువాడవునైన నీకు నమస్కారము. 9

శ్లో॥ ఆయుః పరం వపురభీష్ట మతుల్య లక్ష్మీః
ద్యోభూరసాః సకలయోగ గుణాస్త్రివర్గః ।
జ్ఞానం చ కేవలమనంత భవంతి తుష్టాత్
త్వత్తో నృణాం కిం సపత్న జయాది రాశీః॥10॥

మా కోరికలను నెరవేర్చుట మీకు చాలా స్వల్పమైనదను విషయమును అర్థాపత్తితో చెప్పుచున్నది. ఆయుస్సు శ్రేష్ఠమైన బ్రహ్మజీవన పరిమాణమైనది. ఇచ్ఛాధీన రూపము. ధర్మార్థకామములనే త్రివర్గము యొక్క ప్రాప్తి, అపారమైన సంపద, సంచరించు స్థానములు స్వర్గ, మర్త్య, పాతాళలోకములు కల్యాణ

టీ :- అస్మదీమయనోరథపూరణమీషత్కరమేన తవేతి కైముతికన్యా యేనాహ. ఆయురితి. ఆయుః పరం బ్రహ్మాయురపి ద్యౌశ్చ రసాతలం చ ద్యోభూరసాః. ద్యౌరితి పృథాక్పాఠే భూశ్చ రసాశ్చ బిలస్వర్గా ఇతి విగ్రహః. రసేతి పాఠే. త్రీణి పదాని. సకలయోగగుణాః అణిమాదయః. ॥10॥

యోగసిద్ధులైన అణిమాదులు గుణములు, అపారమైన జ్ఞానము ఒక్కటియై అనంతమైనది మొదలైన వాటన్నిటినీ కలిగించునట్టి నీవు తృప్తి పొందినచో మానవులు తమ శత్రువులను జయించుట మొదలైన ఆశీర్వాదములు ఏమిలెక్క. 10

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ అదిత్యైవం స్తుతో రాజన్ ! భగవాన్ పుష్కరేక్షణః ।
క్షేత్రజ్ఞః సర్వభూతానామితి హెూవాచ భారత !॥11॥

టీ :- అదిత్యేతి.క్షేత్రజ్ఞః అంతర్యామీ. ॥11॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ భరత కుల దీపకా ! అదితి ఈ విధముగా స్తుతించగా పుండరీకాక్షుడు, సర్వభూతనివాసుడైన భగంవంతుడు ఈ విధముగా చెప్పినాడు. 11

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ దేవమాతర్భవత్యామే విజ్ఞాతం చిరకాంక్షితమ్ ।
యత్సపత్నైః హృతశ్రీణాం చ్యావితానాం స్వధామతః॥12॥

టీ :- దేవమాతరితి. సపత్నైర్హృతా శ్రీర్యేషాం స్వధామతశ్చ్యావితానాంచ పుత్రాణాం సంబంధి. యత్ తద్భవత్యాః చిరం ఆకాంక్షితం మయా విజ్ఞాతం. ॥12॥

**శ్రీమహా విష్ణువు ఇట్లు చెప్పినాడు :-**

ఓ దేవమాతా ! దాయాదులైన రాక్షసులవలన రాజ్యసంపదలు కోల్పోయి, స్వర్గనివాసమును వదలిపోయిన నీ కొడుకుల రాజ్యలబ్ధి, స్వర్గప్రాప్తికి సంబంధించిన నీ చిరకాల మనోరథము నాకు తెలియును. 12

శ్లో॥ తాన్వినిర్జిత్య సమరే దుర్మదానసురర్షభాన్ ।
ప్రతి లబ్ధ జయశ్రీభిః పుత్రైరిచ్ఛస్యుపాసితుమ్ ॥13॥

మూడు శ్లోకములలో అదితి కోరికను చెప్పుచున్నాడు. యుద్ధరంగమున దుర్మదులైన రాక్షషులను జయించి మరల నీ పుత్రులు రాజ్యమును, కీర్తిని పొంది ఒకేచోట స్థిరముగా ఉండుటను కోరుచున్నావు. 13

శ్లో॥ ఇంద్రజ్యేష్ఠైః స్వతనయైర్హతానాం యుధివిద్విషామ్ ।
స్త్రియోరుదంతీ రాసాద్య ద్రష్టుమిచ్ఛసి దుఃఖితాః॥14॥

ఇంద్రుడు మొదలైన నీ తనయుల చేతిలో యుద్ధరంగమున శత్రువులైన రాక్షసులు మరణించగా దుఃఖమును పొంది ఏడ్చునట్టి వారి భార్యలను చూడగోరుచున్నావు. అని అదితితో అన్నాడు. 14

టీ :- కాంక్షితమేవాహ.త్రిభిః. తానితి. ప్రతిలబ్ధో జయశ్చ శ్రీశ్చ యైస్తైః పుత్రైస్సహ. ఉపాసితుం ఏకత్ర స్థాతుమిచ్ఛసి. ॥13,14॥

శ్లో॥ ఆత్మజాన్ సుసమృద్ధాం స్త్వం ప్రత్యాహృత యశఃశ్రియః।
నాక పృష్ఠమధిష్ఠాయ క్రీడతో ద్రష్టుమిచ్ఛసి ॥15॥

మరల సంపాదించిన కీర్తి, రాజ్యసంపదలు కలవారై సర్వసందలతో తులతూగుచున్న నీ కుమారులు స్వర్గసింహాసనమును అధిరోహించి విలాసముగా వుండుటను చూడదలచుచున్నావు. 15

టీ :- ఆత్మజానితి. ప్రత్యాహృతం యశశ్చ శ్రీశ్చ యైస్తాన్.॥15

శ్లో॥ ప్రాయోఽధునా తేసురయూథనాథా
అవారణీయా ఇతి దేవి ! మేమతిః ।
యత్తేనుకూలేశ్వర విప్రగుప్తా
న విక్రమస్తత్ర సుఖం దదాతి ॥16॥

ఇప్పుడా సైన్యాధిపతులను జయించుటకు వీలుకాదని భావించుచున్నాను. ఎందుకనగా పరమాత్ముడు, కాలము అనుకూలముగా ఉన్న బ్రాహ్మణులచేత (భార్గవులచేత) రక్షితులైన వారిపై ( రాక్షసులపై ) యుద్ధముచేయుట వలన విజయము కలుగదు సరికదా దుఃఖములును కలుగును. 16

టీ :- ప్రాయ ఇతి. అవారణీయాః అనతిక్రమణీయాః. యద్యస్మాత్. అనుకూల ఈశ్వరః కాలో యేషాం. తైర్విప్రైర్గుప్తాః రక్షితాః అనుకూలైరీశ్వరైః. సమర్థైర్విప్రైర్గుప్తా ఇతి వా. ॥16॥

శ్లో॥ అథా ప్యుపాయో మమ దేవి ! చింత్యః
సంతోషితస్య వ్రత చర్యయా తే ।
మమార్చనం నార్హతి గంతు మన్యథా
శ్రద్ధానురూపం ఫలహేతుకత్వాత్ ॥17॥

ఓ దేవమాతా ! నీ వ్రత నియమాలకు సంతోషించిన నేను చెప్పునట్టి వుపాయమును గుఱించి ఆలోచించుము. నీవు ఏకాగ్రబుద్ధితో నన్నారాధించుట వ్యర్థము కాదు. అది దానికి అనుకూలమైన ఫలమునే కలిగించును. 17

టీ :- తథేతి. మమ మయా. చింత్యఏవ. తత్ర హేతుః. సంతోషితస్యే త్యాది. శ్రద్ధానురూపం ఇచ్ఛానుసారేణ ఫలహేతుత్వాత్. ॥17॥

శ్లో॥ త్వయార్చితశ్చాహమ పత్య గుప్తయే
పయోవ్రతేనానుగుణం సమేధితః ।
స్వాంశేన పుత్రత్వముపేత్య తే సుతాన్
గోప్తాస్మి మారీచ తపస్యధిష్ఠితః ॥18॥

నీ చేత పూజితుడనైన నేను నీ సంతానము రక్షించు కొఱకు నీవు చేసిన పయోభక్షణ వ్రతమునకు అనుకూలముగా వృద్ధిపొంది కశ్యప ప్రజాపతి తపస్సున (తేజమునందు) వ్యాపించి నా అంశతో పుత్రుడనై జన్మించి నీ పుత్రులను పాలించగలను ( రక్షించగలను ). 18

టీ :- త్వయేతి. మారీచస్య తపసి. అస్థితస్సన్ గోప్తాస్మి పాలయిష్యామి. ॥18॥

శ్లో॥ ఉపధావ పతిం భద్రే ! ప్రజాపతి మకల్మషమ్ ।
మాం చ భావయతీ పత్యావేవం రూపమవస్థితమ్॥19॥

ఓ కల్యాణీ ! ఈ రూపమున నున్న నన్ను అనఘుడైన నీ భర్త కశ్యప ప్రజాపతి యందు భావించుచు సేవించుము. 19

టీ॥ ఉపాధావేతి. అతః పతిముపాధావ భజస్వ. ॥19॥

శ్లో॥ నైతత్పరస్మా ఆఖ్యేయం పృష్టయాపి కథంచన ।
సర్వం సంపద్యతే దేవి! దేవగుహ్యం సుసంవృతమ్॥20॥

ఓ దేవమాతా ! నీవడిగినను ఇంతకన్నా వేరుగా చెప్పవలసిన విషయములేదు. ఈ గొప్పదేవ రహస్యమంతయు స్పష్టముగా నీకు వివరించితిని. దేవకార్యములన్నియు తప్పక నెరవేరగలవు. 20

టీ :- నైతదితి. దేవానాం గూహ్యం రహస్యం. సర్వం సుసంవృతం సంగుప్తం సత్ సంపద్యతే సిధ్యతి. ॥20॥

**( ఈ కుండలీకరించిన భాగము కొన్ని ముద్రిత ప్రతులందు మాత్రమే ఉన్నది. అన్నిటియందు లేదు )**

**( అదితి రువాచ :-**

**అదితి ఇట్లు అడిగినది :-**

శ్లో॥ నాహం వోఢు క్షమా దేవ ! త్వామాద్యం పురుషం పరమ్।
బ్రహ్మాండ కోటి సాహస్రం రోమకూపే తవావ్యహా !॥1॥

ఓ దేవా ! సర్వమునకు ఆద్యుడవైన పరమపురుషుడవు. వేలకోట్ల బ్రహ్మాండములను నీవు రోమముల రంధ్రముల భరించునట్టి వాడవు. నాశరహితుడవు. అట్టి నిన్ను నేను ఎట్లు భరించగలను. 1

శ్లో॥ మహాపాతక యుక్తోపి యన్నామ స్మృతి మాత్రతః ।
ప్రయాతి ముక్తిం దేవేశ ! తం కథం ధారయామ్యహమ్॥2॥

ఓ దేవ దేవ ! పంచమహాపాపములు చేసిన వాడైనను నీ నామమును స్మరించినంత మాత్రముననే మోక్షమును పొందగలడు. అట్టి నిన్ను నేనెట్లు గర్భమున భరించగలను. 2

**శ్రీ భగవానువాచ:-**

శ్లో॥ సత్యముక్తం మహాభాగే ! త్రయానాస్త్య్రత్యసంశయః ।
పతివ్రతాః పతిప్రాణాః పతిభక్తి పరాయణాః ।
వహంతి సతతం బాలే ! స్త్రియోపిత్యక్త మత్సరాః॥3॥}

**శ్రీహరి ఇట్లు చెప్పినాడు :-**

నిర్మల మనస్సు గల ఓ యువతీ ! నీవు చెప్పిన విషయము సత్యమే. ఇందులో సందేహము లేదు. అయినను పతివ్రతలు భర్తకు ప్రాణ సమానులైన సతులు పతిభక్తి కలిగిన స్త్రీలు అనుయాయులను విడిచి ఎల్లప్పుడు భర్త అనుగ్రహించిన సంతాన ఫలమును భరించుచునే యున్నారు. }

**శ్రీశుక ఉవాచ :-**

శ్లో॥ ఏతావదుక్త్వా భగవాన్ ! తత్రైవాంతర ధీయత ।
అదితి ర్దుర్లభం లబ్ధ్వా హరేర్జన్మాత్మని ప్రభోః ॥21॥

టీ :- ఏతావదితి. ప్రభోః హరేరాత్మని జన్మ లబ్ధ్వా. ॥21॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా చెప్పి పరమాత్ముడు అదృశ్యుడైనాడు. మిక్కిలి దుర్లభమైన పరమాత్ముని జన్మను ఆత్మలో పొంది ( భర్తను సేవించినదని తర్వాతి శ్లోకముతో అన్వయము ). 21

శ్లో॥ ఉపాధావత్పతిం భక్త్యా పరమయా కృత కృత్యవత్ ।
సవై సమాధి యోగేన కశ్యప స్తదబుధ్యత ॥22॥

టీ :- ఉపాధావదితి. అవితథమీక్షణం దృష్టిర్యస్య సః. ॥22॥

అపారమైన భక్తితో ధన్యురాలై ఆ అదితి భర్తను సేవించినది. ఆ కశ్యప ప్రజాపతి ఏకాగ్రచిత్తముతో ధ్యానయోగమున జరిగిన విషయము అవగతము చేసికొన్నాడు. 22

శ్లో॥ ప్రవిష్టమాత్మని హరేరంశం హ్యవితథేక్షణః ।
సోదిత్యాం వీర్యమాధత్త తపసాచిర సంభృతమ్ ।
సమాహిత మనా రాజన్! వారుణ్యగ్నిం యథానిలః॥23

టీ :- స ఇతి. అనిలో యథా సర్వత్ర సమోఽపి. దారుణి సంఘర్షేణ వనదాహకమగ్నిమాధత్తే. ఏవం స్వయం పుత్రేషు సమోఽపి దైత్యక్షపణార్థం వీర్యమాధత్తేత్యర్థః. ॥23॥

ఓ రాజా ! కశ్యపుడు దివ్యదృష్టితో తనయందు ప్రవేశించిన పరమాత్మ అంశను వాయువు అంతటా వ్యాపించియుండి కూడ అరణి దహనార్థము కఱ్ఱల రాపిడివలన అగ్నిని వృద్ధిపొందించినట్లుగనే కశ్యపుడు తన భార్యలైన దితి, అదితి సుతుల పట్ల సముడయ్యును తన తపస్సుచేత లభ్యమైన భగవంతుని తేజమును (వీర్యమును) రాక్షస నాశనార్థము ఏకాగ్రచిత్తముతో అదితి గర్భమున చేర్చినాడు. 23

శ్లో॥ అదితేర్ధిష్ఠితం గర్భం భగవంతం సనాతనమ్ ।
హిరణ్యగర్భో విజ్ఞాయ సమీడే గుహ్యనామభిః ॥24॥

టీ :- ఆదిత్యా ఇతి. ఆదిత్యాః గర్భం అధిష్ఠాయ స్థితం. సంధిరార్షః. సమీడే తుష్టావ. ॥24॥

అదితి గర్భమునందున్న సనాతనుడైన పరమాత్మను బ్రహ్మదేవుడు గమనించి రహస్య నామములతో స్తుతించినాడు ( ఇక్కడ రహస్యమని చెప్పుట నామమాత్రమునకే అని సూచించుట ). 24

బ్రహ్మోవాచ :-

శ్లో॥ జయోరుగాయ భగవన్నురుక్రమ నమోస్తుతే ।
నమో బ్రహ్మణ్య దేవాయ త్రిగుణాయ నమోనమః॥25॥

**బ్రహ్మ ఈ విధముగా స్తుతించినాడు :-**

గొప్పగా గానము చేయబడు కీర్తిగలవాడు, అపారముగా వ్యాపించగల పాదములు గలవాడు, వేదరూపుడు, సత్వరజస్తమోగుణమూర్తి అయిన భగవంతునికి నమస్కారము. 25

శ్లో॥ నమస్తే పృశ్ని గర్భాయ వేద గర్భాయ వేధసే ।
త్రినాభాయ త్రిపుష్ఠాయ శిపివిష్టాయ విష్ణవే ॥26॥

టీ :- జయ ఇతి. అదితేరేవ పూర్వస్మిన్ జన్మని పృశ్నిరితి నామ. తస్యాః గర్భాయ అర్భకాయ. వేదా గర్భే యస్య. యద్వా. వేదానాం గర్భాయ వేదేషు ప్రకాశమానాయేత్యర్ణః. త్రయో లోకా నాభౌయస్యసః. త్రిణాభః తస్మై త్రయాణాం లోకానాం. పృష్టే ఉపరి స్థితాయ. శిపిశబ్దేన పశవో జీవాః.తేష్వంతర్యామితయా ప్రవిష్టాయ. శ్రు. "యజ్ఞో వై విష్ణుః పశవశ్శిపిర్యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్ఠ" తీతి శ్రుతేః యద్వా. శిపయో రశ్మయస్తైర్వేష్టితాయేత్యర్థః. తథాపి విష్ణవే వ్యాపినే. అంతః పతితం తృణాది యథా గంభీరం స్రోతః అక్షిపతి. తథా కాలాత్మాభవాన్ విశ్వమాకర్షతి. ॥25,26॥

అదితి పూర్వజన్మమున పృశ్ని అను పేరుతోనున్న స్వాయంభువ మన్వంతరము నందలి సుతపుడను ప్రజాపతి భార్య. ఈ దంపతులిరువురు పెక్కేండ్లు శ్రీహరి పుత్రునిగా కోరి తపమునాచరించిరి. వారే ఈ జన్మమున అదితి కశ్యపులైరి. ఆ పృశ్ని గర్భమైనవాడు అనగా శిశువైనవాడు అని అర్థము. వేదములు గర్భముగాగలవాడు. ముల్లోకములకంటే పైన ఉన్నవాడు. శిపివిష్టుడు - శిపులనగా జీవులు. వారియందు అంతర్యామి రూపమున ఉన్నవాడు. "యజ్ఞోవై విష్ణుః । పశవః శిపిః యజ్ఞఏవ పశుషు ప్రతితిష్ఠతి । " అని శ్రుతి. లేక శిపులు అనగా కిరణములు. వానిచేత వ్యాపించువాడు శపివిష్టుడని విష్ణుసమస్రనామభాష్యము. అయినప్పటికీ అంతటా వ్యాపించువాడు విష్ణువు. అట్టి దేవునికి నమస్కారము. 26

శ్లో॥ త్వమాదిరంతో భువనస్య మధ్యం
అనంతశక్తిం పురుషం యమాహుః ।
కాలో భవానాక్షి పతీశ విశ్వం
స్రోతోయథాంతః పతితం గభీరమ్ ॥27॥

తనలో పడిన పుల్లలు, ఆకులు, కట్టెలు మొదలైన వానిని లోతైన ప్రవాహము ఆకర్షించినట్లుగా కాలస్వరూపుడవైన నీవు సమస్తవిశ్వమును ఆకర్శించి త్రిప్పుదువు. ఈ సర్వజగత్తునకు నీవే మొదలు, మధ్యము, చివరలు. అనంతశక్తిగల పరమపురుషుడవు పరమాత్ముడవు నీవే. 27

శ్లో॥ త్వంవై ప్రజానాం స్థిర జంగమానాం
ప్రజాపతీనామసి సంభవిష్ణుః ।
దివౌకసాం దేవ ! దివశ్చ్యుతానాం
పరాయణం నౌరివ మజ్జతోప్సు ॥28॥

టీ :- త్వమితి. ప్రజానాం ప్రజాపతీనాం చ త్వమేవ సంజనిష్ణుః ఉత్పాదనశీలోఽసి. అయం భావః. న హ్యేవంభూతస్య తవ జన్మాదిసంభవః కింతు. దేవానాం పరమాశ్రయత్వేన. తత్కార్యసాధ నాయావతారోఽయం. అతస్తాన్ స్వర్గచ్యుతాన్ పునః స్వర్గే స్థాపయేతి. ॥27,28॥

ఈ విధముగా నున్న నీకు జని, సమృద్ధి, నాశములు లేవు. స్థావర జంగమాత్మకమైన సృష్టికి, ప్రజలకు, ప్రజాపతులకు నీవే ఉత్పాదన శీలుడవు. పరమముగా ఆశ్రయుడైన వాడవు. ఆయాకార్యములను నిర్వహించుటకైన అవతారమవు. అందువలన స్వర్గమునుండి భ్రష్టులైన దేవతలను సముద్రజలమున మునుగువారిని నావవలె కాపాడి మరల స్వర్గమున స్థాపించుము. అని బ్రహ్మ అదితి గర్భస్థ శిశువును ప్రార్థించినాడు. 28

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే నామ సప్తదశోఽధ్యాయః**

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే సప్తదశాధ్యాయము ఆంధ్రానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ తత్వస్త్వష్టా దశే భూత్వా వామన సత్కృతోఽఖిలైః ।
యజ్ఞంగతస్తతస్తేన సత్కృతోక్తో వరాన్ వృణు॥

శ్రీ శుక ఉవాచ :-

శ్లో॥ ఇత్థం విరించస్తుత కర్మ వీర్యః
ప్రాదుర్బభూవామృత భూరదిత్యామ్ ।
చతుర్భుజః శంఖ గదాబ్జచక్రః
పిశంగవాసా నలినాయతేక్షణః ॥1॥

టీ :- "తతస్త్వష్టాదశే భూత్వా వామనస్సత్కృతోఽఖిలైః, బలేర్యజ్ఞం గతస్తేన చోక్తోవృణువరానితి." ఇత్థమితి. ఇత్థం విరించేన స్తుతం. కర్మ చ దేవకార్యలక్షణం. వీర్యం చ। ప్రభావోయస్య. స హరిరదిత్యాం ప్రాదుర్బభూవేతి త్రయాణా మన్వయః. అమృతభూః మృత్యుజన్మశూన్యః శంఖగదాబ్జ చక్రాణ్యస్య సంతీతి తథా. అర్శఆదిత్వేన మత్వర్థీయః అచ్ ప్రత్యయః. అవిసర్గపాతే సచాసౌపిశంగ వాసాశ్చ. ॥1॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

పదునెనిమిదవ అధ్యాయమున పరాత్పరుడు వామనుడై అవతరించి సర్వజనులచేత సత్కారములు పొంది, బలిచక్రవర్తి చేయు యాగమునకు వెళ్ళిగౌరవింపబడి వరములను యాచించుట విషయము.

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

ఈ విధముగా బ్రహ్మచేత స్తుతింపబడిన పుండరీకాక్షుడైన శ్రీమహావిష్ణువు ఇంద్రాదుల కార్యమును నెరవేర్చు ప్రభావము కలవాడై నాలుగు భుజములతో శంఖము, గద, పద్మము, చక్రము ధరించి, పీతాంబర ధారియై జన్మ, మరణములు లేనివాడై అదితికి ఉద్భవించినాడు. 1

శ్లో॥ శ్యామావదాతో ఝషరాజకుండల
త్విషోల్లసత్ శ్రీ వదనాంబుజః పుమాన్ ।
శ్రీవత్స వక్షా వలయాంగదోల్లసత్
కిరీట కాంచీ గుణ చారు నూపురః ॥2॥

టీ :- శ్యామేతి. ఝషరాజో మకరః తదాకారయోః కుండలయోస్త్విషా ఉల్లసంతీ శ్రీః. వదనాంబుజే యస్య. శ్రీవత్సో వక్షసి యస్య. వలయైరంగదైశ్చ సహోల్లసంతి కిరీటాదీని యస్య॥2॥

స్వచ్ఛమైన నల్లని కాంతితో, మకరకుండలముల ప్రకాశముతో శోభిల్లు ముఖ పద్మముతో, వక్షఃస్థలమునందలి శ్రీవత్సమణి, కంకణములు, భుజకీర్తులతో వెలిగిపోవు కిరీటము, మొలనూలు, కాలిఅందెలు కలవాడై పరమపురుషుడు (ఉద్భవించి నాడని ముందరి శ్లోకముతో అన్వయము). 2

శ్లో॥ మధువ్రత వ్రాత విఘుష్టయా స్వయా
విరాజితః శ్రీవనమాలయా హరిః ।
ప్రజాపతేర్వేశ్మ తమః స్వరోచిషా
వినాశయన్ కంఠ నివిష్ట కౌస్తుభః ॥3॥

టీ:- మధువ్రతేతి. శ్రీమత్యా వనమాలయా విరాజితః వేశ్మగతం తమః ॥3॥

తుమ్మెదల సమూహముతో వ్యాప్తమై స్వయముగా కంఠమున ధరింపబడిన వనమాలతో ప్రకాశించు శ్రీమహావిష్ణువు కశ్యప ప్రజాపతి గృహమునందలి చీకటిని తన కాంతితో నశింపజేయుచు గళమున ప్రకాశించు కౌస్తుభమణితో (ఉద్భవించినాడని ముందరి శ్లోకముతో అన్వయము) 3

శ్లో॥ దిశః ప్రసేదుః సలిలాశయాస్తదా
ప్రజాః ప్రహృష్టా ఋతవో గుణాన్వితాః ।
ద్యౌరంతరిక్షం క్షితిరగ్ని జిహ్వా
గావో ద్విజాః సంజహృషుర్నగాశ్చ ॥4॥

టీ :- దిశఇతి. అగ్నిజిహ్వా దేవాః.నగాః పర్వతాః. ॥4॥

వామనావిర్భావముతో దిక్కులు, నదులు, సముద్రములు ప్రసన్నమైనవి. ప్రజలు సంతోషించినారు. సర్వఋతువులు ఫలవంతమైనవి. స్వర్గము, ఆకాశము, భూమి, అగ్ని జిహ్వలు - దేవతలు, గోవులు, బ్రాహ్మణులు, పర్వతములు మోదమందినవి. 4

శ్లో॥శ్రోణాయాం శ్రవణ ద్వాదశ్యాం ముహూర్తేఽభిజితి ప్రభుః।
సర్వే నక్షత్ర తారాద్యాశ్చక్రుస్తజ్జన్మ దక్షిణమ్ ॥5॥

టీ :- తత్ప్రదుర్భావసమయమాహ శ్రోణాయామితి. భాద్రపదశుక్లద్వాదశీ శ్రవణద్వాదశీతి ప్రసిద్ధా తస్యాం తత్రాపి. శ్రోణాయాం శ్రవణస్థే చంద్ర ఇత్యర్థః. తత్రాపి శ్రవణస్య ప్రథమాంశే. అభిజితి నక్షత్రే తచ్చ శ్రుత్యాదర్శితం. శ్రు. "అభిజిన్నామనక్షత్రం.ఉపరిష్టాదషాఢానాం, అధస్తాచ్ఛ్రోణాయా" ఇతి. ఏవం విశిష్టే ముహూర్తే. ప్రభుః ప్రాదుర్బభూవేత్యర్థః. కించ. నక్షత్రాణ్యశ్విన్యాదీని. తారాశబ్దేన తారాః గ్రహాః గురుశుక్రాదయః తే ఆద్యాః యేషాం తే. సూర్యాదయోఽపి సర్వే తస్య జన్మ దక్షిణాం ఉదారం చక్రుః జన్మ ముహూర్తే గుణా బహవో బభూవురిత్యర్థః. ॥5॥

వామన మూర్తి జనన విషయమును చెప్పుచున్నాడు. భాద్రపద శుద్ధ ద్వాదశి శ్రవణ ద్వాదశియని ప్రసిద్ధము ( దీనినే వామన జయంతి వ్రతము చేయుదురు ) . ఆ దినమున చంద్రుడు శ్రవణా నక్షత్రమున నుండుట వలన అది శ్రోణ యనబడును. అందులో కూడా ఆ శ్రవణా నక్షత్ర ప్రథమ అంశను అభిజిత్ నక్షత్రమనబడును. ఈ విషయమే వేదమున " అభిజిన్నామ నక్షత్ర ముపరిష్టాదషానా మధస్తాత్ శ్రోణాయాః " అని చెప్పబడినది. ఈ విధముగా విశేషమైన ముహూర్తమున శ్రీహరి వామనమూర్తిగా జన్మించినాడని అర్థము. అశ్వినీ మొదలైన నక్షత్రములకు తారలని వ్యవహారము. 'తారాద్యాః' అన్నందువలన గురువు, శుక్రుడు మొదలైన గ్రహములు, వానికి ముందున్న సూర్యాది గ్రహములు మొదలైన వన్నియును వామనమూర్తి జన్మను సమర్థమైనదిగా, వుదారమైనదిగా చేసినవి. ఈ విధముగా వామనమూర్తి జన్మసమయమునందు (ముహూర్తమున ) అనేకములైన ప్రసిద్ధులున్నవి. 5

శ్లో॥ ద్వాదశ్యాం సవితాతిష్ఠన్మధ్యందినగతో నృప ।
విజయా నామ సా ప్రోక్తా యస్యాం జన్మ విదుర్హరేః॥6॥

టీ :- విశేషాంతరమాహ ద్వాదశ్యామితి. యస్యాం ద్వాదశ్యాం హరేర్జన్మ. తస్యామహన్యేవ విదుః. తస్య. మధ్యందినగతః సవితా అతిష్ఠత్. సా చ ద్వాదశీ విజయా నామ ప్రోక్తేత్యన్వయః. ॥6॥

మరొక జన్మకాల సంబంధ విశేషమును చెప్పుచున్నాడు. హరి జన్మించిన శ్రవణ ద్వాదశిని దాని పగలు అని తెలియవలెను. అప్పుడు సూర్యుడు మధ్యాహ్నగతుడై వుండును. అట్టి ద్వాదశి విజయ అను పేరుతో పిలువబడునని అన్వయము. 6

శ్లో॥ శంఖ దుందుభయో నేదర్మృదంగ పణవానకాః ।
చిత్ర వాదిత్ర తూర్యాణాం నిర్ఘోషస్తుములోఽభవత్॥7॥

శంఖములు, భేరులు మొదలైనవి మ్రోగినవి. మద్దెల, తప్పెటలు, ఢక్కలు మొదలైనవి చిత్రవాద్య చతుష్టయముల నాదములు మారుమ్రోగినవి.(7)

శ్లో॥ ప్రీతాశ్చాప్సరసోఽనృత్యన్గంధర్వ ప్రవరా జగుః ।
తుష్టువుర్మునయో దేవా మనవః పితరోఽగ్నయః ॥8॥

శ్లో॥ సిద్ధ విద్యాధర గణాః స కింపురుష కిన్నరాః ।
చారణా యక్షరక్షాంసి సుపర్ణా భుజగోత్తమాః ॥9॥

శ్లో॥ గాయంతోఽతి ప్రశంసంతో నృత్యంతో విబుధానుగాః।
ఆదిత్యా ఆశ్రమపదం కుసుమైః సమవాకిరన్ ॥10॥

సంతోషించిన అప్సరసస్త్రీలు నాట్యము చేయగా గంధర్వ శ్రేష్ఠులు పాటలు పాడిరి. మునీశ్వరులు ముదము జెందిరి. దేవతలు, మనువులు, పితృదేవతలు,సిద్ధులు, విద్యాధరులు, కిన్నరులు, కింపురుషులు, చారణులు, అగ్నులు, యక్షులు, రాక్షసులు, గరుడులు, సర్పశ్రేష్ఠులు వారి వారి గణములతో పాటలు పాడిరి. శ్రీహరిని కీర్తించుచు, నాట్యము చేయుచు దేవతలను అనుసరించినవారై అదితి ఆశ్రమ స్థానముపై పుష్పవర్షమును కురిపించిరి. ( అని మూడు శ్లోకములకు ఒకచోట తాత్పర్యము వ్రాయబడినది ). 8,9,10

శ్లో॥ దృష్ట్వాఽదితిస్తం నిజగర్భసంభవం
పరం పుమాంసం ముదమాప విస్మితా ।
గృహీత దేహం నిజయోగమాయయా
ప్రజాపతిశ్చాహ జయేతి విస్మితః ॥11॥

టీ:- శంఖేతి. శంఖాదయో యేషాం అన్యేషాం చ చిత్ర తూర్యాణాం నిర్ఘోషోఽభవత్. ప్రీతా ఇతి. దేవా మనవ ఇత్యాదీనాం కుసుమైస్సమ వాకిరన్నితి తృతీయేసాన్వయః --11॥

ఆ అదితి తనకు పుత్రుడై జన్మించిన పరమపురుషుని చూచి అధికమైన ఆశ్చర్యమును పొంది సంతసించినది. పరమాత్ముడు నిరాకారుడై వుండి కూడా తన యోగమాయతో ఉపాధిని స్వీకరించి తనయుడై పుట్టుటకు ఆశ్చర్యచకితుడై కశ్యప ప్రజాపతి అతనిని జయ శబ్దముతో సన్మానించినాడు. ఇక్కడ జయ శబ్దము నమస్కారవాచి. 11

శ్లో॥ యత్తద్వపుర్భాతి విభూషణాయుధైః
అవ్యక్త చిద్వ్యక్త మధారయద్ధరిః ।
బభూవ తేనైవ స వామనో వటుః
సంపశ్యతోర్దివ్య గతిర్యథా నటః ॥12॥

టీ :- విస్మయాంతరమాహ యత్తదితి. యత్తద్వపుర్హరిరధారయ త్ప్రకటితవాన్. తేనైవవపుషా మాతాపిత్రోః సంపశ్యతోరేవ.వామనో వటుర్బభూవ. దివ్యగతిః అద్భుతచేష్టితః స్వయం కథంభూతః. అవ్యక్తచిద్రూపః. కథమధారయత్.భాతి ర్దీప్తిః విభూషణాని ఆయుదాని చ తైర్వ్యక్తం యథా భవతి తథా. ॥12॥

మరొక ఆశ్చర్య విషయమును చెప్పుచున్నాడు. అప్పుడప్పుడే ప్రకటితమైన (పుట్టిన ) శ్రీహరి వెంటనే పెరిగి తల్లి దండ్రులు చూచుచుండగనే వామనుడు బ్రహ్మచారైనాడు. ( పసికందే ఆశ్చర్యముగా ఎనిమిది ఏడుల వటువుగా మారినాడు) పరమాత్మ వ్యక్తముకాని ( నిరుపాధికుడు, నిరాకారుడు ) జ్ఞాన స్వరూపుడైనను ఆభరణములు, ఆయుధముల కాంతిని ధరించినవాడై స్వయముగనే వెలిసినాడు. నటుడు తన వేషమును మార్చుకున్నట్లుగా దివ్యగతిగల హరి వామనుడైనాడు. 12

శ్లో॥ త్వం వటుం వామనం దృష్ట్వా మోదమానా మహర్షయః।
కర్మాణి కారయామాసుః పురస్కృత్య ప్రజాపతిమ్॥13॥

ఆ వామన బ్రహ్మచారిని చూచి మిక్కిలి సంతోషించిన మహర్షులు కశ్యప ప్రజాపతిని ముందిడుకొని శిశువునకు జాతకర్మ మొదలైన కార్యములను చేయించినారు. 13

శ్లో॥ తస్యోపనీయ మానస్య సావిత్రీం సవితాబ్రవీత్ ।
బృహస్పతిర్బ్రహ్మ సూత్రం మేఖలా కశ్యపోఽదదాత్ ॥14॥

టీ :- తమితి. కర్మాణి జాతకర్మాదీని. ॥13,14॥

ఉపనీతుడైన వామన వటువునకు సవిత సావిత్రిని ఉపదేశించినాడు. బృహస్పతి యజ్ఞోపవీతమును, తండ్రి కశ్యపుడు ముంజ దర్భతో పేనిన త్రాటిని మొలత్రాడుగా ఇచ్చినాడు. 14

శ్లో॥ దదౌ కృష్ణాజినం భూమిర్దండం సోమోవనస్పతిః ।
కౌపీనాచ్ఛాదనం మాతా ద్యౌశ్ఛత్రం జగతః పతేః॥15॥

జగన్నాథుడైన వామనునికి భూదేవి జింక చర్మమును, వృక్షములకు అధిపతియైన సోముడు దండమును, కట్టుకొనుటకు గోచిని తల్లి అదితి, గగనాధిపతి గొడుగును ఇచ్చినారు. 15

శ్లో॥ కమండలుం వేదగర్భః కుశాన్ సప్తర్షయో దదుః ।
అక్షమాలాం మహారాజ! సరస్వత్య వ్యయాత్మనః॥16॥

టీ :- దదావితి. వనస్పతిః వనానాం పతిః సోమః. ॥15,16॥

ఓ మహారాజా ! అవినాశియైన పరమాత్మునికి బ్రహ్మదేవుడు కమండలువును, సప్తఋషులు (కుశ) పవిత్రములను, సరస్వతీదేవి జపమాలను ఇచ్చినారు. 16

శ్లో॥ తస్మా ఇత్యుపనీతాయ యక్షరాట్ పాత్రికామదాత్ ।
భిక్షాం భగవతీ సాక్షాదుమాఽదాదంబికాసతీ ॥17॥

టీ :- తస్మాదితి. పాత్రికాం భిక్షాపాత్రీం. ॥17॥

ఈ విధముగా ఉపనీతుడైన వటువునకు ధనాధిపతియైన కుబేరుడు భిక్షపాత్రను ఇచ్చినాడు. పరమేశ్వరుని అర్ధాంగియైన అంబిక సాక్షాత్కరించి వటువునకు ప్రప్రథమముగా భిక్ష పెట్టినది. 17

శ్లో॥ స బ్రహ్మ వర్చసేనైవం సభాం సంభావితో వటుః ।
బ్రహ్మర్షి గణ సంజుష్టా మత్యరోచిత మారిషః ॥18॥

ఈ విధముగా గౌరవించబడిన శ్రేష్ఠుడైన బ్రహ్మచారి తన తేజముతో బ్రహ్మర్షుల సముదాయముతో నిండిన ఆ సభను అతిక్రమించి గొప్పగా ప్రకాశించినాడు. 18

శ్లో॥ సమిద్ధమాహితం వహ్నిం కృత్వా పరి సమూహనమ్ ।
పరిస్తీర్య సమభ్యర్చ్య సమిద్భి రజుహోద్ద్విజః ॥19॥

ఆ వామన వటుదు ఇధ్మములందు అగ్నిని కలిగించి సోమకుండమున చేర్చి దర్భాదులను పరచి అగ్నిని ఆరాధించి సమిధలతో హోమమును చేసినాడు. 19

టీ:- సఇతి. స ఏవం సంభావితః మారిషః శ్రేష్ఠో వటుః బ్రహ్మవర్చసేన. బ్రహ్మర్షిగణసంఘుష్టాం తాం సభామతి క్రమ్యారోచత. ॥18,19॥

శ్లో॥ శ్రుత్వాశ్వమేధైర్యజమాన మూర్జితం
బలిం భృగూణా ముపకల్పితై స్తతః ।
జగామ తత్రాఖిలసార సంభృతో
భారేణగాం సన్నమయన్పదే పదే ॥20॥

శ్రీహరి వటువుగా మారుటకు కారణము చెప్పుచున్నాడు. పిమ్మట భృగువులచేత ప్రవర్తితములైన అశ్వమేధ యాగములచే వృద్ధిపొందిన బలిచక్రవర్తిని గుఱించి విని అపారమైన బలముచేత సంపూర్ణుడైన వామనుడు తన అధికమైన బరువుతో ప్రతిపదమున భూమిని క్రుంగజేయుచు బలి యాగశాలకు వెళ్ళినాడు. 20

టీ :- యదర్థం వటుర్బభూవ తదాహ యావదధ్యాయ పరిసమాప్తి. శ్రుత్వేతి. యజమానం యజంతం. భృగూణాం భృగుభిః. ఉపకల్పితైః. ప్రవర్తితైః అఖిలేన సారేణ బలేన. సంభృతః సంపూర్ణః. ॥20॥

శ్లో॥ తం నర్మదా యాస్తట ఉత్తరే బలేః
య ఋత్విజస్తే భృగు కచ్ఛ సంజ్ఞకే ।
ప్రవర్తయంతో భృగవః క్రతూత్తమం
వ్యచక్షతారా దుదితం యథా రవిమ్ ॥21॥

టీ :- తదితి.నర్మదాయా ఉత్తరతటే భృగువత్ససంజ్ఞకే క్షేత్రే. క్రతూత్తమం ప్రవర్తయంతః యే బలేః ఋత్విజో భృగవః.తం వ్యచక్షత అపశ్యన్. ఆరాత్సమీప ఏవ. ఉదితం రవిమివ. ॥21॥

వామనుడు నర్మదానదికి ఉత్తరాన భృగు కచ్ఛపమను పేరుగల క్షేత్రమున బలిచక్రవర్తిచే అశ్వమేధయాగమును చేయించు ఋత్విజులు భృగువులుండుచోటికి వెళ్ళి వారి సమీపమున ఉదయించిన సూర్యునివలె ప్రకాశించుచుండగా వారతనిని దర్శించిరి. 21

శ్లో॥ త ఋత్విజో యజమానః సదస్యా
హతత్విషో వామన తేజసా నృప ! ।
సూర్యః కిలాయాత్యుతవా విభావసుః
సనత్కుమారోథ దిదృక్షయా క్రతోః ॥22॥

టీ :- తమితి, తమాచ్ఛంతం. ఋత్విగాదయః సూర్యః కిలేత్యేవమాది. వ్యతర్కరున్నతి శేషః. ॥22॥

ఓ రాజా ! వామనుడు యాగశాలకు వచ్చిన వెంటనే అక్కడున్న యాజకులు, (ఋత్వికులు ) యజమాని బలిచక్రవర్తి, సభాసదులు అతని దివ్యతేజము ముందర కాంతివిహీనులై యాగదర్శనార్థము సూర్యభగవానుడో, అగ్నిదేవుడో, బ్రహ్మ మానస పుత్రుడైన సనత్కుమారుడో వచ్చినారా అని తర్కించిరి. . 22

శ్లో॥ ఇత్థం సశిష్యేషు భృగుశ్వనేకధా
వితర్క్యమాణో భగవాన్ సవామనః ।
ఛత్రం స దండం సజలం కమండలుం
వివేశ బిభ్రత్ హయమేథ వాటమ్ ॥23॥

టీ :- ఇత్థమితి. హయమేధవాటం అశ్వమేధమంటపం వివేశ.॥23॥

ఈ విధముగా శిష్యసమేతులైన భృగువులు పెక్కువిధములుగా చర్చించుకొనుచుండగా భగవంతుడైన వామనుడు గొడుగు, దండము, జలపూర్ణకమండలువును ధరించిన వాడై అశ్వమేధయాగ మంటపమును ప్రవేశించినాడు. 23

శ్లో॥ మౌంజ్యా మేఖలయా వీతముపవీతాజినోత్తరమ్ ।
జటిలం వామనం విప్రం మాయా మాణవకం హరిమ్॥24॥

టీ :- మౌంజ్యేతి. ఉపతాజినం ఉపవీతద్ధృతమజినమేవ ఉత్తరముత్తరీయం యస్య. ॥24॥

భృగువులు ముంజదర్భతో కూడిన మొలత్రాడును నడుమున చక్కగా ధరించినవాడు, బ్రాహ్మణ బ్రహ్మచారి అయిన మాయావటు రూపమును ధరించి యాగశాలను ప్రవేశించిన శ్రీమహావిష్ణువును ( చూచి నమస్కరించిరని ముందరి శ్లోకముతో అన్వయము). 24

శ్లో॥ ప్రవిష్టం వీక్ష్య భృగవః సశిష్యాస్తే సహాగ్నిభిః ।
ప్రతిగృహ్ణన్ సముత్థాయ సంక్షిప్తా స్తస్య తేజసా॥25॥

టీ :- ప్రవిష్టమితి. సంక్షిప్తాః అభి తాస్సంతః. ॥25॥

యాగమండపమును ప్రవేశించిన వామనుని చూచి భార్గవులు శిష్యసహితముగా అగ్నిహోత్రములను గ్రహించి అర్ఘ్యపాద్యాదులను సమర్పించి తీసుకొని వచ్చుటకై లేచి నిలిచి ఆ మాయా వటుని తేజముముందు వెల వెలబోయి ముడుచుకొని పోయినారు. 25

శ్లో॥ యజమానః ప్రముదితో దర్శనీయం మనోరమమ్ ।
రూపాను రూపావయవం తస్మా ఆసనమాహరత్॥26॥

యజమానుడైన బలిచక్రవర్తి వటురూపుడైన వామనుని మనోహరమైన అందమైన రూపానికి అనువైన అవయవముల పొందికను చూచి మిక్కిలి సంతోషపడినవాడై ఆయన కూర్చొనుటకు ఆసనమును సమకూర్చినాడు. 26

శ్లో॥ స్వాగతేనాభినంద్యాఽథ పాదౌ భగవతో బలిః ।
అవనిజ్యార్చయామాస ముక్త సంగ మనోరమమ్॥27॥

పిమ్మట బలిచక్రవర్తి సర్వబంధములను పరిత్యజించిన సత్పురుషుల హృదయములందు క్రీడించు ఆ భగవంతుని స్వాగత వచనములతో అభినందించి ఆ పరమాత్ముని పాదములను కడిగి పూజించినాడు. 27

టీ :- యజమాన ఇతి. రూపస్యానురూపాః అవయవా యస్య తం దృష్ట్వేతి శేషః. ॥26,27॥

శ్లో॥ తత్పాద శౌచం జనకల్మషాపహం
స ధర్మవిత్ మూర్ధ్న్య దధాత్సుమంగలమ్ ।
యద్దేవదేవో గిరిశ శ్చంద్రమౌలిః
దధార మూర్ధ్నా పరయాచ భక్త్యా ॥28॥

దేవదేవుడైన పరమేశ్వరుడు అపారమైన భక్తితో తన జటాజూటమున శ్రీమహా విష్ణువు పాదతీర్థమును ( గంగను ) ధరించినట్లు, ధర్మతత్వమును ఎరిగినవాడైన బలిచక్రవర్తి సర్వపాపములను పోగొట్టునట్టి మంగళకరమైన కాళ్ళకడిగిన జలమును తన శిరస్సున ధరించినాడు. 28

టీ :- తదితి. చంద్రమౌళిశ్చేత్యన్వయః. అప్యర్థే చకారః. చంద్రళిరపి గంగారూపం రున్మూర్ధ్ని దధారేత్యర్థః. ॥28॥

**బలిరువాచ :-**

శ్లో॥ స్వాగతం తే నమస్తుభ్యం బ్రహ్మన్ ! కిం కరవామతే ।
బ్రహ్మర్షీణాం తపః సాక్షాత్ మన్యేత్వార్య ! వపుర్ధరమ్॥29

**బలిచక్రవర్తి ఇట్లు చెప్పినాడు :-**

ఓ ఆర్యుడా ! నీకు స్వాగతము. నమస్కారము. ఓ జ్ఞాన శ్రేష్ఠా ! మీకు నేనేమి చేయవలెనో చెప్పుము. మిమ్ములను బ్రహ్మర్షులంద సమిష్టితపమే రూపమును ధరించి ప్రత్యక్షమైనదిగా భావింతును. 29

శ్లో॥ అద్య నః పితరస్తృప్తా అద్య నః పావితం కులమ్ ।
అద్య స్విష్టః క్రతురయం యద్భవానాగతో గృహాన్॥30॥

ఇప్పుడు మీరాక వలన మా గృహము, నేను చేయుచున్న యాగము సశాస్త్రీయమై సత్ఫలమైనవి. మా పితరులు సంతృప్తులైనారు. మా వంశము పవిత్రమైనది. 30

టీ:- స్వాగతమితి. హే ఆర్య. త్వా త్వాం. సాక్షాత్ప్రత్యక్షం. బ్రహ్మణాం తవ ఏవ మన్యే కథంభూతం తపః. వపుర్ధరం మూర్తిధారి. ॥29,30॥

శ్లో॥ అద్యాగ్నయో మే సుహుతా యథావిధి
ద్విజాత్మజ ! త్వచ్చరణావనే జనైః ।
హతాంహసో వార్భిరియం చ భూరహో
తథాపునీతా తనుభిః పదైస్తవ ॥31॥

నా యాగ కుండమందలి అగ్నులు చక్కగా హవ్యములు స్వీకరించి ఫలవంతమైనవి. ఓ బ్రాహ్మణోత్తమా ! నీ పాదముల కడుగగా పరమ పవిత్రమైన జలముచేత (కల్మషాపహమైన నీ పాదతీర్థముతో ) నా పాపములు నశించినవి. ఈ భూమి నీ చిన్నిచిన్ని అడుగులచేత పవిత్రము చేయబడినది. 31

టీ:- అద్యేతి. హేద్విజా ! త్వచ్చరణావనేజనైర్వార్భిర్హతమంహో యస్య తస్య మే. పునీతా పవిత్రీకృతా. ॥31॥

శ్లో॥ యద్యద్వటో వాంఛసి తత్ప్రతీచ్ఛమే
త్వామర్థినం విప్రసుతాను తర్కమే ।
గాం కాంచనం గుణవద్ధామ మృష్టం
తథాఽన్నపేయముత వా విప్రకన్యామ్ ।
గ్రామాన్సమృద్ధాం స్తురగాన్గజాన్వా
రథాంస్తథాఽర్హత్తమ సంప్రతీచ్ఛ ॥32॥

టీ:- ద్యదితి. మే మత్తః ప్రతీచ్ఛ గృహాణ. హే అర్హత్తమ పూజ్యతమ. ॥32॥

ఓ బ్రహ్మచారీ ! పూజ్యతముడా ! బ్రాహ్మణతనయా ! నీకేమేమి కోరికలున్నవో కోరుము. వాటిని నేను తీర్చెదను. నా యాగమునకు అతిథిగా వచ్చిన నీకు భూమి, బంగారము, వాసయోగ్యమైన గృహము, రుచికరమైన భోజనపానీయములు, వివాహార్థమై బ్రాహ్మణకన్యను, పాడిపంటలతో నిండిన గ్రామములు, గుఱ్ఱములు, ఏనుగులు, రథములు మొదలైనవి ఏవికావలయునో ఆలోచించి అడుగుము. వాటన్నిటిని ఇచ్చెదను. స్వీకరింపుము. 32

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే బలివామన సంవాదే అష్టాదశోఽధ్యాయః**

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే బలి వామన పంవాదము అష్టాదశాధ్యాయము ఆంధ్రానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

శ్లో॥ ఊనవింశే తు హరిణా యాచితే చ పదత్రయే ।
ప్రతి శ్రుతే చ బలినా జానన్ భృగురవారయత్॥

పందొమ్మిదవ అధ్యాయమున వామనుడు మూడడుగులను యాచించుట, బలి ఇవ్వదలచుటలు తెలిసి శుక్రాచార్యుడు వారించుట చెప్పబడినది.

శ్లో॥ దాతుః స్తుతిః స్వయం దుష్టిరిత్యాది ప్రస్తుతోచితమ్ ।
వక్తవ్యమితి భిక్షూంస్తు శిక్షయన్నాహ వామనః॥

దాతను స్తుతించుట, తను పొందిన దానముతో తృప్తిపడుట మొదలైన విషయములను సందర్భోచితముగా చెప్పి యాచకులకు యాచించుటలో వామనుడు శిక్షణ ఇచ్చునట్లుగా చెప్పినాడు.

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతి వైరోచన వాక్యం ధర్మయుక్తం స సూనృతమ్ ।
నిశమ్య భగవాన్ ప్రీతః ప్రదినంద్యేద మబ్రవీత్ ॥1॥

టీ :- "ఊనవింశే తు హరిణా యచితే చ పదత్రయే,ప్రతి శ్రుతే చ బలినా జానన్ భృగురవారయత్ ." యద్వా. స్తుత్యార్థితో భగవతా సబలిస్త్రిపదీమితామ్, వామనాయోనవింశేక్ష్మాం దాస్యన్ శుక్రేణ వార్యతే. దాతుస్స్తుతిః స్వయం తుష్టిరిత్యాదిప్రస్తుతోచితమ్, వక్తవ్యమితి భిక్షూంశ్చ శిక్షయన్నాహ వామనః. ॥1॥

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

ఈ విధముగా సత్యమై ధర్మముతో కూడిన బలిచక్రవర్తి అభ్యర్థనను విని సంతోషించిన వామనుడు అభినందించి ఇట్లు చెప్పినాడు. 1

**శ్రీ భగవాన్ ఉవాచ :-**

శ్లో॥ వచస్తవై తజ్జనదేవ ! సూనృతం
కులోచితమ్ ధర్మయుతం యశస్కరమ్ ।
యస్య ప్రమాణం భృగవః సాంపరా యే
పితామహః కులవృద్ధః ప్రశాంతః ॥2॥

టీ :- వచ ఇత్యారభ్య షోడశభిశ్లో్కైః. వచ ఇతి. హేజన దేవః సాంపరాయే పాలౌకికే ధర్మే పితామహశ్చప్రహ్లాదః. ప్రమాణం దృష్టాంతరూపేణ వర్తత ఇత్యర్థః. ॥2॥

శ్లో॥ నహ్యే తస్మిన్కులే కశ్చిన్నిః సత్వః కృపణః పుమాన్ ।
ప్రత్యాఖ్యాతా ప్రతిశ్రుత్య యోఽ వాదాతా ద్విజాతయే॥3॥

టీ :- నహీతి.నిస్సత్వస్య లక్షణం. యోద్విజాతయే యాచకాయ. ప్రత్యాఖ్యాతా న దదామీతి వక్తా. కృపణస్య లక్షణం. ప్రథమం ప్రతి శ్రుత్య. యః పశ్చాద్దా తేతి. ॥3॥

**వామనుడు ఈ విధముగా బదులు పలికినాడు :-**

ఇక్కడ పదునారు శ్లోకములలో వామనుడు దాతను స్తుతించుచున్నాడు. ఓ రాజా ! నీమాటలు సత్యమై, ధర్మబద్ధమై, సమయానుకూలమై, కీర్తికరముగ వున్నవి. నీకు ఈ విధమైన పారలౌకిక సంస్కారమును కలిగించుటకు గురువులు భృగువులు, ప్రసన్నచిత్తుడు, కులజ్యేష్ఠుడైన ప్రహ్లాదుడు ప్రమాణము. 2

మీ కులమున శక్తిరహితులు కానీ, లోభి, కుత్సితుడైనవాడు కానీ ఎవ్వరునూ లేరు. బ్రాహ్మణుల అభ్యర్థనను తీర్చనివాడుకానీ, ఇత్తునని దానమివ్వనివాడు కానీ ఒక్కరునూ మీకులమున లేరు. 3

శ్లో॥ న సంతి తీర్థే యుధి చార్థి నార్థితాః
పరాఙ్ముఖా యే త్వమనస్వినో నృపాః ।
యుష్మత్కులే యద్యశసామలేన
ప్రహ్లాద ఉద్భాతి యతోడుపః ఖే ॥4॥

ఓ బలిచక్రవర్తీ ! మీ కులమున దాన సమయమున బ్రాహ్మణులకు అపారమైన సంపదలివ్వనివారు కానీ, యుద్ధ సమయమున శత్రురాజులతో యుద్ధమునకు వుత్సాహము చూపని భీరువులు కానీ, చెడ్డమనసుకలవారు కానీ లేరు. మీ వంశమున నిర్మలమైన కీర్తితో ఆకాశమున చంద్రునివలె మేలి కాంతులతో ప్రహ్లాదుడు విరాజిల్లుచున్నాడు. 4

శ్లో॥ యతో జాతో హిరణ్యాక్షశ్చరన్నేక ఇమాం మహీమ్ ।
ప్రతివీరం దిగ్విజయే నావిందత గదాయుధః ॥5॥

పూర్వము మీ వంశమున జన్మించిన మీ చినతాత హిరణ్యాక్షుడు మహాపరాక్రమముతో విశ్వమును జయించి గదాయుధుడై భూమండలమున తనతో యుద్ధముచేయగల ప్రతివీరులను కానలేక ఎదురులేక సంచరించినాడు. 5

టీ :- నేతి. తీర్థే దానావసరే యత్. యస్మిన్ యుష్మత్కులే.॥4,5॥

శ్లో॥ యం వినిర్జిత్య కృచ్ఛ్రేణ విష్ణుః క్ష్మోద్ధార ఆగతమ్ ।
నాత్మానం జయినం మేనే తద్వీర్యం భూర్యనుస్మరన్॥6॥

భూదేవిని ఉద్ధరించుటకై శ్రీమహావిష్ణువు వరాహరూపమును ధరించి మిక్కిలి కష్టముతో హిరణ్యాక్షుని సంహరించి మాటి మాటికి అతని గొప్ప పరాక్రమమును స్మరించుచు తనను విజేతగా భావించలేదు. 6

శ్లో॥ నిశమ్య తద్వధం భ్రాతా హిరణ్యకశిపుః పురా ।
హంతుం భ్రాతృహణం క్రుద్ధో జగామ నిలయం హరేః॥7॥

హిరణ్యాక్షుని మరణవార్తను విని అగ్రజుడైన హిరణ్యకశిపువు తీవ్రమైన కోపముతో సోదరుని సంహరించిన విష్ణువును సంహరించి పగతీర్చుకొనుటకై వైకుంఠమునకు వెళ్ళినాడు. 7

శ్లో॥ తమాయాంతం సమాలోక్య శూలపాణిం కృతాంతవత్ ।
చితయామాస కాలజ్ఞో విష్ణుర్మాయా వినాం వరః॥ 8॥

టీ :- యమితి. క్షోద్ధారే భూమ్యా ఉద్ధరణే. ॥6,7,8॥

శ్లో॥ యతోయతోఽహం తత్రాసౌమృత్యుః ప్రాణ భృతామివ।
అతోఽహమస్య హృదయం ప్రవేక్ష్యామి పరాక్ దృశః॥ 9॥

టీ :- యతఇతి. పరాగ్దృష్టేః.బహిర్దృష్టేః. ॥9॥

శ్లో॥ ఏవం సనిశ్చిత్య రిపోః శరీర
మాధావతో నిర్వివిశేఽసురేంద్రః ।
శ్వాసా నిలాంతర్హిత సూక్ష్మదేహ
స్తత్ప్రాణ రంధ్రేణ వివగ్న చేతాః ॥10॥

టీ :- ఏవమితి. అతో హృదయే స్థితం మాం న జ్ఞాస్యతీత్యేవం సనిశ్చిత్య. శ్వాసానిలే అంతర్హితః సూక్ష్మో దేహో యస్య. వివిగ్నమతికంపితం చేతో యస్య. అకంపితచిత్త ఇతి వాస్తవోఽర్థః.॥10॥

యమధర్మరాజువలె శూలమును ధరించి తనపైకి వచ్చుచున్న హిరణ్యకశిపువును చూచి అపారమైన మాయలను ఎరిగిన వారిలో శ్రేష్ఠుడగు విష్ణువు అతడప్పుడు కాలానుగుణముగా ఉండుటను గుఱించి ఆలోచించినాడు. 8

నేనెక్కడున్నా ప్రాణులను మృత్యువు వెంటాడినట్లు నన్నితడు వెంటాడగలడు. అందువలన బైటి, ప్రపంచ, భౌతిక దృష్టి మాత్రమే ఉండి లోపలి ఆత్మ, పరమార్థ దృష్టి లేని ( లేదా దూరమున ఉన్న వస్తువులను చూడగలడు కానీ తనకు అత్యంత సమీపమున అనగా తనలో ఉన్నవానిని చూడలేని ) ఈ హిరణ్యకశిపుని హృదయమున ప్రవేశించవలెనని విష్ణువు నిర్ణయించినాడు. 9

ఓ దానవేంద్రా ! నేనతని శరీరమునందు ప్రవేశించినచో హృదయమునందున్న నన్ను తెలియలేడని విష్ణువు నిర్ణయించుకొని హిరణ్యకశిపుని శరీరము లోపలికి ఉచ్ఛ్వాస వాయువులో అంతర్లీనమగునట్టి సూక్ష్మశరీరముతో ముక్కురంధ్రముద్వారా వేగముగా ఉరికి భయముతో కంపించు మనస్సుతో ప్రవేశించినాడు. వాస్తవముగా అకంపితుడు, భయరహితుడు అని అర్థము. ( ' వి ' అనే ఉపసర్గకు నిషేదార్థము అంటే లేనిది, కానిది అనే అర్థము కూడా ఉన్నది. వి విగ్నము అనేదానికి విశేష విగ్నము - తీవ్ర కంపనము, విగత విగ్నము - కంపనము లేనిది అని అర్థద్వయము ). 10

శ్లో॥ స తన్నికేతం పరిమృశ్య శూన్యం
అపశ్యమానః కుపితో ననాద ।
క్ష్మాం ద్యాం దిశః ఖం వివరాన్సముద్రాన్
విష్ణుం విచిన్వన్ న దదర్శ వీరః ॥11॥

టీ :- సఇతి. న దదర్శ. అంతః ప్రవిష్టత్వాత్. ॥11॥

శ్లో॥ అపశ్యన్నితి హోవాచ మయాన్విష్ట మిదం జగత్ ।
భ్రాతృహా మే గతో నూనం యతో నావర్తతే పుమాన్॥12॥

టీ :- అపశ్యన్నితి. పుమాన్యతః సకాశాన్నావర్తతే. తద్బ్రహ్మైవ గతః. నిత్యముక్తిత్వాదితి వాస్తవోఽర్థః. ॥12॥

శ్లో॥ వైరానుబంధ ఏతావా నా మృత్యో రిహ దేహినామ్ ।
అజ్ఞాన ప్రభవో మన్యురహం మానోప బృంహితః॥13॥

టీ:- ఏవం మృత్యుపర్యంతమఖండం విష్ణౌ వైరం యత్కృతవాన్. తదుచితమేవ తస్యాప్రతిద్వంద్వమహా బలపరాక్రమస్య.

హిరణ్యకశిపువు విష్ణుమందిరమును వెదికి అక్కడ విష్ణువు కనబడక శూన్యముగా ఉండుటను చూచి కోపముతో గర్జించినాడు. పిమ్మట ఆ వీరాగ్రణి భూమండలమును, స్వర్గమును, దిక్కులను, జలములను, సముద్రములను విష్ణువునకై వెదికి వెదికి తనలోనే ఉన్న విష్ణువును తనకన్న బైటి ప్రదేశములందు చూడలేకపోయినాడు. 11

ఎక్కడా విష్ణువు కనపడనందున నేనీ జగత్తంతయును ప్రతి అణువును వెతికి చూచితిని. అతనెక్కడా కనపడనందున నా సోదరుని సంహరించిన విష్ణువు జీవులు చేరి మరల తిరిగి రానిచోటికి తప్పక వెళ్ళియుండును. అనగా మరణించియుండునని తనవారితో చెప్పినాడు. కానీ వాస్తవముగా జీవుడు దేని సామీప్యమును పొంది మరల తిరిగిరాడో అది తప్పక బ్రహ్మమే యగును. బ్రహ్మము నిత్యముక్తమైనది. 12

ఈ విధముగా మృత్యుపర్యంతము అఖండవైరమును హిరణ్యకశిపుడు ప్రకటించుట ఉచితమే. ఎదురులేకుండా మహాబలవంతుడై, తనను మహాపరాక్రమవంతునిగా భావించు కోపోద్దీపితుడైన హిరణ్యకశిపునికి తాను వీరాగ్రణియై బ్రతికి యుండగనే భీరుని వలె వైరమును ఎందుకు విడిచి పెట్టినాడు? అనే శంకకు సమాధానము చెప్పుచున్నాడు. వైరముతో ఎడతెగని

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శూరాహంమాన విజృంభితక్రోధానుబంధస్య అస్య. కథం నామాసౌ శూరశిరో మణిర్జీవన్నేవ కాతరవద్వైరము పేక్షిత వానిత్యాశయేనాహ. వైరానుబంధ ఇతి. వైరానుబంధః ఏతావా అమృత్యోర్భవతి దేహినాం దేహే నిగూఢాభిమానవతాం శూరాణాం. తథా. అహం మానోపబృంహితో మన్యుశ్చ భవత్యేవ. యతః అజ్ఞానప్రభవః అజ్ఞా ననివృత్తేః ప్రాక్. పౌరుషత్యాగో మాంద్యమేవేత్యర్థః. ॥13॥

సంబంధముతో హిరణ్యకశిపుడు మరణపర్యంతము ఉన్నాడు. జీవులకు తమ శరీరమున అనగా భౌతిక వ్యామోహమునందు అపారమైన అభిమానము కలిగిన శూరులకు (తామే మహాపరాక్రమవంతులమని భావించుకొనువారికి) అదే విధముగా అహంకారముతో విజృంభించు కోపముకూడా వుండును. అజ్ఞానము తొలగకముందు పౌరుషము విడిచిపెట్టుట మూర్ఖత్వమగును. కనుక అజ్ఞాన తీవ్రత ఉచితమే. 13

శ్లో॥ పితా ప్రహ్లాద పుత్రస్తే తద్విద్వాన్ బుధ వత్సలః ।
స్వమాయుర్ద్విజ లింగేభ్యో దేవేఽభ్యోదాత్సయాచితః॥14॥

ఈ విధముగా అతని తాత ముత్తాతలను కీర్తించి అతని తండ్రిని కీర్తించుచున్నాడు. బ్రాహ్మణ వేషాలు ధరించిన తన శత్రువులైన దేవతలుకాని వీరు నిజమైన బ్రాహ్మణులు కారు. అని తెలిసినప్పటికి వారు యాచించగా ఆయన తన ఆయువును వారికి దానము చేసినాడు. ప్రహ్లాదకుమారుడైన నీ తండ్రి విరోచనుడు. 14

శ్లో॥ భవానా చరితాన్ధర్మా నా స్థితో గృహమేధిభిః ।
బ్రాహ్మణైః పూర్వజైః శూరై రన్యైశ్చోద్దామ కీర్తిభిః॥15॥

ఓ బలిచక్రవర్తీ ! పూర్వ పండితులైన బ్రాహ్మణశ్రేష్ఠులు, ఇంకా గొప్ప కీర్తిమంతులైన పలువురు పరాక్రమవంతులు గృహస్థాశ్రమ ధర్మమును నిర్వహించు యజమానులకై ఏర్పాటుచేసిన ధర్మములన్నింటిని నీవు ఆచరించితివి. 15

టీ :- తదేవం పూర్వజాం స్తుత్వా. తత్పితరం స్తౌతి. పితేతి. ద్విజవేష ధారిణో దేవా ఏతే న తు ద్విజా ఇతి. తద్విద్వానపి స యాచితస్సన్ . స్వీయమాయుర్దేవేభ్యోదదౌ. ॥14,15॥

శ్లో॥ తస్మాత్త్వత్తో మహీమీశ ద్వృణఽహం వరదర్షభాత్।
పదాని త్రీణి దైత్యేంద్ర ! సమ్మితాని పదామమ ॥16॥

టీ :- తస్మాది. మమ పదా సంమితానీతి త్రివిక్రమ పదాభిప్రాయేణ న చానృతవాదః తత్రాపి. స్వపదత్వానపాయాత్. ॥16॥

ఓ రాక్షసరాజా ! నేను మీనుండి మూడడుగుల భూమిని కోరుచున్నాను. అది కూడా నా పాదములతో సమానమైన – త్రివిక్రముని పదములు అనే అభిప్రాయముతో– అబద్ధదోషము కలుగకుండునట్లుగా – అది కూడా తన స్థానము తొలగిపోనట్లుగా మాత్రమే కావలెనని వామనుడు కోరినాడు. 16

శ్లో॥ నాన్యత్తే కామయే రాజన్ ! వదాన్యాజ్జగదీశ్వరాత్ ।
నైవః ప్రాప్నోతి వై విద్వాన్యావదర్థ ప్రతిగ్రహః ॥17॥

టీ :- నాన్యదితి. యావదర్థమేవ ప్రతిగ్రహో యస్య సః.॥17॥

ఓ రాజా! జగదీశ్వరుడవైన దాతవు నీవు. అట్టి నీ నుండి వేరే దేనినీ కోరను. వివేకవంతుడైన యాచకుడు ప్రయోజనమున్నంతవరకే దానమును స్వీకరించినచో కష్టమును పొందదు. మరొక అర్థములో – నీవద్ద ఉన్న మొత్తము సంపదను గ్రహించుట నా లక్షణమని తెలిసిన వివేకవంతుడు (దాత) ఎట్టి కష్టమును పొందదు. అనగా నీ సమస్త సంపదను హరించి ఇక మీదట నీకు ఎట్టి కష్టములు కలుగకుండ చూచుటకే నేను వచ్చితినని భావము. 17

**బలిరువాచ :-**

శ్లో॥ అహెూ బ్రాహ్మణ దాయాద ! వాచస్తే వృద్ధ సమ్మతాః ।
త్వం బాలో బాలిశమతిః స్వార్థం ప్రత్య బుధో యథా॥18॥

టీ :- ఈశ్వర స్యాపి యాచ్ఞాప్రకారం చోక్త్వా బలేర్బంధన

**బలిచక్రవర్తి ఇట్లు చెప్పినాడు :-**

ఈశ్వరునికి కూడా యాచన ప్రకారమును చెప్పి బలిని బోధించు సందర్భమున ప్రశ్నోత్తర రూపముగా అతని గర్వము యొక్క ఆధిక్యముచే ఆక్షేపించుచు మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. ఓ బ్రహ్మచారీ ! నీ మాటలు పెద్దల సంప్రదాయమునకు అనుగుణమైనవి. కాని నీవు పిల్లవాడవు. పూర్తిగా

ప్రశ్నోత్తరత్వేన తస్య గర్వాతిరేకేణాధిక్షేప ప్రకార మాహ త్రిభిః. అహో ఇతి. తేవాచో వృద్ధానాం సంమతాః త్వం తు బాలః బాలిశమతిశ్చ. బాలిశానామజ్ఞానామివ మతిర్యస్య. అతి ఏవ స్వార్థం ప్రతి. యథావదబుధః. వస్తుతస్తు బాలఇవ. ఆబాలిశమతిశ్చేతి పదచ్ఛేదః. స్వార్థం ప్రత్యబుధః భకానామేవార్థం బుధ్యసే. న స్వార్థం పరిపూర్ణస్య తవ తద్వ్యతిరేకేణ స్వార్థాభావాదిత్యర్థః. ॥18॥

తెలిసినవాడవు కావు. అందువలన కోరవలసిన గొప్ప విషయమును ( స్వార్థమును) తెలియలేని అజ్ఞానముతో ఉన్నావు కానీ, వాస్తవముగా ' బాల ఇవ అబాలిశ్చ ' అని విడదీయ వలెను. బాలుని వలె ప్రపంచ వ్యామోహములేని, అబాలిశుడు గొప్ప జ్ఞానియని అర్థము. ' స్వార్థం ప్రతి అబుధ ' అనగా తన విషయమును , తన స్వార్థము కాకుండా కేవలము భక్తుల కోరికలు, క్షేమమునే తెలిసిన వాడని అర్థము. పరిపూర్ణుడైన పరమాత్మకు స్వార్థముతో పనిలేదు. అక్కడంతా స్వార్థమునకు వ్యతిరేకమే అనగా స్వార్థా భావమే ( స్వార్థము లేక పోవుటయే ) అని అర్థము. 18

శ్లో॥ మాం వచోభిః సమారాధ్య లోకానామేకమీశ్వరమ్ ।
పాదత్రయం వృణీతే యోబుద్ధిమాన్ద్వీపదాశిషమ్॥19॥

టీ :- అబుధత్వమేవాహ మామితి. ద్వీపస్య దాశిషం దాశ్వాంసం దాతారం. అబుద్ధిమా ఽ వస్తుతస్తు బుద్ధిమానిత్యేవ పదచ్ఛేదః.॥19॥

నీవు తెలియని వాడవే అని చెప్పుచున్నాడు. ఓ వామనా ! నీవు నన్ను పెక్కు మాటలతో, స్తుతులతో చక్కగా సంతృప్తి పరచి సర్వలోకములకు అధిపతియైన నన్ను మూడడుగుల నేలను మాత్రమే కోరినావు. ఒక దీవినే ( ఖండమునే ) దానము చేయగల నన్ను మూడడుగుల నేలను అడుగుట నిజముగా తెలియని తనమే. (బుద్ధిలేని తనమే). ' అబుద్ధిమాన్ ' అనుటలోని అవగ్రహమును లేకుండ చెప్పినచో వాస్తవముగా బుద్ధిమంతుడనియే అర్థము. 19

శ్లో॥ న పుమాన్మాముపవ్రజ్య భూయో యాచితు మర్హతి ।
తస్మాత్ వృత్తకరం భూమిం వటో! కామం ప్రతీచ్ఛమే॥20॥

ఏ యాచకుడు కూడా నా వద్ద దానము పుచ్చుకొని మరల యాచించడు. అనగా నేనిచ్చిన దానముతో అతడు తరతరములు సంపన్నుడై సుఖించునని భావము. అందువల్ల ఓ బ్రహ్మచారీ ! నీ భుక్తికి సరిపోవునంత భూమిని సమృద్ధిగా నానుండి పొందుము. అయ్యా ! నీకిచ్చిన మూడడుగుల

టీ :- నేతి. కామం యథేచ్ఛం. సమ్యక్ పాదప్రసారణేనేత్యర్థః. అతఏవ తథా కరిష్యతి. ॥20॥

నేలను నీ యిచ్ఛానుసారముగా నీ పాదములతో కొలిచి స్వీకరించుము. నేనటులనే ఇత్తునని వాస్తవార్థము. 20

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ యావంతో విషయాః ప్రేష్ఠాః త్రిలోక్యా మజితేంద్రియమ్।
న శక్నువంతి తే సర్వే ప్రతి పూరయితుం నృప !॥21॥

టీ :- పునరపి నిస్పృహత్వమేవా విష్కుర్వన్నాహ యావంత ఇత్యాదినా ష్టభిః. ॥21॥

**వామనుడిట్లు సమాధానము చెప్పెను :-**

మరల వామనుడు నిష్కామత్వమునే ప్రకటించుచు ఏడు శ్లోకములలో చెప్పుచున్నాడు. కోరికలు కలవానికి మూడు జగములందు అనంతమైన, మిక్కిలి ఇష్టమైన కోరికలు పెక్కులున్నవి. ఓ రాజా ! వాటన్నిటిని తీర్చుకొనుటకు ఎవ్వరికినీ సాధ్యముకాదు. 21

శ్లో॥ త్రిభిః క్రమైరసంతుష్టో ద్వీపేనాపి నపూర్యతే ।
నవవర్ష సమేతేన సప్తద్వీప వరేచ్ఛయా ॥22॥

టీ :- త్రిభిరితి. నవవర్షసమేతేన ద్వీపేనాపి. సప్తానాం ద్వీపవ రాణాం ఇచ్ఛయా. ॥22॥

మూడు పాదముల నేలతో తృప్తి పడనిచో ఒక ఖండముతో కూడా కోరికలు తీరవు. జంబూ, ప్లక్ష , క్రౌంచాది నవవర్షములు, సప్తఖండములతో కూడిన సమస్త భూమండలమును కోరినను ( లభించినను ) మానవునికి తృప్తి కలుగదు. 22

శ్లో॥ సప్త ద్వీపాధిపతయో నృపా వైన్య గయాదయః ।
అర్థైః కామైః గతానాంతం తృష్ణాయా ఇతి నః శ్రుతమ్॥23॥

టీ :-సప్తేతి. తృష్ణాయాః అంతం న గతా ఇత్యుస్మాభిః శ్రుతం॥23॥

సమస్త భూమండలములకు ( సప్త ద్వీపములకు ) పరిపాలకులైన వైన్య గయాది రాజులు సంపదలతో తృప్తిని పొందలేక పూర్తిగా తీరని కోరికలతోనే గతించినారు కానీ ఎవరును వారి పేరాశకు అంతమును చూచినట్లుగా ఇంతవరకు వినలేదు. 23

శ్లో॥ యదృచ్ఛయోపపన్నేన సంతుష్టో వర్తతే సుఖమ్ ।
నా సంతుష్ట స్త్రిభిర్లోకై రజితాత్మోప సాదితైః ॥24॥

దైవికముగా లభించిన సంపదలతో, కోరికలతో తృప్తి పొందిన వాడు సుఖమును పొందును. ముల్లోకములు లభించినను తృప్తి లేనివాడు కోరికలను అణుచుకొనలేని వాడై దుఃఖమును పొందును. 24

శ్లో॥ పుంసోఽయం సంసృతేర్హేతు రసంతోషోఽర్థ కామయోః।
యదృచ్ఛయోపపన్నేన సంతోషముక్తయే స్మృతః ॥25॥

మానవునికి ధనము, కోరికల పట్ల తృప్తి లేకపోవుటయే సర్వ ప్రాపంచిక సంకటములకు కారణము. దైవికముగా తనకు లభించిన అర్థకామములతో సంతోషించువాడు మోక్షమును పొందునని చెప్పబడినది. 25

టీ :- యదృచ్ఛయేతి అసంతుష్టస్తు ప్రాప్తై స్త్రిభిర్లోకైరసి. న సుఖం వర్తతే. ॥24,25॥

శ్లో॥ యదృచ్ఛా లాభ తుష్టస్య తేజో విప్రస్య వర్ధతే ।
తత్ప్రశామ్యత్య సంతోషాదంభసేవా శుశుక్షణిః ॥26॥

దైవికముగా లభించిన దానితో తృప్తిపడు బ్రాహ్మణుని తేజము వృద్ధిపొందును. అసంతృప్తి వలన అతని అపారమైన శక్తి , నీటి యందలి అగ్ని వలె నశించిపోవును. 26

టీ :- యదృచ్ఛయేతి ఆశుశుక్షణిరగ్నిః. ॥26॥

శ్లో॥ తస్మా త్రీణి పదాన్యేవ వృణే త్వద్వర దర్షభాత్ ।
ఏతావతైవ సిద్ధోఽహం విత్తం యావత్ప్రయోజనమ్॥27॥

అందువలన దానవీరుడవై నీ నుండి మూడడుగుల నేలను మాత్రమే కోరుచున్నాను. ఈ సంపద వలననే నా అవసరములు నెరవేరి నేను కృతార్థుడనగుదును. అవపరమునకు తగిన ధనమే సుఖము. అధికము దుఃఖమే. 27

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యుక్తః సహసన్నాహ వాంఛితం ప్రతిగృహ్యతామ్ ।
వామనాయ మహీం దాతుం జగ్రాహ జలభాజనమ్॥28॥

శ్లో॥ విష్ణవే క్ష్మాం ప్రదాస్యంతముశనా అసురేశ్వరమ్ ।
జానం శ్చికీర్షితం విష్ణోః శిష్యం ప్రాహ విదాం వరః॥29॥

**శుక్ర ఉవాచ :-**

శ్లో॥ ఏష వైరోచనే ! సాక్షాద్భగవాన్విష్ణు రవ్యయః ।
కశ్యపాదదితేర్జాతో దేవానాం కార్య సాధకః ॥30॥

టీ :- తస్మాదితి. సిద్ధోఽహం కృతార్థః ఏతావతైవ సర్వస్వాపహార సిద్ధేరితిగూఢోఽభిప్రాయః తదేవాహ విత్తం హి. యావత్ప్రయోజన మేవ సుఖం. అధికస్య క్లేశావ హత్వాదిత్యర్థః. ॥27-30॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా వామనుడు చెప్పిన మాటలు విని బలిచక్రవర్తి నవ్వుచు నీవు కోరిన దానమును స్వీకరింతువు గాక యని, వామనునికి జలధారా పూర్వకముగా భూమిని దానము చేయుటకై నీటితో నిండిన కలశమును స్వీకరించినాడు. 28

దనుజాధిపతి యైన బలి వామనునికి భూమిని దానము చేయు విషయమును తెలిసి విష్ణువు యొక్క కోరిక యేమిటో స్పష్టముగా అవగతమగునట్లు శుక్రాచార్యుడు బలిచక్రవర్తికి తెలిపినాడు. 29

**శుక్రాచార్యుడిట్లు చెప్పినాడు :-**

ఓ విరోచనపుత్రా ! ఈ వామనుడు సాక్షాత్తుగా నాశరహితుడైన, భగవంతుడైన విష్ణుమూర్తి. కశ్యప ప్రజాపతి వలన అదితి గర్భమున దేవతల కార్యమును నెరవేర్చుటకై ( వారికి స్వర్గరాజ్యమును కట్టబెట్టుటకై ) జన్మించినాడు. 30

శ్లో॥ ప్రతి శ్రుతం తయైతస్మై యదనర్థమజానతా ।
న సాధుమన్యే దైత్యానాం మహానుపగతోఽనయః॥31॥

టీ :- ప్రతిశ్రుతమితి. అనయః అన్యాయః. ॥31॥

వామనునికి భూదానము చేయుటకు నీవు రాబోవు కీడును తెలియలేక అంగీకరించినావు. ఇది సరియైన నిర్ణయము కాదు. దీని వలన రాక్షస కులమునకు గొప్ప అన్యాయము కలుగుచున్నది. అందువలన నీ దాన కార్యక్రమము ఉచితము కాదు. మానుకొనుము. 31

శ్లో॥ ఏషతే స్థానమైశ్వర్యం శ్రియం తేజో యశ శ్రుతమ్ ।
దాస్యత్వాచ్ఛిద్య శక్రాయ మాయామాణవకో హరిః॥32॥

టీ :- అన్యాయమేవాహ ఏష ఇతి. ॥32॥

రాక్షసులకు కలుగబోవు అన్యాయమును చెప్పుచున్నాడు. ఈ వామనుడు నీ స్వర్గసింహాసనము, ఐశ్వర్యము, సంపద, ప్రాభవము, ప్రఖ్యాతమైన కీర్తి మొదలైన సర్వస్వమును కప్పిపెట్టి అనగా వంచనతో సంపాదించి మోసపు బ్రహ్మచారి రూపమున ఇంద్రుని పరము చేయగలడు. 32

శ్లో॥ త్రివిక్రమై రిమాన్ లోకాన్ విశ్వకాయః క్రమిష్యతి ।
సర్వస్వం విష్ణవే దత్వా మూఢ ! వర్తిష్యతే కథమ్॥33॥

టీ :- నను మయా పదత్రయమేవ ప్రతిశ్రుతంనాధికం. తత్రాహ త్రిభిరితి. క్రమ తామితి చేత్తత్రాహ సర్వస్వమితి. ॥33॥

నేను మూడడుగుల నేలను మాత్రమే దానమిచ్చుటకు అంగీకరించినది. అంతకంటే ఎక్కువ కాదు కదా ! . అని అనుకుందువేమో అనే విషయమును చెప్పుచున్నాడు. ఉధృతముగా పెంచిన మూడు పాదములతో ఈ సర్వలోకములను విశ్వరూపుడై విష్ణువు ఆక్రమించగలడు. ఓ మూర్ఖుడా! సమస్తమును శ్రీహరికి అప్పగించి నీవెట్లు ఉండగలవు. 33

శ్లో॥ క్రమతో గాం పదైకేన ద్వితీయేన దివం విభోః ।
ఖంచ కాయేన మహతా తార్తీయస్య కుతోగతిః ॥34॥

అంగీకరించిన మూడడుగులలో కూడా నీవు అధికముగా సంపాదించ వలసి ఉన్నది. అనగా మూడడుగుల దానము చేయగల శక్తికూడా నీకు లేదని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. ఈ వామనుడు త్రివిక్రముడై విపరీతముగా పెంచిన ఒక పాదముతో భూమిని, మరొకపాదముతో స్వర్గమును,

అపారముగా పెంచిన శరీరముతో ఆకాశమును ఆక్రమించినచో మూడవ పాదము నుంచుటకు నీకు గతి (ఆధారము) ఏమున్నది?. 34

శ్లో॥ నిష్ఠాం తే నరకే మన్యే హ్యప్రదాతుః ప్రతిశ్రుతమ్ ।
ప్రతిశ్రుతస్య యోనీశః ప్రతిపాదయితుం భవాన్ ॥35॥

టీ :- తథాపి ప్రతిశ్రుతం సంపాదనీయమితి చేత్తత్రాహ ద్వాభ్యాం. క్రమత ఇతి ఏకేన పదన్యాసేన భూమిం క్రమమాణ స్యేత్యర్థః తార్తీయప్య తృతీయపదన్యాసస్య. ॥34,35॥

నీవు దానమిత్తునని అంగీకరించిన మాటను నిలుపుకొనుటకు సమర్థుడవు కాదు. ఇత్తునని వాగ్దానము చేసినదానిని ఇవ్వనట్టి నీకు నరకమునందు నిశ్చయముగా స్థానము కలుగును. 35

శ్లో॥ న తద్దానం ప్రశంసంతి యేన వృత్తి విపర్యయే ।
దానం యజ్ఞస్తపః కర్మలోకే వృత్తి మతోయతః ॥36॥

శ్లో॥ ధర్మాయ యశసేఽర్థాయ కామాయ స్వజనాయచ ।
పంచధా విభజన్విత్త మిహాముత్ర చ మోదతే ॥37॥

టీ :- తథాపి సర్వస్వదానాత్కీర్తిస్తావద్భవిష్యతీతి చేత్తత్రాహ న తద్దానమితితపశ్చిత్తై కాగ్ర్యం.కర్మపూర్తం. ననుతర్హి ప్రతిశ్రుత్య నేతి కథమనృతం వాచ్చం. తత్రాహ దానామి త్యాదిసార్ధైః షడ్భి.॥36,37॥

ఎందుకనగా నీవు అంగీకరించి యిచ్చిన దానము వలన నీకు జీవనము (బ్రతుకు తెరువు) ఉండని పక్షమున అనగా నీవు సర్వస్వము పోగొట్టుకొని నశించిపోవునట్లైన అట్టిదానిని తత్వకోవిదులు దానము కాదందురు. దానము, యజ్ఞము, తపస్సు, కర్మ మొదలైనవి సంపద ఉన్నవానికే సాధ్యమగును. కనుక సర్వధన నాశము కూడదు, 36

వ్యక్తి తన సంపదను ధర్మకార్యములు, కీర్తి, అర్థము (అవసరములు), కోరికలు, ఆశ్రితులు అనేవానికి ఐదు సమభాగములుగా విభజించి వినియోగించినచో అతనికి ఇహపర సుఖములు కలిగి పూర్ణుడై సంతోషించును. 37

శ్లో॥ అత్రాపి బహ్వృచైర్గీతం శ్రుణు మేఽసురసత్తమ ! ।
సత్యమోమితి యత్ప్రోక్తం యన్నేత్యాహానృతం హి తత్॥38॥

టీ :- అత్రాపీతి. అత్రాపి సత్యానృతవ్యవస్థాయాం. బహ్వృచశ్రుత్యాహి ప్రథమం. శ్రు. "ఓమితి సత్యం నేత్యనృత" మిత్యాదినా. సత్యానృతయో ర్లక్షణపూర్వకం స్తుతినిందాభ్యాం. సత్యం విహితం. అనృతం చ నిషిద్ధం. అనంతరం చ శ్రు. ''పరాగ్వా ఏతద్రిక్తమక్షరమో" మిత్యాదినా. సత్యే దోషానవృతే చ గుణానుక్త్వా. శ్రు. ''తస్మాత్కాల ఏవ దద్యాత్కాలేన దద్యాత్తత్సత్యానృతే మిథునీకరోతీ'' త్యుపసంహారేణ వృత్తి సంకటాదిషు. అనృతమప్యనుజ్ఞాతం. తమిమం శ్రుత్యర్థం దర్శయన్నాహ ఓమిత్యంగీకారేణ యత్ప్రోక్తం తత్సత్యం నేతి యదాహ, తదేవానృతం. ॥38॥

ఒకవేళ అంగీకరించి లేదని అసత్యమును ఎట్లు చెప్పవలెను. అనుదానికి ఆరున్నర శ్లోకములలో చెప్పుచున్నాడు. దానము చేయుట, చేయకపోవుట, ఏది సత్యము, ఏది అసత్యము అనువాని విషయమై శాస్త్రీయ వ్యవస్థను చెప్పుచున్నాడు. " ఓమితి సత్యం నేత్య నృతమ్ " . ఓం అనునది సత్యము. లేదు అనునది అసత్యము. మొదలుగా సత్యము, అసత్యముల లక్షణములతో స్తుతి నిందలతో తెరువబడినది, వికసించినది, ఔను అనే విధముగా భావపరముగా, యదార్థముగా వికసించినది. సత్యము ( స్తుతి పాత్రము ), మూయబడినది, లేదు, కాదు అనే విధముగా అభావ పరముగా, అయథార్థముగా ముడుచుకుపోయినది. అసత్యము ( నిందాపాత్రము ) అని చెప్పబడినది. తర్వాత కూడా " పరాగ్వా ఏతద్రిక్త మక్షరమ్ " అనేది మొదలుగా సత్యమునందు దోషములు అనగా కొన్ని సందర్భాలలో సత్యము పాప కారణముగా, అసత్యమునందు గుణములు అనగా కొన్ని సందర్భములలో అసత్యమే పుణ్యకారణమైనదిగా చెప్పి , " తస్మాత్కాల ఏవ దద్యాత్కాలే న దద్యాత్సత్యానృతే మిథునీ కరోతి " ఎట్టి సమయమున దానము చేయవలెను, ఎట్టి దానము చేయకూడదు, ఏది సత్యము, ఏది అసత్యము అనే విషయములు రెండింటి సామరస్యమును చెప్పుచు ఉపసంహారము ( ముగింపు ) నందు సర్వనాశనమగు సమయమున అసత్యము కూడా అంగీకరించబడినది. అని చెప్పి ఈ విషయమునకు ఉపపత్తిగా చూపుచు చెప్పుచున్నాడు. "ఓమిత్యంగీకారేణ యత్ప్రోక్తం తత్సత్యమ్। నేతి యదాహ తదేవానృతమ్॥"

అంగీకారముతో ఓంకారము సత్యమని చెప్పినదంతయు సత్యము. అది కానిదిగా చెప్పినదంతయు అసత్యము. 38

శ్లో॥ సత్యం పుష్పఫలం విద్యాదాత్మ వృక్షస్య గీయతే ।
వృక్షేఽ జీవతి తన్నస్యాదనృతం మూలమాత్మనః ॥39॥

టీ :- తత్తు సత్యమీషదనృతం వినా న సిధ్యతీత్యాశయేనాహ సత్యమితి. సత్యం పుష్పఫలం. విద్యాజ్జానీ యాత్. ఆత్మవృక్షస్య దేహరూపస్య వృక్షస్య. గీయతే శ్రుత్యా ఉచ్యత ఇత్యర్థః. పాఠాంతరేసుగమనం. యద్యపి శ్రుత్యా. శ్రు."వాచఃసత్యం. పుష్పఫలం". చేత్యుక్తం తథాపి. వాచోదేహ నిర్వాహాధీనత్వాదాత్మ వృక్షస్యేతి.ప్రస్తుతానుసారేణోక్తం. భవతు. పుష్పఫలస్థానీయం సత్యం. తతః మత ఆహ వృక్షే దేహే ఆజీవతి సతి తత్పుష్పఫలం న స్యాత్. సా న స్యాదితి పాఠే శ్రుత్యుక్తా యాః వాచః పరామర్శః దేహశ్చానృతేన రక్షణీయ ఇత్యాహ అనృతం త్వాత్మనో దేహస్య.మూలం.॥39॥

సత్యము కూడా కొంచెమైనా అసత్యము లేనిదైతే సిద్ధించదనే ఆశయముతో చెప్పుచున్నాడు. దేహమనెడు వృక్షమునకు సత్యమును పుష్పఫలముగా తెలియవలెను. ఈ విషయమును వేదము కూడా చెప్పినది. ' ఆత్మ వృక్షస్య జీవితః ' అనే పాఠాంతరమునకు కూడా ఇదే అర్థము. ఏది ఏమైనప్పటికి వేద వాక్కులు సత్యము పుష్పఫలమని చెప్పినవి. అయినప్పటికి వాక్కులు దేహశక్తికి అధీనములైనందున ఆత్మవృక్షమని ప్రస్తుత అవసరమునకు తగినట్లుగ చెప్పబడినది. అందువలన దేహమనెడు వృక్షశరీరమున పుష్పఫలముల స్థానమున సత్యముండుగాక. తర్వాత ఏమిటో చెప్పుచున్నాడు. దేహవృక్షము బ్రదుకనిచో పుష్పఫలములుండలేవు. ' సా నస్యాత్ ' అనే పాఠాంతరమున వేదవాక్కులను పరామర్శించుటయే. దేహమును అసత్యముచేత రక్షింపవలసినదని చెప్పుచున్నాడు. అసత్యము శరీరమునకు మూలము. 39

శ్లో॥ తద్యథా వృక్ష ఉన్మూలః శుష్యత్యుద్వర్తతేఽ చిరాత్ ।
ఏవం నష్టానృతః సత్య ఆత్మా శుషేన్నసంశయః॥40॥

ఈ విషయమునే దృష్టాంతముతో స్పష్ట పరచుచున్నాడు. వృక్షము మూలమును పెకిలించగా ఎండిపోయి భూమినుండి బైటపడి పడిపోవును. అట్లే అసత్యము లేనిచో ఆ శరీరము ఎండిపోవును. ఏమైనప్పటికి శ్రుతి "

టీ :- ఏతదేవ దృష్టాంతేన స్పష్టయతి తదితి. తద్యథా వృక్ష ఉత్పాటితమూలః శుష్యతి.అచిరాదేవ ఉద్వర్తతే పతతి చ ఏవం నష్టమనృతం యస్య. ఆత్మా దేహః శుష్యేత్. యద్యపి శ్రుత్యాపి శ్రు "ఇదమేవానృతం వదన్నాత్మానమావిర్మూలం కరోతీ" త్యేవం నిందయా. అనృతం షిద్ధం. తథాప్యుపసంహారానుసారేణ. తత్కేవలాన్న తవిషయమిత్యభిప్రేత్యేవం వ్యాఖ్యాతం. దయేత్తత్వేనేతి చ తత్రైవోక్తేః. తథా చ శ్రుతిః. శ్రు "ఓమితి సత్యం. నేత్యనృతం. తదేతత్పుష్పం ఫలం వాచో యత్సత్యం సహీశ్వరో యశస్వీ కల్యాణకీర్తిర్భవితా పుష్పం హి ఫలం వాచస్సత్యం సదన్త్యేతన్మూ వాచో యదనృతం తద్యథా వృక్ష ఆవిర్మూలః శుష్యత్యుద్వర్తతే ఏవమేవానృతం వదన్నావిర్మూల త్మానం కరోతి స శుష్యతి స ఉద్వర్తతే. తస్మాదనృతం నవదేద్దయేత్తత్వే తేనేతి.యేన అనేన అనృతేన దయేత్సంకటేష్వాత్మానం రక్షేదితి శ్రుత్యర్థః. ॥40॥

శ్లో॥ పరాగ్రిక్త మపూర్ణం వా అక్షరం యత్తదోమితి ।
యత్కించి దోమితి బ్రూయాత్తేన రిచ్యేత వై పుమాన్ ।
భిక్షవే సర్వమోంకుర్వన్నాలం కామేన చాత్మనే ॥41॥

ఏవమేవానృతం వదన్నాత్మాన మావిర్మూలం కరోతి " ఈ విధముగనే అసత్యమును చెప్పుచు దేహమును ప్రసూతి నివారణకు అవకాశము కలిగించును. అని చెప్పినది. ఈ విధముగనే నిదతో అసత్యము నిషేధమని చెప్పుచు అయినప్పటికి ఈ చర్చను ముగించుటకు అనుకూలముగా కేవలము అసత్యవిషయమును సమ్మతించి ఈ విధముగా వ్యాఖ్యానింపబడినది. ' దయేత త్యేతేన ' అని శ్రుతి వాక్యము. ఆ అసత్యము చేతనే వ్యక్తి సంకటమునుండి తనను రక్షించుకొనవలెను. శ్రుతివాక్యము అసత్యమును సమర్థించుచున్నది. " ఓమితి సత్యమ్ । నేత్యనృతమ్ । తదేత్పుష్పమ్ । ఫలంవాచో యత్సత్యమ్ । స ఈశ్వరో యశస్వీ । కల్యాణ కీర్తిర్భవితా । పుష్పం హి ఫలం వాచః । సత్యం వదత్యథైతన్మూలమ్ । వాచో యదనృతమ్ । తద్యథా వృక్ష ఆవిర్మూలః । శుష్యతి స ఉద్వర్తతే । ఏవమేవానృతం వదన్నావిర్మూల మాత్మానం కరోతి స శుష్యతి స ఉద్వర్తతే। తస్మాదనృతం నవదేద్దయేత త్వేతేన॥" అని. అందువలన ఈ అసత్యము చేతనే సంకట పరిస్థితులందు మానవుడు తనను తాను రక్షించుకొనవలెనని శ్రుతి వాక్యార్థము. 40

ఎల్లప్పుడు సత్యముతోనే శరీరము ( జీవయాత్ర ) జరుగదు అనే విషయమును స్పష్టపరుచుటకు సత్యము యొక్క దోషములను, అసత్యముయొక్క గుణములను రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. ఓంకారమను అక్షరమునకు దూరాన్వయముననున్న అర్థమును స్వీకరించి అంగీకరించుటను శూన్యమని

టీ :- సర్వదా సత్యవచనేన దేహేన నిర్వాహేదితి స్ఫుటీకర్తుం. సత్యస్య దోషాన్.అనృతస్య చ గుణానాహ ద్వాభ్యాం. పరాగితి. మదోమిత్యక్షరం. తత్పరాక్. దూరేఅర్థం గృహీత్వా అంచతీతి పరాక్. రిక్తమితి శ్రుతిపద వ్యాఖ్యానం. అపూర్ణం వా ఇతి. తత్తస్మాత్ అర్థినే. యత్కించిదోమితి దాస్యామీతి బ్రూయాత్. తేనచ్యేత శూన్యోభవేత్. ॥41॥

శ్లో॥ అర్థై తత్పూర్ణమఖ్యాత్మం యచ్చనేత్యనృతం వచః ।
సర్వం నేత్యనృతం బ్రూయాత్స దుష్కీర్తిః శ్వసన్మృతః॥42॥

టీ :- భిక్షవఇతి. కించి భిక్షవే సర్వమోంకుర్వన్ దాస్యామీత్యంగీకుర్వన్. ఆత్మనే కామాయ వాలం పర్యాప్తో న భవతి. తస్య భోగో న సిధ్యతీత్యర్థః. తథా చ శ్రుతిః. పరాగ్వా

చెప్పుటవలన శ్రుతి పదమునకు వ్యాఖ్యానము అసంపూర్ణమే. అందువలన ఆ యాచకునికి ఏదో ఒకటి ' ఓం ' ను ఇచ్చుచున్నాను అని చెప్పుట వలన లోపము కలుగును. కానీ యాచకునికి సమస్తమును ' ఓం ' గా చేసి ఇచ్చుచున్నాను. అని అంగీకరించినను తన కోరికతో పూర్తిగా సమృద్ధుడు (చాలుననెడు బుద్ధి కలవాడు) కాలేదు. ఎన్నికోరికలు తీరినను ఇంకను తీరని కోరికలు మిగిలియుండునని భావము. అతనికి సుఖము పూర్తిగా సిద్ధించదని అర్థము. ఈ విషయమును శ్రుతి ఇట్లు సమర్థించుచున్నది. " పరాన్వా ఏతద్రిక్తమక్షరం యదేతదోమితి తద్యత్కించోమిత్యాహాత్రవాస్మై తద్రిచ్యతే । స యత్స సర్వమోంకుర్యాత్ రిచ్యాదాత్మానం స కామేభ్యో నాలం స్యాత్॥" అని. ఏదో ఒకటి అని దానము చేసినచో యాచకునికి తక్కువయగును. సర్వమూ అని యిచ్చినచో దాత మరల తను దానముచేయగల స్థితిని కోల్పోయి శూన్యుడగును అని భావము. 41

లేదు అనేమాట అసత్యమైనట్లే అర్థము నాశనము కానందువలన ఇది పూర్ణము. ఆత్మ సంబంధమైనదని చ కారముతో అన్వయము. తనకు (ఆత్మకు) ఎదురుగానున్న ఇతరమైన, ఇతరులయొక్క వస్తువులను ఆకర్షించుట ( అన్నీ తనకే కావలెనని కోరుట ) అధ్యాత్మము. ప్రతివాడు, ప్రతిరోజు నాకు ఏమియు లేదు, దరిద్రముతో ఉన్నానని చెప్పును. అతడా అసత్యముతో ఇతరుల సంపదను పొందుట ప్రసిద్ధము. ఇట్టి అసత్యమే ఎల్లప్పుడు చెప్పదగినదా?

తద్రిక్తమక్షరం యదేతదోమితి తద్యత్కించిదోమిత్యాహ అత్రైవాస్మై తద్రిచ్యతే యత్సర్వ మోంకుర్యాద్రిచ్యాదాత్మానం సకామేభ్యో నాలం స్యాదితి.నేతి యదనృతం వచః. ఏతత్పూర్ణం అర్థవ్యయాభావాత్. ఆధ్యాత్మ చేతి చకారస్యాన్వయః. ఆత్మనోఽభిముఖమన్యస్యార్థ మాకర్షతీత్యధ్యాత్మం. యో హి నిత్యం మమ కించిదపి నాస్తీతి న కిమపి దాస్యామీతి బ్రూతే సహి తేనానృతేన రేషామర్థానాకర్షతీతి ప్రసిద్ధం. ॥42॥

(అనృతమే అమృతమువంటిదని చెప్పుట తగునా?) అనే దానికి సమాధానము, ' సర్వమితి ' అని చెప్పుచున్నాడు. దీనికి " అథైత త్పూర్ణ మభ్యాత్మం యన్నేతి స యత్సర్వం నేతి బ్రూయాత్పాపికాస్య కీర్తిర్జాయేత సైనం తత్రైవ హన్యాత్ " అని శ్రుతి ప్రమాణము. అన్ని విషయములందును లేదు కాదని అసత్యములు పలుకువాడు అపకీర్తితో జీవించియున్నను అతడు మరణించిన వానితో సమానుడే ( శ్వసన్మృతుడు ) అని అర్థము. 42

శ్లో॥ స్త్రీషు నర్మ వివాహేచ వృత్త్యర్థే ప్రాణ సంకటే ।
గోబ్రాహ్మణార్థే హింసాయాం నానృతం స్యాజ్జుగుప్సితమ్॥43॥

టీ :- నను తర్హి దమనృతమివ సర్వదా సేవ్యం స్యాన్నేత్యాహ సర్వమితి.తథా చ శ్రుథా చ శ్రుతిః "అథైతత్పూర్ణమధ్యాత్మం యన్నేతి. స యత్సర్వం నేతి బ్రూయాత్ పాపికాస్య కీర్తిర్జాయతే.సైనం తత్రైవ హన్యాదితి. అతో వృత్తిసంకటాదిషు అనృతం నదోషాయేత్యుపసంహరతి స్త్రీష్వితి. స్త్రీషు ప్రోత్సాహనేన వశీకారేణ.నర్మణి పరిహాసే. వివా హే చ వరాదిస్తుతౌ గవాం బ్రాహ్మణానాం చ పి తార్థం. హింసాయాం చ కస్య

అందువలన జీవనమునకు సంకట పరిస్థితి కలిగినప్పుడు అసత్యమాడుట దోషముకాదని ఈ సత్యానృతముల చర్చను ముగించ ుచున్నాడు. స్త్రీలకు కామోద్రేకమును కలిగించి వశము చేసికొనుటలో, హాస్యమైన విషయములలో, పెండ్లిండ్లలో వధూవరులను గొప్పగా చెప్పుటలో, గోబ్రాహ్మణులకు మేలు కలగించుటలో, అపకారము కలుగబోవు సమయమున, హింసలందు అసత్యము దోషముకాదు. ఈ విధముగా యాజ్ఞ్యవల్క్య స్మృతి " వర్ణినాం హి వధో యత్ర తతసాక్ష్యేఽనృతం వదేత్ " ఋషులు, బ్రహ్మచారుల వధ విషయమున సాక్ష్యము చెప్పవలసినచో అసత్యము చెప్పవచ్చును. అని. " తస్మాత్కాలేవ దద్యాత్కాలే నదద్యాత్తత్సత్యానృతే మిథునీ కరోతి " ఏ కాలమున దానము చేయవచ్చును, ఏకాలమున దానము చేయగూడదు, ఏది సత్యము,

చిత్రాప్తాయాం తథాచ యాజ్ఞవల్క్యః. "శ్లో. వర్ణినాం హి వధో యత్ర తత్ర సాక్ష్యనృతం వదేది" తి. తథా చ శ్రుతిః. "తస్మాత్కాల ఏవ దద్యాత్తత్సత్యానృతే. మిథునీకరోతీ" తి. ॥43॥

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే వామన ప్రాదుర్భావే ఏకోనవింశోఽధ్యాయః**

ఏదసత్యము అని దానాదానముల విషయమున, సత్యాసత్యముల విషయమున శ్రుతి ప్రమాణము. 43

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే వామనప్రాదుర్భావమను ఏకోనవింశాధ్యాయము ఆంధ్రానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ వింశే త్వనృత భీతోఽసౌ జ్ఞాత్వాపి కపటం హరేః ।
దదావేవ తతో విష్ణుః సహసాఽవర్ధతాద్భుతమ్॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ బలిరేవం గృహపతిః కులాచార్యేణ భాషితః ।
తూష్ణీం భూత్వా క్షణం రాజన్! ఉవాచా వహితో గురుమ్॥ 1॥

టీ :- శ్లో. వింశే గురూక్తిముల్లంఘ్య దత్తాంక్ష్మాం బలినా హరిః, ప్రతిగృహ్యాఖిలాణ్ లోకాన్ విశ్వరూపో విచక్రమే. యద్వా. వింశే త్వనృతభీతోఽ సౌజ్ఞాత్వాపికపటం హరేః,దదౌ పృథ్వీం తదా విష్ణుస్సహసాఽ వర్ధతాద్భుతమ్. ॥1॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

ఇరువదవ అధ్యాయమున అసత్యదోషమునకు భయపడి, బలిచక్రవర్తి శ్రీమహావిష్ణువు వంచనను తెలిసి కూడా మూడు పాదముల నేలను వామనునకు దానము చేసినాడు. పిమ్మట శ్రీహరి అద్భుతముగా తన శరీరమును పెంచి త్రివిక్రమత్వమును చూపుట విషయము.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! బలిచక్రవర్తికి ఈ విధముగా వంశగురువైనట్టి శుక్రాచార్యుడు చెప్పగా విని బలి క్షణకాలము ఊరకనే వుండి ఏకాగ్రచిత్తుడై గురువుతో ఇట్లు చెప్పినాడు.

1

**బలిరువాచ :-**

శ్లో॥ సత్యం భగవతా ప్రోక్తం ధర్మోఽయం గృహమేధినామ్ ।
అర్థం కామం యశో వృత్తిం యో న బాధేత కర్హిచిత్॥2॥

టీ :- సత్యమితి. భగవతా త్వయా ప్రోక్తం సత్యం. కిం తత్. యోఽర్థ కామాదికం న బాధేత. స గృహమేధినాం ధర్మఇతి.॥2॥

**బలి చక్రవర్తి ఇట్లు చెప్పినాడు :-**

ఓ గురువర్యా ! మీరు చెప్పిన మాట సత్యం. అర్థము, కామము, కీర్తి, జీవనములకు భంగము కలుగకుండ వ్యవహరించుట గృహస్థాశ్రమమున నున్న యజమానులకు ధర్మము. 2

శ్లో॥ స చాహం విత్తలోభేన ప్రత్యాచక్షే కథం ద్విజమ్ ।
ప్రతి శ్రుత్య దదామీతి ప్రాహ్లాదిః కితవో యథా ॥3॥

నేను ప్రహ్లాదుని పౌత్రుడనై యుండియు సంపద పట్ల వ్యామోహముతో బ్రాహ్మణునికి దానమిత్తునని అంగీకరించి చెప్పిన మాటను వంచకునివలె ఎట్లు నిరాకరించగలను? (ప్రహ్లాదిని యగుటవలన భగవంతునికి అనుకూలముగా నుండుటయే తన ధర్మమని రహస్యార్థము) 3

శ్లో॥ న హ్య సత్యాత్పరోఽధర్మ ఇతి హెూవాచ భూరియమ్ ।
సర్వం వోఢుమలం మన్యే ఋతేఽలీక పరం నరమ్॥4॥

టీ :- సచేతి. కథం తత్ప్రత్యాచక్షే నిరాకరోమి. ॥3,4॥

అసత్యము కన్న మించిన అధర్మము లేదని శాస్త్రములు ఘోషించుచున్నవి. అందువలననే ఈ భూదేవి ఇట్లు చెప్పినది. అసత్యములు పలుకు నరుని తప్ప సమస్తమును భరించుట సాధ్యమని తలతునన్నది. 4

శ్లో॥ నాహం బిభేమి నిరయాన్నాధన్యా దసుభార్ణవాత్ ।
న స్థాన చ్యవనాన్మృత్యో ర్యథా విప్ర ప్రలంభనాత్॥5॥

దానమివ్వనని నిరాకరించుటలో దోషము లేదనిన విషయమును చెప్పుచున్నాడు. నేను నాశనమైనను, దారిద్ర్యముతో కష్టాల కడలిని పొందినను,

టీ :- నన్వప్రత్యాఖ్యానే దోషా ఉక్తాః తత్రాహ నాహమితి. అధన్యాత్ దారిద్ర్యాత్.మృత్యోరపి. ॥5॥

నా చక్రవర్తి పదవి పోయినను, మృత్యువాత పడినను భయపడను. కానీ బ్రాహ్మణుని వంచించుటకు మాత్రము భయపడుదును. 5

శ్లో॥ యద్యద్హాస్యతి లోకేస్మిన్సంపరేతం ధనాదికమ్ ।
తస్యత్యాగే నిమిత్తం కిం విప్రస్తుష్యేన్నతే న చేత్ ॥6॥

టీ :- యద్యదితి.కించ. యద్యద్ధరాదికం. తత్సర్వం సంపరేతం మృతం పురుషం హాస్యతిత్యక్ష్యత్యేవ ఏతత్కిమితి జీవతైవ స్వయం నదేయమితి భావః. తథాపి. తావద్వృత్తిసంకటపరిహారార్థం. అర్థః దేయ ఇతి చేత్తత్రాహ. తస్యేతి. విప్రశ్చేత్తేనార్థేన దత్తేనాపి న తుష్యేత్. తర్హి తస్యార్థస్య త్యాగే దానే. కింనిమిత్తం న కించిత్. యాచితాదల్పస్య దానే విప్రస్యాసంతోషేణ దానం వ్యర్థమేవస్యాత్. అతస్తద్యాచితం సర్వం దేయం న కించితితి భావః పాఠాంతరే యద్యద్హాస్యతి తస్య అత్యాగే కిం నిమిత్తం. తేనచేద్విప్రస్తుష్యతీత్యర్థః. ॥6॥

మానవునికి ఎంతసంపద ఉన్నను అదంతయు మరణించిన వ్యక్తిని విడిచి పెట్టును. అతని వెంట వెళ్ళదని భావము. మరణముతోనే విడుచును గానీ బ్రదికియుండగా స్వయముగా దానము చేయలేదని భావము. ఐనప్పటికీ బ్రతుకుదెరువునకు లోపము లేకుండా సగము ఇవ్వవచ్చుకదా! అను విషయమును చెప్పుచున్నాడు. బ్రాహ్మణుడు కూడా అంగీకరించిన దానిలో సగము మాత్రమే దానము చేసినచో తృప్తి చెందనిచో ఆ అర్థమును త్యాగము చేయుటకు కారణమేమియు లేదు. అడిగిన దానికంటే తక్కువ దానము చేయుటలో బ్రాహ్మణుని అసంతృప్తి వలన దానము నిరర్థకమే యగును. అందువలన ఆయన కోరిక మేరకు అడిగినదంతయు ఇవ్వవలెను. కొంచెము కాదు అని భావము. 6

శ్లో॥ శ్రేయః కుర్వంతి భూతానాం సాధవో దుస్త్యజానుభిః ।
దధ్యఙ్ శిబి ప్రభృతయః కోవికల్పో ధరాదిషు ॥7॥

ఒకవేళ దానవే చేయకూడదన్నట్లైతే అనే విషయమును చెప్పుచున్నాడు. సత్పురుషులు విడిచిపెట్టుటకు వీలులేని ప్రాణములు సైతము (తానుండుటకు మూలమైన వాటిని) ధారవోసి జీవులకు సుఖమును కలిగించు చున్నారు. దధీచి, శిబి మొదలైన చక్రవర్తులు శరీరమును కోసి దానము

టీ :- నను విప్రో యది న తుష్యేత్తర్హి న దేయమేవేతి చేత్తత్రాహ శ్రేయ ఇతి.దుస్త్యజైరసుభిరపి కో వికల్పః విచారః. ॥7॥

చేసినారు. అందువలన ప్రాణహాని కలిగించకుండా కేవలము వ్యామోహమును కలిగించు భూమి విషయమై వేరే త్రోవలు వెదుకుట ఎందుకు? 7

శ్లో॥ యైరియం బుభుజే యుద్ధే దైత్రేంద్రైరనివర్తిభిః ।
తేషాం కాలోఽ గ్రసీల్లోకాన్న యశోఽ ధిగతాం భువి ॥8॥

టీ:- యైరితి. యైర్దైత్యేంద్రైర్యుద్ధే అనివర్తిభిః. ఇయం భూర్బుభుజే ఉపభుక్తా తేషామిహలోకా ‾ పరలోకాంశ్చ. భోగానితి వా. కాలః అగ్రసీత్. సంహృతవాన్. న తు భువి తైరధిగతం ప్రాప్తం యశః అగ్రసీత్. అతః కీర్తిరేవ సాధ్యా నాన్యదితి భావః.॥8॥

యుద్ధము నందు ఎదురులేని (ఓటమి ఎఱుగని) రాక్షస యోధులెందరో ఈ భూమిని పాలించినారు. వారు ఇహ లోకమున, పరలోకమున భోగములనుభవించినారు. వారందరు కాలగర్భమున కలిసినారు. వారున్నప్పుడు భూమిపై పొందిన కీర్తి మాత్రము నశించక మిగిలే వున్నది. అందువలన కీర్తిని పొందవలెను. ఇతరములను కాదు అని భావము. 8

శ్లో॥ సులభా యుధి విప్రర్షే హ్యనివృత్తాస్తనుత్యజః ।
నతథా తీర్థ ఆయాతే శ్రద్ధయా యే ధనత్యజః ॥9॥

టీ :- దేహత్యాగాదపి ధనత్యాగే కీర్తిర్భవతీత్యాహ సులభా ఇతి. తనుం త్యజంతీతి తథా. తీర్థే పాత్రే అతోఽ తిదుష్కరో ధనత్యాగ ఏవమయా కార్య ఇతి భావః. ॥9॥

శరీరమును త్యాగమును చేయుటకంటే ధన త్యాగమునకే కీర్తి ఎక్కువ అని చెప్పుచున్నాడు. ఓ బ్రాహ్మణోత్తమా! (ఇది శుక్రాచార్యునుద్దేశించిన సంబోధన) యుద్ధరంగమున వెనుదిరుగక సాహసముతో పోరాడి వీరమరణమును పొందిన వీరులు పలువురున్నారు. కాని పాత్రుడైన వ్యక్తి యాచకుడై వచ్చినప్పుడు అడిగిన దానముతో ధన త్యాగము చేయువారు లభించరు. మిక్కిలి దుష్కరమైన అట్టి ధన త్యాగమును చేయుచున్నానని భావము. 9

శ్లో॥ మనస్వినః కారుణి కస్యశోభనం
యదర్థి కామోప నయేన దుర్గతిః ।
కుతః పునర్బ్రహ్మ విదాం భవాదృశాం
తతో వటోరస్య దదామి వాంఛితమ్ ॥10॥

టీ :- తర్హి నిర్ధనత్వేన దైన్యం స్యాదితి చేత్తత్రాహ. మనస్విన ఇతి. యాదృశానామప్యర్థినాం. కామోపనయేన కామపూరణేన. దుర్గతిః దైన్యమితి యత్ తచ్ఛోభనం భద్రమేవ. భవాదృశానాం తు కామోపనయేన దుర్గతిః. శోభనమితి కిం పునర్వక్తవ్యమితి భావః ॥10॥

ఒకవేళ ఉన్నదంతయు దానము చేసి దారిద్ర్యమును పొందినచో దైన్యమును అనుభవించవలయును కదా ! అను దానికి చెప్పుచున్నాడు. యాచకులయొక్క కోరికలను తీర్చినందున దుర్గతి కలిగినను దయాళువైన ఉత్తమునికి మంచిదే. అట్టి యెడల మీవంటి బ్రహ్మవేత్తల కోరికలను తీర్చుటలో ఎట్టి స్థితి కలిగినను అది ఎంతటి శుభదాయకమో? అందువలన ఈ బ్రాహ్మణ వటుని కోరికను తప్పక తీర్చెదను. 10

శ్లో॥ యజంతి యజ్ఞ క్రతుభిర్యమాదృతా
భవంత ఆమ్నాయ విధాన కోవిదాః ।
స ఏవ విష్ణుర్వరదోఽస్తువాపరో
దాస్యామ్యముష్మై క్షితి మీప్సితాం మునే ॥11॥

ఇతడు వటుడు కాడు. నీ శత్రువైన విష్ణువని మీరు చెప్పితిరి. అట్లైనచో మొత్తము దానము చేయుదునని చెప్పుచున్నాడు. ఓ గురుదేవా ! వేదశాస్త్రవిధులను నిర్వహించుటలో మీరు మిక్కిలి శ్రద్ధతో యజ్ఞములు ( సోమపానము లేనిది ), క్రతువులు ( సోమపాన సహితములు ) మొదలైనవి పరమాత్ముని తృప్తికై చేయుచున్నారు. అట్టి యజ్ఞములకు ఫలదాత, వరదుడైన శ్రీహరి శత్రువే కావచ్చును. అయినప్పటికీ ఆయన స్వయముగా వచ్చి అర్థించునప్పుడు ఆయన కోరిన దానమును ( మూడడుగుల నేలను) చేయుచున్నాను. 11

శ్లో॥ యదప్యసావ ధర్మేణ మాం బధ్నీ యాదనాగసమ్ ।
తథాప్యేనం న హింసిష్యే ధృత బ్రహ్మతనుం రిపుమ్॥12॥

ఒకవేళ శ్రీహరి పాడితప్పి ఎట్టి పాపమును చేయని నన్ను బంధించినను నేను మాత్రము బ్రాహ్మణరూపమును ధరించిన పిరికి వాడైన ఈ శత్రువునకు ఎట్టి అపకారము కలిగించను. 12

టీ :- నను నాయం పటుః కింతు. విష్ణుస్తవ శత్రురిత్యుక్తం. తర్హి నుంతరావేవ దాస్యామీత్యాహ యంజంతీతి. పరశ్శత్రుర్వాస్తు.॥11,12॥

శ్లో॥ ఏషవా ఉత్తమ శ్లోకో న జిహాసతి యద్యశః ।
హత్వా మైనాం హరుద్యుద్ధే శయీత నిహతో మయా॥13॥

ఇతడు పరమాత్ముడైన విష్ణువే ఐనచో తన కీర్తిని వదలడు. అనగా తను తలపెట్టిన కార్యమును విడువడు. యుద్ధరంగమున నన్ను చంపియైనను ఈ భూమి హరించగలడు. ఒకవేళ ఇతడు విష్ణువు కాక అన్యుడైనచో నా చేత దెబ్బతిని నిదురించును. చక్కగా తెలిసినవాడై నా హృదయమున నిదురించునని వాస్తవార్థము. 13

టీ :- ఏష ఇతి.యది యశో న జిహాసతి. తర్హి యుద్ధే మాం హత్వా. ఏనాం భూమిం హరేత్. శయీత వా. సమ్యక్ జ్ఞాతస్సన్ మమ చిత్తే శయీతేతి వాస్తవో౽ర్థః. ॥13॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవమశ్రద్ధితం శిష్యమనాదేశకరం గురుః ।
శశాప దైవ ప్రహితః సత్యసంధం మనస్వినమ్ ॥14॥

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

ఈ విధముగా శ్రద్ధలేక తన మాటను లెక్కపెట్టనందున సత్యవాక్పరిపాలకుడు, మంచివాడైన శిష్యుడగు బలిచక్రవర్తిని గురువు శుక్రాచార్యుడు దైవ ప్రేరితుడై శపించినాడు. 14

శ్లో॥ దృఢం పండిత మాన్యజ్ఞః స్తబ్ధోస్యన్మదుపేక్షయా ।
మచ్ఛాసనాతిగోయస్త్వమచిరాద్భ్రశ్యసే శ్రియః ॥15॥

అజ్ఞానముతో ఏమీ తెలియకున్నను అన్ని శాస్త్రవిషయములు తెలిసినవాని వలె అతిగా నిక్కుచున్నవాడవైతివి. నన్ను నిర్లక్ష్యముచేసి నేను చెప్పినమాటవినని నీవు అనతికాలముననే నీ సర్వసంపదలకు దూరమగుదువు గాక. అని శపించినాడు. 15

శ్లో॥ ఏవం శప్తః స్వగురుణా సత్యాన్న చలితో మహాన్ ।
వామనాయ దదావేన మర్చిత్వోదక పూర్వకమ్ ॥16॥

టీ :- ఏవమితి. అశ్రద్ధితం అజ్ఞాతశ్రద్ధం ॥14-16॥

ఈ విధముగా కులగురువైన శుక్రునితో శాపము పొందికూడా మిగుల గొప్పవాడైన బలి ఏవిధమైన వికారమును పొందక, సత్యమును వీడక వామనుని అర్ఘ్యపాద్యాది షోడశోపచారములు చేసి మూడడుగుల నేలను ఆయనకు దానము చేసినాడు. 16

శ్లో॥ వింధ్యావలి స్తదాగత్య పత్నీజాలక మాలినీ ।
ఆనిన్యే కలశం హైమ మవనే జన్యపాంభృతమ్॥17॥

అప్పుడు బలిచక్రవర్తి భార్య వింధ్యావళి వల వలె నుండు నెత్తిపై ధరించబడు పూల వఱుసల మాల ధరించి వచ్చి వటుని పాదములు కడుగుటకై జలముతో నిండిన బంగారు ఘటమును తెచ్చినది. 17

శ్లో॥ యజమానః స్వయంతస్య శ్రీమత్పాదయుగం ముదా ।
అవని జ్యావహన్మూర్ధ్ని తదపో విశ్వ పావనీః ॥18॥

యజమానుడైన బలిచక్రవర్తి స్వయముగా మంగళకరమైన వామన వటువు పాదములను మిగుల నానందముతో కడిగి సర్వలోకములను పవిత్రము చేయునట్టి ఆ పాదజలమును అపారమైన భక్తితో తన శిరసున చల్లుకున్నాడు. 18

శ్లో॥ తదాఽసురేంద్రం దివిదేవతా గణా
గంధర్వ విద్యాధర సిద్ధచారణాః ।
తత్కర్మ సర్వేఽపి గృణంత ఆర్జవం
ప్రసూన వర్షైర్వవృషుర్ముదాన్వితాః ॥19॥

అప్పుడు ఆ రాక్షసనాథుని అద్భుతమైన ధైర్యము, త్యాగనిరతులకు అపారమైన ఆనందమును పొంది బలిచక్రవర్తి చేసిన గొప్పదానమును స్తుతించుచు అతని నిష్కల్మషతను మెచ్చుకొనుచు ఆకాశమునుండి దేవతా సముదాయము, గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు పుష్పవర్షమును కుతిపించిరి. 19

శ్లో॥ నేదుర్ముహుర్దుందుభయః సహస్రశో
గంధర్వ కింపురుష కిన్నరాజగుః ।
మనస్వినాఽనేన కృతం సు దుష్కరం
విద్వానదాద్య ద్రిపవే జగత్త్రయమ్ ॥20॥

వేలకొలది దేవదుందుభులు మ్రోగినవి. గంధర్వులు, కింపురుషులు, కిన్నరులు మంచిమనసు గల ఈ బలిచక్రవర్తి గొప్ప అసాధ్యమైన కార్యమును చేసినాడు. ఈ విజ్ఞానవేత్త శత్రువైన ( సర్వనాశకుడైన ) విష్ణువునకు ముల్లోకములు దానమిచ్చినాడని అతని కీర్తిని గానము చేసినారు. 20

టీ :- వింధ్యావళిరితి. జాలకం ముకాభరణవిశేషః తన్మాలావతీ. అవనేజనీనామపాం. కలశం పూర్ణం. ॥17-20॥

శ్లో॥ తద్వామనం రూప మవర్ధతాద్భుతం
హరేరనంతస్య గుణత్రయాత్మకమ్ ।
భూః ఖం దిశో ద్యౌర్వివరాః పయోధయః
తిర్యఙ్నృ దేవా ఋషయో యదాసత ॥21॥

అప్పుడు వామనుని రూపము అద్భుతముగా వృద్ధిపొందినది. విశ్వరూపుడు, అనంతుడైన శ్రీహరి యొక్క సత్త్వరజస్తమో గుణములతో కూడిన ( పొట్టి ) వామన రూపమున భూమి, దిక్కులు, ఆకాశము, సముద్రములు, గుహలు, పశుపక్ష్యాదులు, నరులు, దేవతలు, ఋషులు మొదలైన సమస్తము అందే వున్నవి. “ వాంఛాతః ప్రతి గృహ్యతామ్ ” కోరినంత

టీ:-తదితి. అవర్ధత. శ్లో."యద్యద్వటో వాంఛసి తత్ప్రతీచ్ఛ మే"తి. బలినా పూర్వముక్తత్వాత్. గుణత్రయమాత్మని యస్య తత్. అతఏవ భూః ఖమిత్యాదయో యద్యస్మిన్. ఆసత స్థితవంతః ॥21॥

శ్లో॥ కాయే బలిస్తస్య మహా విభూతేః
సహర్త్విగాచార్య సదస్య ఏతత్ ।
దదర్శ విశ్వం త్రిగుణం గుణాత్మకే
భూతేంద్రియార్థాశయ జీవ యుక్తమ్ ॥22॥

టీ :- కాయ ఇతి. ఋత్విగాదిసహితో బలిః. తస్య హరేః కాయే. ఏతద్విశ్వం దదర్శ. ॥22॥

శ్లో॥ రసామ చష్టాంఘ్రి తలేఽథ పాదయోః
మహీం మహీధ్రాన్పురుషస్య జంఘయోః ।
పతత్రిణో జానుని విశ్వమూర్తేః
ఊర్వోర్గణం మారుత మింద్రసేనః ॥23॥

టీ :- తదేవ ప్రపంచయతి రసామిత్యాదిపాదోనైస్సప్తభిః రసామితి. మారుతం గణం వాయుసంఘం. ఇంద్రస్య సేనేవ సేనా యస్యసః ఇంద్రపదేస్థితత్వాత్. ॥23॥

స్వీకరించుమని ముందే చెప్పినందున వామనుడు త్రివిక్రముడై విజృంభించినాడు. 21

బలిచక్రవర్తి సత్వాది గుణములతో అంతటా వ్యాపించిన విష్ణుమూర్తి బృహత్ శరీరమున త్రిగుణాత్మకమైన పంచభూతములు, శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధములనెడు ఇంద్రియార్థములు, మనస్సు, అంతఃకరణ చతుష్టయములతో కూడిన, తను చేయు యాగము నందున్న యాజకులు, ఆచార్యులు, సభాపదులతో కూడినవాడై ఈ సమస్త విశ్వమును దర్శించినాడు. 22

ఈ విశ్వరూపమునే వివరించుచున్నాడు. విశ్వరూపుడైన విష్ణువునకు దిగువ నున్న రసాతలాది ఏడులోకములు పాదతలము. భూమి పాదయుగళము. కులపర్వతములు కాలి పిక్కలు, పక్షి సముదాయములు మోకాళ్ళు , వాయు సంఘములు తొడలు, ఈ విధముగా ఉన్న త్రివిక్రముని ఇంద్రసేనుడు- బలిచక్రవర్తి ( తానప్పుడు ఇంద్ర పదవిలో ఉన్నందున ఇంద్రుని సైన్యమువంటి సేనగలవాడు) చూచినాడు. 23

శ్లో॥ సంధ్యాం విభోర్వాససి గుహ్య ఐక్షత్
ప్రజాపతీన్ జఘనే ఆత్మ ముఖ్యాన్ ।
నాభ్యాం నభః కుక్షిషు సప్త సింధూన్
ఉరుక్రమస్యోరసి చర్క్షమాలామ్ ॥24॥

టీ:–సంధ్యామితి. ఐక్షత్ ఐక్షత ఆత్మా స్వయం బలిర్ముఖ్యోయేషాం తా అసురాన్. ఋక్షమాలాం నక్షత్రపఙ్క్తిం ॥24॥

క్రమ క్రమముగా విజృంభించు త్రివిక్రముని రూపమునందు సంధ్యాకాలమును వస్త్రముగా, ప్రజాపతులను మర్మావయవముగా, స్వయముగా తనవంటి రాక్షసులను పిఱుదులుగా, ఆకాశమును బొడ్డుగా, సప్తసముద్రములను కడుపుగా, నక్షత్రమాలను వక్షస్థలముగా బలిచక్రవర్తి దర్శించినాడు. 24

శ్లో॥ హృత్యంగధర్మం స్తనయోర్మురారేః
ఋతంచ సత్యంచ మనస్యథేందుమ్ ।
శ్రియం చ వక్షస్యరవిందహస్తాం
కంఠేచ సామాని సమస్త రేఫాన్ ॥25॥

టీ:– హృదీతి. అంగ హే రాజ్ సమస్తాన్ వేదాన్ శబ్దాన్.॥25॥

ఓ రాజా ! విష్ణువునకు ధర్మము హృదయముగా, ఋతము, సత్యము స్తనములుగా, చంద్రుడు మనస్సుగా, ఱొమ్మున పద్మపాణియైన లక్ష్మిని, కంఠమున సామములు, రేఫము చేత లక్షితమైన అకారాది సర్వ వర్ణమయములైన శబ్దములను దర్శించినాడు. 25

శ్లో॥ ఇంద్ర ప్రధానా నమరాన్ భుజేషు
తత్కర్ణయోః కకుభో ద్యౌశ్చ మూర్ధ్ని ।
కేశేషు మేఘాన్ శ్వసనం నాసికాయాం
అక్ష్ణోశ్చ సూర్యం వదనేచ వహ్నిమ్ ॥26॥

టీ :– ఇంద్రేతి. ద్యౌశ్చ ద్యాం చ. ॥26॥

విశ్వరూపుని భుజములందు ఇంద్రుడు మొదలుగాగల దేవతలను, చెవులందు దిక్కులను, శిరస్సున అంతరిక్షమును, వెండ్రుకలందు మేఘములను, ముక్కు రంధ్రములందు వాయువును, కన్నులందు సూర్యుని, నోటియందు అగ్నిని బలి దర్శించినాడు. 26

శ్లో॥ వాణ్యాం చ ఛందాంసి రసే జలేశం
భ్రువోర్నిషేధం చ విధించ పక్ష్మసు ।
అహశ్చ రాత్రించ పరస్య పుంసో
మన్యుం లలాటేధర ఏవ లోభమ్ ॥27॥

టీ :- వాణ్యామితి. రసే రసనే. ॥27॥

ఆ త్రివిక్రముని రూపమున వాక్కులందు సమస్త ఛందముల సముదాయము, నాలుకయందు వరుణుడు, కనుబొమల జంటలో విధి, నిషేధములు, రెప్పలందు రాత్రింబగళ్ళు, (రెప్పలు మూసినచో రాత్రి, తెరిచినచో పగలు) , ఫాలభాగమున కోపము, పెదవియందు లోభము (లను బలి దర్శించినాడని తర్వాతి శ్లోకమున అన్వయము). 27

శ్లో॥ స్పర్శే చ కామం నృప ! రేతసోంభః
పృష్ఠే త్వ ధర్మం క్రమణేషు యజ్ఞమ్ ।
ఛాయా సు మృత్యుం హసితే చ మాయాం
తనూరుహేష్వోషధి జాతయశ్చ ॥28॥

టీ :- స్పర్శఇతి. రేతసారేతసి క్రమేషు పాదన్యాసేషు ఓషది జాతయః ఓషధిజాతీశ్చ. ॥28॥

ఓ రాజా ! త్రివిక్రముని రూపమున స్పర్శయందు కామము, రేతస్సునందు జలము, వీపున అధర్మము, అడుగులందు యజ్ఞము, నీడలందు మృత్యువు, నవ్వులందు సర్వమాయా విలాసములు, రోమములందు సమస్త ఓషధీ సముదాయము ( లను బలి దర్శించినాడు ). 28

శ్లో॥ నదీశ్చ నాడీషు శిలా నఖేషు
బుద్ధా వజం దేవ గణానృషీంశ్చ ।
ప్రాణేషు గాత్రే స్థిర జంగమాని
సర్వాణి భూతాని దదర్శ వీరః ॥29॥

టీ :- నదీరితి. ప్రాణేషు ఇంద్రియేషు. ॥29॥

త్రివిక్రముని శరీరమున నాడీ సముదాయమునందు నదులు, గోర్లందు రాళ్ళు , బుద్ధియందు బ్రహ్మదేవుడు, ప్రాణములందు దేవతలు, ఋషులు, శరీరమున స్థావర జంగమాదులైన సమస్తజీవరాశులను బలి చూచినాడు. 29

శ్లో॥ సర్వాత్మ నీదం భువనం నిరీక్ష్య
సర్వేసురాః కశ్మల మాపురంగ ।
సుదర్శనం చక్రమసహ్య తేజో
ధనుశ్చ శార్ఙ్గం స్తనయిత్ను ఘోషమ్ ॥30॥

ఓ రాజా ! సర్వాంతర్యామియందు ఈ సర్వజగత్తును దర్శించి సర్వ రాక్షసులు బాధను పొందిరి. భరించరాని పరాక్రమముగల సుదర్శన చక్రము, మేఘగర్జనవంటి వింటినారి మ్రోత గలిగిన శార్ఙ్గమనే విల్లుతో ( విష్ణువు ప్రకాశించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము ). 30

టీ :- సర్వేతి. సర్వాత్మనీత్యాదివాక్యాంతరం. ॥30॥

శ్లో॥ పర్జన్య ఘోషో జలజః పాంచజన్యః
కౌమోదకీ విష్ణు గదా తరస్వినీ ।
విద్యాధరోఽసిః శతచంద్ర యుక్తః
తూణోత్తమా వక్షయ సాయకౌ చ ॥31॥

ఉఱుము వంటి ధ్వని కలిగిన శంఖము పాంచజన్యము, బలము, వేగముగల గద కౌమోదకీ, విద్యాధరమను పేరుతోనున్నది కానీ, సకల విద్యలకు ఆధారమైనది కాని ఐన నూరు చంద్రుల కాంతితో ప్రకాశించు ఖడ్గము నందకము, అక్షయ బాణములతో విరాజిల్లు శ్రేష్ఠమైన తూణీర యుగళముతో (విష్ణువు ప్రకాశించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము). 31

టీ :- సుదర్శనమితి. సుదర్శనమిత్యాదీనాం ఈశ్వరముపతస్థురిత్యుత్తరే ణాన్వయః. ॥31॥

శ్లో॥ సునందముఖ్యా ఉపతస్థురీశం
పార్షద ముఖ్యా సహలోక పాలాః ।
స్ఫురత్కిరీటాంగద మీన కుండల
శ్రీవత్స రత్నోత్తమ మేఖలాంబరైః ॥32॥

సునంద, నంద, జయ, విజయులు మొదలైన పరిచరులు, సర్వలోకపాలకులతో పరివృతుడై ప్రకాశించు కిరీటము, భుజ కీర్తులు, మీన కుండలములు, శ్రీవత్స రత్నము, మణిమేఖలము, పీతాంబరములతో కూడినవాడై (ప్రకాశించినాడని తర్వాతి శ్లోకముతో అన్వయము). 32

టీ :- విధ్యాధర ఇతి. విధ్యాధరసంజ్ఞోఽసిః శతచంద్రం వర్మ తేన యుక్తః సునందముఖ్యాః సునందాదయశ్చ తేవ పార్షదముఖ్యాః. ॥32॥

శ్లో॥ మధువ్రత స్రగ్వన మాలయా వృతో
రరాజ రాజన్ ! భగవానురుక్రమః ।
క్షితిం పదైకేన బలేర్విచక్రమే
నభః శరీరేణ దిశశ్చ బాహుభిః ॥33॥

తుమ్మెదలు మూగిన దండమాలతో కూడినవాడై భగవంతుడైన ఉరుక్రముడు ప్రకాశించువాడు. బలిచక్రవర్తి అధీనమున భూమిని ( సమస్త భూమండలమును) ఒక పాదముచేత, శరీరముతో ఆకాశమును, భుజములతో దిక్కులను త్రివిక్రముడు ఆక్రమించినాడు. ( మూడడుగుల నేలను మాత్రమే గ్రహించవలసి యుండగా భుజములు మొదలైన శరీరావయవములతో ఆకాశము మొదలైనవి ఆక్రమించుట అన్యాయము కాదు. ఒకరికి భూమిని దానము చేసినారనగా ఆ భూమి పైభాగము కూడా గ్రహింపదగును. ఆకాశము మొదలైనవి కూడా రెండు పాదములందే అంతర్భూతమైనందున పాదద్వయము చేతనే వ్యాప్తమైనదని భావము ). 33

టీ :- స్ఫురదితి. మీనకుండలే మకరకుండలేస్ఫురంతి కిరీటాదీని యస్య సః మధువ్రతానాం స్రజో యస్యాం. తయా వరమాలయా శ్రీవత్సా దిభిశ్చావృతో వ్యాప్తః. ॥33॥

శ్లో॥ పదం ద్వితీయం క్రవత స్త్రివిష్టపం
నవై తృతీయాయ తదీయ మణ్వపి ।
ఉరుక్రమస్యాంఘ్రి రుపర్యుపర్యథో
మహర్జనాభ్యాం తపసః పరంగతః ॥34॥

త్రివిక్రముని రెండవ పాదము క్రమముగా సాగి స్వర్గమును ఇంకను పైపైకి వెళ్ళి మహర్లోకము, జనోలోకమును మీరి, తపోలోకమునుదాటి సత్యలోకము వరకు వ్యాపించినది. అందువలన బలిచక్రవర్తికి మూడవ పాదమునకు స్థానమును చూపించుటకు అతనిదైనది అణువు కూడా లేకపోయినది. 34

టీ :- ఉరుక్రమత్వమేవాహ క్షితిమితి. ద్వితీయం పదం క్రమతో విక్షి పతస్త్రివిష్టపం తదీయం కించిన్మాత్రం జాతం. తృతీయాయ తు నన కించిదపి తత్ర హేతుః. ఉరుక్ర మస్యాంఘ్రిః త్రివిష్టాపాదుపర్యుపరి గచ్ఛ్.మహర్జనాభ్యాం తపసశ్చ పరం గతః. సత్యలోకం గత ఇతి. ॥34॥

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే విశ్వరూప దర్శనం నామ వింశతి తమోఽధ్యాయః**

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే విశ్వరూప దర్శనమను వింశతితమాధ్యాయము ఆంధ్రానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ ఏకవింశే పదాపూర్తి మిషేణ బలి బంధనమ్ ।
విష్ణునా కర్తు ముత్కర్షం తస్య స్థాపయితుం జనే॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ సత్యం సమీక్ష్యాబ్జభవో నఖేందుభిః
హత స్వధామ ద్యుతి రావృతోఽభ్యగాత్ ।
మరీచి మిశ్రా ఋషయో బృహద్వ్రతాః
సనందనాద్యా నరదేవ యోగినః ॥1॥

టీ :- "ఏకవింశే పదాపూర్తి మిషేణ బలి బంధనమ్,విష్ణునా కర్తు ముత్కర్షం తస్య స్థాపయితుం జనే" ఉరుక్రమస్యాంఘ్రిః తపసః పరం గత ఇత్యుక్తం. తతః కిం వృత్తం తదాహ సత్యమితి. సత్యం సత్యలోకం. ప్రాప్తం తమంఘ్రిం సమీక్ష్యామ్మబ్జభవోఽభ్యగాత్. తదా మరీచిమిశ్రాః ఋషయశ్చేతి. ద్వయోరన్వయః. కథంభూతోఽబ్జభవః హరేంఘ్రేర్నఖాఏవేందవః. తైర్హతాస్వధామ్నోద్యుతిర్యస్య తం తస్య

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

ఇరువది ఒకటవ అధ్యాయమున మూడవ పాదము పూర్తి కానందున బలిని బంధించుటకు విష్ణువు ప్రయత్నించుట, అతని తీవ్రతను ఆపుటకు జనులు ప్రయత్నించుటలు విషయము.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! హరి పాదము సత్యలోకమునకన్న పైకి వెళ్ళినదని ఇంతకుముందు చెప్పిన విషయమునకు ఆ తర్వాత జరిగిన విషయమును చెప్పుచున్నాడు. సత్యలోకమును చేరిన ఆ పాదమును బ్రహ్మదేవుడు చూచి సమీపించినాడు. గొప్ప నియమములు కలిగిన మరీచాది మహర్షులును, సనందనాది యోగులును వచ్చిరని రెంటికి అన్వయము. ('అభ్యగుః ' అనుటకు బదులుగా ' అభ్యగాత్ ' అని ప్రయోగింపబడినది) శ్రీహరి నఖములు అనే చంద్రకాంతితో తిరస్కృతమైన తేజస్సు కలవాడైనాడు బ్రహ్మ. ఆ నఖ కాంతులలో ఆవరింపబడి దాగినాడు. 1

లోకం స్వయం చ తైరావృతః ఛన్నః. హే నరదేవ. బృహద్వ్రతాః యోగినశ్చ.॥1॥

శ్లో॥ వేదోపవేదా నియమాన్వితా యమాః
తర్కేతిహాసాంగ పురాణ సంహితాః ।
యేచాపరే యోగ సమీర దీపిత
జ్ఞానాగ్నినా రంధిత కర్మ కల్మషాః ॥2॥

టీ :- వేదేతి. అంగాని శిక్షాదీని. పురాణాని. తత్సంహితాశ్చ యోగఏవ సమీరః. తేన దీపితం జ్ఞానమేవాగ్నిస్తేన రంధితం దగ్ధం కర్మకల్మషం కర్మమలం యేషాం తే. ॥2॥

వేదములు, ఉపవేదములు, యమ, నియమాదులు, తర్కము, ఇతిహాసములు, వ్యాకరణము, శిక్ష, నిరుక్తాది వేదాంగములు, శాస్త్రములు, పురాణములు, సంహితలు ఇంకా యోగములనే వాయువు చేత అతిశయించిన అగ్నిచేత నాశనమైన పాప కర్మలుగల వారైన యోగులకే ( సత్యలోకము వరకు వ్యాపించిన ఆ పరమాత్ముని పాద దర్శనము కలుగును) 2

శ్లో॥ వవందిరే యత్స్మరణాను భావతః
స్వాయంభువం ధామ గతా అకర్మకమ్ ।
అథాంగ్రయే ప్రోన్నమితాయ విష్ణోః
ఉపాహరత్పద్మ భవో2ర్హణోదకమ్ ।
సమర్చ్య భక్త్యాభ్యగృణాచ్ఛు చిశ్రవా
యన్నాభి పంకేరుహ సంభవస్వయమ్ ॥3॥

పరమాత్మ పాదపద్మము యొక్క స్మరణానుభావము చేత సత్యలోకమున ఉండినవారందరు అప్రయత్నముగా లభించిన యజ్ఞయాగాది కర్మలచేత పొందలేని, సాధనత్వముచేత నీచకర్మ ఫలము లేని అనగా నిష్కల్మషులైన వారందరు లభించిన పాదమునకు నమస్కరించిరి. స్వయముగా తను జన్మించిన పద్మము నాభియందుగల శ్రీమహావిష్ణువు యొక్క పైకిలేచిన పాదమును కడుగుటకై బ్రహ్మదేవుడు నిర్మలోదకమును తెచ్చి పూజించి స్తుతించ సాగినాడు. 3

టీ :- వవందిర ఇతి. తే సర్వే తమంఘ్రిం వవంతిరే యస్యాంఘ్రేః స్మరణానుభావతః అకర్మకం కర్మభిర ప్రాప్యం. విష్ణోరంఘ్రేయే.॥3॥

శ్లో॥ ధాతుః కమండలు జలం తదురుక్రమస్య
పాదావనేజన పవిత్రతయా నరేంద్ర ! ।
స్వర్ధున్య భూన్నభసి సా పతతీ నిర్మార్ష్టి
లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః ॥4॥

ఓ రాజా ! బ్రహ్మ కమండలు జలముతో శ్రీహరి పాదమును కడుగగా ఆ పాదపద్మ పావిత్ర్యముతో ఆ జలము ఆకాశగంగ అయినది. ఆకసమునుండి పరమాత్ముని నిర్మలమైన కీర్తివలె క్రిందకు భూమిపై పడుతూ ముల్లోకములను పవిత్రముగా చేయుచున్నది. 4

టీ :- సమర్చ్యేతి. స్వయం యస్య నాభిపంకేరుహసంభవః. తస్య విష్ణోరంఘ్రిం సమ్యభ్యర్చ్య. ॥4॥

శ్లో॥ బ్రహ్మాదయో లోకనాథాః స్వనాథాయ సమాదృతాః ।
సానుగా బలి మాజహ్రుః సంక్షిప్తాత్మ విభూతయే ॥5॥

తమ ప్రభువైన పరాత్పరుని పట్ల అపారమైన ఆదరభావము కలిగిన బ్రహ్మాది లోకపాలకులు తమతమ అనుచరులతో కూడి త్రివిక్రమ రూపమును ఉపసంహరించిన శ్రీమహావిష్ణువును అర్చించినారు. 5

టీ :- ధాతురితి. లోకత్రయం. నిర్మమార్ష్టి పవిత్రయతి. ॥5॥

శ్లో॥ తోయైః సమర్హణైః స్రగ్భిర్దివ్య గంధానులేపనైః ।
ధూపైర్దీపైః సురభి భిర్లాజాక్షత ఫలాంకురైః ॥6॥

(స్నానాదికములకు తగిన) జలము, పూలమాలలు, సువాసనా భరితమైన గంధము మొదలైన లేపనములు, సుగంధ ద్రవ్యముల పరిమళములు

వెదజల్లు ధూపములు, పేలాలు, అక్షతలు, ఫలములు, గరిక మొదలైన చిగురులు గాగల పూజాద్రవ్యములతో (అర్చించినారని ముందరి శ్లోకముతో అన్వయము)6

శ్లో॥ స్తవనైర్జయ శబ్దైశ్చ తద్వీర్య మహిమాంకితైః ।
నృత్యవాదిత్ర గీతైశ్చ శంఖదుందుభి నిస్వనైః ॥7॥

పరమాత్ముని పరాక్రమ విశేషములను కీర్తించే జయ శబ్దముతో కూడిన స్తోత్రములు, నాట్యములు, మంగళవాద్యములు, కీర్తనలు, శంఖములు, భేరులు మొదలైన వాని మ్రోతలతో (అర్చించిరి ) 7

శ్లో॥ జాంబవానృక్షరాజస్తు భేరీ శబ్దైర్మనోజవః ।
విజయం దిక్షు సర్వాసు మహోత్సవ మఘోషయత్॥8॥

భల్లూకనాథుడైన జాంబవంతుడు మనోవేగము కలవాడై దుందుభి మ్రోతలతో ఎల్లదిశలందు శ్రీహరి విజయమహోత్సవమును చాటినాడు. **8**

శ్లో॥ మహీం సర్వాం హృతాం దృష్ట్వా త్రిపద వ్యాజయాంచయా
ఊచుః స్వభర్తృరసురా దీక్షితస్యాత్యమర్షితాః ॥9॥

టీ :- బ్రహ్మాదయ ఇతి. సంక్షిప్తా ఉపసంహృతా ఆత్మవిభూతిః స్వవిస్తారో యేన తస్మై యథాపూర్వం వామనరూపేణ స్థితాయేత్యర్థః. ॥6-9॥

మూడడుగులనేలనే అని బైటకు కనిపించునట్టి మిషతో, కపట యోచనతో యజ్ఞ దీక్షితుడైన తమ రాజు బలిచక్రవర్తి యొక్క సమస్త భూమండలమును అపహరించుటను చూచి రాక్షసులందరు మిక్కిలిగా కోపించి తమలో ఇట్లు తర్కించుకొనిరి. 9

శ్లో॥ న వా అయం బ్రహ్మ బంధుర్విష్ణుర్మాయా వినాం వరః ।
ద్విజరూప ప్రతిచ్ఛన్నో దేవకార్యం చికీర్షతి ॥10॥

రాక్షసులు తమలో వితర్కించుకున్న విషయములను మూడున్నర శ్లోకములలో వివరించుచున్నాడు. ఈ వచ్చిన వటుడు వాస్తవముగా బ్రాహ్మణుడు

టీ :- మహీమితి. త్రిపదవిషయా. యా యాచ్ఞా. తయా. స్వభర్తుర్బలే ర్మహీ హృతాం దృష్ట్వా. ఊచుః. ॥10॥

కాదు. అపారమైన మాయలందు దిట్టయైన విష్ణుమూర్తియే బ్రాహ్మణరూపమున గుట్టుగా మారువేషమున ఇంద్రాది దేవతలకు శుభము ఘటించుటకు వచ్చియుండవచ్చును. 10

శ్లో॥ అనేన యాచమానేన శత్రుణా వటురూపిణా ।
సర్వస్వం నో హృతం భర్తుర్న్యస్త దండస్య బర్హిషి॥11॥

ఇట్లు బ్రహ్మచారిగా మాయారూపమున ఉన్న శత్రువైన అతడు (విష్ణువు) ఆయుధములు, సైన్యము, పరాక్రమములను విసర్జించి యాగదీక్షలో దర్భాసనమున నున్న మహారాజు బలిచక్రవర్తి సర్వభాగ్యములను అపహరించినాడు. 11

శ్లో॥ సత్య వ్రతస్య సతతం దీక్షితస్య విశేషతః ।
నానృతం భాషితుం శక్యం బ్రాహ్మణస్య దయావతః॥12॥

నిరతము సత్యవాక్పరిపాలకుడు, విశేషముగా యాగదీక్షలో నున్నవాడు, బ్రాహ్మణుని పట్ల దయగలవాడైన బలిచక్రవర్తికి ఈ విధముగా అసత్యమును చెప్పుట (వంచించుట ) చేతగాదు 12

శ్లో॥ తస్మాదస్య వధో ధర్మో భర్తుః శుశ్రూషణం చ నః ।
ఇత్యాయుధాని జగృహుర్బలే రనుచరాఽసురాః॥13॥

టీ :- కిమూచుః తదాహ సార్ధైస్త్రిభిః. నేతి. ॥11-13॥

అందువలన ఇతడు బ్రాహ్మణ వటుడైన అసత్యవాది, వంచకుడై నందున ఇతనిని సంహరించుటకు దోషము కాదు. ప్రస్తుతము మన ప్రభువును సర్వవిధముల రక్షించుకొనుటయే అనివార్య కర్తవ్యము. అని విచారించి బలి అసురగణములైన సర్వరాక్షసులు తమ తమ ఆయుధములను గ్రహించి యుద్ధప్రయత్నము చేసిరి. 13

శ్లో॥ తే సర్వే వామనం హంతుం శూలపట్టిస పాణయః ।
అనిచ్ఛంతో బలే రాజ్ఞాం ప్రాద్రవన్ జాతమన్యవః॥14॥

ఆ రాక్షస నాయకులందరు తమ తమ సైన్యములతో వామనుని సంహరించుటకై బల్లెము, అడ్డకత్తి మొదలైన ఆయుధములను ధరించి బలిచక్రవర్తి అనుమతిని కూడా ఆశించనివారై తీవ్రమైన కోపముతో వామనుని వైపు పరిగెత్తిరి. 14.

శ్లో॥ తానభి ద్రవతో దృష్ట్వా దితి జానీకపాన్ నృప ! ।
ప్రహస్యానుచరాః విష్ణోః ప్రత్యషేధన్నుధాయుధాః॥15॥

ఓ రాజా ! యుద్ధమునకై మీదకు ఉరికి వచ్చుచున్న రాక్షస సైన్యాధిపతులను చూచి విష్ణుమూర్తి పరిచరులైన దేవయోధులు పరిహాసముగా నవ్వుచు వారిని నిరాకరించి తమ తమ ఆయుధములతో ఎదిరించుటకు సిద్ధపడిరి. 15

శ్లో॥ నందః సునందోఽథ జయో విజయః ప్రబలో బలః ।
కుముదః కుముదాక్షశ్చ విశ్వక్సేనః పతత్రిరాట్ ॥16॥

నందుడు, సునందుడు, జయుడు, విజయుడు, ప్రబలుడు, బలుడు, కుముదుడు, కుముదాక్షుడు, విష్వక్సేనుడు, గరుత్మంతుడు ( మొదలైనవారు రాక్షసులతో యుద్ధమునకు సిద్ధపడిరి). 16

శ్లో॥ జయంతః శ్రుతదేవశ్చ పుష్పదంతోఽథ సాత్వతః ।
సర్వే నాగాయుత ప్రాణాశ్చమూం తే జఘ్నురాసురీం॥17॥

పదివేల ఏనుగుల బలము కలిగిన జయంతుడు, శ్రుతదేవుడు, పుష్పదంతుడు, సాత్వతుడు మొదలైన దేవ సైన్యాధిపతులందరు రాక్షస సైన్యమును హింసించిరి. 17

శ్లో॥ హన్యమానాన్ స్వకాన్ దృష్ట్వా పురుషానుచరైర్బలిః ।
వారయామాస సంరబ్ధాన్ కావ్యశాప మనుస్మరన్॥18॥

శీఘ్రముగా తన సంపదలు నశించునని శుక్రాచార్యుడిచ్చిన శాపమును తలిచి పురుషోత్తముని దేవసైన్యముచేత మరణించుచున్న తనవారైన

రాక్షసవీరులను చూచి బలిచక్రవర్తి వారిని యుద్ధప్రయత్నమునుండి విరమింపజేసినాడు. 18

శ్లో॥ హే విప్రచిత్తే ! హే రాహో ! హే నేమే ! శ్రూయతాం వచః।
మా యుధ్యత నివర్తధ్వం న నః కాలోఽయమర్థకృత్ ॥19॥

ఓ విప్రచిత్తీ , రాహూ, నేమీ ! నామాట వినండి. ప్రస్తుతకాలము మనకు అనుకూలమైనది కాదు. కనుక ఇప్పుడు యుద్ధము చేయక వెనుకకు మరలండి. 19

టీ :- ఇతీతి. అనుచరాశ్చ తే అసురాశ్చ. ॥14-19॥

శ్లో॥ యః ప్రభుః సర్వభూతానాం సుఖ దుఃఖోపపత్తయే ।
తం నాతి వర్తితుం దైత్యాః పౌరుషైరీశ్వరః పుమాన్॥20॥

సమస్త జీవుల సుఖదుఃఖములకు కారకుడైన, జగన్నాథుడైన పరమేశ్వరుని మన రాక్షసుల పరాక్రమములు అతిక్రమించలేవు. 20

టీ :- హే విప్రచిత్తే ఇతి. అర్థకృత్. అనుకూలః. ॥20॥

శ్లో॥ యోనో భవాయ ప్రాగాసీదభావాయ దివౌకసామ్ ।
స ఏవ భగవానద్య వర్తతే తద్విపర్యయమ్ ॥21॥

పూర్వము మనకు అనుకూలుడై వుండి దేవతలకు ప్రతికూలముగ నుండిన పరాత్పరుడే ప్రస్తుతము దానికి విపరీతముగా అనగా మనకు ప్రతికూలముగా, దేవతలకు అనుకూలముగా ప్రవర్తించుచున్నాడు. 21
.

శ్లో॥ బలేన సచివైర్బుద్ధ్యా దుర్గైర్మంత్రౌషధాదిభిః ।
సామాదిభి రుపాయైశ్చ కాలం నాత్యేతి వై జనః ॥22॥

కాలము వ్యతిరేకముగా ఉన్నప్పుడు జనులు బలము, మంత్రులు, తెలివి, బలమైన కోటలు, మంత్రము, ఔషధములవంటి శాంతింపజేయు

ప్రయత్నములు, సామదానాది నాలుగు ఉపాయములు మొదలైన సహాయముల నెన్నిటిని పొందినను జనులెవ్వరును కాలమును అనుకూలముగా చేసికొనలేరు. 22

శ్లో॥ భవద్భిర్నిర్జితాహ్యేతే బహుశోऽనుచరా హరేః ।
దైవేనార్ధైస్తఏవాద్య యుధి జిత్వా నదంతి నః ॥23॥

టీ :- యిఇతి.పౌరుషైస్తం కాలమతివర్తితుంపుమాన్. నేశ్వరః న భవతి ॥21-23॥

పూర్వము ఈ హరి పరిచరులైన దేవనాథులు పెక్కు పర్యాయములు మీ చేతిలో పరాజితులైన వారే. వారు ప్రస్తుతము దైవికమైన కాలముచేత వృద్ధిపొందిన వారై మనలను యుద్ధమున జయించి సంతోషించుచున్నారు. 23

శ్లో॥ ఏతాస్వయం విజేష్యామో యది దైవం ప్రసీదతి ।
తస్మాత్కాలం ప్రతీక్షధ్వం యోనోऽర్థత్వాయ కల్పతే॥24॥

టీ:-భవద్భిరితి.హరేరనుచరా దేవాః దైవేన ఇద్ధైస్సమృద్ధైర్భవద్భిః ॥24॥

మనకు భగవంతుడు అనుకూలించి ఈ దేవనాథులను జయించగలుగు శక్తి సామర్థ్యములు అనుగ్రహించునంతవరకు వేచియుండండి. 24

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ పత్యుర్నిగదితం శ్రుత్వా దైత్యదానవ యూథపాః ।
రసాం నివివిశూ రాజన్ ! విష్ణు పార్షద తాడితాః ॥25॥

**శుక మహర్షి ఇట్లు చెప్పెను :-**

ఓ రాజా ! ఈ విధముగా బలిచక్రవర్తి నిర్దేశమును విని విష్ణు పరిచారకులచేత దెబ్బలు తినుచున్న సమస్త దైత్య దానవ సైన్యాధిపతులు పాతాళలోకమును ప్రవేశించిరి. 25

శ్లో॥ అథతార్క్ష్య సుతో జ్ఞాత్వా విరాట్ప్రభు చికీర్షితమ్ ।
బబంధ వారుణైః పాశైః బలిం సుత్యేఽహని క్రతౌ॥26॥

టీ॥ ఏతానితి. అర్థత్వాయ అనుకూల్యాయ. ॥25,26॥

రెక్కలవలన ప్రకాశించువాడు విరాట్ – గరుత్మంతుడు తన ప్రభువైన శ్రీహరి కోరికను తెలిసి ప్రవర్తించినాడని చెప్పుచున్నాడు. ఈ బలి సమస్త సంపదలు తనవనే వ్యామోహమును పూర్తిగా వదులుకొని, తన శరీరమునే అర్పించుటచేత అహంకారమును విడిచిపెట్టి పరమాత్మ కరుణా కటాక్షమును పొందుటకు కోరుచున్నాడు ( సర్వస్వాత్మ నివేదన పరుడైనాడు ) . ఐతే ఇతనితో సమానుడైన సత్యవాక్పరిపాలకుడుగాని, దానవీరుడుగానీ లేడని అతని కీర్తిని ఎల్ల లోకములందు వ్యాపింపజేయుటకై కొంచెము క్రిందకు త్రోయుటను కూడా ( ఉద్ధరించుటకై అథఃపతనము చేయుట ) శ్రీహరి కోరుచున్నాడని ఆయన అభిప్రాయమును గ్రహించిన వినతా సుతుడు బలిని బంధించినాడని యజ్ఞమున సోమపానమును చేయుదినముననే ( యజ్ఞమున జరిగిన ఎక్కువ తక్కువ లోపములను పరిహారమును చేసుకొనుటకై యజ్ఞపరిసమాప్తిని నిర్వహించు కార్యములు చేయుదినముననే – అనగా బలి యాగము సద్యః ఫలము నిచ్చినదని భావము. యజ్ఞము పూర్తిగా పరిసమాప్తి యగుటకు ముందే యజ్ఞేశ్వరుడైన పరమాత్ముని అనుగ్రహము లభించినదని అర్థము). వారుణ పాశములతో బంధించినాడు. 26

శ్లో॥ హాహాకారో మహానాసీద్రోదస్యోః సర్వతోదిశమ్ ।
గృహ్యమాణేఽసురపతౌ విష్ణునా ప్రభవిష్ణునా ॥27॥

టీ :– అథేతి.విషు పక్షిషు రాజత ఇతి విరాట్ ప్రభోశ్చికీర్షితం

ఈ విధముగా సర్వాధిపతియైన శ్రీహరి చేత బలి బంధితుడైన వెంటనే భూమ్యాకాశముల మధ్యమునందన్ని దిక్కులందు బ్రహ్మాండముగా హాహాకారములు నిండిపోయినవి. 27

జ్ఞాత్వా. అయమర్థః. అస్య సర్వస్వాపహారేణ. మమేత్యభిమానం సంత్యాజితం. ఇదానీం దేహస్వీకారేణాహంకారమపిత్యాజయిత్వా పరమాగ్రహం కర్తుమిచ్ఛతి,న చానేన తుల్యోఽన్యః కోఽపి సత్యసంధో ధీరో వాస్తీతి తద్యశః ప్రత్యాఖ్యాపనార్థం కించిద్యాతయితుమపీచ్ఛతీతి ప్రభోరబి. ప్రాయం జ్ఞాత్వా తం బబంధేతి. సౌత్యేఽహనిసోమాభిషవదినే. ॥27॥

శ్లో॥ తం బద్ధం వారుణైః పాశైః భగవానాహ వామనః ।
నష్టశ్రియం స్థిరప్రజ్ఞ ముదార యశసం నృప ! ॥28॥

ఓ రాజా ! సంపదలు నశించినను దృఢచిత్తమును వీడక అపారకీర్తిమంతుడై కూడా ఆ విధముగా వరుణ పాశము లందు బంధితుడైన బలిచక్రవర్తితో భగవంతుడైన వామనుడు ఇట్లు చెప్పుచున్నాడు. 28

శ్లో॥ పదాని త్రీణి దత్తాని భూమేర్మహ్యం త్వయాఽసుర ! ।
ద్వాభ్యాం క్రాంతా మహీసర్వా తృతీయ ముపకల్పయ ॥29॥

ఓ రాక్షసేంద్రా ! నాకు నీవు మూడడుగుల నేల దానము చేసితివి. రెండుపాదములకే సమస్త భూమండలము సరిపోయినది. మరి నా మూడవ పాదమునకు స్థలము చూపించుము. 29

శ్లో॥ యావత్తపత్యసౌ గోభిర్యావదిందుః సహోడుభిః ।
యావద్వర్షతి పర్జన్యస్తావతీ భూరియం తవ ॥30॥

టీ :- హాహాకార ఇతి. రోదస్యోః ద్యావాపృథివ్యోః.॥28-30॥

ఈ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రముల కిరణముల ప్రసారములతో వెలుగునది, వరుణదేవుని వర్షపు జల్లులతో పులకించునదైన నీకు సంబంధించిన భూ ఖండమంతయు ఇంతమాత్రమే. 30

శ్లో॥ పదైకేన మయాక్రాంతో భూర్లోకః ఖం దిశస్తనోః ।
స్వర్లోకస్తు ద్వితీయేన పశ్యతస్తే స్వమాత్మనా ॥31॥

టీ :- యావదితి. అసౌసూర్యః. ॥31॥

శ్లో॥ ప్రతిశ్రుత ముదాతుస్తే నిరయే వాస ఇష్యతే ।
విశ త్వం నిరయం తస్మాద్గురుణా చానుమోదితః॥32॥

టీ :- పదేతి. మయా ఆత్మనేత్యన్వయః వ్యాపినేత్యర్థః. ఖం చ దిశశ్చ. తనోః తన్వాః తే స్వం త్వదీయం సర్వస్వం. ॥32॥

శ్లో॥ వృథా మనోరథస్తస్య దూరే స్వర్గః పతత్యధః ।
ప్రతి శ్రుతస్యాదానేన యోర్థినం విప్రలంభతే ॥33॥

టీ :- ప్రతిశ్రుతమితి. గురుణా శుక్రేణానుమోదితస్సన్. ॥33॥

శ్లో॥ విప్రలబ్ధో దదానీతి త్వయాహం చాధ్యమానినా ।
తద్వ్యలీక ఫలం భుంక్ష్వ నిరయం కతి చిత్సమాః॥34॥

దృగ్గోచరమైన ఈ నీ సర్వస్వమును ఒకపాదముచే భూమిని, శరీరముచే దిక్కులు, ఆకాశమును, రెండవ పాదముచే స్వర్గలోకమును నీవుచూచుచుండగనే ఆక్రమించితిని. 31

అంగీకరించిన దానమును సక్రమముగా ఇవ్వలేని నీకు నరకమున నివాసము తప్పదు. అందువలన నీవు నీ గురువైన శుక్రాచార్యుని శాపఫలముగా దుర్గతిని పొందుము. 32

ఈ విధముగా కఠినముగా చెప్పినను దుర్గతిని పరిహరించుటకు, స్వర్గపతనమును నివారించుటకు కోరికను నెరవేర్చుటకు సిద్ధమైన బలిని ఉద్దేశించి చెప్పుచున్నాడు. అంగీకరించిన దానమును యాచకులకు సక్రమముగా సమర్పించలేక విశేషముగా వంచించిన వాని కోరికలు వ్యర్థమగును. అందువలన అతడు స్వర్గము నుండి దూరమై క్రిందపడి పోవును. 33

గొప్ప ధన , శక్తిమంతుడనని విఱ్ఱవీగేనీవు నేను కోరిన దానమును ఇత్తునని ఇవ్వలేక నన్ను వంచించితివి. ఆ అసత్యఫలమును కొన్ని

టీ :- ఏవముక్తేఽపి నిరయపరిహారార్థం స్వర్గాద్భ్రంశపరిహారార్థం చ మనోరథం కుర్వంతం ప్రత్యాహ. వృధేతి. యః ప్రతిశ్రుతస్యాప్రదానేన. యాచకం విప్రలంబతే. తస్య మనోరథో వృథైవ. స్వర్గశ్చతస్య దూరత ఏవ . సచాధః పతత్యేవ. ॥34॥

**ఇతి శ్రీమద్భాతవతే, మహాపురాణే, అష్టమస్కంధే బలి నిగ్రహో నామ ఏక వింశోఽధ్యాయః**

సంవత్సరములు అనుభవించుము అని వామనుడు బలితో చెప్పినాడు. 34

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే బలినిగ్రహమను ఏకవింశోధ్యాయము ఆంధ్రానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

శ్లో॥ ద్వావింశేతు ప్రసన్నః సన్ ప్రస్థాప్య సుతలం బలిమ్ ।
దత్వా వరాన్ హరిర్న్యూనం గత్వా తద్వారపోఽభవత్॥

ఇరువది రెండవ అధ్యాయమున శ్రీమహా విష్ణువు మిగుల తృప్తిని బొందినవాడై సుతలాలయమున బలిచక్రవర్తిని ఉండ నియమించి, రాబోవు అష్టమ సావర్ణి మన్వంతరమున స్వర్గాధిపత్యముతో అతనిని ఇంద్రునిగా చేయుదునని వరమిచ్చి, దాత అయిన బలికంటే యాచకుడైన తనను తక్కువవాడుగా భావించి సుతలాలయమున అతని ద్వారపాలకుడై ప్రవర్తించుట విషయము.

శ్లో॥ సమర్పిత తనూవిత్త నిర్మలాచల భక్తితః ।
ఛలితో బలినా చిత్రం స్వమేదార్పయ దచ్యుతః॥

వంచితుడై కూడా స్వచ్ఛమైన అచంచల భక్తితో తన తనువును, మనస్సును, సర్వమును శ్రీహరికి సమర్పించినాడు బలిచక్రవర్తి . ఐతే శ్రీమన్నారాయణుడు తనను తానే బలికి సమర్పించుకొనుట మిక్కిలి చిత్రము ( మహా పురుషుల సన్మానము మహాఫలదము ).

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఏవం విప్రకృతో రాజన్ ! బలిర్భగవతాఽసురః ।
భిద్యమానోఽప్య భిన్నాత్మా ప్రత్యాహా విక్లబం వచః ॥1॥

**శుకయోగి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! ఈ విధముగా శ్రీహరి చేత అపకారముపొంది శారీరకముగా హింసను అనుభవించినను మానసికముగా అభిన్నబుద్ధి గలవాడై కలవరములేని పలుకులతో విష్ణువునకు ఈ విధముగా సమాధానము చెప్పినాడు. 1

టీ :- "శ్లో. ద్వావింశేతు ప్రసన్నః సన్ ప్రస్థాప్య సుతలం బలిమ్,దత్వా వరాన్ హరిర్వ్యానం గత్వా తద్వారపోఽ భవత్,సమర్పిత తనూవిత్త నిర్మలాచల భక్తితః,ఛలతో బలినా చిత్రం స్వమేదార్పయ దచ్యుతః " ఏవమితి. విప్రకృతః అపకృతః భిద్యమానః సత్యాచ్చాల్యమానోఽపి నిశ్చలచిత్తో బలిః ॥1॥

**బలిరువాచ :-**

శ్లో॥ యద్యుత్తమ శ్లోక ! భవాన్మమేరితం
వచోవ్యలీకం సురవర్య ! మన్యతే ।
కరోమ్యృతం తన్న భవేత్ప్రలంభనం
పదం తృతీయం కురు శీర్ష్ణిమే నిజమ్ ॥2॥

టీ :- యదీతి. హే ఉత్తమశ్లోకేతి కటాక్షప్రార్థనాసూచకః. మమ వచ ఈరితం ప్రతిశ్రుతం. న తావదలీకం. త్వయా కపటేన వామనతయా భిక్షిత్వా రూపాన్తరస్యావిష్కృతత్వాత్ ఏవమపి యది భవానలీకం అనృతం మన్యతే. తథాపి ఋతమేవాహం కరోమి. మదుక్తం విప్రలంభనం న భవతు.మే శీర్ష్ణి నిజం తృతీయం పదం కురు. న చ ద్వాభ్యాం విశ్వం క్రాంతవతః మే తవ శిరః పదప ర్యాప్తం న భవతీతి మన్యేథాః విత్తేన చేత్

**బలి విష్ణువునకు ఇట్లు చెప్పినాడు :-**

ఓ సురశ్రేష్ఠా ! ఉత్తమ శ్లోకా ! (ఈ సంబోధనలు భగవదనుగ్రహమునకై ప్రార్థన సూచకములుగా నున్నవి) మీకు నేను అంగీకరించిన మూడడుగుల దానము చేయుట అనే మాట అసత్యముకాదు. ఎందుకనగా వంచనతో వామన రూపమున నీవు యాచించి అప్రమేయమై మరో త్రివిక్రమ రూపము ధరించుట వలన, అట్లైనను మీరు దానిని అసత్యమైనదిగా భావిచినట్లైతే ఇప్పటికిని నేను మూడవ అడుగునకుస్థానము కల్పించి నా మాటను సత్యమైనదిగా చేయుదును. అప్పుడు నామాట వంచన కానేరదు. నా తలపై నీ పాదమును పెట్టుము. అట్లుకాదు రెండు పాదములతో అనంత విశ్వమును అతిశయించిన నాకు నీ శిరస్సు నాపాదము కొలతకు సరిపోదుకదా అని భావింతువేమో? నా సంపదతో రెండు పాదములు సరిపోయినట్లైనచో నా తలమీది పాదమునకు నీకు అధికమే ముట్టినట్లగును. సంపదకంటే దానిని సంపాదించినవాడు గొప్ప . (స్వామి, స్వలలో స్వామియే మిన్న) . అందువలన

పదద్వయం జాతం. తర్హీదమధీకమేవ స్యాత్. విత్తాదపి విత్తవతోఽధికత్వాదితి భావః.. ॥2॥

నా సర్వస్వము రెండు పాదములైతే, దానిని పొందిన నాతల రెండు పాదముల పరిమాణముకంటే పెద్దదగును. నా తలపై నీ కాలు మోపుటవలన నాలుగు పాదములకు మించిన దానము కలుగును. అప్పుడు నీవడిగిన దానము కంటే ఎక్కువ ముట్టినట్లేయగును కదా ! 2

శ్లో॥ బిభేమి నాహం నిరయాత్ పదచ్యుతో
న పాశబంధార్వ్యసనాద్దురత్యయాత్ ।
నైవార్థ్ర కృచ్ఛ్రాద్భవతో వినిగ్రహాత్
అసాదువాదాద్భృశ ముద్విజే యథా ॥3॥

టీ :- నను. శ్లో."ఆపదర్థే ధనం రక్షేద్ధారాన్ రక్షేద్ధనైరపి, ఆత్మానం సంతతం రక్షేద్ధారైరపి ధనైరపీత్యాదివచనాదాత్మభయపరిహారాయ సర్వస్వం త్యజ్యతే. త్వం తు కుతో భీత స్సన్నాత్మానం న పాసి? అత ఆహ బిభేమీతి. అసాధువాదాత్ అపకీర్తేః. యథాహం భృశముద్విజే. తథా నిరయాదిభ్యోన బిభేమి. ॥3॥

ఒకవేళ "ఆపదర్థం ధనం రక్షే ద్దారా న్రక్షేద్ధనైరపి । ఆత్మానం సతతం రక్షే ద్దారైరపి ధనైరపి॥" ఆపదలనుండి కాపాడుకొనుటకు ధనమును కూడబెట వలయును. ధనము వెచ్చించి యైనను భార్యాబిడ్డలను కాపాడుకొనవలయును. దారాపుత్ర విత్తాదులను కూడా తిరస్కరించి వ్యక్తి తనను తాను కాపాడు కొనవలయును. మొదలైన ధర్మసూత్రములవలన తనకు కలిగిన ఆపదలనుండి బైటపడుటకు తన సర్వస్వమును త్యాగము చేయవచ్చును. అని ఉన్నప్పుడు ఎందుకు భయపడి నిన్ను నీవు సమర్పించుకొనుచున్నావు. అనే దానికి సమాధానము చెప్పుచున్నాడు. దుర్గతికి గానీ, రాజ్యపదవి పోయినందువలన కానీ, త్రాళ్ళు కట్టినందువలన కానీ, దాటలేని దుఃఖము కలిగినందువలన గానీ, ప్రాణసంకట పరిస్థితులకు గానీ, నీచేత దండనకు గురియగుట వలన గానీ నేను భయపడను. 'బలి మంచివాడు కాదు (అసాధువు)' అనే అపకీర్తికి మాత్రమే నేను భయమందుదును. 3

శ్లో॥ పుంసాం శ్లాఘ్యతమం మన్యే దండ మర్హత్త మార్పితమ్ ।
యం న మాతా పితా భ్రాతా సుహృదశ్చాదిశంతి హి॥4॥

టీ :- నను మయా కృతత్ నిగ్రహోత్తవాపకీర్తిర్జాతైవ నైవే త్యాహ పుంసామితి. అర్హత్తమైరర్పితం దండం. మాత్రాదయోఽపి న హ్యాదిశంతి నైవార్పయంతి. హితైషిణా త్వయా. నిగృహీతోఽహం శ్లాఘ్య ఏవాస్మీతి భావః ॥4॥

నేను నిన్ను దండించినందువలన కూడా అపకీర్తి రానే వచ్చును కదా ! అని అందువేమో ! అట్లు కాదని చెప్పుచున్నాడు. పురుషులకు సర్వోత్తముడైన అర్హుని వలన కలిగిన దండన - శిక్ష - శిక్షణ పొందుట నింద్యమెట్లగును. అవి వారికి కీర్తికరమే. తల్లి దండ్రులు, తోబుట్టువులు, స్నేహితులు శిక్షించుట అవమానము కాదు. పైగా తరువాతి కాలమున ఈ శిక్ష ( ణ ) వారికి హితమునే కలిగించును. నా మేలు కోరునట్టి నీచేత దండింపబడుట కీర్తికరము మాత్రమే కాదు, మంగళకరమే అని భావము. 4

శ్లో॥ త్వం నూన మసురాణాం నః పారోక్ష్యః పరమోగురుః ।
యోనోఽనేక మదాంధానాం విభ్రంశం చక్రురాదిశత్ ॥5॥

టీ :- నన్వహం దేవానాం హితైషీనాసురాణాం. తత్రాహ త్వమితి. పారోక్ష్యః శత్రుచ్ఛలేన వర్తమానః. ॥5॥

నేను దేవతలకు మేలు కలిగించువాడను. రాక్షసులకు కాదుకదా! అనే విషయమై చెప్పుచున్నాడు. తప్పక నీవు మావంటి గర్వాంధులైన పలువురు దానవులకు శత్రువను మిషతో వర్తించి క్షతిలేని జ్ఞాన నేత్రములను ప్రసాదించి సర్వోన్నతుడవైన పరోక్షగురుడవైతివి. 5

శ్లో॥ యస్మిన్వైరానుబంధేన రూఢేన విబుధేతరాః ।
బహవో లేభిరే సిద్ధిం యాము హై కాంతయోగినః॥6॥

టీ :- శత్రుత్వం తు పునర్భక్తానివాస్మాననుగృహీతుమేవేత్యాహ యస్మిన్నితి. ఉ అహో.హ ప్రసిద్ధా. ॥6॥

నీకు శత్రుత్వము విశేషముగా ఎందుకంటే నీ భక్తులవలెనే మమ్ములను అనుగ్రహించుటనే అని చెప్పుచున్నాడు. ధ్యానాభ్యాస వశీకృత చిత్తులైన యోగీశ్వరులు. అఖండాద్వైత భావనతో నిర్గుణము, నిష్క్రియమైన నీ పరమోత్తమమైన తేజోరూపమును పొందినట్లే మావంటి అజ్ఞానులు ఎందరో దృఢమైన శత్రుభావనతోడను ఆత్మైక్యమును పొందినారు. 6

శ్లో॥ తేనాహం నిగృహీతోఽస్మి భవతా భూరికర్మణా ।
బద్ధశ్చ వారుణైః పాశైః నాతి వ్రీడే న చ వ్యథే ॥7॥

టీ :- అతో మమ నా లజ్జానాపి దుఃఖమిత్యాహ తేనేతి. తేన గురుణా భవతా. ॥7॥

అందువలన నీ బంధనములో నుండుటవలన నాకు సిగ్గుకాని, దుఃఖముకానీ లేదని చెప్పుచున్నాడు. సృష్టి, స్థితి, లయములనే గొప్పకార్యములు చేయు జగద్గురుడవైన నీచేత వరుణపాశములతో బంధింపబడినను నాకు లజ్జ కానీ, బాధగానీ లేదు. 7

శ్లో॥ పితామహో మే భవదీయ సమ్మతః
ప్రహ్లాద ఆవిష్కృత సాధువాదః ।
భవద్విపక్షేణ విచిత్ర వైశసం
సంప్రాపితస్త్వ త్పరమః స్వపిత్రా ॥8॥

టీ :- కించ యోఽయం దండరూపో మమానుగ్రహస్త్వయా కృతః స తు త్వద్భక్తపాత్రత్వేన. న త్వహమనుగ్రహస్య పాత్రమిత్యాశయేనాహ పితామహ ఇతి. భవదీయానాం సంమతః యతః. ఆవిష్కృతః సాధువాదో యస్య త్వమేవ పరమః ఆశ్రయో యస్య సః. అతః భవతో విపక్షేణ విర్విషా. హిరణ్యకశిపునా విచిత్రం వైశసం హింసాం సంప్రాపితోఽపి దేహదీనామ సారతాం నిశ్చిత్య. అకుతోభయం ధ్రువం చ భవతః పాదపద్మమేవ

నన్నీవిధముగా దండించుట, మీరు నన్ననుగ్రహించుటే. నేను మీ భక్తుని పౌత్రుడనైనందువలననో మీరు నన్ననుగ్రహించుటనా లేక నేను ప్రత్యేకముగా మీ కరుణను పొందుటకు అర్హత లేని వాడనా? అనే విషయమును చెప్పుచున్నాడు. మా పితామహుడైన ప్రహ్లాదుడు మీకు ఇష్టమైన వ్యక్తి . ఆయన దానవులందును సజ్జనత్వమును వెలయింప జేసినాడు. ఆయనకు కన్నతండ్రికంటే నీవే గొప్ప ఆశ్రయుడవు. అందువలననే నీవు శత్రువని ద్వేషించిన అతని తండ్రి హిరణ్యకశిపుడు విచిత్రమైన పెక్కు విధముల తనను హింసించినను, ఈ వికారమైన శరీరాదులు నిస్సారములని నిర్ణయించి నిర్భయుడై, నిత్యమైన నీ పాదపద్మములను ఆశ్రయించినాడు. ( కనుక అతని మీద దయతో నున్నకూడా మీ సమీపమునకు రప్పించుకొంటిరా అని తర్వాత నాలుగవ శ్లోకముతో అన్వయము ). 8

ప్రపేదే. అథ తస్మాదహమపి దైవేన తస్యైవ భాగ్యేన తవాంతికం నీత ఇతి చతుర్ణామన్వయః. ॥8॥

శ్లో॥ కిమాత్మనానేన జహాతియోऽంతతః
కిం రిక్థ హారైః స్వజనాఖ్య దస్యుభిః ।
కిం జాయయా సంస్రుతి హేతు భూతయా
మర్త్యస్య గేహైః కిమిహాయుషో వ్యయః ॥9॥

టీ :- కిమితి. అంతతః ఆయుషోఽంతే రిక్తహారైః పుత్రైః.ఇహ గేహేషు. కేవలమాయుషో వ్యయ ఏవ. న తు సుఖం కించిత్.॥9॥

పుట్టుకతో వచ్చిన ఈ శరీరము ఆయువు నశించి మరణము పొందునప్పుడు ఈ పుత్రులు, జ్ఞాతులు, చుట్టాలనెడి దొంగలు, కామభోగములకు కారణమై సంసార వ్యామోహమున క్రుంగజేయు భార్య, ఐశ్వర్యము మొదలైన వానితో మృతునకేమి ప్రయోజనము? ఇవన్నియు కేవలము ఆయుర్నాశకరములేగాని వీనివలన కొంచెముగూడా సుఖములేదు. 9

శ్లో॥ ఇత్థం సనిశ్చిత్య పితామహో మహాన్
అగాధబోధో భవతః పాదపద్మమ్ ।
ధృవం ప్రపేదే హ్యకుతో భయం జనాత్
భీతః స్వపక్ష క్షపణస్య సత్తమః ॥10॥

టీ :- ఇత్థమితి.సః ప్రసిద్ధో మహాన్. స్వపక్షం దైత్యకులం క్షపయతీతి తథా. తస్యాపి. ॥10॥

మిగుల ప్రశస్తినొందిన మాతాత ప్రహ్లాదుడు గొప్ప విజ్ఞానము కలవాడై, జన్మరాహిత్య కాంక్షతో ఈ ప్రాపంచిక విషయములు వ్యర్థములని నిర్ణయించుకొని తన రాక్షసకుల నాశకుడవైనప్పటికీ నిత్యమై, సర్వభయ రహితమై శ్రేష్ఠతమమైన నీ పాదపంకజమును ఆశ్రయించినాడు. 10

శ్లో॥ అథాహ మప్యాత్మ రిపోస్తవాంతికం
దైవేన నీతః ప్రసభం త్యాజిత శ్రీః ।
ఇదం కృతాంతాంతిక వర్తి జీవితం
యయాధ్రువం స్తబ్ధమతిర్నబుధ్యతే ॥11॥

టీ :- అథేతి. అథ తస్మాత్. అహమపి దైవేన తస్యైవ. భాగ్యేన తవాంతికం నీతః. ప్రసంభం బలాత్. త్యాజితా శ్రీర్యస్య. యయా శ్రియా. స్తబ్ధమతిః. స పుమాన్. ఇదం జీవితమధ్రువం న బుధ్యతే. కథంభూతం. కృతాంతస్యాంతికవర్తిమృత్యోః సన్నిహితం.॥11॥

నిత్యము మృత్యువునకు సమీపగతుడగుచు కూడా మూర్ఖుడైన మానవుడు సంపదలే సత్యమనుకొని ప్రాపంచిక వ్యామోహములలో కూరుకొని పోవుచు ఈ జీవితము అశాశ్వతమని తెలియలేడు. అట్టి స్థితిలో నేను బలవంతముగా సర్వసంపదలకు దూరము చేయబడి దైవికముగా దానవాంతకుడవైన (జడమై తుచ్ఛమైన ప్రాపంచిక శరీర బాధలను నాశనముచేయు) నీ సన్నిధానమునకు చేర్చబడితిని. 11

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ తస్యేత్థం భాషమాణస్య ప్రహ్లాదో భగవత్ప్రియః ।
ఆ జగామ కురుశ్రేష్ఠ ! రాకాపతి రివోత్థితః ॥12॥

టీ :- తస్యేతి. రాకాపతిః పూర్ణేందుః. ॥12॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ కురుకుల దీపకా ! బలి ఈ విధముగా వామనునితో సంభాషించుచుండగా శ్రీహరికి మిక్కిలి ఇష్టుడైన ( ప్రహ్లాద, నారద, పరాశర అంటూవున్న భక్తులవరుసలో మొదటివాడు ) ప్రహ్లాదుడు పున్నమినాడుదయించే నిండు చంద్రుని వలె ఎల్లెడల తన తేజమున ప్రకాశింపజేయుచు వచ్చినాడు. 12

శ్లో॥ తమింద్రసేనః స్వపితామహం శ్రియా
విరాజమానం నలినాయతేక్షణమ్ ।
ప్రాంశుం పిశంగాంబర మంజనత్విషం
ప్రలంబబాహుం సుభగం సమైక్షత ॥13॥

పద్మములవంటి విశాలమైన కన్నులతో, ఉన్నతమైన శరీరముతో, ఆజానుబాహువులతో, గోరోచన వర్ణముతో విరాజిల్లు వస్త్రముతో, కాటుకవంటి శరీరచ్ఛాయతో, పరిపూర్ణయోగ్యతతో ఐశ్వర్యశోభితుడై వచ్చిన తన తాతగారు ప్రహ్లాదవర్యుని ఇంద్రసేనుడు ( బలి ) భక్తితో దర్శించినాడు. 13

టీ :- తమితి. అంజనత్విషం శ్యామం. ॥13॥

శ్లో॥ తస్మై బలిర్వారుణ పాశయంత్రితః
సమర్హణం నోపజహార పూర్వవత్ ।
ననామ మూర్ధ్నాశ్రు విలోల లోచనః
సవ్రీడ నీచో న ముఖో బభూవహ ॥14॥

వరుణ పాశమున బంధింపబడి యున్నందున బలిచక్రవర్తి తన పితామహుడైన ప్రహ్లాదనికి అంతకు ( బంధమునకు ) ముందువలె అర్హమైన స్వాగతాసన అర్ఘ్యపాద్యాదులతో అర్చనాదికములను సమకూర్చలేక పోయినాడు. కానీ తాను చేసిన విశ్వజయాది గర్వ కారణములైన దోషముల వలన కలిగిన పాపములను తలచి సిగ్గుతో తలవంచుకొని శిరస్సుతోడనే నమస్కరించినాడు. 14

టీ :- తస్మా ఇతి. స్వకృతాహంకారాదిరూపాపరా ధస్మరణేన. సవ్రీడం. నీచీనమధోముఖం. యస్య సః ॥14॥

శ్లో॥ సతత్ర హాసీన ముదీక్ష్య సత్పతిం
సునంద నందాద్యనుగై రుపాసితమ్ ।
ఉపేత్య భూమౌ శిరసామహామనా
ననామ మూర్ధ్నా పులకాశ్రు విక్లబః ॥15॥

అక్కడ నంద సునందాది అనుచరులు సేవించుచుండగా తీరిన సత్పుషావన పారీణుడైన పరమాత్ముని దర్శించిన గొప్పమనస్సుగలవాడైన ఆ ప్రహ్లాదుడు సమీపించి పరమానందమును సాత్వికముగా ప్రదర్శించు పులకాంకురములు, ఆనందాశ్రువులతో కలవరపడినవాడై భూమిపై తలనుంచి సాష్టాంగముగా ప్రణమిల్లినాడు. ( ఈ పులక హర్షాశ్రులకు పరమాత్మ దర్శనము ఒక కారణముకాగా తన మనమడైన బలిమీద పరమేశ్వరుడు చూపిన అనుగ్రహము మరొక కారణము) 15

టీ :-సఇతి. శిరసానమన్నేవ. ఉపేత్య మూర్ధ్నా ననామ బలేస్తత్ర తమనుగ్రహం దృష్ట్వా. పులకైరశ్రుభిశ్చ విక్లబః విహ్వలః. ॥15॥

**ప్రహ్లాద ఉవాచ :-**

శ్లో॥ త్వయైవ దత్తం పదమైంద్ర మూర్జితం
హృతం తదేవాద్య తథైవ శోభనమ్ ।
మన్యే మహానస్య కృతో హ్యనుగ్రహో
విభ్రంశితో యచ్ఛ్రియ ఆత్మ మోహనాత్॥16॥

టీ :- త్వయేతి.నహ్యైంద్రంపదమేతదీయం త్వయాపహృతం. కింతు స్వీయమేవ పునః స్వీకృతం. తచ్చ శోభనమేవ కృతం. తత్ర హేతుః మన్య ఇతి యద్యస్మాత్. శ్రీరేవ యదాత్మనో మోహనం. తస్మాద్విభ్రంశితః. ॥16॥

**ప్రహ్లాదుడు ఇట్లు చెప్పినాడు :-**

ఓ మహానుభావా ! ఇతనికి గొప్ప ఇంద్రపదవిని ఇచ్చినది నీవే. మరల ఇతని నుండి హరించినది నీవే. అంటే మరల దీనిని నీవే స్వీకరించితివి. (ఇక్కడ ఇచ్చినదానిని మరల స్వీకరించుటలో దత్తాపహరణ దోషములేదు. ఎందుకంటే పుత్రుని మీద వాత్సల్యముతో తండ్రి ఇచ్చిన మోదకములవంటి తినుబండారములను మరల తండ్రి లాగుకొనునను. అవి తిన్నచో మంచి కలుగునో లేదో అంటే చెడిపోయినవా? పాసిపోయినవా? అని వాటిని చిదిపి చిదిపి చూసి భోజన యోగ్యము లైనచో మరల ఇచ్చును.) అట్లే నీవు మరల గ్రహించుట ఇంతకన్న అధిక సుఖమును కలిగించుటయే దానికి కారణము. సంపదలే వ్యక్తిని లౌకిక వ్యామోహమున పడవేయునని దూరము చేసితివే గానీ అపహరించలేదని భావము. 16

శ్లో॥ యయాహి విద్వానపి ముహ్యతే యతః
తత్కోవిచష్టే గతిమాత్మనో యథా ।
తస్మై నమస్తే జగదీశ్వరాయవై
నారాయణాయాఖిల లోక సాక్షిణే ॥17॥

టీ :- విమోహనత్వమేవాహ యయేతి యయా శ్రియా. విద్వానపి. యతః సంయతోఽపి.ముహ్యతే తస్యాం సత్యాం కోఽన్యః పుమానాత్మనో గతిం తత్త్వం యథావత్. విచష్టే పశ్యతి తస్మై మహాకారుణికాయ. ॥17॥

మోహము కలుగుటకు కారణము చెప్పుచున్నాడు. సంపద మహాపండితుని గానీ, కఠిన నియమాలతో నున్న యతీశ్వరుని కాని వ్యామోహమున పడవేయును అనే విషయము ప్రసిద్ధమై యుండగా సామాన్య మానవుడు ఆత్మతత్త్వమును ఎట్లును తెలియలేడు. అందువలన ఎల్లరును దయతో చూచు సర్వసాక్షివైన జగదీశ్వరుడవు, ఎల్లలోకములకు సాక్షివి, నారాయణుడవైన నీకు నమస్కారము. (లోకమోహనమైన సిరినుండి దూరముచేసి అతనిపై అనుగ్రహముతో ఆత్మమోహితుని చేసికొంటివని భావము). 17

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ తస్యాను శ్రుణ్వతో రాజన్ ! ప్రహ్లాదస్య కృతాంజలేః ।
హిరణ్యగర్భో భగవానువాచ మధుసూదనమ్ ॥18॥

టీ :- తస్యేతి. తస్య ప్రహ్లాదస్యానుశృణ్వతః. ఉవాచేతి కించిద్వక్తుం ప్రవృత్త ఇత్యర్థః ॥18॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! చేతులు జోడించి ప్రహ్లాదుడు చెప్పునది వినుచుండగా భగవంతుడైన బ్రహ్మదేవుడు శ్రీహరికి ఏదో (చెప్పుటకు సిద్ధపడినాడు) చెప్పినాడు. 18

శ్లో॥ బద్ధం వీక్ష్య పతిం సాధ్వీ తత్పత్నీ భయవిహ్వలా ।
ప్రాంజలిః ప్రణతోపేంద్రం బభాషేఽవాఙ్ముఖీ నృప॥19॥

టీ :- తదైవ వింధ్యావళిరపి వక్తుం ప్రవృత్తా. తాం చ సంమానయన్. హిరణ్య గర్భః క్షణం తూష్ణీం స్థితః. అతస్తస్యా ఏవ వాక్యం ప్రథమమవ తారయతి బద్ధమితి. ॥19॥

బలిచక్రవర్తి భార్య వింధ్యావళి ముందుగా మాట్లాడ మొదలిడగా ఆమెకు అవకాశమిచ్చి బ్రహ్మదేవుడు కొంతసేపు మిన్నకుండినాడు. అందువలన ఆమె మాటనే ముందు ప్రసక్తమైనది. ఓ రాజా ! విష్ణువు చేత బంధితుడైన భర్తను చూచి బలి భార్య వింధ్యావళి భయముతో కలవరపడుచు విష్ణువునకు చేతులు జోడించి నమస్కరించుచు తలవంచుకొని ఇట్లు చెప్పినది. 19

**వింధ్యావళి రువాచ :-**

శ్లో॥ క్రీడార్థ మాత్మన ఇదం త్రిజగత్కృతం తే
స్వామ్యం తు తత్రకుధియోపర ఈశ కుర్యుః ।
కర్తుః ప్రభోస్తవ కిమస్యత ఆవహంతి
త్యక్త హ్రియ స్త్వదవ రోపిత కర్తృ వాదాః॥20॥

**వింధ్యావళి ఇట్లు చెప్పినది :-**

నీ విలాసమునకై నీవే ఈ ముల్లోకములను పుట్టించి, పోషించి, సంహరించునట్టి సర్వ ప్రభుడవైన ఈశ్వరుడవు నీవు. అట్టి నీకు నీకుండే వేరైన దేనిని సమర్పించి నీకు ఆవాహన నివేదనలనే సత్కారాలు చేయాలి. (ఈ అనంత సృష్టి నీవే ఐనపుడు, నీకంటే భిన్నమైనది ఇందెట్లు లభించగలదని భావము.) కర్తకే కృతమునందు సర్వాధికారమనునది కర్తృవాదము. కర్తలమైన మేము

టీ :- క్రీడేతి త్రిజగతః కర్తుః. ప్రభోః పాలకస్య. అస్యతః సంహర్తుశ్చ ఈశ్వరస్య తవన్యే కిమావహంతి కిం సమర్పయంతి. త్వయావరోపితః కర్త ృవాదః. కర్తారః స్వతంత్రా వయమితి. వాదమాత్రమపి యేషాంతే. అయం భావః. లోకత్రయం సమర్పితం. తతీయపాదాయ దేహం సమర్ప్య ప్రతిశ్రుతం ఋతం కరోమీతి దేహాదిషు స్వామ్యావిషారేణ బ్రువన్నయం కుబుద్ధిర్నిర్లజ్జశ్చ యతస్త్వమేవ సర్వస్యాపి స్వామీ. అతో మందబుద్ధిమేనం కేవలం కృపయా విముచ్య పాలయేతి. ॥20॥

స్వతంత్రులము. అనే నీ కర్తృ వాదమును నీవే పెకిలించుచున్నావు. కొందరికి కర్తృవాదము కేవలము వాదము మాత్రమే. అల్పబుద్ధులు కొందరు దీనికి వేరు అధికారులను చెప్పుచున్నారు. అంటే అది యదార్థము కాదని భావము. దీని అర్థమిది. నీకు ముజ్జగములు నా భర్త అప్పగించడము జరిగినది. మరి అటువంటి సమయమున ఈ దానవ చక్రవర్తి ( స్తుతిలో నింద ) మూడవ పాదదానమును పూర్తిచేయుటకు తన శరీరమును అర్పించి తన దానము సత్యమై పూర్ణమైనదిగా చేయగలనని ఎట్లు చెప్పుచున్నాడు? తన శరీరమునకు తానే అధికారిగా ప్రకటించి చెప్పుచున్నాడు. ఇతడు బుద్ధి సరిగా లేనివాడు. సిగ్గుకూడా లేనివాడు. ఎందుకంటే నీవే ఈ సర్వసృష్టికి, ఇతని శరీరమునకు కూడా కర్తవు. కనుక సర్వ స్వామ్యము నీదే. తనది కాని దానిని తనదనుకునే ఇతడు బుద్ధిలేని వాడే. అందువలన సమస్తమును త్యాగముచేసి నీకే సమర్పించిన ఈ ఆత్మ నివేదన పరుడైన నీ భక్తుని నీ దయతో విడిచిపెట్టి రక్షించుమని ప్రార్థించినది. ( నీ వస్తువును నీవే గ్రహించి అందులో ఎక్కువ, తక్కువల విచారణ చేయుట నీ కర్తృవాదమును నీవే అతిక్రమించినట్లగును కదా ! అని కూడా భావము) . 20

**బ్రహ్మ ఉవాచ :-**

శ్లో॥ భూత భావన భూతేశ దేవ దేవ జగన్మయ ।
ముంచైనం హృత సర్వస్వం నాయమర్హతి నిగ్రహమ్॥21॥

బ్రహ్మ ఇట్లు చెప్పినాడు :-

ఈ విధముగా ప్రహ్లాదుడు, వింధ్యావళి చెప్పిన పరమార్థయుక్తమైన మాటలతో తృప్తి చెందిన విష్ణుమూర్తితో బ్రహ్మదేవుడు వ్యావహారిక దృష్టితో మూడు శ్లోకములలో ఈ విధముగా అభ్యర్థించుచున్నాడు. ఓ సర్వేశ్వరా ! దేవ దేవా ! జగత్పతీ ! సమస్తమును కోల్పోయిన ఈ బలిని విడువుము.

టీ :- తదేవం ప్రహ్లాదస్య వింధ్యావళేశ్చ పరమార్థోక్త్యా. ప్రసన్నో

హరిః.బ్రహ్మేతు. లోకదృష్ట్యైవ విజ్ఞాపయతిత్రిభిః భూతభావనేతి. ॥21॥

ఇతడు బంధనమునకు తగడు. 21

శ్లో॥ కృత్స్నా తేఽనేన దత్తా భూర్లోకాః కర్మార్జితాశ్చ యే ।
నివేదితం చ సర్వస్వ మాత్మాఽవిక్లబయా ధియా॥22॥

టీ :- నిగ్రహానర్హత్వేహేతుః కృత్స్నే ్తి. సర్వస్వమేవాహ ఆత్మేతి.॥22॥

బలి బంధనార్హుడు కాడనుటకు కారణము చెప్పుచున్నాడు. ఇతడు భూరాది సర్వలోకములను సమస్తమైన సంచిత, ప్రారబ్ధ కర్మలతో గూడా నీకు ధారవోసినాడు. అచంచలమైన బుద్ధితో తన శరీరముతో గూడా సర్వస్వమును అర్పించినాడు. 22

శ్లో॥ యత్పాదయో రశఠధీః సలిలం ప్రదాయ
దూర్వాంకురైరపి విధాయ సతీం సపర్యామ్ ।
అప్యుత్తమాం గతిమసౌ భజతే త్రిలోకీం
దాశ్వాన విక్లబ మనాః కథమార్తి మృచ్ఛేత్॥23॥

టీ :- తదేవ కైముతికన్యాయేనాహ యదితి. యస్య తవ పాదయోః సలిలమాత్రమపి. ప్రదాయ సర్వోఽపి జనః. అత్యుత్తమాం గతిం ప్రాప్నోతి. తస్మై తుభ్యం. అసౌ బలిః త్రిలోకీం. దాశ్వాన్ దత్తవాక్.ఆర్తిం కథం ప్రాప్నుయాత్. ॥23॥

ఆ విషయమునే అర్థాపత్తితో సమర్థించుచున్నాడు. మోసములేని చిత్తముతో గరిక పోచలపైన పాదములను భావన చేసి అర్ఘ్యపాద్యాది విధులతో ప్రోక్షించి అర్చించిన జనులందరికి అపవర్గాది ఉత్తమ గతులు కలుగుచున్నవి. అట్టిది ప్రత్యక్షముగా సన్నిధానమున ఉన్న నిన్ను మోసములేని అచంచలమైన బుద్ధితో స్వయముగా సపర్యలు చేసి స్వశరీరముతో గూడా ముల్లోకములను నీకు నివేదించిన బలికి సంకటము ఎట్లు ప్రాప్తించును? అన్నాడు. 23

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ బ్రహ్మన్ ! యమనుగృహ్ణామి తద్విశో విధునోమ్యహమ్ ।
యన్మదః పురుషః స్తబ్ధో లోకం మాం చావమన్యతే॥24॥

టీ:- సర్వార్థాపహారః కోఽయమనుగ్రహః తత్రాహ బ్రహ్మన్నితి. యన్మదో యైరర్థైర్మదో యస్య సః అతఏవ. స్తబ్ధ అన్రమస్సన్. మదస్తంభహేతూనా మర్థానామపహార ఏవానుగ్రహ ఇత్యర్థః.॥24॥

**శ్రీహరి ఇట్లు చెప్పినాడు :-**

ఇతని సర్వస్వమును అపహరించుట కాదు. ఇతనిని అనుగ్రహించుటయే అని చెప్పుచున్నాడు. ఓ బ్రహ్మదేవా ! ధనమదముతో విఱ్ఱవీగువాడు వినయ రహితుడై అటు లోకమును ( దుర్మార్గముతో ఎల్లరకు అపకారము కలిగించు పాపబుద్ధితో సంచరించు ) ఇటునన్ను ( పరమాత్మ తత్వమును ) తెలియలేక తిరస్కరించి ఉభయభ్రష్టుడు అగుచున్నాడు. అందువలన నేను కరుణించదలచిన వారి సర్వస్వమును పరిగ్రహింతును. ధన గర్వమును తొలగించుటకై మాత్రమే ఈ సర్వస్వాపహరణము. ఇది నేనితని అనుగ్రహించుటయేగాని బంధనముకాదు. 24

శ్లో॥ యదా కదాచీ జ్జీవాత్మా సంసరన్నిజ కర్మభిః ।
నానా యోనిశ్వనీశోఽయం పౌరుషీం గతి మావ్రజేత్॥25॥

టీ :- దుర్లభం పురుషజన్మ కథంచిల్లబ్ధవతో జీవస్య. జన్మాది నిమిత్తో గర్వో మహాహానికరః తస్య చ నాశో మదనుగ్రహో దేవేత్యాహ ద్వాభ్యాం. యదేతి. అనీశః పరతంత్రస్సన్. నిజైః కర్మభిర్నానాయోనిషు క్రిమికీటా దిషు సంసరన్. ॥25॥

సమస్త జీవరాశిలో దుర్లభమైన మానవ జన్మను ఏ పుణ్య విశేషముతోడనో పొందిన జీవునికి జన్మసంబంధమైన గర్వము మిక్కిలి హానికరము. దానిని నశింపజేయుట నా అనుగ్రహమే. అని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. జీవుడు తను చేయు పనులతో ( కర్మలతో ) పెక్కు క్రిమి కీటకాది రూపములలో దుర్గతులను పొందుచు పారతంత్ర్యముతో సంచరించుచు ఎప్పుడో తన అదృష్టవశముచేత మానవ జన్మను పొందును. 25

శ్లో॥ జన్మ కర్మ వయోరూప విద్యైశ్వర్య ధనాదిభిః ।
యద్యస్య న భవేత్ స్తంభ స్తత్రాయం మదనుగ్రహః॥26॥

టీ :- జన్మేతి. తత్ర పౌరుష్యాం గతౌ. జన్మాదిభిరస్య యది స్తంభో న భవేత్. తర్హి ఆయం మదనుగ్రహ ఏవ. ॥26॥

ఎన్నడైనను అట్టి జీవునికి తనపుట్టుక, ఆచరించు పనులు, వయస్సు, రూపము, విద్య, సంపదలు, ధనము మొదలైన భోగ విషయములపట్ల అహంకారము, మమకారములు తొలగినచో అది నా అనుగ్రహమే. 26

శ్లో॥ మానస్తంభ నిమిత్తానాం జన్మాదీనాం సమంతతః ।
సర్వశ్రేయః ప్రతీపానాం హంత ముహ్యేన్న మత్పరః॥27॥

టీ :- కథం తర్హి. ఙధువాదిభ్యోఽర్థసంపదః. అదదా ఇతి చేత్తత్రాహ మానేతి. మానఏతి స్తంభః అనమ్రతా తస్య నిమిత్తభూతానాం. సమంతతః సర్వశ్రేయః ప్రతికూలానాం జన్మాదీనాం. సత్స్వేఽపి. జన్మాదిభిరితి వా. హంత హేబ్రహ్మన్. మత్పరో న ముహ్యేత్. అతో భక్తస్యేచ్ఛయా సంపదోఽపి దదామి. అభక్తస్తు ముహ్యేదితి. తదహంకారాపమేవ తస్యానుగ్రహం కరోమీతి భావః. ॥27॥

అయితే ధృవుడు మొదలైన వారికి అపారమైన సంపదలు ఎందుకిచ్చితివి అనే దానిని చెప్పుచున్నాడు. గర్వమే అవినయము. దానికి కారణము జన్మ కర్మ వయో రూపైశ్వర్యాదులు. పరమార్థ తత్వావగాహనకు ప్రతికూలములైన ఈ జన్మాది కల్మషములు తోడైతే అయ్యో! వారి దుర్గతికి అంతెక్కడ? ఓ బ్రహ్మదేవా! నాకు అనన్యాశ్రితుడైన వాడు, నన్ను తప్ప దేనిని విశ్వసించి ఆశ్రయించనివాడు జన్మాదులైన ఎన్ని ప్రతికూలములు ఎదురైనను దేనికి మోహము చెందడు. అందువలన నా భక్తుల కోరిక ననుసరించి సంపదలు కూడా ఇత్తును. భక్తుడు కానివాడు సంపదాదులతో వ్యామోహ పడగలడని దానిని అపహరణ రూపముగా అతనిని అనుగ్రహింతును. (అసలే అవినయపరుడైన మానవునికి వయోరూప సంపదధికారములున్నచో (ఆస్తి) వానికెన్నటికి పరమార్థము తెలియదని అతనికి సంపదలు లేకుండ (నాస్తి) చేసినచో ఎన్నటికైనను అతనికి ఆత్మ విమర్శ (అభావ వైరాగ్యము ) కలుగునని అనుగ్రహించుట. సర్వసుఖములు అందుబాటులో నున్నను మోహము చెందనివారు (భావ వైరాగ్యము కలవారు) నా భక్తులు. నేను వారికి సంపదలిచ్చినను శ్రేయమే ). 27

శ్లో॥ ఏష దానవ దైత్యానా మగ్రణీః కీర్తి వర్ధనః ।
అజైషీ దజయాం మాయాం సీదన్నపి న ముహ్యతి॥28॥

ఇప్పుడితడు నాకు అనన్య భక్తుడైనందున ఇతరులెవ్వరునూ పొందలేని స్థితిని కలిగించుచున్నాని చెప్పుటకు బలి సంపూర్ణముగా వ్యామోహము లేనివాడైనాడని మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. యశోవంతుడైనవాడు దానవ వంశాగ్రగణ్యుడు. జయించవీలులేని మాయను (జన్మాది కల్మషములను) జయించినాడు. ప్రాణసంకటమునందును దేహాది వ్యామోహమును పొందలేదు. 28

శ్లో॥ క్షీణరిక్థ శ్చ్యుతః స్థానాత్ క్షిప్తో బద్ధశ్చ శత్రుభిః ।
జ్ఞాతిభిశ్చ పరిత్యక్తో యాతానా మనుయాపితః ॥29॥

ఇతడు ధనశూన్యుడు. ఇతనికి రాజ్యపదవి పోయినది. శత్రువులు బంధించినారు. నిరంతరము అనుసరించు చుండిన దాయాదులు వదిలి వెళ్ళినారు. 29

శ్లో॥ గురుణా భర్త్సితః శప్తో జహౌ సత్యం న సువ్రతః ।
ఛలై రుక్తో మయా ధర్మో నాయం త్యజితి సత్యవాక్॥30॥

టీ :- అస్య చేదానీం మత్పరత్వాదన్యైః దుష్ప్రాపమపి దాస్యామీతివక్తుం. తస్య మోహాభావ మాహ త్రిభిః. ఏష ఇతి. శ్లో. న హ్యేతస్మిన్కు లేక శ్చిన్నిస్సత్త్వః కృపణః పుమానిత్యాదినా. ఛలైరేవయయా ధర్మ ఉక్తః. తథాపి తం ధర్మం. అయం న త్యజతి. అతః సత్యవాక్. ॥28-30॥

కులగురువైన శుక్రాచార్యుడు బెదిరించి, శపించినను శ్రేష్ఠమైన నియమములుగల ఇతడు సత్యమును వీడలేదు. నేను " నహ్యే తస్మిన్కులే కశ్చిన్నిస్సత్వః కృపణః పుమాన్ " ఇతని వంశమున బలవంతుడు కాని వాడు కానీ, పిసినారికానీ, దీనుడుకానీ లేడని ఎన్నిమోసపుమాటలాడినను ఈయన ధర్మమును వదలని సత్యసంధుడు. 30

శ్లో॥ ఏషమే ప్రాప్తితస్థానం దుష్ప్రాప మమరైరపి ।
సావర్ణే రంతరస్యాయం భవితేంద్రో మదాశ్రయః॥31॥

టీ :- ఏషఇతి. మే మయా. మదాశ్రయః అహమేవాశ్రయః పాలకోయస్య సః. ॥31॥

ఇతనికి నేను కల్పించిన నా రక్షణలోని (సుతలాలయ) స్థానము దేవతలు పొందలేనిది. రాబోవు అష్టమ మన్వంతరమైన సావర్ణి మనువు కాలమున నన్నాశ్రయించిన ఇతడు ఇంద్రపదవిని అలంకరించగలడు. 31

శ్లో॥ తావత్సుతల మధ్యాస్థాం విశ్వకర్మ వినిర్మితమ్ ।
యన్నాదయో వ్యాధయశ్చ క్లమస్తంద్రా పరాభవః ।
నోపసర్గా నివసతాం సంభవంతి మమేక్షయా ॥32॥

టీ :- స్థానం ప్రాపిత ఇతి యదుక్తం. తదేవ స్థానమాహ తావదితి. తావత్సావర్ణిమన్వంతరపర్యంతం సుతలమధ్యాస్తాం. అధివ సత్విత్యర్థః. యద్యస్మిన్నివసతాం ఆధ్యాదయః మమేక్షయా న సంభవంతి.॥32॥

నేను ఇచ్చిన స్థానమని ముందు చెప్పిన దానికి ఇప్పుడు నిర్దేశించిన స్థానమును చెప్పుచున్నాడు. ఇప్పటి వైవస్వత మన్వంతరము ముగియువరకు సుతలాలయ మధ్యమున విశ్వకర్మ నిర్మించిన భవనమున ఇతడుండును. అక్కడ ఎలాంటి మానసిక, శారీరక బాధలు, అలసట, సోమరితనము, అవమానము, ఉత్పాతములు మొదలైనవేవియు నా రక్షణ ఉన్నందున కలుగవు. 32

శ్లో॥ ఇంద్రసేన మహారాజ ! యాహి భో భద్రమస్తుతే ।
సుతలం స్వర్గిభిః ప్రార్థ్యం జ్ఞాతిభిః పరివారితః ॥33॥

టీ :- ఏవం బ్రహ్మాణం ప్రత్యుక్త్వా కరుణాపరవశః సాక్షాద్బలిం ప్రత్యాహ చతుర్భిః ఇంద్రసేనేతి. ॥33॥

ఈ విధముగా విష్ణుమూర్తి బ్రహ్మదేవునికి బదులు చెప్పి అపారమైన దయతో పరవశించినవాడై సాక్షాత్తుగా బలిచక్రవర్తితోనే ఇట్లు చెప్పుచున్నాడు. ఓ ఇంద్రసేన మహారాజా ! సుతలము స్వర్గముకన్నా మిన్నయైనది. దేవతలునూ అందుండ కోరుదురు. నీవు, నీ పరివారము, దాయాదులతో ఆవృతుడవై అక్కడికి వెళ్ళుము. నీకు ఎల్ల శుభములు కలుగును. 33

శ్లో॥ న త్వామభి భవిష్యంతి లోకేశాః కిముతా పరే ।
త్వచ్ఛాసనాతిగాన్ దైత్యాన్ చక్రంమే సూదయిష్యతి॥34॥

టీ :- నేతి. త్వచ్ఛాసనం అతిగచ్ఛంతి అతివర్తంత ఇతి తథా. తాన్. ॥34॥

అక్కడ లోకపాలకులును నిన్ను తాకలేరు. ఇతరుల సంగతి చెప్పనేల? నీ శాసనమును అతిక్రమించిన దానవులను నా సుదర్శన చక్రము చంపగలదు. 34

శ్లో॥ రక్షిష్యే సర్వతోఽహంత్వాం సానుగం సపరిచ్ఛదమ్ ।
సదా సన్నిహితం వీర ! తత్రమాం ద్రక్ష్యతే భవాన్॥35॥

ఇంత ఉన్నతస్థితి కలిగినను నీకు దూరమై ఎడబాటు కలుగును కనుక ఆ సుతలాలయ స్థితిని తిరస్కరించుటను గుఱించి చెప్పుచున్నాడు. ఓ వీరుడా ! అక్కడ ఎల్లప్పుడు నేను నిన్ను, నీవారిని, నీ పరికరములను రక్షించగలను. నిరంతరము నీవెంటనంటి ఉన్న నన్ను నీవు నిరంతరము దర్శించగలవు. 35

శ్లో॥ తత్రదానవ దైత్యానాం సంగాత్తే భావ ఆసురః ।
దృష్ట్వా మమానుభావం వై సద్యః కుంఠో వినంక్ష్యతి॥36

టీ :- తథాపి భగవద్వియోగాత్తదనిచ్ఛంతం ప్రత్యాహ రక్షిష్య ఇతి. తత్రేతి. సంగాద్య ఆసురో భావః స వినంక్ష్యతి.॥35, 36॥

అక్కడ దానవుల, దైత్యుల కూడికను పొందిన నీ రాక్షస భావము నా (భక్తి) ప్రభావముచేత అవిలంబముగా విరిగి సమూలముగా నశించును. 36

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే
బలి వామన సంవాదో నామ ద్వా వింశోఽధ్యాయః

శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే బలి వామన సంవాదమను
ద్వా వింశోధ్యాయము ఆంధ్రానువాదము.

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ త్రయోవింశే బలౌయాతే సుతలం సపితామహే ।
ఉపేంద్రేణ దివంగత్వా పూర్వవన్మోదతే హరిః॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యుక్తవంతం పురుషం పురాతనం
మహానుభావో஽ఖిల సాధుసమ్మతః ।
బద్ధాంజలిర్బాష్ప కళాకులేక్షణః
భక్త్యుద్గతో గద్గదయా గిరా஽బ్రవీత్ ॥1॥

టీ:-"త్రయోవంశే బలౌయాతే సుతలం సపితామహే, ఉపేంద్రేణ దివంగత్వా పూర్వవన్మోదతే హరిః"ఇతీతి. బాష్పస్య కళాభిః. బిందుభిః ఆకులే ఈక్షణే యస్య. భక్త్యా ఉద్గళః ఉత్కంఠః.॥1॥

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

ఇరువది మూడవ అధ్యాయమున తాతగారైన ప్రహ్లాదుని కలిసి బలి సుతలాలయమునకు వెళ్ళుట, ఇంద్రుడు వామనునితో కలిసి స్వర్గమునకు వెళ్ళి యథా పూర్వముగా ఆనందించుట చెప్పబడును.

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా పరాత్పరుడు చెప్పుచుండగా సమస్త సాధుజనాగ్రగణ్యుడు, మహానుభావుడు, సర్వస్వాత్మ నివేదనపరుడైన బలిచక్రవర్తి చేతులు జోడించి ఆనంద బాష్పములతో కన్నులు చెమ్మగిల్లినవాడై అనన్య భక్తితో కూడిన ఉత్కంఠతో, బొంగురు గొంతుతో ఆ పరమాత్మతో ఇట్లన్నాడు. 1

**బలిరువాచ :-**

శ్లో॥ అహెూ ప్రణామాయ కృతః సముద్యమః
ప్రసన్న భక్తార్థ విధౌ సమాహితః ।
యల్లోకపాలై స్త్వదనుగ్రహెూఽమరైః
అలబ్ధ పూర్వోఽపసదేఽసురేఽర్పితః. ॥2॥

**బలి ఇట్లని చెప్పినాడు :-**

ఓ స్వామీ ! నీకు నమస్కరించుట అనునది ఎంతో మహిమ కలది. నీవు శరణాగతులైన నీ భక్తుల విషయమై ఎంత తీవ్రముగా తపింతువో (గజేంద్ర రక్షణలో ''ఛందోమయేన గరుడేన సముహ్యమానః। చక్రాయుధోభ్యగమ దాశు యతో గజేంద్రః" అని పూర్వము చెప్పబడినది). అదే విధముగా నీకు భక్తులు కానీ మావంటివారి విషయములో కూడా అంతే తీవ్రముగా అనుగ్రహించుటకు ఏకాగ్రతతో జాగరూకుడవై ఉందువు. ఎందుకనగా సత్వగుణముతో విరాజిల్లు లోకపాలకులైన ఇంద్రాదిదేవతలు ఎన్నడూ పొందలేని స్థితి అనగా రజోగుణ దోషముతో నున్న నా సమీపమున సేవకుడవై నిలుచుట అనే అపారమైన అనుగ్రహమును నాకు ప్రసాదించితివి. ఓ పరమేశ్వరా ! నేను యుద్ధమున జయించిన ముల్లోకములను సమర్పించవలెనని యుంటిని. నమస్కారముకూడా చక్కగా ఇంకా చేయలేదు. కేవలము నమస్కరించు ప్రయత్నము మాత్రమే చేసితిని. అంతమాత్రముననే కోట్లకొలది నిత్యనైమిత్తిక కర్మలు, తపస్సులు, దానములుచేసినను లభ్యముకాని నీ అనుగ్రహమును పొందితిని. నీకు చేసిన నమస్కారము ఎంతో అద్భుత ప్రభావము కలది అని ఆశ్చర్యము పొందవలసినదే. 2

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యుక్త్వా హరిమానమ్య బ్రహ్మాణం సభవంతతః ।
వివేశ సుతలం ప్రీతో బలిర్ముక్తః సహాసురైః ॥3॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఇట్లు చెప్పి బలిచక్రవర్తి శ్రీహరికి ప్రణమిల్లి పిమ్మట అక్కడ శివునితోనున్న బ్రహ్మదేవునికిని నమస్కరించినాడు. వరుణ పాశములనుండి విడువబడి మహానందముతో తన దానవానుచరులతో కూడి సుతలాలయమునకు వెళ్ళుటకు సిద్ధపడినాడు. (ఇక్కడ ముందు బలితో కలిసి ప్రహ్లాదుడును సుతలమునకు వెళ్ళుట చెప్పబడెను). 3

టీ :- అహో ఇతి. అహో. త్వత్ప్రణామస్య. మహిమా యదర్థం కృతః. సముద్యమ ఏవ ప్రపన్నానాం భక్తానాం. యోఽర్థః తస్య విధౌ అభక్తేఽపి తస్య సంపాదనే సమాహితః అప్రమత్తస్సన్ స్థితః. కుతః. యేనోద్యమేన లోకపాలైరమరైః సత్త్వప్రధానైరపి. అలబ్ధపూర్వస్త్వదనుగ్రహః అపశదే నీచే. రాజసే మయి. అర్పితః అయం భావః. పరమేశ్వరాయ తుభ్యం. అహం వరాకస్త్రిలోకీం దత్తవానిత్యేతదాస్తామ్. ప్రణామోఽపి న సమ్యక్కృతః కింతు తదర్థముద్యమమాత్రం కృతం తేన తపోదానాదికర్మకోటిభిరప్య లభ్యస్తదనుగ్రహస్సంపాదితః. అహో త్వత్ప్రణామప్రభావాశ్చర్యమితి ॥2,3॥

శ్లో॥ ఏవ మింద్రాయ భగవాన్ ప్రత్యానీయ త్రివిష్టపమ్ ।
పూరయిత్వాదితేః కామమశాసత్సకలం జగత్ ॥4॥

ఈ విధముగా పరమాత్ముడు స్వర్గమున ఇంద్రుని మరల ప్రతిష్ఠించి అదితి కోరికను నెరవేర్చి యధేచ్ఛముగా ఉపేంద్ర రూపమున సర్వజగత్తును పరిపాలించినాడు. 4

శ్లో॥ లబ్ధ ప్రసాద నిర్ముక్తం పౌత్రం వంశధరం బలిమ్ ।
నిశామ్య భక్తి ప్రవణః ప్రహ్లాద ఇద మబ్రవీత్ ॥5॥

టీ :- ఏవమితి. అశాసత్ ఉపేంద్రస్సన్ పాలయామాస.॥4,5॥

పరమాత్ముని అనుగ్రహమును పొంది వరుణ పాశములనుండి విడువబడిన కులదీపకుడైన మనుమడు బలిచక్రవర్తిని చూచి భక్తశిఖామణియైన ప్రహ్లాదుడు శ్రీమహా విష్ణువుతో ఇట్లు చెప్పినాడు. 5

ప్రహ్లాద ఉవాచ :-

శ్లో॥ నేమం విరించో లభతే ప్రసాదం
న శ్రీర్న శర్వః కిముతా పరేతే ।
యన్నోఽసురాణామసి దుర్గపాలో
విశ్వాభి వంద్యై రపి వందితాంఘ్రిః ॥6॥

టీ :- నేతి.దుర్గపాలః రక్షిష్యే సర్వతోఽహమిత్యుక్తత్వాత్. ॥6॥

ప్రహ్లాదుడు ఇట్లు చెప్పినాడు :-

" రక్షిష్యే సర్వతోహమ్ " సర్వవిధముల నీ దుర్గ రక్షకుడనై (సేవకుడనై) కాపాడుదునన్న నీ ఇంత గొప్ప అనుగ్రహము ఆ బ్రహ్మదేవునికి గానీ, లక్ష్మీ దేవికి గానీ, పరమశివునికిగానీ లభించలేదు. ఇక మిగిలిన వారి గతించి చెప్పనేల? సర్వ జగత్తు చేత పూజలందుకొను బ్రహ్మేశ్వరాదులచేతను శిరసంటి పాదనమస్కారములందు నీవు తుచ్ఛమైన రజోగుణ దూషితులమైన మావంటి అసురులకు కూడా పరిచారకత్వమును స్వీకరించితివి. 6

శ్లో॥ యత్పాదపద్మ మకరంద నిషేవణేన
బ్రహ్మాదయః శరణదాశ్నువతే విభూతీః ।
కస్మాద్వయం కుసృతయః ఖలయో నయస్తే
దాక్షిణ్య దృష్టి పదవీం భవతః ప్రణీతాః ॥7॥

టీ :- యదితి. హే శరణద ఆశ్రయద. యే కుసృతయః

రక్షించి పాలించు ఓ దేవా ! చెడ్డనడవడితో , పాపముతో కూడిన క్షేత్రములందు భయంకరమైన జన్మను పొందిన రాక్షసులము మేము. అట్టి మాకు కరుణా కటాక్షముతో ఇంత గొప్పస్థితిని ఎందుకు కలిగించితివి? సన్మానముతో మనసు నిండిన దయతో కూడిన నీ చూపులవలననే ఇంతటి స్థితికై సంస్కరింపబడితిమి. (పొందితిమి) త్వత్ పాద కమలముల మకరందమును

దుర్వృత్తాః. ఖలయోనయః ఉగ్రజాతయశ్చ. తే వయం తస్య భవతో దాక్షిణ్యదృష్టేః పదవీం కస్మాద్ధేతోః ప్రణీతాః ప్రాపితాః. బహుమానేన చిత్తానువర్తనం దాక్షిణ్యం. తేన యా దృష్టిః తద్విషయతాం ప్రాపితాః. ॥7॥

సేవించిన బ్రహ్మాది దేవతలు నీ దయవలన కలిగిన తమ తమ సంపదలు తామనుభవించుచున్నారు. 7

శ్లో॥ చిత్రం తవేహిత మహోఽమిత యోగమాయా
లీలా విసృష్ట భువనస్య విశారదస్య ।
సర్వాత్మనః సమదృశో విషమ స్వభావో
భక్త ప్రియో యదసి కల్పతరు స్వభావః. ॥8॥

టీ :- భక్తప్రియత్వాదితి చేత్తర్హి..చిత్రమితి. ఏవం తవేహితం అహో చిత్రం. కిం తత్. సర్వాత్మనః. సముదృశశ్చ. స్వభావో విషమ ఇతి యత్. సర్వాత్మత్వే చిత్రచరి త్రత్వే చ హేతుః. అమితా అచింత్యా యోగమాయా. తయా లీలయా. విసృష్టాని విరచితాని యేన తస్య అహో మితయోగేత్యత్ర సంధిరార్షః సమదృక్త్వే హేతుః. విశారదస్య సర్వజ్ఞస్య అథవా. భక్తాప్రియత్వేఽపి తవ వైషమ్యం నాస్త్యేవ యతః కల్పతరుస్వభావస్సక్. భక్తప్రియోఽసి. న హి కల్పతరురాశ్రితానామేవ కామాన్ పూరయన్నపి విషమో శవతీత్యర్థః. ॥8,9॥

భక్త ప్రియత్వమే నీకు పరాకాష్ట అయినపుడు ఇదే దానికి పరమావధి. అనగా ఇంత గొప్పగా కరుణించుటయే చిత్రాతి చిత్రము. సర్వాత్మత, సర్వసమతలు స్వభావమైన నీకు అనగా ఉచ్ఛనీచములు, స్వ పర భేదములు, శత్రుమిత్రులు, జడచేతనములు మొదలైన ద్వంద్వములకు అతీతుడవైన నీకు భేద ( విషమ ) దృష్టి ఎట్లు కలుగును. ఈ విధమైన అద్వైత రూపమైన విచిత్ర వర్తనకు కారణము చెప్పుచున్నాడు. అత్యంతముగా ఎరుగరానిది యోగమాయ. అది అతని లీలా విలాసము ( అవ్యక్త నామ్నీ పరమేశ శక్తిః - శంకరులు ) . దానిచేత సృశింపబడినవి ఎల్లలోకములు. ఇప్పుడు సమదృష్టికి కారణము చూపుచున్నాడు. తన మాయా లీలా విలాసము కలిగిన సర్వవిషయముల సంపూర్ణతత్వ మెఱిగినందున కానీ, కేవలము భక్త ప్రియత్వము వలన కానీ నీకు భేద భావన ఉండుటకు వీలు లేదు. ఎందుకంటే నీవు కల్పతరువు వంటి స్వభావముతో భక్త ప్రియుడవైనావు. కల్పవృక్షము తనను ఆశ్రయించిన వరెవరైనను వారి కోరికలను తీర్చునే కానీ వారి గుణ విశేషములను బట్టి ప్రవర్తించదు. అనగా ఎల్లప్పుడూ ఎవ్వరినీ విరోధించదని భావము. (ఇక్కడ 'అహోఽమిత' అని సంధి వచ్చుటకు ఆర్షత్వమే కారణము). 8

**శ్రీ భగవానువాచ :-**

శ్లో॥ వత్స ప్రహ్లాద భద్రం తే ప్రయాహి సుతలాలయమ్ ।
మోదమానః స్వ పౌత్రేణ జ్ఞాతీనాం సుఖమావహ ॥9॥

**శ్రీహరి ఇట్లు చెప్పినాడు :-**

ఓ నాయనా ప్రహ్లాదా ! నీకు శుభము కలుగును. నీ మనుమనితో, నీ వారితో కలిసి సంతోషముతో సుఖమును పొందుదువు. నీవును సుతలాలయమునకు వెళ్ళుము. 9

శ్లో॥ నిత్యం ద్రష్టాసి మాం తత్ర గదాపాణి మవస్థితమ్ ।
మద్దర్శన మహాహ్లాద ధ్వస్త కర్మ నిబంధనః ॥10॥

అక్కడ గదాధరుడనై ఎదురుగా ఉన్న నన్ను నీవు నిరంతరము దర్శింతువు. నా దర్శనమువలన కలిగిన అనంత సంతోషముతో నీకు సర్వ కర్మ సంబంధమైన అజ్ఞానము పూర్తిగా నశించును. సంచితము నశించును. ఆగామి (కర్మ) కలుగదు. ప్రారబ్దము పరిసమాప్తమగును. శుద్ధసత్వ స్థితి కలుగును. 10

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఆజ్ఞాం భగవతో రాజన్ ! ప్రహ్లాదో బలినా సహ ।
బాఢమిత్యమిత ప్రజ్ఞో మూర్ధ్న్యాధాయ కృతాంజలిః॥11॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఓ రాజా ! నిర్మల జ్ఞానియైన ప్రహ్లాదుడు పరమాత్మునికి శిరస్సుతో నమస్కరించి మనుమడు బలితో కలిసి సరే అని ( సుతలమును ప్రవేశించెనని తర్వాతి శ్లోకముతో అన్వయము). 11

శ్లో॥ పరిక్రమ్యాది పురుషం సర్వాసుర చమూపతిః ।
ప్రణతస్తదను జ్ఞాతః ప్రవివేశ మహాబిలమ్ ॥12॥

పరమాత్ముని సమీపించి సమస్త దానవ పతియైన ప్రహ్లాదుడు నమస్కరించి ఆయన అనుమతిని పొంది సుతలము చేరుటకు ప్రవేశద్వారమైన గుహలో ప్రవేశించినాడు. 12

శ్లో॥ అథాహోశనసం రాజన్ ! హరిర్నారాయణోఽ ఽంతికే ।
ఆసీన మృత్విజాం మధ్యే సదసి బ్రహ్మవాదినామ్॥13॥

ఓ రాజా ! తర్వాత శ్రీమన్నారాయణుడు తన సమీపమున బ్రహ్మవేత్తలైన యాజకుల మధ్య సదస్సులో కూర్చునియున్న శుక్రాచార్యుని (తో ఇట్లు చెప్పినాడు) (బలిని బంధించుటతో అతని అపరాధమును హరించినవాడు హరి యని భావము). 13

టీ :- నిత్యమితి. మద్దర్శనేన. యో మహానాహ్లోదః, తేన ధ్వస్తం కర్మబంధ నమజ్ఞానం యస్య. ॥10-13॥

శ్లో॥ బ్రహ్మన్ సంతను శిష్యస్య కర్మచ్ఛిద్రం వితన్వతః ।
యత్తత్కర్మసు వైషమ్యం బ్రహ్మదృష్టం సమం భవేత్॥14॥

ఓ బ్రాహ్మణోత్తమా ! దీక్షను పూని యాగమును నిర్వహించుచు మధ్యలో నిష్క్రమించిన నీ ప్రియ శిష్యుడు చేయకుండా మిగిల్చిన కొదువలను పూర్తిచేసి యజ్ఞ పరిసమాప్తి చేయుము. యజమాని లేకుండా ఎట్లు నిర్వర్తించవలెనో చెప్పవలసిన పని లేదని చెప్పుచున్నాడు. బ్రహ్మదేవుడు చెప్పినదే వేదము. బ్రాహ్మణుడు ఆచరించినదే శాస్త్రము. ఇక ప్రత్యేకముగా అనుష్ఠించవలసినదేమున్నది. అనగా బ్రహ్మదృష్టి, బ్రాహ్మణదృష్టి సమానమని భావము . 14

టీ :- బ్రహ్మన్నితి. కర్మ వితన్వతః శిష్యస్య యత్. ఛిద్రమంతరం. న్యూనం జాతం. తత్సంతను విస్తారయ సంధత్స్వ. యజమానం వినా కథం సంధాతవ్యమితి న వాచ్యమిత్యాహహ యత్తదితి. బ్రహ్మదృష్టం బ్రాహ్మణైర్ద్ర ృష్టమేవ. సమం భవేత్ కిం పునరనుష్ఠితమిత్యర్థః. ॥14॥

**శుక్ర ఉవాచ :-**

శ్లో॥ కుత స్తత్కర్మ వైశమ్యం యస్య కర్మేశ్వరో భవాన్ ।
యజ్ఞేశో యజ్ఞపురుషః సర్వభావేన పూజితః ॥15॥

సాక్షాత్తు భగవంతుడవైన నీవే ప్రత్యక్షముగా యజ్ఞకర్త అయిన బలిచక్రవర్తి పరిపూర్ణమైన ఏకాగ్రచిత్తముతో యథార్థముగా సమర్పించిన అర్ఘ్యపాద్యాది ద్రవ్యములతో పూజలందుకొన్న ఈ యాగమున కొదువ లెట్లేర్పడును? యజ్ఞేశుడు, యజ్ఞఫలదుడు అయిన యజ్ఞమయ పురుషుడే

టీ:- కుత ఇతి. భవాన్ యస్య సర్వేణాపి భావేన వస్తుమాత్రేణ పూజితః తస్య కర్మసు. కుతో వైషమ్యం. కథంభూతః కర్మణా మీశ్వరః ప్రవర్తకః యజ్ఞేశః యజ్ఞస్య ఫలదః యజ్ఞమయశ్చ పురుషః. ॥15॥

యజ్ఞకర్మ ప్రవర్తకుడైనందున ఇక అసంపూర్ణత ఎట్లుండును? (ఉండదని భావము). 15

శ్లో॥ మంత్ర తస్తంత్రతశ్ఛిద్రం దేశకాలార్హ వస్తుతః ।
సర్వం కరోతి నిశ్ఛిద్రం నామ సంకీర్తనం తవ ॥16॥

పూజ, కథ అటుండని. మంత్రము, తంత్రము, స్వరము మొదలైన వానిలో కలిగే పొరపాట్లు, తంత్ర క్రియ యందలి ముందు వెనుకలు, దేశము, కాలము, అర్హతలు, పాత్రత్వములు, వస్తువులు, సంభావనలు మొదలైన వాని విషయమై కలిగిన కొదువలు, పొరపాట్లు అన్నియు నీ నామములను సంకీర్తనము చేసిన వెంటనే సమసి పోవును. 16

శ్లో॥ తథాపి వదతో భూమన్ కరిష్యామ్యను శాసనమ్ ।
ఏతచ్ఛ్రేయః పరంపుంసాం యత్తవాజ్ఞాను పాలనమ్॥17॥

అయినప్పటికీ ఓ పరమాత్మా ! నీవు చెప్పిన విధముగా చేయుదును. పరమ పురుషుడవైన నీ ఆదేశమును ఆచరించుటయే పురుషులకు ఉత్తమమైన శుభము. 17

టీ :- ఆస్తాం తావత్పూజా. మంత్రత ఇతి. యస్మాన్మంత్రతః స్వరాది భ్రంశేన.తంత్రతః వ్యుత్క్రమాదినా. దేశతః కాలతశ్చ అర్హతః పాత్రతః వస్తుతస్తు దక్షిణాదినా. యచ్ఛిద్రం న్యూనం తత్సర్వం. తవానుకీర్తమా త్రవమేవ నిశ్ఛిద్రం కరోతి. ॥16,17॥

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ అభినంద్య హరే రాజ్ఞా ముశనా భగవానితి ।
యజ్ఞచ్ఛిద్రం సమాధత్త బలేర్విప్రర్షిభిః సహ ॥18॥

**శుక యోగి ఇట్లు చెప్పినాడు :-**

భగవంతుని యొక్క ఆదేశమును స్వీకరించిన పూజనీయుడైన శుక్రాచార్యుడు శ్రీహరికి నమస్కరించి బలిచక్రవర్తి యాజక పురోహితులను కూర్చుకొని యజ్ఞసమాప్తి చేయుటకు పూనుకొనెను. 18

శ్లో॥ ఏవం బలేర్మహీం రాజన్ ! భిక్షిత్వా వామనోహరిః ।
దదౌ భ్రాత్రే మహేంద్రాయ త్రిదివం యత్పరైర్హృతమ్॥19॥

ఓ రాజా ! ఈ విధముగా బలిచక్రవర్తి భూమిని వామనుడైన శ్రీహరి యాచించి స్వర్గమును తన సోదరుడైన దేవేంద్రునికి ఇచ్చినాడు. ఆ స్వర్గమును ఇంద్రుడు తన శత్రువుల చేతిలో అంతకు పూర్వము పోగొట్టుకొని యుండినాడు. 19

టీ :- ప్రతినంత్యేతి. ఇతి హరేరాజ్ఞాం ప్రతినంద్య బలేర్యజ్ఞఛిద్రం. సమాధత్త సందధే. పాఠాంతరే సమాధాయ. తస్యాజ్ఞాం సంపాదితవానితి శేషః. ॥18,19॥

శ్లో॥ ప్రజాపతి పతిర్బ్రహ్మా దేవర్షి పితృ భూమి పైః ।
దో భృంగ్వంగిరో ముఖ్యైః కుమారేణ భవేనచ ॥20॥

శ్లో॥ కశ్యపస్యాదితేః ప్రీత్యై సర్వ భూత భవాయచ ।
లోకానాం లోకపాలాఇనామకరో ద్వామసంపతిమ్॥21॥

అప్పుడు సర్వ ప్రజాపతులకు అధిపతియైన బ్రహ్మదేవుడు, దేవతలు, ఋషులు, పితృదేవతలు, రాజులు, దక్షుడు, భృగువు, అంగిరుడు మొదలైన ప్రజాపతులు, కుమారస్వామి, పరమేశ్వరుదు మొదలగు వారితో కూడి, కశ్యపుడు మొదలైన అధిపతుల ప్రీతికొఱకు, సర్వలోకములకు, లోకపాలురకు అధిపతిని చేసినాడు. 20,21

టీ :- ప్రజాపతిరితి.దేవాశ్చ ఋషయశ్చ మనవశ్చ భూమిపాశ్చ తైస్సహితః. ॥20,21॥

శ్లో॥ వేదానాం సర్వదేవానాం ధర్మస్య యశసః శ్రియః ।
మంగళానాం వ్రతానాం చ కల్పం స్వర్గాపవర్గయోః॥22॥

వేదములు, సర్వదేవతలు, ధర్మము, కీర్తి, సంపద, వ్రతములు, శుభములు, పరిపాలనా సామర్థ్యము, స్వర్గ మోక్షములు మొదలైన వాని ప్రీతి కొఱకు ( బ్రహ్మ యజ్ఞమును నిర్వహించినాడు ). 22

టీ :- నను లోకాదీనాం పతిరింద్రోఽ స్త్యేవ సత్యం. తథాపి దేవానామితి దేవాదీనాం కల్యం పాలనే దక్షం. ॥22॥

శ్లో॥ ఉపేంద్రం కల్పయాం చక్రే పతిం సర్వ విభూతయే ।
తదా సర్వాణి భూతాని భృషం ముముదిరే నృప!॥23॥

వామనుడు యజ్ఞపతిగా సర్వఐశ్వర్యముల కొఱకు బ్రహ్మదేవుడు యజ్ఞకర్మను పూర్తి చేసినాడు. ఓ రాజా ! అప్పుడు చరాచరజగత్తులన్నియు అపారముగా సంతసించినవి. ( సర్వలోకములకు నాథుడు ఇంద్రుడగుట సత్యమైనను వేదములను, వ్రతకల్పములను రక్షించుటకు సమర్థుడు వామనుడే (ఉపేంద్రుడే) అని ఆయననే పతిగా బ్రహ్మవ్రత కల్పమును నిర్వహించినాడు). 23

టీ :- ఉపేంద్రమితి. వామనముపేంద్రం. కల్పయాంచక్రే. ॥23॥

శ్లో॥ తతస్త్వింద్రః పురస్కృత్య దేవయానేన వామనమ్ ।
లోకపాలైర్దివం నిన్యే బ్రహ్మణా చానుమోదితః ॥24॥

అప్పుడు ఇంద్రుడు వామనుని అమూల్యమైన వస్త్రమాల్యాను లేపనాదులతో సత్కరించి దేవయానమున ఇతర లోకపాలురతో కూడి బ్రహ్మదేవుని అనుమతి పొంది స్వర్గమునకు వెళ్ళినాడు. 24

శ్లో॥ ప్రాప్యత్రిభువనం చేంద్ర ఉపేంద్ర భుజ పాలితః ।
శ్రియా పరమయాజుష్టో ముముదే గత సాధ్వసః ॥25॥

ఇంద్రుడు త్రిలోకాధిపత్యమును పొంది వామనుని పరాక్రమము చేత రక్షితుడై అపారమైన సంపద్భోగములను అనుభవించుచు సంతోషించెను. 25

శ్లో॥ బ్రహ్మా శర్వః కుమారశ్చ భృగ్వాద్యామునయోనృప ! ।
పితరః సర్వభూతాని సిద్ధావైమానికాశ్చయే ॥26॥

ఓ రాజా ! బ్రహ్మ, శివుడు, కుమారస్వామి, భృగువు మొదలైన మునులు, పితృదేవతలు, సర్వభూతములు, సిద్ధులు, దేవతలు (విష్ణువును కీర్తించి, అదితిని మెచ్చుకొనిరని తర్వాతి శ్లోకముతో అన్వయము). 26

శ్లో॥ సుమహత్కర్మ తద్విష్ణోః గాయంతః పరమాద్భుతమ్ ।
ధిష్ణ్యాని స్వాని తే జగ్మురదితించ శశంసిరే ॥27॥

ఆ జగన్నాథుని మిక్కిలి ఆశ్చర్యకరమై సర్వోత్కృష్టకార్యమును ( త్రివిక్రమ రూపధారణతో బలిచక్రవర్తిని కరుణించుట ) కీర్తించుచు, అంతటి అదృష్టమును తమకు కలిగించుటకు కారణమైన అదితిని మెచ్చుకొనుచు తమ తమ నెలవులకు వెళ్ళిరి. 27

శ్లో॥ సర్వమేతన్మయాఖ్యాతం భవతః కురునందన ! ।
ఉరుక్రమస్య చరితం శ్రోత్రూణామఘమోచనమ్॥28॥

ఓ వంశవర్ధనా ! నేను నీకు, నీ మిషతో ఎల్లరకు చెప్పిన లోకోత్తరమైన త్రివిక్రముని చరితమును విన్నవారందరి పాపములు నశించును. 28

టీ :- తత ఇతి. దేవయానేన మార్గేణ విమానేనవా.॥24-28॥

శ్లో॥ పారం మహిమ్న ఉరువిక్రమతో గృణానో
యః పార్థివాని విమమే స రజాంసి మర్త్యః ।
కిం జాయమాన ఉత జాత ఉపైతి మర్త్యః
ఇత్యాహ మంత్రదృగృషిః పురుషస్య యస్య॥29॥

చెప్పవలసినదంతయు ముగిసినదా అనే విషయమును చెప్పుచున్నాడు. అనేక విధములుగా విజృంభించిన త్రివిక్రముని అపారమైన మహిమ యొక్క కడపటి మేరను గ్రహించుచున్న మానవుడు (మరణము కలవాడు) పార్థివములైన పృథివీ సంబంధమైన జన్మాదివికారములు తనవి కాదని ఎంచును. ఈ భూమండలమునందలి పరమాణువులను లెక్కించుటకు

టీ :- ఏతచ్చరితం సర్వమాఖ్యాతమితి విశేషోక్త్యా. అన్యాన్యపి సంతీత్యుక్తం తానితర్హి నిశ్శేషాణి వర్ణనీయానీత్యపేక్షాయామాహ పారమితి. ఉరు బహుధా విక్రమతో విష్ణోర్మహిమ్నః పారం యో గృణానో భవతి సమర్థ్యః పార్థివాని రజాంస్యపి. విమమే గణితవన్. యథా. పార్థివపరమాణుగణనమశక్యం. తథా. విష్ణోర్గుణగణనమప్య శక్యమిత్యర్థః. తథా చ మంత్రః. శ్రు ."విషోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విషమే రజాగ్ంసి యో అస్కభాయ దుత్తరగ్ం సధస్థం విచక్రమాణస్త్రేథోరుగాయ" ఇత్యాది. ఏవమేవ మంతాంతరార్థం సూచయన్నాహ యస్య పురుషస్య పూర్ణస్య మహిమ్నః. పారం మంత్ర దృగృషిః వసిష్ఠ ఇతి. ఏవమాహ కథం కిం జాయమానో జాతో వా. ఉపైతి. న కోఽ పీతి వదన్ననంతత్వేనైవాహేత్యర్థః. తథా చ మంత్రః. శ్రు. "న తే విష్ణో జాయమానో న జాత" ఇతి. ॥29॥

సాధ్యముకాని విధముగా శ్రీహరి గుణములను లెక్కించుట కూడా అసాధ్యము. దానికి " విష్ణోర్నుకం వీర్యాణి " అనేది మంత్రము. ఈ మంత్రార్థమును సూచించుచు చెప్పుచున్నాడు. పరాత్పరుని తేజముయొక్క తుట్ట తుది హద్దు మంత్ర (నిరంతర మననముతో కూడిన దైవిక భావన సాంద్రత ) దృక్కు అయిన ఋషి వసిష్ఠుడు అని ఈ విధముగా చెప్పినాడు. పుట్టినవారుగానీ (భూతులు), పుట్టబోవువారుగానీ (భవిష్యులు) పరమాత్మ మహిమ పారమును పొందగలమని చెప్పువారెవ్వరును లేరని భావము. దీనికి " న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమంత మాప " అని మంత్రము. 29

శ్లో॥ యః ఇదం దేవ దేవస్య హరేరద్భుత కర్మణః ।
అవతారాను చరితం శృణ్వన్ యాతి పరాంగతిమ్ ॥30॥

టీ :- యితి. య ఇదం శృణ్వన్ గృణన్. భవతి సపరాం గతిం యాతి. ॥30॥

అద్భుత కర్మలు నిర్వహించు పరాత్పరుడైన శ్రీమహా విష్ణువుయొక్క అవతారములకు సంబంధించిన ఈ చరిత్రమును విన్నవారు ఉత్తమోత్తమ స్థితిని పొందుదురని ఫలశ్రుతి. 30

శ్లో॥ క్రియమాణే కర్మణీదం దైవే పిత్ర్యేథ మానుషే ।
యత్ర యత్రాను కీర్త్యేత తత్తేషాం సుకృతం విదుః॥31॥

టీ :- క్రియమాణ ఇతి. సుకృతం యథావత్కృతం విదుః. ॥31॥

దైవ సంబంధమైనవి (అర్చనాదులు), పితృదేవతలకు సంబంధించినవి (తల్లి దండ్రులు మొదలైన వారి మృతతిథులందు పిండాదికములర్పించుటలు), మానవులకు సంబంధించినవి (జాతకర్మోపనయన వివాహాదులు) మొదలైన కర్మలను ఆచరించునప్పుడు వామన చరితమును కీర్తించినచో అది వారి సుకృతమని తెలియుము. ఎంతచేసిన అంత పుణ్యమని భావము. 31

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టమస్కంధే వామనావతార చరితే త్రయో వింశోఽధ్యాయః

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే వామనావతార చరితమున త్రయోవింశోధ్యాయము ఆంధ్రానువాదము.**

శ్రీ గణేశాయ నమః

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

శ్లో॥ చతుర్వింశే ప్రసంగేన మత్స్యరూపస్య శార్ఙిణః ।
లీలోచ్యతే యతః సత్యవ్రత రక్షా మహార్ణవే॥

శ్లో॥ తనుం తనుం ప్రదర్శ్యాదౌ నిజైశ్వర్య నిదర్శనాత్ ।
మత్స్యం పృచ్ఛతి పృథ్వీశో లీలయా వామనోపమమ్॥

**రాజోవాచ :-**

శ్లో॥ భగవన్ ! శ్రోతుమిచ్ఛామి హరేరద్భుత కర్మణః ।
అవతార కథామాద్యాం మాయా మత్స్య విడంబనమ్॥ 1॥

టీ :- "చతుర్వింశే ప్రసంగేన మత్స్యరూపస్య శార్ఙిణః, లీలోచ్యతే యతః సత్యవ్రత రక్షా మహార్ణవే".తనుం తనుం విదర్శ్యాదౌ నిజైశ్వర్య నిదర్శనాత్, మత్స్యం పృచ్ఛతి పృథ్వీశో

శ్రీ పరమహంసాస్వాదిత చరణకమల చిన్మకరందాయ భక్తజనమానస నివాసాయ శ్రీరామచంద్రాయ నమః

ఇరువది నాలుగవ అధ్యాయమున ప్రసంగవశమున శ్రీహరి ధరించిన మత్స్యావతారమున మహాసముద్రమునుండి సత్యవ్రతుని రక్షించు విష్ణుమాయావిలాసము చెప్పబడును.

తన అష్ట సిద్ధులతో కూడిన ఈశ్వర భావమును చూపుటకు అణిమాశక్తి సామర్థ్యముతో ( మిగుల చిన్న పరిమాణమును పొందుటతో ) ముందుగా విలాసముగా వామనరూపము వంటి చిన్న శరీరమును ప్రదర్శించిన ఆదిమత్స్యమును రాజు అడుగుచున్నాడు.

**రాజు అడుగుచున్నాడు :-**

ఓ స్వామీ ! పరమాశ్చర్యకరమైన కార్యములను నిర్వహించు శ్రీహరి యొక్క అవతారములను వివరించు కథలందు మాయతో మత్స్యరూపమును ధరించిన ఆ మొదటి అవతార కథను వినగోరుచున్నాను. 1

లీలయా వామనోపమమ్. భగవన్నితి. మయాయా. మత్స్యవిడంబనం మత్స్యరూపానుకరణం యస్యాంతాం. ॥1॥

శ్లో॥ యదర్థ మదధా ద్రూపం మాత్స్యం లోక జుగుప్సితమ్ ।
తమః ప్రకృతి దుర్మర్షం కర్మ గ్రస్తఇవేశ్వరః ॥2॥

టీ :- నను కస్మాదకస్మాదేవ మత్స్యావతారశ్రవణేచ్ఛా. వామనావతార సాదృశ్యాదిత్యాహ. ద్వాభ్యాం. యదర్థమితి. దుర్మర్షం దుస్సహం. ॥2॥

ఇక్కడ ఇప్పుడు హఠాత్తుగా మత్స్యావతారకథను వినవలెనని కోరిక ఎందుకు కలిగినది? వామనమూర్తివలె చిన్న శరీరము కలిగియుండుట వలన అని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. పరమేశ్వరుడు కూడా లోకమున మిక్కిలి కర్మపీడితుడైన జీవునివలె దుర్వాసనతో కూడి నిరంతరము చీకటిలో (సముద్ర గర్భమున) అసహ్యకరమై ఉండు స్వభావముగల సహించుటకు వీలులేని దుష్టకర్మలతో నుండు చేప రూపమును ధరించుటకు కారణమేమి? 2

శ్లో॥ ఏతన్నో భగవన్ సర్వం యావద్వక్తు మర్హసి ।
ఉత్తమ శ్లోక చరితం సర్వలోక శుభావహమ్ ॥3॥

శ్రీహరి బలిచక్రవర్తిని అనుగ్రహించుటకు అసహ్యకరమైన భిక్షుకుని రూపమును ధరించిన కథను తెలిపితిరి. ప్రస్తుతము లోకమున మిక్కిలి నీచ జన్మగా భావింపబడు చేపరూపమును ఎందుకు శ్రీహరి ధరించినాడు? ఓ యోగీంద్రా ! పరమాత్ముడైన శ్రీమహా విష్ణువు అవతారకథలు ఎల్లలోకములకు సుఖమును కలిగించును. అందువలన మీరు వాటిని వివరించవలసినదని పరీక్షిత్తు అడిగినాడు. ఆయనకు శుకయోగీంద్రుడు వినిపించిన కథను సూతమహాముని శౌనకులకు చెప్పినాడు. 3

**సూత ఉవాచ :-**

శ్లో॥ ఇత్యుక్తో విష్ణురాతేన భగవాన్ బాదరాయణిః ।
ఉవాచ చరితం విష్ణోర్మత్స్యరూపేణ యత్కృతమ్ ॥4॥

టీ :- ఏతదితి. బలేరనుగ్రహాయ జుగుప్సితమపి యాచక రూపం ధృతవానితి యుక్తముక్తం. యదర్థం తు లోకజుగుప్సితం మాత్స్యం రూపమధారయత్. ఏతన్నో యథావద్వక్తుమర్హసీత్యర్థః. ॥3,4॥

**సూతమహాముని ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా రాజు అడిగిన పిమ్మట శుకమహర్షి శ్రీమహావిష్ణువు మత్స్యావతారమున చేసిన ఘనకార్యముల విషయమును వివరించుచున్నాడు 4

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ గోవిప్ర సుర సాధూనాం ఛందసామపిసేశ్వరః ।
రక్షా మిచ్ఛం స్తనూర్దత్తే ధర్మస్యార్థస్య చైవహి ॥5॥

టీ :- సామాన్యేనావతారప్రయోజనమాహ గోవిప్రేతి. ॥5॥

**శుక మహర్షి ఇట్లు చెప్పిరి :-**

మత్స్యావతారమునకు సాధారణమైన ప్రయోజనమే ఉన్నదని చెప్పుచున్నారు. గోవులు, బ్రాహ్మణులు, దేవతలు, సజ్జనులు, వేదములు మొదలైన వాటిని రక్షించుటకై పురుషార్థములు ముఖ్యముగా ధర్మమును, అర్థమును కాపాడుటకు పరమేశ్వరుడు చేపరూపమును ధరించినాడు. 5

శ్లో॥ ఉచ్చావచేషు భూతేషు చరన్వాయురివేశ్వరః ।
నోచ్చావచత్వం భజతే నిర్గుణత్వాద్ధియోగుణైః ॥6॥

టీ :- జుగుప్సితత్వం పరిహరతి. ఉచ్చావచేష్వితి. ధియో గుణైర్యాన్యుచ్చావచాని భూతాని. తేషు నియంతృత్వేన

అసహ్యత్వమును పరిహరించి చెప్పుచున్నాడు. భగవంతుడు సత్వ రజస్తమస్సులనే గుణములకు అతీతుడైనందున ఆయనకు హెచ్చుతగ్గులు లేవు. బుద్ధిగుణముచేత జీవరాశిలో ఉచ్చమైనది, నీచమైనది అనే భేదము లేకుండా సర్వ జీవుల యొక్క జన్మ కర్మాదులను నియమించు చుండుటవలన నిర్గుణుడైన పరమాత్మ ఉచ్చ నీచములను భావించడు. సత్వము, రజస్సు,

చరన్నపీశ్వరః. నోచ్చావచత్వం భజతే నిర్గుణత్వాత్ శుద్ధసత్వమయైర్మత్స్యాద్యవతారైః ఉచ్చావచత్వశంకా క్వేతి భావః. ॥6॥

తమస్సు అని పరమాత్మ స్వభావము మూడు విధములుగా విభాగింపబడినప్పుడు మాత్రమే అవి గుణములగును. అట్లుగాక రజస్తమములు రెండును సత్వమునందే అణిగి యున్నచో అది శుద్ధ సత్వము అనబడును. ఇది నిర్వికారమైనందున గుణముగా పరిగణకు రాదు. కనుక దీనిని నిర్గుణ మందురు. సర్వజీవులకు ఇదే చిట్టచివరి ఆశ్రయస్థానము. అట్టి ఈ శుద్ధసత్వమయములైన చరాచరములలో చేప మొదలగు విధముగా కేవలము బైటకు కనబడు ఆకారములందు ఉచ్చనీచముల శంకకు అవకాశమే లేదని భావము. పదార్థము ఒక్కడే అయినపుడు ఆకారమేదైనను వస్తుభేదము కలుగదు (కుండ, కడవ, కాగు అని ఆకారములందు భేదమున్నను మట్టిలో భేదములేదు). 6

శ్లో॥ ఆసీదతీవ కల్పాంతే బ్రాహ్మో నైమిత్తికోలయః ।
సముద్రోప ప్లుతాస్తత్ర లోకా భూరాదయో నృప ॥7॥

టీ :- విశేషతో మత్స్యావతారప్రయోజనమాహ త్రిభిః ఆసీదితి. బ్రహ్మణో నిద్రాయాం భవో బ్రాహ్మః తేనైవ నిమిత్తేన జాతోనైమిత్తిక సముద్రే ఉపప్లుతాః నిమగ్నాః. ॥7॥

ఇప్పుడు మత్స్యావతార ప్రయోజనమును మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. కల్పాంతమున, ప్రళయకాలమున బ్రహ్మ నిద్రించు స్థితియందుండుటను బ్రాహ్మము ( సుషుప్తి ) అందురు. బ్రహ్మ సుషుప్తి కారణముచేత ( నిమిత్తముచేత ) కలిగినది నైమిత్తికము ( ప్రసంగవశమున ఒక ప్రత్యేకసమయమున మాత్రమే కలుగునది నైమిత్తికము. ఎల్లప్పుడు సహజముగా నుండునది నిత్యము ) . సముద్రమున భూమి మొదలైన సర్వలోకములు మునిగిపోయినవి. 7

శ్లో॥ కాలేనా గత నిద్రస్య ధాతుః శిశయిషోర్బలే ।
ముఖతో నిస్సృతాన్వేదాన్ హయగ్రీవోఽంతికేఽహరత్ ॥8॥

టీ :- కాలేనేతి అంతికే నిస్సృతాన్. ॥8॥

ప్రళయకాలమున గాఢనిద్రలో మునిగిన బ్రహ్మదేవుని (నాసారంధ్రములనుండి) నిశ్వాసవాయువుతో ముఖమునుండి బైటకు జారిన వేదములను సమీపమున నున్న మహాబలవంతుడైన హయగ్రీవ దనుజుడు అపహరించినాడు. 8

శ్లో॥ జ్ఞాత్వా తద్దానవేంద్రస్య హయగ్రీవస్యచేష్టితమ్ ।
దధార శఫరీరూపం భగవాన్ హరిరీశ్వరః ॥9॥

టీ :- జ్ఞాత్వేతి శఫరీ రూపం మత్స్యరూపం. ॥9॥

రాక్షసేశ్వరుడైన హయగ్రీవదనుజుడు వేదములను అపహరించిన విషయమును తెలిసి సర్వనియామకుడైన భగవంతుడు శ్రీహరి చేపరూపమును ధరించినాడు. 9

శ్లో॥ తత్ర రాజఋషిః కశ్చిన్నామ్నా సత్యవ్రతో మహాన్ ।
నారాయణ పరోఽతప్యత్తపః స సలిలాశనః ॥10॥

టీ:-ప్రయోజనా:తరం చ లీలాప్రకారం చాహ తత్రేత్యాదినాయావ దధ్యాయపరిసమాప్తి. ॥10॥

మత్స్యావతారమునకు మరొక ప్రయోజనకరమైన భగవంతుని విలాసమును చెప్పుచున్నాడు. అక్కడ సత్యవ్రతుడను పేరుగల ఒక గొప్ప రాజర్షి శ్రీహరి పాదతత్పరుడై జలమును మాత్రమే ఆహారముగా స్వీకరించుచు కఠోరమైన తపమును ఆచరించినాడు. 10

శ్లో॥ యోసావస్మిన్మహాకల్పే తనయః స వివస్వతః ।
శ్రాద్ధదేవో ఇతి ఖ్యాతో మనుత్వే హరిణార్పితః ॥11॥

సూర్యపుత్రుడైన ఆ సత్యవ్రతుడే ఇప్పటి మహాకల్పమున శ్రాద్ధదేవుడను పేరుతో ప్రఖ్యాతిచెంది ఈ సప్తమమన్వంతరమున శ్రీమహావిష్ణువుచే మను స్థానమున నియమితుడైనాడు. 11

టీ :- య ఇతి. స ఏవ శ్రాద్ధదేవ ఇతి ఖ్యాతః. ॥11॥

శ్లో॥ ఏకదా కృతమాలాయాం కుర్వతో జలతర్పణమ్ ।
తస్యాంజల్యుదకే కాచిచ్ఛఫర్యేకాభ్యపద్యత ॥12॥

ఒకనాడు ఆ సత్యవ్రతుడు కృతమాలా నదియందు అర్ఘ్యప్రదానము చేయుటకై ఆయన దోసిలితో నీటిని గ్రహించగా అందులో ఒకానొక చిన్న చేపపిల్ల వచ్చిచేరినది. 12

శ్లో॥ సత్యవ్రతోఽంజలిగతాం సహతో యేన భారత ! ।
ఉత్ససర్జ నదీతోయే శఫరీం ద్రవిడేశ్వరః ॥13॥

ఓ కురువీరా ! ద్రవిడ దేశాధిపతియైన ఆ సత్యవ్రతుడు తన దోసిట నీటితో కూడివున్న చేపపిల్లను నదీ జలమునందు విడిచి పెట్టినాడు. 13

శ్లో॥ తమాహసాతి కరుణం మహాకారుణికం నృపమ్ ।
యాదేభ్యో జ్ఞాతి ఘాతిభ్యో దీనాం మాం దీనవత్సల ! ।
కథం విసృజసే రాజన్ ! భీతామస్మిన్ సరిజ్జలే ॥14॥

ఆ చేపపిల్ల మిక్కిలి దయనీయముగా అపారమైన దయగలిగిన ఆ సత్యవ్రతమహారాజుతో ఇట్లని పలికినది. ఓ రాజా ! ఆశ్రితరక్షకుడా ! నీవు నన్ను నా దాయాదులైన పెద్దచేపలతో దెబ్బతిని ఆపద పొందగలుగు ఈ నదీజలమునందు భయపడు నన్ను ఎందుకు విడుచుచున్నావు ( ఇక్కడ నాకు రక్షణలేనందువలననే నీ దోసిటచేరి నీ ఆశ్రయమును పొందిన నన్ను మరల ఆపద పాలు చేయవద్దని భావము). 14

శ్లో॥ తమాత్మనోఽనుగ్రహార్థం ప్రీత్యా మత్స్య వపుర్ధరమ్ ।
అజానన్రక్షణార్థాయ శఫర్యాః స మనోదధే ॥15॥

మత్స్యావతారమును ధరించిన శ్రీమహావిష్ణువని గ్రహించలేక రాజు దానిని దయతో రక్షించుటకు నిశ్చయించుకొనెను. 15

శ్లో॥ తస్యా దీనతరం వాక్యమాశ్రుత్య సమహీపతిః ।
కలశాప్సు నిధాయైతాం దయాళుర్నిన్య ఆశ్రయమ్॥16॥

ఆ రాజు చేపపిల్ల మిక్కిలి దీనమైన మాటలు విని దయగలవాడై ఆశ్రమమునకు తన కమండలు జలమున తెచ్చినాడు. 16

శ్లో॥ సా తు తత్రైక రాత్రేణ వర్ధమానా కమండలౌ ।
అలబ్ధ్వాత్మావకాశం వా ఇదమాహ మహీపతిమ్ ॥17॥

ఆ చేపపిల్ల ఒక రాత్రిలోనే వృద్ధిపొంది ( పెరిగి ) ఆ చిన్నకమండలమున తనకు సంచరించుటకు అవకాశము లేనందున ఆ రాజుతో ఆ విధముగా చెప్పినది. 17

టీ :- ఏకదేతి. కృతమాలాయాం నద్యాం ॥12-17॥

శ్లో॥ నాహం కమండలావస్మిన్ కృచ్ఛ్రం వస్తు మిహోత్సహే।
కల్పయౌకః సువిపులం యత్రాహ నివసే సుఖమ్॥18॥

నేనీ కమండలమున ఉండుటకు మిక్కిలి కష్టము కలుగుచున్నందున ఇందుండుట నాకిష్టము లేదు. అందువలన నేను సుఖముగా వసింపజాలు మరొక విశాలమైన స్థానమును నాకు కల్పించుము. అని చేపపిల్ల రాజును అర్థించినది. 18

టీ :- నాహమితి. మత్రాహం సుఖం నివసామి తదోకః స్థానం కల్పయ. ॥18॥

శ్లో॥ స ఏనాం తత ఆదాయ న్యధాదౌదంచనోదకే ।
తత్రక్షిప్తా ముహుర్తేన హస్తత్రయ మవర్ధత ॥19॥

పిమ్మట సత్యవ్రతుడు ఆ చేపను తీసుకొని సమీపమునందలి పెద్ద కాగులోని నీటిలో ఉంచినాడు. అందులో వేసిన చేప రెండు ఘడియల కాలమున మూడు మూరల పొడువు పెరిగినది. 19

శ్లో॥ న మ ఏతదలం రాజన్ ! సుఖం వస్తుముదంచనమ్ ।
పృథు దేహి పదం మహ్యం యత్త్వాహం శరణం గతా॥20॥

ఓ రాజా ! నేను సుఖముగా నివసించుటకు ఈ కాగు చాలదు. నేను నిన్ను శరణు పొందినందువలన నాకు మరొక పెద్దస్థానమును వాసమునకై కల్పించుము. అని ఆ చేప సత్యవ్రతునితో చెప్పినది. 20

శ్లో॥ తత ఆదాయ సా రాజ్ఞా క్షిప్తా రాజన్ ! సరోవరే ।
తదా వృత్యాత్మనా సోయం మహామీనోఽన్వవర్ధత॥21॥

ఓ రాజా ! ఆ కాగునుండి సత్యవ్రతుడు చేపను తీసుకొని వెళ్ళి ఒక పెద్ద సరస్సులో ఉంచినాడు. ఆ చెరువులో తన శరీరమును పెంచుటవలన ఆ చేప మహామీనముగా వృద్ధిపొందినది. 21

టీ :- స ఇతి.ఔదంచనోదకే మణికస్థే జలే. ॥19-21॥

శ్లో॥ నైతన్మే స్వస్తయే రాజన్నుదకం సలిలౌకసః ।
నిధేహి రక్షా యోగేన హ్రదే మామ విదాసిని ॥22॥

ఓ రాజా! ఇందలి జలము జలజంతువునైన నాకు సరిపోవుట లేదు. నన్ను రక్షించు ఉపాయముచేత మహాహ్రదము అంటే పెరుగుటవలన వెంటనే నీరు లేనందువలన నేను ఎండి పోకుండనట్టి ఉపాయముతో చేర్చుము. 22

టీ:-నేతి. రక్షాయా యోగేనోపాయేన. యథా మహా హ్రదప్రాప్తేరర్వాగ్జ లం న శుష్యేయం తేనోపాయేన. నిధేహి అవిదాసిని అనుపక్షయే ॥22॥

శ్లో॥ ఇత్యుక్తః సోఽనయన్మత్స్యం తత్ర తత్రా విదాసిని ।
జలాశయే సమ్మితం తం సముద్రే ప్రాక్షి పజ్ఝుషమ్॥23॥

ఈ విధముగా చేప చెప్పగా విని ఆ సత్యవ్రతుడు ఆయా స్థలములకు మార్చునప్పుడు వలలు, ములుకులు మొదలైనదానివలన ఏ విధమైన గాయముగానీ, బాధగానీ లేకుండునట్లుగా ఆ మత్స్య పరిమాణమునకు అనుగుణమైన

జలస్థానములకు మార్చుచు చివరికు దానిని సముద్రమును చేర్చెను. 23

శ్లో॥ క్షిప్య మాణస్తమాహేదమిహ మాం మకరాదయః ।
అదంత్యతిబలా వీర ! మాం నేహోత్స్రష్టు మర్హసి॥24॥

ఆ చేప తనను సముద్రమును చేర్చుచున్న సత్యవ్రతునితో ఓ వీరుడా! ఈ సముద్రమున నాకన్నా బలవంతమైన మొసలి మొదలైన పెద్ద జలజంతువులు తినగలవు. అందువలన నన్నిందులో ప్రవేశపెట్టవద్దని చెప్పినది. 24

శ్లో॥ ఏవం విమోహితస్తేన వదతా వల్గు భారతీమ్ ।
తమాహ కో భవాన్ అస్మాన్మత్స్యరూపేణ మోహయన్॥25॥

ఈ విధముగా మధురమైన మాటలు మాట్లాడుచున్న చేపమాటలకు మిగుల ఆశ్చర్యమును పొందినవాడై సత్యవ్రతుడు ఆ మాయా మత్స్యముతో ఓ స్వామీ! చేపరూపముతో మమ్ములను మోహ పెట్టుచున్న తమరెవరని అడిగినాడు. 25

టీ:-ఇతీతి.సమ్మితం తత్తజ్జలాశయపరిమితం సంతం.॥23-25॥

శ్లో॥ నైవం వీర్యో జలచరో దృష్టోఽస్మాభిః శ్రుతోఽపిచ ।
యో భవాన్ యోజన శత మహ్నాఽభివ్యానశేఽమరః॥26॥

ఓ స్వామీ! ఇంత అపారమైన శక్తిగల జలజంతువును ఇంతకు ముందు మేమెన్నడూ చూడలేదు. ఇట్టి విచిత్రశక్తి మంతములైన జలచరములున్నట్లునూ వినలేదు. మీరు ఒక పగటి కాలముననే నూరుయోజనముల విస్తీర్ణమున్న సరోవరమును నిండితిరి. 26

శ్లో॥ నూనం త్వం భగవాన్ సాక్షాద్ధరిర్నారాయణోఽవ్యయః ।
అనుగ్రహాయ భూతానాం ధత్సేరూపం జలౌకసామ్ ॥27॥

తప్పక నీవు సాక్షాత్తుగా నాశరహితుడవు, భగవంతుడవైన శ్రీమన్నారాయణుడవు. జీవరాశిని అనుగ్రహించుటకై ఈ జలజంతురూపమును ధరించినావు. 27

టీ:- నైవమితి.అభివ్యానశే అభితో వ్యాప్తవాన్. ॥26-27॥

శ్లో॥ నమస్తే పురుష శ్రేష్ఠ ! స్థిత్యుత్పత్త్యప్యయేశ్వర ! ।
భక్తానాం ప్రపన్నానాం ముఖ్యో హ్యాత్మ గతిర్విభో!॥28॥

శ్లో॥ సర్వే లీలావతారాస్తే భూతానాం భూతి హేతవః ।
జ్ఞాతు మిచ్ఛామ్యదో రూపం యదర్థం భవతా ధృతమ్॥29॥

టీ:- నమ ఇతి. ముఖ్యఃసత్యః. ఆత్మా. గతిశ్చ ఆశ్రయః. ॥28-29॥

శ్లో॥ నతేరఽవిందాక్ష పదోపసర్పణం
మృషా భవేత్సర్వ సుహృత్ప్రియాత్మనః ।
యథేతరేషాం పృథగాత్మనాం సతాం
అదీదృశో యద్వపురద్భుతం హి నః ॥30॥

టీ :- నేతి. హే అరవిందాక్ష. పృతగాత్మనాం దేహాద్యభిమానినాం. సతామితరేషాం. పదోపసర్పణం. యథా మృషా భవేత్. తథా సర్వసుహృత్ప్రియాత్మనస్తవ పదోపసర్పణం మృషా న భవేత్. యద్యస్మాత్ నో భక్తానామద్భుతం వపురదీదృశః దర్శితవానసి పృథగాత్మనోసతామితి, పాఠాంతరే. పృథగాత్మనో భేదదర్శినః. పుంసః అసతాం అపరిచ్ఛిన్నానాం. పదోపసర్పణం యథా మృషేత్యర్థః.॥30॥

ఓ పురుషోత్తమా నీకు నమస్కారము. నీవే ఈ జగత్తు పుట్టుకకు, స్థితికి, నాశనమునకు అధీశ్వరుడవు. ఆపన్నులమైన మావంటి భక్తులకు నీవే సత్యమైన ఆత్మవు, ఆశ్రయుడవు. 28

ఓ స్వామీ! సమస్తజీవులకు సుఖములు కలిగించుటకే నీ యొక్క లీలా విలాసముతో కూడిన అవతారములన్నియును అందువలన ఇప్పుడు నీవు ఈ మత్స్యావతారమును ధరించుటకు కారణమును తెలియగోరుచున్నాను. 29

ఓ పుండరీకాక్షుడా ! నీకంటే భిన్నవారమనే భావనతో తన శరీరము, ఇల్లు, సంపదలు, భార్యాబిడ్డలు తనవనుకునే ప్రాపంచిక వ్యామోహమున మునిగి తేలువారై సత్పురుషులకన్న వేరైనవారు అనగా అజ్ఞానమున కొట్టు మిట్టాడువారికి ("పృథగాత్మఽనోసతామ్" అను పాఠాంతరమున భిన్న భావనతో భేద దృష్టిగల అజ్ఞానవంతులైన చెడ్డవారికి ) నీ ఆశ్రయము లభించుట అసత్యమైనట్లే మంచిమనస్సుగల ఎల్లరకు ప్రియుడవైన నీవు రక్షకుడవు అనేమాట సత్యము. అది అట్లు కాకుంటే మావంటి భక్తులకు ఇట్టి ఆశ్చర్యకరమైన శరీరమును ప్రదర్శించువాడవు కాదు. 30

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇతి బ్రువాణం నృపతిం జగత్పతిః
సత్యవ్రతం మత్స్య వపుర్యుగక్షయే ।
విహర్తుకామః ప్రళయార్ణవేఽబ్రవీత్
చికీర్షురేకాంత జనప్రియః ప్రియమ్॥31॥

టీ:- ఇతీతి. ఏకాంతజనాః భక్తాః తేషాం ప్రియాణ్యేవ చికీర్షితాని యేన. ॥31॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా సత్యవ్రతుడు అడుగుచుండగా లోకేశ్వరుడు రాజునుద్దేశించి ప్రళయకాలమున జగమంతయు ఒకే సముద్రముగా మారి జలప్రళయమైనపుడు నాకు అత్యంత ప్రీతిపాత్రులైన భక్తులకు సుఖము కలిగించుటకై ప్రళయ పయోధిజలముల సంచరించు కోరికతో ఈ మీనాకృతిని ధరించితినని చెప్పినాడు. 31

**శ్రీ భగవానువాచ:-**

శ్లో॥ సప్తమేఽద్యతనాదూర్ధ్వ మహన్యేత దరిందమ ।
నిమంక్ష్యత్యప్యయాంభోధౌ త్రైలోక్యం భూర్భువాదికమ్॥32॥

టీ :- సప్తమ ఇతి. అప్యయాంభోధౌ ప్రళయార్ణవే. భూర్భువాదికమిత్యర్థః. ॥32॥

**శ్రీహరి ఇట్లు చెప్పినాడు :-**

ఓ శత్రుంజయుడా ! ఈ దినమునకు సరిగా ఏడవరోజు పగట భూలోకము, భువర్లోకము మొదలైన వానితో ముల్లోకములన్నియు సముద్రజలమున మునిగి ప్రళయము కలుగును. 32

శ్లో॥ త్రైలోక్యాం లీయమానాయం సంవర్తాంభసి వై తదా ।
ఉపస్థాస్యతి నౌః కాచిద్విశాలా త్వాం మయేరితా॥33॥

టీ :- త్రైలోక్యామితి. సంవర్తాంభసి ప్రళయోదకే త్వాముపస్థాస్యతి. ప్రాప్స్యతి. ॥33॥

ముల్లోకములు ఆ సముద్ర ప్రళయజలమునందు మునిగిపోగా నీకు నేను చెప్పిన విధముగా ఒకానొక విశాలమైన ఓడ ఒకటి రాగలదు. 33

శ్లో॥ త్వం తావదోషధీః సర్వా బీజాన్యుచ్చావచానిచ ।
సప్తర్షిభిః పరివృతః సర్వ సత్వోప బృంహితః ॥34॥

టీ :- త్వమితి. ఓషధీః ఆదాయేతి శేషః. ॥34॥

ఓ రాజా ! నీవు సమస్తఓషధులను తీసుకొని ఉచ్చ నీచ భేదములను విస్మరించి అన్నిరకములైన ఓషధులను విత్తనములను సంగ్రహించి, సృష్టిని కాంక్షించు సర్వప్రాణులతో, సప్త ఋషులతో కూడినవాడవై నావనిండునట్లుగా (అధిరోహించుమని తర్వాతి శ్లోకముతో అన్వయము). 34

శ్లో॥ ఆరుహ్య బృహతీం నావం విచరిష్యస్య విక్లబః ।
ఏకార్ణవే నిరాలోకే ఋషీణామేవ వర్చసా ॥35॥

టీ :- ఆరుహ్యేతి. ఋషీణామేవా లోకేన విచరిష్యసి. ॥35॥

గొప్పనావను అధిరోహించి గాఢాంధకారము ఎల్లదిక్కులు నిండగా ఆ మహాసముద్రజలమునందు ఋషీశ్వరుల దేహకాంతిచేత (మౌళికమైన పరమాత్మ తేజమున) కలత లేకుండా సంచరించగలవు. 35

శ్లో॥ దోధూయమానాం తాం నావం సమరేణ బరీయసా ।
ఉపస్థితస్య మే శృంగే నిబధ్నీహి మహాహినా ॥36॥

శ్లో॥ అహం త్వాం ఋషిభిః సాకం సహనావముదన్వతి ।
వికరషన్విచరిష్యామి యావద్బ్రాహ్మీ నిశా ప్రభో !॥37॥

టీ :- దోధూయమానామితి. మహాహినా వాసుకినా. ॥36;37॥

సముద్రజలములందు బలమైన ఈదురగాలుల చేత కల్లోలపడు నావను అచ్చట ఎదురుగా ఉన్న నా కొమ్మునకు సర్పరాజైన వాసుకిని త్రాడుగా ఆనావను వుపద్రవ రహితముగా గట్టిగా కట్టుము. 36

ఓరాజా ! నీతో, ఋషులతో కూడిన నావను సముద్రమున బ్రహ్మనిద్రించిన సమయమందలి అలోకమైన గాఢాంధకార, బ్రహ్మరాత్రి పరిపమాప్తి యగువరకు లాగుచు తిరుగుచుండును. ఆరవ వాడైన చాక్షుషమనువు మధ్యకాలముననే బ్రహ్మకు పగలు ప్రారంభమైనది. అందువలన ఇప్పుడు బ్రహ్మకు బ్రాహ్మీస్థితి – ప్రళయము కలుగుటకు వీలులేదు. అయితే పరమాత్మ ఇష్టానుసారముగా ఆకస్మిక ప్రళయము కలిగినది. ముల్లోకములు

ఏకార్ణవమున మునుగుట వలన ప్రతిరోజు సామాన్యముగా కలుగు రాత్రివంటి దృష్టితో భగవంతుని క్రీడావిలాసము ననుసరించి కలత చెందకుండా బ్రహ్మదేవుడు కొంత కాలము (తాత్కాలిక ప్రళయము – నిద్ర, శాశ్వత ప్రళయము – మరణము) చక్కగా నిద్రించినాడు. దాని ననుసరించి గౌణవృత్తితో బ్రాహ్మినిశయని (నిద్రను మరణమని) చెప్పబడినదని భాగవతామృత వ్యాఖ్య ననుసరించిన సందర్భవిషయ నిరూపణము. 37

శ్లో॥ మదీయం మహిమానంచ పరం బ్రహ్మేతి శబ్దితమ్ ।
వేత్స్యస్యను గృహీతం మే సంప్రశ్నైర్వివృతం హృది॥38॥

పరబ్రహ్మ పర్వోత్తమమైన జ్ఞానము – ప్రజ్ఞానఘనము అని అక్షరరూపముడా ప్రకటితమైన నా గొప్పదనమును – ఐశ్వర్యమును గ్రహించుటకు నేననుగ్రహించిన ప్రసాదరూపమైన హృదయమునందు, బుద్ధిగుహలో చక్కని ప్రశ్నలతో, పూర్వపక్ష శంకా సమాధానములతో అపరోక్షముగా స్వయంవ్యక్తమైన పరతత్వమును తెలియగలవు (ఆత్మా వివృణతే తనుం స్వామ్). 38

శ్లో॥ ఇత్థమాదిశ్య రాజానం హరిరంత రధీయత ।
సోన్వ వైక్షత తం కాలం యం హృషీకేశ ఆదిశత్॥39॥

ఈ విధముగా సత్యవ్రతుని ఆదేశించి శ్రీహరి అదృశ్యమైనాడు. ఆ రాజు పరమాత్మ చెప్పిన కాలము వరకు ఎదురు చూచెను. 39

శ్లో॥ ఆస్తీర్య దర్భాన్ ప్రాక్కూలాన్ రాజర్షిః ప్రాగుదఙ్ముఖః ।
నిషసాద హరేః పాదౌ చింతయన్మత్స్య రూపిణః॥40॥

తూర్పుకొనలుండునట్లుగా దర్భలను పరిచి పూర్వోత్తర దిక్కునకు ముఖమై ( ఈశాన్యాభిముఖమై ) మత్స్యరూపమును ధరించిన శ్రీమహావిష్ణువు పాదమును స్మరించుచు కూర్చుని యుండెను. 40

శ్లో॥ తతః సముద్ర ఉద్వేలః సర్వతః ప్లావయన్మహీమ్ ।
వర్ధమానో మహామేఘైర్వర్షద్భిః సమదృశ్యత॥41॥

అప్పుడు సముద్రము భయంకరముగా వర్షించు పుష్కలావర్తకాది మహామేఘ సముదాయముతో మిక్కిలి కల్లోలమై క్షణ క్షణము విజృంభించుచు భూమండలము ముంచెత్తునట్లుగా కనపడినది. 41

శ్లో॥ ధ్యాయన్భగవదావేశం దదృశే నావమాగతామ్ ।
తామారురోహ విప్రేంద్రై రాదాయౌషధి వీరుధః॥42॥

అంతకు ముందు శ్రీహరి చెప్పిన ఆదేశమును బట్టి సముద్రతీరమున తనవద్దకు వచ్చిన నావను చూచి దానిని సమీపించి సప్తఋషులతో సర్వఓషధులు, లతలు, బీజములను తీసుకొని అధిరోహించెను. 42

శ్లో॥ తమూచుర్మునయః ప్రీతా రాజన్ ! ధ్యాయస్వకేశవమ్।
స వై నః సంకటాదస్మాదవితా శం విధాస్యతి ॥43॥

సత్యవ్రతుని భక్తి, ఉపకారబుద్ధులకు సంతసించిన సప్తర్షులు ఆయనతో ఓ రాజా ! పరమాత్ముడైన శ్రీహరిని స్మరించుము. ఆయనయే మనయొక్క ఈ సంకట పరిస్థితులనుండి కాపాడి మనకు సుఖమును కలిగించగలడు. 43

శ్లో॥ సోఽనుధ్యాతస్తతో రాజ్ఞా ప్రాదురాసీన్మహార్ణవే ।
ఏక శృంగధరో మత్స్యో హైమో నియుత యోజనః॥44॥

అప్పుడు రాజు ధ్యానించగనే శ్రీమన్నారాయణుడు మహామీన రూపుడై సముద్రమునందు ప్రత్యక్షమైనాడు. ఆయన సువర్ణమువంటి కాంతికలిగి, లక్ష క్రోసుల పరిమాణముతో కూడిన గొప్ప శరీరముతో, ఒక పెద్ద కొమ్ముతో విరాజిల్లినాడు. 44

శ్లో॥ నిబధ్య నావం తచ్ఛృంగే యథోక్తో హరిణాపురా ।
వరత్రేణాహినా తుష్టస్తుష్టావ మధుసూదనమ్ ॥45॥

శ్రీమహావిష్ణువు ముందుగా ఆదేశించిన విధముగా సర్పరాజైన వాసుకిని బలమైన త్రాడుగాచేసి ఆ మాయామత్స్యముయొక్క కొమ్మునకు ఓడను గట్టిగా బంధించి సంతోషముతో శ్రీహరిని స్తుతించినాడు. 45

టీ:- మదీయమితి. మేమయా. అనుగృహీతం. ప్రసాదీకృతం హృది. అపరోక్షం వేత్స్యసి త్వయా కృతైః సంప్రశ్నైః. మయా వివృతం ప్రకాశితం సంతం. ॥38-45॥

శ్లో॥ అనాద్య విద్యోపహతాత్మ సంవిదః
తన్మూల సంసార పరిశ్రమాతురాః ।
యదృచ్ఛ యేహోపసృతా యమాప్నుయుః
విముక్తిదోనః పరమోగురుర్భవాన్ ॥46॥

టీ :- నిబధ్యేతి. వరత్రేణ రూపేణ. శ్లో. సాగరం తారయిష్యం తం తరిష్యన్నివ సాగరం, సత్యవ్రతో గురుత్వేన తుష్టావ హరిమష్టభిః శ్రీధరీయోఽయం శ్లోకః అత్రేదం చింత్యం. కిమయం మహాప్రళయో దైనం దినోవేతి. తత్ర తావత్. బ్రాహ్మో లయ ఇతి యోఽసావస్మిన్మహాకల్ప ఇతి ప్రాప్తం. నేతి బ్రూమః మహాప్రళయే పృథివ్యాదీనామవశేషాసంభవత్. యావద్బ్రాహ్మీ నిశేత్యాద్యుక్తివి రోధాచ్చ. అతో దైనందిన ఇతి యుక్తం. న చైతదపి సంగచ్ఛతే. సంవర్తకానాం వృష్ట్యాదిభిర్వినా అకస్మాదేవ సప్తమేఽహని త్రైలోక్యం నిమంక్ష్యతీతి మత్స్యోక్తేరనుపపత్తేః. యచ్చోక్తం ప్రథమస్కంధే. శ్లో. రూపం సజగృహేమాత్స్యం చాక్షుషాంతర సంప్లవే, నావ్యారోప్య మహీమయ్యామపాద్వైవస్వతం

"సాగరం తారయిష్యంతం తరయిష్యన్నివ సాగరమ్ । సత్యవ్రతో గురుత్వేన తష్టావ హరిమష్టభిః॥" సముద్రమున దాటించువానిని సముద్రమును దాటువానివలె సత్యవ్రతమహారాజు ఎనిమిది శ్లోకములలో మిగుల గొప్పగా స్తుతించి సంతోషపెట్టెను. ఇక్కడ ఈ విషయమును గుఱించి విచారణ చేయవలెను. ఇది మహా ప్రళయమా లేక దినదినము ( రాత్రింబగళ్ళవలె యథాక్రమమున - పర్యాయముగా ) వచ్చునదా? అక్కడ బ్రహ్మలయమును పొందినాడు. అని ' యోఽసావస్మిన్ కల్పే ' అన్నయితే మహాప్రళయము సిద్ధించినది కాదని చెప్పుచున్నారు.

మహాప్రళయమునందు పృథివి మొదలైన పంచభూతములు మొదలైన వాని అవశేషములుండుటకు వీలులేదు. ' యావద్బ్రాహ్మీ నిశా ' మొదలైన మాటల విరోధము వలన అనగా గాఢాంధకారము (బ్రహ్మ నిద్ర - ప్రళయము) ముగియున్నంతవరకు నేను నావలో మిమ్ము కాపాడుదును. అని చెప్పుటవలన సృష్టిలో ఇంకను సత్యవ్రతాదులు మిగిలి వున్నందున ఇది మహాప్రళయము కానేరదు. అందువలన సాధారణమైన దైనందినమే అనుట సరియైనది. ఇది కూడా కావచ్చును. సంవర్తక మేఘముల తీవ్రమైన వర్షధారలచేత హఠాత్తుగా

మనుమిత్యాది. తదపి తదా దుర్ఘటం న హి ప్రళయద్వయేఽపి మహీమయ్యాం నావ్యారోహః సంభవతి. న చాక్షుషమన్వంతరే ప్రళయోఽస్తి తథా చ సతి. సప్తమో మనుర్వైవస్వత ఇతి చ దుర్ఘటం స్యాత్. 'త్వం తావదోషధీః సర్వా' ఇత్యాదినిర్దేశోఽపి న హి తదా ఓషధ్యానాం సత్వానాం చావశేషః సంభవతి. తస్మాదన్యథా వర్ణ్యతే. నైవాయం వాస్తవః కోఽపి ప్రళయః కింతు సత్యవ్రతస్య జ్ఞానోపదేశాయావిర్భూతో భగవా వైరాగ్యార్థ మకస్మాత్ప్రళయమివ దర్శయామాస. యథాస్మిన్నేవ వైవస్వతమన్వంతరే మార్కండేయాయ దర్శితవాన్ తదపేక్షయేవ చ మహాకల్పేఽస్మిన్నితి విశేషణం సంగచ్ఛతే. తథా చ. తత్ర నాయోనిషు సంసరతః స్వస్య భగవత్కృపయైవ తత్ప్రాప్తిం దృష్ట్వా ముక్తయే తమేవ ప్రార్థయతే అనాదీతి. అనాదిర్యా అవిద్యా తయా ఉపహతా ఆవృత్తా ఆత్మసంవిద్యేషాం తే. అతేవ అవిద్యామూల స్సంసారపరిశ్రమైః ఆతురాః. ఇహ సంసారే మదృచ్ఛయా యదనుగ్రహాదేవ. ఉపసృతా ఆశ్రితాస్సంతః. యం ప్రాప్నుయుః. స భవానేవ సాక్షాన్నో గురుస్స. గ్రంథిం భింద్యాదిత్యుత్తరేణాన్వయః.॥46॥

ఏడవదినమున సర్వలోకములు మునిగిపోవునన్న మాయా మీనము మాటలకు అవకాశముండదు కనుక, మొదటి స్కంధమున "రూపం జగృహేమాత్స్యం చాక్షుషాంతర సంప్లవే। నావ్యారోప్య మహీ మయ్యామపాద్వైవస్వతం మనుమ్।" శ్రీహరి మత్స్య రూపమును ధరించి ఆరవ చాక్షుషమన్వంతరమున వైవస్వతమనువును భూమయమైన ఓడపైనెక్కించి కాపాడెను. అని చెప్పబడినది. అది కూడా అక్కడ సాధ్యము కాదు. రెండు ప్రళయముల మధ్యమున పృథివీసంబంధమైన ఓడను అధిష్ఠించుట జరుగదు. అసలు చాక్షష మన్వంతరమున ప్రళయము లేదు. అట్లైనపుడు ఏడవ మనువు వైవస్వతుడు అనునది కూడా అసాధ్యమే అగును. 'త్వం తావదోషధీః సర్వాః' నీవు ఓషధులను గ్రహించి అని నిర్దేశించుట సంభవింపదు. అందువలన వేరే విధముగా చెప్పవలెను. నిజముగా ఇది వాస్తవ ప్రళయము కాదు. ఎందుకంటే సత్యవ్రతునికి వైరాగ్యరూపమైన జ్ఞానమునుపదేశించుటకై భగవంతుడు శ్రీహరి ప్రత్యక్షమై హఠాత్తుగా ప్రళయము వలె కన్పింపజేసినాడు. ఇప్పటి ఈ వైవస్వతుని అంతముననే మార్కండేయునికిని ఇట్టి దానినే దర్శింపజేసినాడు. దీనిని దృష్టిలో ఉంచుకొని ' ఈ మహాకల్పమునందే ' అని విశేషణము చెప్పబడినది. అట్లే ' తతః సముద్ర ఉద్వేలః సమదృశ్యత ' అని ప్రళయము కనపడినదని చెప్పుట కుదురదు. ఇంతవరకు ఆ ప్రళయము వాస్తవమా? దైనందినమా? అని చర్చ. ఇప్పుడు స్తోత్రవివరణ.

జనన మరణ చక్రమైన ఈ సంసారమున అనేక గర్భములందు సంచరించుచున్న జీవునికి పరమాత్ముని దయవలన లభించిన పరమాత్మ సాక్షాత్కారమును చూచి మోక్షప్రాప్తికై ఆ పరతత్వమునే ప్రార్థించుచున్నాడు. అనాదియైన జీవుడు పుట్టకముందునుండి ఉన్న అవిద్య – అదే అజ్ఞానము. దీనిచేత ఆవరింపబడి – కప్పబడి అందే వాస్తవతత్వమును గ్రహింపనీయని తెలివి అనగా – ఇది ఇది యని తెలియలేని అవివేకము కలవాడు జీవుడు. అట్టి అవివేకముయొక్క మూలములతో బలముగా పాతుకొనిపోయిన అవివేకముయొక్క వ్యాప్తితో ఈ జగత్తున జనన మరణ చక్రమునబడి నలుగుచూ కొట్టుమిట్టాడు వారికి ఈ జగత్తుననే ఈ జీవితముననే అప్రయత్నముగా లభించిన పరమాత్మ ఆశ్రయమును పొందిన వారు దేనిని (ఏ పరమాత్మను) పొందుచున్నారో అట్టి సర్వనియామకుడవైన నీవే సాక్షాత్తుగా గురుడవై జీవుని సంకట పరిస్థితికి కారణమైన చిక్కుముడిని విప్పి మాకు నిత్యానందమయమైన ముక్తిని ప్రసాదించుచున్నావని ముందరి శ్లోకముతో అన్వయము. 46

శ్లో॥ జనోఽబుధోయం నిజకర్మ బంధనః
సుఖేచ్ఛయా కర్మ సమీహతేఽసుఖమ్ ।
యత్సేవయా తాం విధునోత్య సన్మతిం
గ్రంథిం సభింధ్యా ద్ధృదయం సనోగురుః॥47॥

వైరాగ్యము లేకుండా ముక్తి లభించదు. దానికి నీ సేవ ఒక్కటే మార్గము. భగవంతుని సేవించుటకు కేవలము ముక్తియే ఫలము. భగవంతుని ఆదేశించు వుద్దేశ్యముతో ఉన్నందువలన తనకు నిజమైన సుఖమును కలిగించు పని ఏదియో తెలియక సుఖమును కోరుచు తనకు కీడును కలిగించు పనులను (కర్మలను) చేయుచున్నాడు. వాస్తవమైన సుఖమును (ముక్తిని) కలిగించుటకై

టీ :- నను వైరాగ్యం వినాకుతో ముక్తిః? తర్హి తస్య త్వత్సేవైకఫలత్వాత్సేవామాదిశేత్యాశయేనాహ. జన ఇతి. అబుధోఽయం జనః. అసుఖం యథా భవతి తథా కర్మ సమీహతే తాం అసస్మతిం సుఖేచ్ఛాం ధునోతి. నో హృదయరూపం గ్రంథిం. స విభింద్యాత్ యతః స ఏవ పరమో గురుః. ॥47॥

శ్లో॥ యత్సేవయాఽగ్నేరివ రుద్రరోదనం
పుమాన్ విజహ్యాన్ మలమాత్మనస్తమః ।
భజేత వర్ణం నిజమేష సోఽవ్యయో
భూయాత్స ఈశః పరమో గురోర్గురుః ॥48॥

టీ :- నను యజ్ఞదానాదిభిః సత్త్వశుద్ధిం వినా కథం గ్రంథిభేదః స్యాత్తత్రాహ యదితి. యస్య సేవయైవపుమాన్ ఆత్మనః మనసః మలం తమో విజహ్యాత్ ఏషః హీనమలః. నిజం వర్ణం సత్త్వస్వరూపం భజేత. స ఈశో నో గుర్భూయాత్. యతః సేవ గురోరపి పరమో గురుః మలహానౌ దృష్టాంతః రుద్ర రోదనం రజతం. శ్రు. "యదరోదీత్తద్రు ద్రస్యరుద్రత్వం యదశ్రవ్వశీయత తద్రజతగ్ం హిరణ్యమ భవది" తి శ్రుతేః. తద్వత్. యథాగ్నేః సంపర్కాన్మలం జహాతి. స్వవర్ణంభజతే. న తు క్షాళనాదిభిః.

అజ్ఞానమయమైన హృదయరూపగ్రంథిని ఛేదించి వాస్తవసుఖమును తెలియగల మంచి బుద్ధిని ప్రసాదించు పరమాత్మయే మాకు గురువు. 47

యజ్ఞము, దానము మొదలైన పవిత్ర కర్మలతో శారీరక, మానసిక మలినములు తొలుగకుండా ( సత్వశుద్ధి లేకుండా ) ఏ విధముగా హృదయరూపమైన చిక్కుముడి వీడును అను విషయమును చెప్పుచున్నాడు. పరమాత్ముని సేవనమువలన మానవుడు తనయొక్క ( ఆత్మనః ) మనస్సుయొక్క మాలిన్యరూపమైన అజ్ఞానమనే చీకటిని విడువగలడు. ఈ విధముగా మనోమాలిన్యమును తొలిగించికొన్న వ్యక్తి తన యథార్థ స్వరూపమును సేవించును. అట్టి జ్ఞానోపదేశము చేయు ఈశ్వరుడు మాకు గురువుగా లభించుగాక. అయనే గురువులందరికి గురువు పరమగురుడు. మనోమాలిన్యము తొలిగిపోవుటకు దృష్టాంతమును చెప్పుచున్నాడు. రుద్రుని రోదనము వెండి " యదరోదీ త్తద్రుద్రస్య రుద్రత్వం । యదశ్రవ్వశీర్యత తద్రజతం హిరణ్యమభవత్॥" అని శ్రుతి వాక్యము. ఆ వెండి అగ్ని సంపర్కమువలన తనయందలి మాలిన్యములను వీడి తన వాస్తవమైన వర్ణమును స్వీకరించును. అంతేగానీ ఎంత శుభ్రముగా కడిగినను దాని మాలిన్యము పోదు. (హేమ్నః సంలక్షతే హ్యాగ్నౌ విశుద్ధిః) అట్లే మొదలైన వానివలన మలత్యాగము

తథా న యజ్ఞాదిభిః మలత్యాగః. కింతు త్వత్సేవయైవ తేషాం తు సేవాంగత్వమేవేతి భావః. ॥48॥

శ్లో॥ నయత్ప్రసాదాయుత భాగలేశం
అన్యే చ దేవా గురవో జనాః స్వయమ్ ।
కర్తుం సమేతాః ప్రభవంతి పుంసః
తమీశ్వరం త్వాం శరణం ప్రపద్యే ॥49॥

టీ:- పరమేశ్వరత్వం పరమగురుత్వం చ ప్రపంచయన్నాహ నేతి. యత్ప్రసాదస్యాయుతభాగస్తస్య లేశమప్యన్యే దేవాదయః సమేతా అపి స్వయం తన్నిరపేక్షస్సంతః. న కర్తుం ప్రభవంతి. ॥49॥

శ్లో॥ అచక్షు రంధస్య యథాగ్రణీః కృతః
తథా జనస్యా విదుషోఽబుధో గురుః ।
త్వమర్క దృక్ సర్వదృశాం సమీక్షణో
వృతో గురుర్నః స్వగతిం బుభుత్సతామ్॥50॥

తాత్కాలికమే, అసంపూర్ణమే కాని పరమేశ్వరుని సేవవలన ఆత్మ మలనాశము పూర్తిగా సిద్ధించును. భగవంతుని సేవనము సర్వపాపములను హరించు అగ్నివంటిదని భావము. ఆత్మ యొక్క తమము, అవివేకము, " అవిద్యాకర్మ సంజ్ఞాన్నా తృతీయా శక్తి రిష్యతే। యథా క్షేత్రజ్ఞ శక్తిః సావేష్టితా నృప! సర్వగా॥" అని ధర్మశాస్త్రములందు ప్రసిద్ధమైన ' అవిద్య ' అనే పేరుగల కర్మమే మలము అని అర్థము. 48

పరమేశ్వరత్వము పరమగురుత్వమని వివరించి చెప్పుచున్నాడు. (అంటే పరమేశ్వరునికి, గురువునకు భేదము లేదని భావము). పరమేశ్వరుని అనుగ్రహమునందలి పదివేలవ భాగముయొక్క లేశ మాత్రమే ఇతర దేవతలు, గురువులు మొదలైన జనులందరు గుంపుగట్టినప్పటికి స్వయముగా గురువు (పరమాత్మ ) ప్రమేయము లేకుండా ఏ పని చేయుటకును సమర్థులుకారు. అట్టి పరమేశ్వరుడవైన నిన్ను శరణు పొందుచున్నాను. 49

ఆ విషయమునే దృష్టాంతముతో స్పష్టపరిచి చెప్పుచున్నాడు. కళ్ళు లేని వానికి ముందున్నవాడు దారి చూపునట్లుగా తెలియని మానవునికి పండితుడు కాని వాడు కూడా గురువు అగుచున్నాడు. చీకటిలో వస్తుజ్ఞానము కలుగకున్నను సూర్యప్రకాశముతో స్వతః సిద్ధముగనే కంటి చూపువలన

టీ:- దృష్టాంతేన స్పష్టయన్నాహ సచక్షురితి. అవిదుషో జనస్య బుధో విద్వాన్ గురుః తథైవ ప్రకాశవత్ స్వత ఏవ దృక్ జ్ఞానం యస్య సః అర్కదృక్ అతః సర్వదృశాం సర్వేంద్రియాణాం ఙః ప్రకాశః. అతఏవ. సుగతిం బోద్ధుమిచ్ఛద్భిః నోఽ స్మాభిర్గురుర్వృతోఽసి. ॥50॥

జ్ఞానమును కలిగినవాడు ఆర్య దృక్కు . అందువలన అన్ని ఇంద్రియముల జ్ఞానశక్తిని ప్రకాశింపచేయుచు సర్వజ్ఞానములతో ఆవరింపబడిన గురువు మాకు మంచిని బోధించుగాక. ఎల్ల జ్ఞానములతో మమ్ము ఆవరించిన గురుడవు నీవని భావము. 50

శ్లో॥ జనో జనస్యా దిశతేఽసతీం గతిం
యయా ప్రపద్యేత దురత్యయం తమః
త్వమవ్యయం జ్ఞాన మమోఘ మంజసా
ప్రపద్యతే యేన జనో నిజం పదమ్ ॥51॥

టీ :- కించ గురురనర్థహేతురేవేత్యాహ జన ఇతి. ఆదిశతే ఉపదిశతే అసతీం గతిమర్థకామాదిగతిం. తమః. ॥51॥

ఎందుకంటే లౌకికుడైన గురువు అనర్థములకు కారకుడని చెప్పుచున్నాడు. సామాన్యుడైన గురువు జనులకు అసత్యమైన జ్ఞానమును బోధించును. ప్రాపంచికములైన ధనము, కోరికలు తీర్చుకొనుటకు అవసరమైన అపరా విద్యలనే ( జీవనోపాధులను ) సాధారణుడైన గురువు బోధించును. అట్టి విద్యలవలన దాట శక్యముగాని అజ్ఞానమనే చీకటి వ్యాపించును. అనగా సంసారరూపమున పడవేయును. కానీ పరమాత్మ గురుడు ప్రసాదించు నాశరహితమైన, వ్యర్థము కాని జ్ఞానముతో అతి శీఘ్రముగా మానవుడు తన స్థానమును, పునరావృత్తి రహితమైన సర్వానంద స్థానమును పొందును. 51

శ్లో॥ త్వం సర్వ లోకస్య సుహృత్ప్రియేశ్వరో
హ్యాత్మా గురుః జ్ఞాన మభీష్ట సిద్ధిః ।
తథాపి లోకో న భవంత మందధీః
జానాతి సంతం హృది బద్ధకామః ॥52॥

సర్వజనులు నన్నే ఎందుకు అనుసరించరు. అనేదానికి అజ్ఞానము వలన అని చెప్పుచున్నాడు. నీవు సర్వులకు స్నేహితుడవు, ప్రియతముడవైన నాయకుడవు (ఈశ్వరుడవు) , ఆత్మవు, గురుడవు, ఇష్టమైన కోరికను తీర్చు (ముక్తిని లభింపజేయు) జ్ఞానము నీవే. అయినప్పటికి మానవులు నిరంతరము

టీ :- నను తర్హిసర్వోఽపి లోకో మామేవ కిం నోపసర్పతి. అజ్ఞానాది త్యాహ త్వమితి శ్చాసావీశ్వరశ్చ. ॥52॥

శుభమును కలిగించుటకై తమ హృదయమందే ఉన్న నిన్ను పలురకములైన కోరికలకు దాసులై బుద్ధిలేని వారై తెలియలేకున్నారు. 52

శ్లో॥ తం త్వామహం దేవవరం వరేణ్యం
ప్రపద్య ఈశం ప్రతిబోధనాయ ।
ఛింద్యర్థ దీపైర్భగవన్ వచోభిః
గ్రంథీన్ హృదయాన్వివృణు స్వమోకః ॥53॥

టీ :- అహం తు త్వామేవ శరణం యామీత్యాహ తమితి. ప్రతిబో ధనాయ అర్థదీపైః పరమార్థప్రకాశకైః హృదయే భవాన్ గ్రంథీ అహంకారాదీన్ స్వలోకః వివృణు ప్రకాశయ ॥53॥

నేను నిన్నే శరణు పొందుచున్నానని చెప్పుచున్నాడు. అట్టి లోకోత్తర గురుడవు, దేవతా శ్రేష్ఠుడవు, సర్వేశ్వరుడవైన నిన్ను ఉపదేశము కొఱకు ఆశ్రయించినాను. పరమార్థమును తెలియజేయు జ్ఞానజ్యోతి ప్రకాశముతో నా హృదయమందే వుండి అహంకారములనే చిక్కుముడులను విడదీసి నీ యదార్థ స్వరూపమును ప్రకాశింపజేయుము. 53

**శ్రీ శుక ఉవాచ :-**

శ్లో॥ ఇత్యుక్తవంతం నృపతిం భగవానాది పురుషః ।
మత్స్య రూపీ మహాంభోధౌ విహారం స్తత్వమబ్రవీత్ ॥54॥

టీ :- ఇతీతి నృపతిం ప్రతి. ॥54॥

**శుక మహర్షి ఇట్లు చెప్పినాడు :-**

ఈ విధముగా చెప్పుచున్న రాజు సత్యవ్రతునితో మాయా మత్స్యరూపమును ధరించిన ఆదిపురుషుడైన పరమాత్ముడు అపారమైన సముద్రమున సంచరించుచు ఇట్లని చెప్పినాడు. 54

శ్లో॥ పురాణ సంహితాం దివ్యాం సాంఖ్యయోగ క్రియావతీమ్।
సత్యవ్రతస్య రాజర్షేరాత్మ గుహ్యమశేషతః ॥55॥

సత్యవ్రతుడనే రాజఋషి పరమాత్మ సంబంధమైన అతి రహస్యమైనది. సాంఖ్యయోగ దర్శనములకు చెందినది. మత్స్య పురాణమందలి సంపూర్ణ విషయముతో నిండినదైన పరిజ్ఞానమును ( చెప్పినాడని తర్వాతి శ్లోకమున అన్వయము). 55

శ్లో॥ అశ్రౌషీ దృషిభిః సాకమాత్మతత్త్వమసంశయమ్।
నావ్యాసీనో భగవతా ప్రోక్తం బ్రహ్మ సనాతనమ్ ॥56॥

టీ:- పురాణేతి. పురాణసంహితాం మత్స్య అశేషతః. అబ్రవీదిత్య నుషంగః. ॥55,56॥

ఓ రాజా ! సప్త ఋషులతో కూడి నావయందు ఆసీనుడవై శ్రీమహావిష్ణువు చెప్పిన పారంపర్యమైన పరమాత్మతత్త్వమునకు సంబంధించిన పరిపూర్ణమైన జ్ఞానమును సంశయరహితముగా వింటివి. 56

శ్లో॥ అతీత ప్రలయాపాయ ఉత్థితాయ న వేధసే ।
హత్వాఽసురం హయగ్రీవం వేదాన్ ప్రత్యాహరద్ధరిః॥57॥

ప్రళయమునకు ముగింపు సమయమున శ్రీహరి హయగ్రీవ దనుజుని సంహరించి నిద్రనుండి లేచిన బ్రహ్మదేవునికి వేదములను మరల తీసుకొని వచ్చి ఇచ్చినాడు. 57

శ్లో॥ సతు సత్యవ్రతో రాజా జ్ఞాన విజ్ఞాన సంయుతః ।
విష్ణోః ప్రసాదాత్కల్పేస్మిన్నా సీద్వైవస్వతో మనుః॥58॥

శాస్త్రీయమైన జ్ఞానమును, అనుభవసహితమైన విజ్ఞానమును పొందిన ఆ సత్యవ్రత మహారాజు శ్రీమహావిష్ణువు అనుగ్రహముతో ఈ ప్రస్తుత కల్పమైన ఏడవ మన్వంతరమున వైవస్వతుడను పేరుగల మనువుగా సుప్రతిష్ఠితుడైనాడు. 58

శ్లో॥ సత్యవ్రతస్య రాజర్షేః మాయా మత్స్యస్య శార్‌జిణః ।
సంవాదం మహదాఖ్యానం శ్రుత్వా ముచ్యేత కిల్బిషాత్॥59॥

టీ:- అతీతేతి. అతీతః పూర్వోయః ప్రళయః యే అవసానే. ॥57-59॥

రాజఋషి అయిన సత్యవ్రతునికి మాయామీన రూపధారియైన భగవంతుడు శ్రీమహావిష్ణువునకు మధ్య జరిగిన గొప్ప ఆత్మతత్త్వమును ప్రతిపాదించునట్టి ఈ కథను విన్నవారి సర్వపాపములు నశించి ఎల్లసుఖములు పొందగలరని ఫలశ్రుతి. 59

శ్లో॥ అవతారో హరేర్యోఽయం కీర్తయే దన్వహం నరః ।
సంకల్పాస్తస్య సిధ్యంతి సయాతి పరమాంగతిమ్॥60॥

టీ:-అవతారమితి. యోఽయం హరేరవతారః. తం యః కీర్తయేత్ ॥60॥

మానవుడు శ్రీమహావిష్ణువుయొక్క ఈ మత్స్యావతార వృత్తాంతమును ప్రతిదినము గానము చేసినచో అతని సర్వకామములు నెరవేరి చివరకు సర్వోత్కృష్టమైన ముక్తిని పొందగలడు. 60

శ్లో॥ ప్రలయ పయసి దాతుః సుప్తశక్తేర్ముఖేభ్యః
శ్రుతిగణ మపనీతం ప్రత్యుపాదత్త హత్వా ।
దితిజ మకథయ ద్యో బ్రహ్మసత్యవ్రతానాం
తమహ మఖిల హేతుం జిహ్మమీనం నతోఽస్మి ॥61॥

టీ :- ప్రళయేతి. సత్యవ్రతానాం సత్యవ్రతస్య ఋషీణాం చ. ఛత్రిణో గచ్ఛంతీతి వత్. లింగసమ వాయన్యాయాద్బహువచనం జిహ్మమీనం మాయామత్స్యం. ॥61॥

ప్రళయకాలము నాటి అఖండ జలము లందు నిద్రించినందువలన (ఆకస్మిక ప్రళయమును పొందిన) సర్వ శక్తులను కోల్పోయిన బ్రహ్మదేవుని నిశ్వాసవాయువుతో బైటకు వచ్చిన వేదరాశిని అపహరించిన హయగ్రీవ దనుజుని సంహరించి మరల శ్రీహరి బ్రహ్మదేవునికి అప్పగించినాడు. ఆ సందర్భమున సత్యవ్రతుని ఉద్దేశించి , సత్యవ్రతునికి, ఋషులకు పిమ్మట వారి శిష్యప్రశిష్యులకు సంక్రమించవలెనని ఆత్మతత్త్వ వివృతితో కూడిన పరిపూర్ణ జ్ఞానమును ఉపదేశించిన సర్వజగత్కారణుడు మహా మాయి మీనస్వామి అయిన పరాత్పరునికి నమస్కారము. 61

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే, అష్టాదశసాహస్ర్యాం, పారమ హంస్యాం సంహితాయాం వైయాసక్యామష్టమస్కంధే మత్స్యావతార చరితానువర్ణనానామ చతుర్వింశోఽధ్యాయః, సమాప్తోఽయమష్టమ స్కంధః॥**

**శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగా డా॥తలముడిపి బాలసుబ్బయ్య విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులచే మత్స్యావతారచరితమను చతుర్వింశోధ్యాయము ఆంధ్రానువాదము అష్టమ స్కంధము సమాప్తము**

